ప్రథమ ముద్రణము-1000
సెప్టెంబరు, 1982

వెల : రు. **24-00**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
సమాదరమున ప్రకాశితము

Paper used for the printing of this book was made available by the Government of India at the Concession Rate.

ప్రతులకు :
శ్రీవిశ్వనాథ పావని శాస్త్రి,
మారుతీనగరం,
విజయవాడ-4.
కృష్ణాజిల్లా

---

ముద్రణ :
వెంకట్రామ్ పేపరు ప్రోడక్ట్సు (ప్రైవే) లిమిటెడ్
నారాయణగూడ, హైదరాబాదు

# కవిసమ్రాట్, పద్మభూషణ, డాక్టర్
# విశ్వనాథ సత్యనారాయణ

'అలఘుస్వాదు రసావతారధిషణాహంకార దోహల బ్రాహ్మీమయమూర్తి' విశ్వనాథ సత్యనారాయణ-బహువిచిత్ర చిత్రధ్వని మన్మహాకృతి ప్రణేత.

పార్వతీ శోభనాద్రుల జ్యేష్ఠపుత్రుడుగా సత్యనారాయణ గారు మన్మథ నామసంవత్సర భాద్రపద బహుళషష్ఠి, మంగళవారం (10.9.1895) కృష్ణామండలంలో నందమూరులో జన్మించారు. 'అతిరూక్ష చింతనాగ్రస్థితమగు తేజము' విశ్వేశ్వరునికి నందమూరులో తండ్రి ఆలయం కట్టిస్తే ఆ విశ్వేశ్వరునికి కుమారుడు గుండెలో గుడికట్టాడు. దైవభక్తి, త్యాగనిరతి, శిష్టాచార సంపన్నత, దానవ్యగ్రత సత్యనారాయణకు పైతృకంగా సంక్రమించిన ఆస్తి.

పుట్టిపెరిగినఊరు, దేశికవితాఫణితులు పుక్కిటపట్టిన భిక్షుక బృందము, పురాణగాథా ప్రవచన ప్రవణులైన స్వజనము - ఇవి శ్రీవిశ్వనాథ భవిష్యత్కవితాసౌధానికిపునాది అయినవి. ఆంధ్రసారస్వత మాధుర్యం రుచిఎరిగిన తరవాతనే సత్యనారాయణగారి ఆంగ్ల విద్యాభ్యాసం ప్రారంభమైంది. చదువుకొనే తొలిరోజుల్లోనే శిష్యవాత్సల్యంబు చెలువుదీర్చినమూర్తి, కాకవికంఠంబు కత్తికోత, వ్యోమపేశల చాంద్రీమృదుకీర్తిఅయిన చెళ్ళపిళ్ల-ఆయన ఉపజ్ఞను తీర్చే ప్రథమమూర్తికాగా, విద్యానంద భారతీస్వాములుగా విశ్రుతులైన త్రివిక్రమరావుగారి అంతేవాసిత్వం విశ్వనాథవారి జిజ్ఞాసకు, 'జీవుని వేదన'కు పదును పెట్టింది.

పదునాలుగేండ్లపసివయస్సునుంచి వాగ్దేవి కరుణకు పాత్రులయిన శ్రీవిశ్వనాథ ఎఫ్.ఎ చదువులో చేరగానే 'ఆంధ్రపౌరుషం' (1917) ప్రకటించారు ఆయన 'దేశభక్తి గుణసాంద్రత'కు అది ప్రతీకయై నిలిచింది ఆతరవాత (1919—20) 'ఆంధ్రప్రశస్తి'.

డిగ్రీలులేని పాండిత్యము వన్నెకెక్కని కాలమని తెలిసికూడా ఆసేతుశీతాచలం ప్రజ్వరిల్లిన సహాయ నిరాకరణోద్యమంలో (1921) కళాశాల చదువుకు స్వస్తిచెప్పారు. తరువాత బందరు ఆంధ్రజాతీయ కళాశాలలో అధ్యాపక వృత్తి (1921-26) చేపట్టారు. 1926-27 లో బి. ఎ. పట్టభద్రత పొంది, బందరు హిందూకళాశాలలో ఉపన్యాసకులుగా ఉంటూ, 1929 నాటికి యం.ఎ. పట్టం అందుకున్నారు. 1930లో అత్యుత్తమ కళారూపం అని ప్రశంసపొందిన 'ఏకవీర' నవల వెలువరించారు.

1932లో స్వల్పకాలం గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో అధ్యాపకత్వం, ప్రథమ కళత్రవియోగం; ఆ తరవాత అయిదేళ్లపాటు స్థిమితమయిన ఉద్యోగం లేకపోవటం. ఆకాలంలోనే దేశసంచారం చేసి కవిగా, వాగ్మిగా తెలుగుసీమ నలుమూలలా విశ్వనాథ సుప్రతిష్ఠితులయినారు. విశేషకీర్తి తెచ్చిన 'వేయిపడగలు' (1934)ముగించి, తండ్రిఆజ్ఞచొప్పన శ్రీమద్రామాయణ కల్పవృక్ష రచనకు శ్రీకారం చుట్టడం ఈకాలంలోనే జరిగింది.

1938లో విజయవాడ యస్. ఆర్. ఆర్. కళాశాలలో ఆంధ్ర భాషాచార్యులుగా చేరి, 21 సంవత్సరాలు చిరుత తామర పూల వంటి శిష్యప్రతతికి నిత్యమార్తాండమూర్తియై నిలిచారు.

1935 లోనే బందరు సన్మానసభలో విశ్వనాథను కవి సమ్రాట్ బిరుదం వరించింది. రసావతారులయిన సత్యనారాయణ గారి అలౌకికప్రతిభ సహస్రముఖాలుగా నవలలై, నాటకాలై, కావ్యాలై, గేయాలై, పరిపరివిధాల తెలుగు సాహిత్యసీమను రసమయం చేసింది.

'నన్నయ్యయు తిక్కన్నయు నన్నావేశించిరి' అని ఆయన చెప్పినా వేయిసంవత్సరాల తెలుగుకవిత్వదీప్తిని తనలో ఇముడ్చుకొన్న సహస్రకిరణుడు శ్రీవిశ్వనాథ. సాహిత్యంలోను జీవితంలోను కూడా ఆయన సమున్నతులే. కనిపించే శిలాకాఠిన్యం వెనక 'నాకనివాసుల యన్నముంబోని నాజూకు' కలవారు.

తెలుగు కవితారంగంలో తమ జీవిత కాలంలోనే ఒక శకపురుషుడుగా నిలబడిన సత్యనారాయణగారి మార్గాన్ని పరమ విధేయులుగా అనుగమించిన వారున్నట్లే అతివేలంగా ఆక్షేపించిన వారు ఉన్నారు. అయితే ఆయన సమున్నతికి తగినట్లు పొగడ్తలు విమర్శలు కూడా అత్యంత వ్యగ్రమైనవే.

సత్యనారాయణగారు ఇంట గెలిచారు, రచ్చ గెలిచారు. బిరుదాలు, సన్మానాలు, గౌరవాలు అశేషంగా పొందారు-1942లో గుడివాడలో గజారోహణం, 1952లో షష్టిపూర్తి ఉత్సవాలు, 1963లో విశ్వనాథ మధ్యాక్కరలకు కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు, కలకత్తా నగరంలో పుష్పకిరీటాలంకరణ; 1964లో ఆంధ్రవిశ్వ కళాపరిషత్తు 'కళాప్రపూర్ణ' పట్టప్రదానం; 1967లో అఖిలభారత వంగీయ సాహిత్య పరిషత్తు సన్మానం; 1970లో కేంద్ర ప్రభుత్వం వారి 'పద్మభూషణ' బహూకృతి, 1971లో తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారి 'డాక్టరేట్' సమర్పణ; ఆ సంవత్సరమే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థాన కవి పదవి, జ్ఞానపీఠంవారి బృహత్పారితోషిక ప్రదానం; 1975లో నాగపూర్ విశ్వహిందీసమ్మేళనంలో భారతజాతీయకవిగా సన్మానం; 1976 సెప్టెంబర్ లో సహస్రమాస జీవితోత్సవం.

విజయవాడ కళాశాలలో ఉద్యోగ విరమణ అనంతరం 1958లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనమండలి సభ్యత్వం. 1959-61లో కరీమ్‌నగర్ కళాశాల అధ్యక్షత. 1957లో స్థాపననాటినుంచి బహుకాలం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఉపాధ్యక్షత్వం-ఇవన్నీ వారి సమున్నత స్థాయికి పట్టిన నీరాజనాలే.

ఉత్తమ గురువులకు శిష్యత్వం, ఉత్తమ శిష్యులకు గురుత్వం నెరిపి, ప్రాచీన ఆధునిక సంప్రదాయాలకు సంగమ స్థానమై, తమ ప్రతిభతో, భావనతో తెలుగు సీమకు ఒక విలక్షణచైతన్యాన్ని ఆపాదించిన మహోవ్యక్తి, మహాసంస్థ శ్రీ విశ్వనాథ.

చంద్రునకో నూలుపోగుగా ఆ మహామహునకు ఈ స్మారక ప్రచురణ ఒక చిరుకానుక. అన్నీ అనుకూలపడితే 'విశ్వనాథశారద' రెండవ భాగంకూడా వెలువరించగలం.

—శ్రీ విశ్వనాథ సత్యనారాయణ స్మారకసమితి

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణ స్మారక సమితి
## (1976-77)

పోషకులు

శ్రీ జలగం వెంగళరావు
డా॥ బెజవాడ గోపాలరెడ్డి

అధ్యక్షులు

శ్రీ పి. వి. నరసింహారావు

ఉపాధ్యక్షులు

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య
శ్రీ మండలి వెంకట కృష్ణారావు
శ్రీ భవనం వెంకట్రామ్ రెడ్డి

సభ్యులు

శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు
ఆచార్య దివాకర్ల వెంకటావధాని
శ్రీ జువ్వాడి గౌతమరావు
డా॥ జి. యస్. రెడ్డి
డా॥ బి. రామరాజు
డా॥ బోయి భీమన్న
డా॥ కె. వి. రామకోటిశాస్త్రి
శ్రీమతి ఇందిరా శేషేంద్రశర్మ
డా॥ నాయని కృష్ణకుమారి
శ్రీ విశ్వనాథ అచ్యుతదేవరాయలు

కోశాధికారి

డా॥ యమ్. యస్. గురునాథ్

కార్యదర్శి

డా॥ పి. యస్. ఆర్. అప్పారావు

# విషయసూచిక



కవిసమ్రాట్,పద్మభూషణ,డాక్టర్ విశ్వనాథ సత్యనారాయణ

| జననం | నిర్యాణం |
|---|---|
| మన్మథ-భాద్రపద బహుళషష్ఠి | నల-ఆశ్వయుజ బహుళ దశమి |
| 10.9.1895 | 18.10.1976 |

# శ్రీ విశ్వనాథలోని "నేను"

—శ్రీ పేరాల భరతశర్మ

"ఆ వచ్చుచున్న మహాపురుషుడు దబ్బపండువంటి దేహచ్ఛాయవాడు, కోల గుండ్రముకాని ముఖము, ఆజానుబాహువు, నల్లని కనులు, విశాలమైన ఫాలభాగము వయ సేబదియేండ్లుండును"

"కాయపారు మనిషి నిగనిగలాడు శరీరము. కోసలైన కనులు తెలివి కొట్టవచ్చినట్లుండు మొగము. అందమనగా నాయనదే యందము"

"ఆయన పేరు ధర్మారావు"

"కాదు విశ్వనాథ సత్యనారాయణగారు"

వేయి పడగలలోని మాటలనే అనువదిస్తున్న ఈ సంభాషణ 1951 సంవత్సరం జూన్ నెల చివరివారంలో ఒకానొకనాడు విజయవాడలో ఇద్దరు వ్యక్తులమధ్య జరిగింది- శ్రీరాజారంగయ్యప్పారావు చుండూరు వేంకటరెడ్డి కళాశాల ప్రిన్సిపాలు గదిముందు వరండాలో నేను B A.లో చేరడానికి అక్కడే వేచివున్నాను మా అన్నయ్య లక్ష్మణరావు నాకు తోడుగా వచ్చాడు దూరంనుండి వస్తున్న వారిని గూర్చి మా ప్రక్క నున్న యిద్దరూ అలా అనుకుంటూవుంటే మా అన్నయ్య కూడా కల్పించుకొని "ఆయన గొంతుక వీణానిక్వాణమువంటిది" అన్నాడు తమ గడుసుదనాన్ని కనిపెట్టి అన్న మావాడి మాటలకు వాళ్ళు కొంచెం చకితులయ్యారు "అవునండీ! వేయిపడగలలో ధర్మారావు శ్రీ విశ్వనాథవారే కదండీ" అని తమను సమర్థించుకొంటున్నట్లు వారు మాట కలిపారు వీరితో మరొకాయన వచ్చి చేరాడు. "దానికేం లెండి! ఆ మాటకువస్తే కల్పవృక్షంలో రాముడిలో ఆయన కన్పిస్తారు విశ్వామిత్రుడు ఆయనే

అనిపిస్తుంది దశరథుడు, జనకుడు వారి ఉదాత్తత వారి చమత్కారాలు చూడండి వారిలో ఆయన లక్షణాలు లేవూ? బాలకాండలో చూడండి!" అంటూ ఆయన రామాయణంవైపు తప్పుకుపోతున్నాడు "అశ్వత్థ స్సర్వవృక్షాణాం గంధర్వాణాం చిత్రరథః ఆయుధానా మహం వజ్రం ధేనూనామస్మి కామధుక్" అని భగవంతుడన్నట్టే ఆయనయొక్క ఒక్కొక్క గ్రంథంలోని ఒక్కొక్క ఉత్తమోత్తమ పాత్ర ఆయనే" అంటాను నేను అంటూ సిద్ధాంతీకరించినట్లు మొగంపెట్టేశా రాయన

ఆ మహాపురుషుడు ప్రిన్సిపాలు గదిదగ్గరకు చేరుకోవడంతో అందరూ నోళ్ళు కట్టేసి చేతులుజోడించారు

"అలఘుస్వాదురసావతారధిషణాహంకార సంభార దోహాల బ్రాహ్మీమయమూర్తి" అనుకుంటూ నేను నమస్కారంచేశాను ఏదో ఆనందం ఏమో తన్మయత్వం! నా కళ్ళు మూతపడిన సంగతి నాకు తెలియదు మా అన్నయ్య తర్వాత అన్నాడు "ఓరి! దౌర్భాగ్యుడా! నీవు నమస్కారం పెట్టే ఆయన నీవైపు చూచి చిరునవ్వు నవ్వాడు నీవు కళ్ళుమూసుకున్నా వేమిటి! 'చిరునవ్వు నవ్వెనా చిన్నారి ముత్యాలు ప్రోవులు ప్రోవులు పోసినట్లు' అంటే ఏమిటో నీకు తెలిసేది. ఆయనగారి ఆ ప్రసన్నత చూడాల్సింది" అన్నాడు. "ఆయన నవ్వింది నేను చూడలేదు కాని ఆ క్షణంలో నాలో వెన్నెల ప్రాకినట్లుంది అది చాలురా ఈ జన్మకు" అన్నాను.

అప్పటికి వారితో ప్రత్యక్ష పరిచయం లేదు. అదే వారిని మొట్ట మొదటిసారిగా దగ్గరలో చూడడం కూడా ఆ కాలేజిలో B.A. స్పెషల్ తెలుగులో చేరడానికి సంవత్సరం వేచివున్నాను. ప్రిన్సిపాలువద్దకు ఇంటర్వ్యూకు వెళ్ళినప్పుడు ఆయన వుంటారేమోనని భయభయంగా లోపలికి వెళ్ళాను. ఆ నుక అక్కడ లేరు ప్రిన్సిపాలు అప్లికేషను తీసుకొని డబ్బు కట్టమన్నాడు ఆఫీసులో డబ్బు కట్టాడు మా అన్నయ్య క్లర్కు దగ్గర రూపాయిచిల్లర లేదు; అర్ధరూపాయియివ్వాలి మా అన్నయ్య వరండాలోకి వచ్చి రూపాయి చిల్లరకోసం వారిని వారినీ అడుగుతున్నాడు అప్పుడు

వరండాలో ఎవరితోనో మాటాడుతున్న శ్రీ విశ్వనాథ "ఇటురా! ఎంత కావాలి" అన్నారు "రూపాయి చిల్లరండీ" అన్నాడు మా అన్నయ్య. "అది సరే! అక్కడ ఎంత చిల్లర యివ్వాలి చెప్పు" అన్నారు. "అర్ధ రూపాయి అండీ!" "చూస్తాను" అని పర్సు తెరుస్తూ "అర్ధరూపాయి వుంటే నీ అదృష్టం" అంటూ "వుంది" అన్నారు మా అన్నయ్య "ఇంకో అర్ధరూపాయి కూడా చూడండి సార్" అన్నాడు ఆయన నవ్వుతూ "అది వుండడం నాఅదృష్టం అంటావు ఆదీ వుంది" అని రెండర్ధరూపాయిలు చిల్లర యిచ్చి రూపాయి తీసికొని పర్సులో పెట్టుకున్నారు నేను వంగి వారి పాదాలు కళ్ళ కద్దుకున్నాను "ఇకనుండీ మావాడు మీ శిష్యుడండీ! ఇది మా భాగ్యం" అన్నాడు మా అన్నయ్య మాష్టారు నా బుగ్గమీద తమాషాగా చిటికెవేసి నవ్వారు అది మొదలు ఆ అదృష్టం నాకు 1976 అక్టోబరు 18 న ఆయన కన్నుమూసేవరకూ అవ్యాహతంగా దక్కింది

"ఆయన మహాపండితుడే గొప్ప అధ్యాపకుడే. మహాపురుషుడే. కాని ఆయన చాలా గర్వి, అహంకారి, కోపిష్ఠి తొందరపాటు మనిషి. తిట్టాడు మొహాన వుమ్మేస్తాడు ఏ క్షణాన ఎలా వుంటాడో తెలియదు. ఆయనతో వేగటం చాలా కష్టం అంతంత మాత్రంగా ఆయన దగ్గర చేరనీయడు మనిషి చాలా భయంకరుడు కావాలని మీవాణ్ణి ఆయన వున్నాడని B.A స్పెషల్ తెలుగులో చేర్చడం కంటె ఏ B.Com లోనో చేర్చండి. లేదా యూనివర్శిటీకి పంపండి లేదా మరోచోట చేర్పించండి ఆయన ఏమైనాఅంటే మీవాడు అభిమానపడితే అప్పుడు సర్దుకోవటం కష్టం" అని కొందరు ప్రబుద్ధులు మానాన్నగారిని భయపెట్టారు మా నాన్నగారు అప్పుడన్న మాటలు నాకిప్పటికీ గుర్తు "దూరపు కొండలు నునుపు అంటారు శ్రీ విశ్వనాథ వారి విషయంలో అలా కాదు ఆయన దూరానికి గర్విగా అహంకారిగా కోపిష్ఠిగా కనిపించవచ్చు. సమక్షంలో సన్నిధిలో ఆయన అమృతప్రాయుడు కావచ్చు దూరంనుండి కాదు దగ్గర నుండే అలాంటివారిని అర్థంచేసుకోవాలి" అని నన్ను ఆ కాలేజీలో చేర డానికే పంపించారు ఆనాడు ప్రిన్సిపాలు గదిముందు జరిగిన సంగతులు చెప్తే మా నాన్నగారు "చూశారా! నేను చెప్పలేదా! అంతటి మహాను

భావుడు మిమ్మల్ని పిలిచి చిల్లర యివ్వడమేమిటి! ఆ చమత్కార సంభాషణ ఏమిటి! మీరు చిన్నపిల్లలు క్రొత్తవారు యాదృచ్ఛికంగా కలిశారు కాని ఆయన మీతో ఎంత సరసంగా మాట్లాడారు! 'నీఅదృష్టం' అన్న కవివాక్కు ఎంత అమృతమయం అయింది నిజంగా 'నీఅదృష్టమేరా' చాలా ఆనందంగా వుంది" అన్నారు.

"శిష్యవాత్సల్యంబు చెలువుదీర్చిన మూర్తి" అని తమ గురువుగారిని గూర్చి మా గురువుగారు చెప్పుకున్నారు. అది వారి విషయంలో యథార్థ మనడానికి నేను ప్రత్యక్షనిదర్శనం ఆయన శిష్యులంటే ఎవరు? అన్న ప్రశ్న ఉండనేవుంది. ఆయనే చెప్పారు— "నేను ఎన్నో కాలేజీల్లో ఎన్ని ఏండ్లో పనిచేశాను అప్పుడు చదువుకున్న వారంతా నా శిష్యులే అనటం ఏం న్యాయం? ఎందరో స్వబుద్ధి వికాసంతో మేధావులై ఎన్నో పెద్దపెద్ద పదవులు అలంకరించారు. వారంతా నన్ను గురువుగా చెప్పుకుంటారు అది వారి మంచితనం అంటే వారు ఒప్పుకోరు మాకు విలక్షణమైన ఆలోచనా పద్ధతిని నేర్పింది మీరు మీరే మా గురువులంటారు ఇంకా కొందరు అత్యంత సన్నిహితులున్నారు వాళ్ళు కొన్ని శాస్త్రాల్లో నిధులు. వాళ్ళూ నన్ను గురువుగారంటారు వారిలో కొందరు నాతో కలిసి పనిచేసిన వారు. కొందరు తరచు నన్ను కలుసుకొనేవారు మేము శాస్త్రమే చదివాంగాని అందులోని రహస్యం మీవల్ల తెలిసింది. మీరు మాకు గురువులు అంటారు అది వారి మంచితనమే ఇంకాకొంద రున్నారు. వారి మొగం నేను చూడలేదు వారు ఎప్పుడూ ఉత్తరాలు వ్రాస్తుంటారు. మేము మీకు ఏకలవ్య శిష్యులమని. అలాంటి కొందరు అప్పుడప్పుడూ పత్రికల్లో కొన్ని వ్యాసాలు విమర్శలు వ్రాస్తుంటారు. వారి వ్యాసాలూ విమర్శలూ అన్నీ నా గ్రంథాలని బాగా అధ్యయనం చేసినందువల్ల పొందిన సంస్కారంతో వుంటాయి. కొందరు వ్యాసాలు వ్రాయని వారున్నారు నేను ఏసభలోనో కనిపిస్తే వచ్చి దణ్ణంపెడ్తారు. ఏవో కొంతసేపు మాట్లాడుతారు. వారు ఎంతో చక్కని భావుకులుగా కనిపిస్తారు. మేము మీ శిష్యులమంటారు. అలా వారనడం నేను ఒప్పుకోకపోవటం ఎట్లా? సరే - వారూ శిష్యులే. ఈ రీతిగా నాకు దేశం నిండా వేలసంఖ్యలో శిష్యులున్నారంటే — అది నా అహంకారం అను

కుంటారు కొందరు ఇది నాజాతకం నేను వినయంగా నాకు మీరేమి శిష్యులంటే వారు ఒప్పుకోరు నేను వారికి గురువునే. వాళ్ళు నాతో నిత్యం తిరిగే వారికంటే ఎక్కువ శ్రద్ధగా నా గ్రంథాలు చదివారు. నా పద్యాలు వందలు వేలుగా కంఠస్థం చేశారు. వారు ఏపద్యమన్నా సొంతంగా వ్రాస్తే అది నేను వ్రాసినట్లు వ్రాస్తారు నా మార్గాన్ని బాగా పట్టుకొన్న లక్షణం వారిలో కనిపిస్తుంది. వారు నిజానికి శిష్యులంటే శిష్యులే ఇలాంటి శిష్యులు నాకు నేను బ్రతికుండగానేకాదు. ఈ లోకం విడిచిపోయినా. వుంటారు. ఈ తెలుగుదేశం నా పుస్తకాలను బ్రతకనిచ్చినన్నాళ్ళూ వుంటారు. నేను ఏగ్రంథం వ్రాసినా బుద్ధిమంతుడైన వానికి కొంత ఉపయోగించే విషయమే వ్రాశాను మేధావి యైనవాడు తరచిచూస్తే పూర్వాపరాను సంధానం చేసుకుంటే నాగ్రంథాలన్నిటిలోనుండీ నేను గురువుగానే కన్పిస్తాను అలాంటి గురుత్వంపొందని లక్షణంతో నేను ఏ గ్రంథం వ్రాయలేదు. నేను వ్రాయటంకాదు నా నోటిలోనుండి అలావాక్కు వస్తుంది అలా వాగావిష్కారం జరిగే వరకూ ఆ వాక్స్వరూపం అలా వుంటుందని నాకే తెలియదు ఆవిష్కృతమైన ఆ వాక్కును చూచి మీలాగా నేనూ ఆశ్చర్యపోతాను కనుక నాకు శిష్యులంటే—ఆ వాక్కుకు శిష్యులన్నమాట - ఇది యథార్థం అటువంటి నా శిష్యులు చిరకాలం వర్ధిల్లాలని నా ఆశ."

అలా అని తాను కాలేజిలో పనిచేసేప్పుడు ఉన్నవారిని ప్రేమించలేదని కాదు ఆ ప్రేమ, ఆ వాత్సల్యం అపారం 1956లో మా విజయవాడ కాలేజిలో వారికి షష్టిపూర్తి సన్మానం జరిగినప్పుడు లేతలేత మొగాలతో చిరునవ్వులుచిందిస్తున్న తన విద్యార్థులందర్నీ చూచి సభలో ఆశువుగా ఒక పద్యం చెప్పారు. అది ఆయన ప్రేమకు పతాక

"చిఱుత తామరపూల్ వికసించుచున్న
చెఱువునుంబోని మీ ముఖసీమలొప్ప
ఈ కళాశాల గురువనై యెసగుచుంటి
నిత్యమార్తాండమూర్తిని నేనొకండ."

తాను నిత్య మార్తాండమూర్తి కనుక ఆ తామరపూలు నిత్యమూ వికసించే వుంటాయన్న మాట. మార్తాండుని వెలుగునోకని తావేలేదు "ఈ కళా శాల గురువునై యెసగుచుంటి"— తన గురుత్వము కళాశాలపైన నిత్య మార్తాండ తేజముతో పరివ్యాప్తమై వుందట.

మాకు తెలుగు అభిమాన పాఠ్యాంశంలో మహాభారతము సభా పర్వములో ద్వితీయాశ్వాసముంది దానినొక మాష్టారు చెప్పేవారు ఆయన గంటకు ఏభై పద్యాలు చదువుకుపోయి యేదో వివరించేవారు మేము ఆ గ్రూపులో నలుగురు విద్యార్థులం "మాష్టారూ! మాకు భారతం మీరుచెప్పండి" అని ఒకసారి గురువుగారిని అడిగాము "మీకు ఏపాఠం ఎవరుచెప్పాలో మీరానాకు చెప్పేది?" అని గద్దించారు వణికి పోయాం "కాదు మాష్టారూ" అన్నాను "కాదు లేదు గీదులేదు పొండి" అని తరిమేశారు తన తోటి ఉపాధ్యాయుడి గౌరవాన్ని కాపా డడంలో ఆయన పట్టుదలచూచి మేము మొగాలు వ్రేలాడ వేసుకొని నోరు మూసుకొని ఊరుకున్నాం మళ్ళా ఆ ప్రసక్తి ఆయనవద్ద తేలేదు మా మామూలు మాష్టారు తమ మామూలు ప్రకారం సభాపర్వం ఒక వారంలో పూర్తిచేశారు తర్వాత ఆయన పారిజాతాపహరణం కూడా అలాగే చేశారు పరీక్షలింకా మూడు నెలలున్నాయి గురువుగారు మమ్మల్ని నలుగురినీ ఒక ఆదివారం ఇంటికి రమ్మన్నారు మధ్యాహ్నం మూడు గంటలకు వెళ్ళాం అప్పుడు వారి యిల్లు ఒక చిన్నపాక ఎవరైనావస్తే కూర్చుండేందుకు ఇంటి ఆవరణలో ఆగ్నేయభాగంలో అష్ట కోణాకారపు చుట్టుగుడిసె వుండేది రాతి అరుగులుండేవి చుట్టూ మాతో బాటు ఆయనకూడా వాటిమీదే కూర్చున్నారు భారతం సభాపర్వం తెచ్చి ద్వితీయాశ్వాసం మాపాఠం మొదలు పెట్టారు

"అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె, నట్లు రాజ సూయ మహోత్సవంబు నొప్పును, ధర్మరాజు ధర్మ నిత్యతయును స్తుతించి నారదుండు..." మొదలైన వచనం చదివి అక్కడ ఆపారు రాజసూయ మహోత్సవంబు నొప్పును, ధర్మరాజు ధర్మనిత్యతయు అన్న రెండు

విషయాల గురించే చెప్పారు. సాయంత్రం అయిదయింది సభాపర్వం కథ అంతా తేనెపట్టును కదిలించినట్లు కదిలించారు తేనెటీగలలాగా ఏన్నో రహస్యాల చాటున కథా పరమార్థం వుంది ఆ ఆశ్వాసం అలా ఎందుకు ప్రారంభించాడు కవి? వచనమే ఎందుకు వ్రాశాడు? ఆ రెండు సమాసాల కూర్పు ఎటువంటిది? మహోత్సవంబు నొప్పును, ధర్మరాజు ధర్మనిత్యతయు అన్న ఆ సముచ్చయార్థకాలంలోని స్ఫూర్తి ఏమిటి? ఇలా ప్రశ్నలూ వాటి సమాధానాలు భావ ప్రపంచంలో ఉయ్యాల లూగించారు నారదుడు సభను భావించిన వైఖరి ఏమిటి? ఆయన చెప్పే విషయం-ఒక మాటో రెండు మాటలో మహా అయితే మూడు మాటలు— విసుగు పుట్టదు ఆశ్చర్యానికి అంతువుండదు ప్రతిక్షణం క్రొత్తవిషయం బయట పెట్టటమే "ఆవచనం గురించి ఇంకాచెప్పాలి రేపు కాలేజి కాగానే యింటికివద్దాం ద్వితీయ విఘ్నం కాకుండా చెప్తాను రండి" అప్పుడాయన కళ్ళల్లో వెలుగు, మొగంలో చిరునవ్వు ఆయన దయనంతా పైకి చిమ్ము తున్నట్టున్నాయి మరునాడు పాఠం చెప్పారు ఛందస్సులు మారినాయి మళ్ళా వచనం వచ్చింది తరువాత సీసపద్యం కథతోపాటు ఈ మర్మాలు త్రవ్వుకొని వస్తున్నాయి ద్రౌపదీ వస్త్రాపహరణం గూర్చిన సీసపద్యం చెప్పేనాడు, ఆయన శాలువా నాలుగు మడతలుగా పెట్టి ఎడమభుజాన వేసుకొని కూర్చున్నారు "దుశ్శాసనుండు నెట్టన ద్రౌపది కట్టిన పుట్టంబు సభలోన విడ్చె నాశంక లేక యుడుగక యొలువంగఁబడియు మున్నపనీత మైన తద్వస్త్రంబు నట్టి వలువ లలితాంగి జఘన మండలమునఁబాయక యొప్పుచునున్న నయ్యువిదఁజూచి సభ్యులెల్ల నుదిత సమ్మదులైరి" — ఆపద్యం చెప్పేప్పుడు ఆయనే ద్రౌపది ఆయననాలుగుమడతలతో ఎడమ బుజముపైగా కాళ్ళదాకా కప్పుకొన్న శాలువా ఆమెకట్టిన పుట్టము ఆయనచేయి దుశ్శాసనుడు మేము సభ్యులము ఆచుట్టు పాక సభా మందిరము, దుశ్శాసనుడు ద్రౌపది కట్టిన పుట్టంబు విప్పుతున్నాడు శాలువా ఒక మడత తొలిగింది "ఉడుగక యొలువంగబడియు మున్నపనీతమైన తద్వస్త్రంబునట్టి వలువ" శాలువా రెండవమడత "లలితాంగి జఘన మండలమున బాయక యొప్పుచున్నది" ఎన్నిమారులు చీరెలాగినా అలాంటి అలాంటి చీరే మళ్ళీ ఆమె శరీరం మీద కన్పిస్తున్నది. ద్రౌపది

శరీరమునుండి చీరె తొలగడమనేది జరగలేదు శాలువా మడతలతో ఆ పదంలోని ఔచిత్యాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించారు మన సినిమాల వాళ్ళు "ద్రౌపదీ వస్త్రాపహరణ "మని పేరుపెట్టారు ద్రౌపది వస్త్రం అపహరింపబడితే కృష్ణుడామెను ఆదుకోవడమేమిటి? ద్రౌపది యొంటిమీద వస్త్రము తొలగలేదు" అందుకు "సఖ్యులెల్ల నుదిత సమ్మదులైరి" మేమే ఆ సఖ్యుల మనిపించింది ఆయన పాఠం చెప్పేవేళ అది శిష్యుల అదృష్టం ఆ ఆనందం అనుభవైకవేద్యం మాకు సభా పర్వం యింత నేత్రపర్వమైంది హృదయ పర్వమైంది కాలేజీలో ఇతరులు చెప్పిన మిగతా తెలుగుపాఠా లన్నీ మళ్ళా మాకు ఆయన యింటిదగ్గర సింహావలోకనంచేశారు అప్పు డాయనదయ మాకు అర్థమైంది మేము స్పెషల్ తెలుగు చదివేమంటే బి. ఏ డిగ్రీకోసంకాదు ఒక పెద్ద విశ్వవిద్యాలయంలో గొప్ప పట్టాపుచ్చు కుంటున్నంత తృప్తి పొందాము

ఆయన వాత్సల్యానికి హద్దులులేవు నా బి. ఏ మొదటి సంవత్స రం కాగానే మా తండ్రిగారు స్వర్గస్థులయినారు. అప్పుడాయన నన్ను ఆదరించిన ఘట్టం నా జన్మలో మరువలేను నాచేయి తన చేతిలోకి తీసుకొని ప్రక్కన కూర్చోబెట్టుకున్నారు నన్ను తన ఒంటికి అతుక్కుపోయినట్లు అదుముకున్నారు. మా కుటుంబ పరిస్థితినంతా క్రమంగా తెలుసుకొన్నారు "ఏమైనా డబ్బుకావాలా ?"—వద్దని తల ఆడించాను దుఃఖంతో నోట మాట పెగలక "అవును కావాలంటావా ? అభిమానం వుంటుంది. తప్పదు తండ్రి హోదా కుటుంబపు పాణీ అభిమానపడకు. నాయన గారు లేరని బాధపడకు నేనున్నాను" ఆయనను నేను డబ్బు అడగనని ఖాయం చేసుకున్నారు అప్పటి నా స్థితి ఎలాంటిదో ఆయన వూహిం చారు. ఏదోరీతిగా సహాయం చేయాలని-"నాయనా ! పాతికరూపాయలు అద్దెపెట్టి మీకు యిల్లెందుకు ? పెద్దది మీ అమ్మగారూ నీవేకదా ! మేముంటున్నది పాకలోనే కదా ! అంతకంటె మంచిపాక మా ఆవరణలో ఆ ప్రక్కన వేయిస్తాను. అందులో వుండండి. నీవున్నన్నాళ్ళూ అది నీ సొంతం. కావలసినంత స్వేచ్ఛగా నీవు వుండు నిన్ను నేనేమీ చిన్నచూపు చూడను గురుకులవాసక్లేశం లాంటిది నీకేమీ వుండదు ఆలోచించి చెప్పు

పాక వేయిస్తాను" ఇలా ఎంతో చెప్పారు ఆ అవకాశంకూడా నేను వినియోగించుకోలేదు "మీ పెద్దవాళ్లు వద్దన్నారు కదూ! న్యాయమే నాయనా! దశమారిందని అభిమానం చచ్చిపోతుందా? బాగా బ్రతికిన కుటుంబంకదా!" అన్నారు.

"మీరేమనుకోకండి మాష్టారూ" అన్నాను

"పిచ్చివాడా! నేనేమనుకుంటానోయ్ నీవు ఇబ్బంది పడకుండా వుండటమే నాకు కావలసింది" అని ఆప్యాయంగా వీపు తట్టారు ఆ తర్వాత ఒకనాడు నేను ఇంగ్లీషు క్లాసులో వున్నాను కీ శే జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు గంభీరంగా పాఠం చెప్తున్నారు గురువుగారు ఉత్తరీయం తలపాగాలాగా చుట్టి తలవెనుకనుండి ఉత్తరీయంకుచ్చు భుజంమీదికి లాగిపట్టుకొని క్లాసుగుమ్మం దగ్గరకువచ్చి "ఏడీ మావాడు ఎక్కడా?" అని నావైపు సైగచేసి బైటకిరమ్మని చేయి వూపారు శ్రీ జొ స మూర్తిగారివైపు అదొక ఒడుపుగా చూస్తూ "ఆతనికి పర్మిషన్ యివ్వండి" అని నవ్వారు మూర్తిగారు నవ్వులో నవ్వు కలిపారు నేను బయటకు వచ్చాను మాష్టారు "నీవు Term fees కట్టాలికదూ ఎల్లుండిలోగా కట్టాలి ఆపైన పేరు తీసేస్తారు"

"అవును మాష్టారు"

"నీవు ఫీజు కట్టవు కాలేజి కట్టుకొంటుంది"

నేను కొంచెం ఆశ్చర్యంగా వారివైపు చూశాను "కాలేజిమేనేజిమెంటు నీకు స్కాలర్‌షిప్పు గ్రాంటు చేసింది. ఇప్పుడే మీటింగయింది మధ్యాహ్నం నోటీసు వస్తుందిలే" ఈ మాటలంటూ ఆయన నాలిక మెలిత్రిప్పి సన్నగా నా మొగంపైకి గాలి వూదారు అది చప్పుడులేని యీల "పో ఇంగ్లీషుపాఠం నీకోసం ఆగిపోయింది. ఇక ఈ సంవత్సరం నీవు ఫీజు కట్టనక్కరలేదు" అని హేలగా వెళ్ళిపోయారు నేను స్కాలర్‌షిప్‌కు అప్లికేషన్ పెట్టలేదు అది గవర్నమెంటు గ్రాంటుకాదు మేనేజిమెంటు వారిది మాష్టారు చేయించినది.

ఈ విషయం నేనుచెప్తే కొందరిట్లా అన్నారు "ఎందరు విద్యార్థులకో ఆయన సొంత డబ్బు ఫీజులు కట్టేవారు చాలామందికి పై చదువులకు సాయంచేశారు తనకు బాగా జరగని రోజుల్లోకూడా చేతికి డబ్బువస్తే ఎవరికో కొంత దక్కించనిదే ఆయనకు తోచేదికాదు కాలేజిలో ప్రతినెలా చందాలు వేయించి ఎవరికో ఒకరికి సహాయంచేస్తూనే వుంటారు నీకీసహాయం చేయడం ఆయనకు క్రొత్త ఏమీ కాదు" అని ఆయన గుప్తదాత నలుగురిలో ఆడంబరానికి ఆయన డబ్బిచ్చేవాడు కాదు; అడిగిన వాణ్ని కొంచెం చీదరించుకొనేవారు ఏకాంతంలో ఎందరికో ఆయన సహాయం చేసేవారు నా కోసం వేయిస్తానన్న పాక తర్వాత మరొకరి సహాయార్థం వేయించారు తాము మేడ కట్టుకున్నా మరొక ప్రక్క రేకులతో షెడ్డు వేయించి తమసహాయాన్ని కొనసాగిస్తూనే వచ్చారు. ఇప్పటికీ ఆ షెడ్డు ఆయన సహాయాన్ని కొనసాగిస్తూనేవుంది,

ఆయన రాబడి మొదటినుంచీ జాగ్రత్త పడితే కొన్నిలక్షలు మిగలవలసిందిట క్లాసులో ఎవడో ప్రక్కవాడితో మాట్లాడుతున్నట్లు కనిపిస్తే ఒకనాడు "ఒరేయ్! ఏమిటీ దవడలాడిస్తున్నావ్ ఇంకోసారి మాటవినిపిస్తే ఆ దవడలు నీవికావు" అని "చదువుకోండోయ్ ఉద్యోగాలు రావద్దా ఊళ్ళేల వద్దా నేనూ మొన్నటి దాకా ఒళ్ళూపాయీ తెలియకుండా తిరిగిన వాణ్ణే ఒక ఏడాదిక్రితం నాకొక ఆలోచన వచ్చింది మనజీవితంలో మిగిల్చింది ఏమిటి? ఇంత మహాకవినీ ఇప్పుడుపోతే నాభార్యకు పిల్లలకు తిండికూడా కష్టమైపోతుంది ఆస్థితి ఊహిస్తే నాకు జాగ్రత్త పడాలన్న జ్ఞానోదయమైంది అప్పటినుంచీ కొంచెం వెనక వేస్తున్నాను జీవితంలో జాగ్రత్త నాకు ఆలస్యంగా మొదలైంది మిమ్మల్ని చిన్నప్పుడే జాగ్రత్త పడమని కోప్పడుతా" అని చమత్కారంగా చెప్పేరు.

ఆయనకు తన గొప్పదనాన్ని గురించిగానీ, భాగ్యాన్ని గురించికానీ ఏమాత్రం గర్వంలేదు ఆయనకు జ్ఞానపీఠం బహుమానం వచ్చింది. రేడియో స్టేషనుకి కార్లోపోతున్నాము అప్పుడు మాస్టారు——"ఈశరీరమే చిత్రమైనది. ఎన్నిబాధలు పడిందో అన్ని సుఖాలూ పడింది ఈశరీరంలో ఉన్న సత్యనారాయణ నాటికీ నేటికీ ఒక్కడే. కాని పీడిచుట్టూవున్న

సంసారం మారిపోయింది అప్పుడు నాతో బ్రతికిన భార్య యిప్పుడులేదు ఇప్పుడు నా యింట్లో ఎన్నికూరలున్నా చుట్టంవస్తే మళ్ళా ఏ బంగాళ దుంపలో ఏవో తెప్పిస్తేగాని తృప్తిగావుండదు అప్పట్లో నా కొంపకు చుట్టంవస్తే వానికి ఏమిమర్యాద చేయగలమా అని నాకు కొంచెం కష్టంగా వుండేది. భోజనంవేళ ఆగదుగదా! ఆ వేళకు మాఆవిడ వచ్చిన చుట్టానికి నాకు తిండి సృష్టించేది ఇంట్లో ఆ పదార్థాలు ఎలా ఎక్కడనుండి ఊడిపడి నాయో నాకు తెలియదు షడ్రసోపేతంగా అమృతాయమానమైన తిండి సృష్టించేది సృష్టించడమే సుమా! కూర, పప్పు, పులుసు, పచ్చడి ఏమి కావాలో అన్నీ, ఎలా వచ్చినాయి యివన్నీ! నా బీదకాపురానికి అటు వంటి సృష్టిచేయడానికి, ఆ మర్యాద దక్కించడానికి ఆ మహాయిల్లాలు పడిన శ్రమ తలుచుకుంటే నాకు యిప్పటికీ ఒళ్ళు గగుర్పొడుస్తుంది అదంతా ఎందుకండి! నేను 1956లో మేడ కట్టాను అప్పటివరకు పాకలో వున్నాను.అప్పుడూ యిప్పుడూ ఒక్కటే. కాని అప్పటి మాఆవిడ పడినకష్టం వానకురిస్తే యింట్లో మోకాటిలోతు నీళ్ళు ఆ నీళ్ళు తోడేసి రాళ్ళుపేర్చి వాటిమీద యింత ఉడకేసిపెట్టాల్సి వచ్చేది. అప్పటి విశ్వనాథ సత్యనారాయ ణకి యిప్పటివిశ్వనాథ సత్యనారాయణకి తేడా ఏమిటి? అదేశరీరం కారులో పోతుంది. రైలులో పోతుంది. కొన్ని యేండ్లుగా యిలా సుఖపడుతున్నది లోపలఉన్న జీవుడుముందుస్థితి మరచిపోలేదు మా తండ్రిగారుండగా నేను యువరాజును పుట్టుభోగిని తర్వాత కష్టదశ. ఈకనబడే భోగం, మేడ అంతా ఆ జీవుడినంటుకోవటం లేదు. అందువల్ల వాడికి దుఃఖమేమిటో కష్టమేమిటో తెలిసినంత సుఖం గూర్చి తెలీదు. వానికి గర్వం ఎలావుంటుంది? [అంత కష్టదశలో ఆయన చేసిన గుప్తదానాలు అనేకములు ఆయన సంపాదన అప్పుడు తక్కువకాదు. దాతృత్వం ఆపుకోలేని చేయి తన యిబ్బంది తాను పడుతూనేవుంది ఆదానాలతో సుఖపడినవారు చాలామంది వున్నారు] బ్రతికి వున్నానుగనుక యివన్నీ అనుభవిస్తున్నాను. ఆభార్యలేదు ఆమెకీ అనుభవంలేదు. ఇప్పుడింత మహాకవిని అప్పుడూ ఆ మహాకవినే నన్ను మహా కవినిచేసినది ఆమె " ఈ మాటలాయన కళ్ళల్లో చెమ్మతో అన్నమాటలు వరలక్ష్మి త్రిశతిలో అన్నారుకదా!

"వట్టినీరసబుద్ధి నట్టినన్ను రసోత్థపథముల సత్కవీశ్వరునిజేసి
......ఇతరు లెవ్వరు నెరుగని యీ రహస్య ఫణితి నను
నేలుకొనిన నా పట్టమహిషి"

"నా యఖిల ప్రశస్త కవనమ్మునన కాయమ పట్టభద్రురా
లాయమ లేక యాధునికమైన మదున్నత చిత్తవృత్తి లేదు"

అని చెప్పారు శ్రీరామచంద్రుడికి ముప్పైఫ ఆరుఏండ్ల వయసులో సీతా వియోగం సంప్రాప్తించింది తనకుకూడా సరిగాఅదే వయస్సులో ఆభార్యా వియోగమహాదుఃఖం సంప్రాప్తించింది ఆ వియోగ వ్యథఏమిటో తెలియనిదే తానురామకథను రసవంతం చేయలేడని భగవంతుడు తనకు ఆ యోగ్యత కూడాకల్పించాడని వాపోయినాడాయన

"నీవఖిలోహామార్గముల నిండిన జానకివై రఘూద్వహుం
గా వెలయించి నావునను, గట్టిగ ముప్పదియాఱు వత్సరా
లీవల భూమి గర్భమున నెప్పుడు చొచ్చితివో మఱప్పుడే
నా వెలయింపు లూర్మిపృతనా రభసాక్రమణంబు లన్ జెడన్"

అన్నారు వరలక్ష్మీ త్రిశతిలో-

తనను భారతప్రభుత్వం "పద్మభూషణ" అన్న రోజున ఆయన ఏదో యాదృచ్ఛికంగా మా యింటికివచ్చి నాతో కూర్చున్నారు "ఇదేమిటి! మాష్టారూ! జనమంతా మిమ్మల్ని అభినందించడానికి మీ యింటికి వస్తుంటే మీరిక్కడికి వచ్చి కూర్చున్నారేమిటి?" అన్నాను "ఏమిటి నాయనా! నాలో మార్పు? నిన్నటికంటె యివ్వాళ నాలో పెరిగిన గొప్పయేమిటి?" అని ఆయన అంటుండగానే రేడియోవారి కారు ఆయనకోసం మాయింటి దగ్గరకు వచ్చింది అప్పుడాయన యింటికిపోయి రేడియోవారికి, పత్రికల వారికి సందేశాలిచ్చారు ఎందుకు చెప్తానంటే ఆయనకు మనుష్యులపై ప్రేమ, ఆదరము, ఆర్ద్రిత యివి పట్టినంతగా యీ గొప్పతనాలపైన తన అంతస్థును అధికంగా భావించుకొనే తత్వమే లేదు

అంతటి మహాకవే కదా! ఎంతటి అల్పకవి అయినా సరే తనదగ్గరకు వినయంగావస్తే ఎంతో ఆదరించేవారు ఎందరో ఆయన దగ్గరకు వచ్చేవారు. వారు తనంత మేధావులు కారు ప్రసిద్ధులు కారు కవితారసికులుగూడా కాకపోవచ్చు అతిసామాన్యులు కావచ్చు వారిని చులకనచేసే వారుకాదు. కొందరు అంతంతమాత్రపు కవిత్వం వ్రాసేవారే పట్టరానంత గర్వంతో ఎదరవాడు తన కవిత్వాన్ని ఆస్వాదించగల సమర్థుడు కాడన్నట్లుగా ప్రవర్తిస్తారు.

వారికి అష్టావధానాల మీద అంత యిష్టంలేదు నేను అష్టావధానం రాజమండ్రిలో 1961లో మొదలు పెట్టాను. 1965 వరకూ చాలాచోట్ల చేశాను గురువుగారు ఆ వార్తలు వింటున్నారు, ఏమీఅనలేదు విజయవాడలో ఒకనాడు వివేకానంద శతజయంతి మహోత్సవాలలో వివేకానంద విజ్ఞానమందిరం భవనంపైన అవధానం ఏర్పాటయింది గురువుగారే అధ్యక్షులు వారి సమక్షంలో అవధానం చేయటం అదే మొదటిసారి తనకు గిట్టకపోతే ఆయన శిష్యుడి అవధానమైనా మెచ్చుకోరు ఉపేక్షించి వూరుకోను గూడా వూరుకోరు "ఎందుకొచ్చిన అవధానాలు" అని ఏవేవో అనేస్తారు ఆ భయంనాకు బాగాపట్టుకుంది గురువుగారు అధ్యక్ష స్థానమలంకరించారు నిర్వాహకులు ఇంకా పృచ్ఛకులను వేదికపైకి పిలవాలి ఈ లోపుగానే గురువుగారు సభనంతా కలయజూచి, ఏడెనిమిది మంది పండితులను పిలిచి, మీరు సమస్య యివ్వండి, మీరు దత్తపది, మీరు నిషేధాక్షరి...... ఇలా తలా ఒకటి ఒప్పచెప్పారు ఈ నిర్వాహకులు పిలిచినవారూ కొందరందులో వున్నారు కాని చాలామంది అక్కడికక్కడ గురువుగారి ఆదేశాన వచ్చిన వారే. నిర్వాహకులు తమ యిబ్బంది చెప్పారు మేము పృచ్ఛకులను ఏర్పాటు చేశామండి, వారేమన్నా అనుకుంటారన్నారు అలా ముందుగా ఏర్పాటు అనవసరం అలా చేయగూడదు వీరిని నేను పిలిచాను వీరేవుంటారన్నారు. ఆయన సమ్రాట్ సమ్రాట్టే నేను అవధానం ప్రారంభించాను రెండు వేల మంది జనం రోడ్డు మీద ఫుట్‌పాత్ మీదకూడా కిటకిటలాడుతున్నారు. భగవంతుని దయవల్ల అవధానం చక్కగా సాగింది మధ్యలో ఎన్నో చమత్కారాలు !

ఆయన ఏగ్రంథం వ్రాసినా ఆశువుగా చెప్పగా మాబోటివారము వ్రాసిపెట్టేము ఎన్ని గ్రంథాలు వ్రాసినా ఆయన నాలుగుతలుపులూ బిడాయించుకొని ఏ మారుమూలగదిలోనో తనసెవరూ పలకరించకుండా ఉండే చోట కూర్చొని వ్రాసినవికావు పంచలో కూర్చుండేవారు వ్రాయడానికి నేనో ఇంకెవరో ఉంటాము కూరలమ్మేవాళ్ళువస్తారు పనివాళ్ళువస్తారు ప్రెస్సునుండి ప్రూఫులువస్తుంటాయి ఎవరో పండితులో కవులో చూచిపోడానికి వస్తూనేవుంటారు ఎవరెవరో ఎందరెందరో ఆయన ఏదో గ్రంథం వ్రాసుకుంటున్నారు మనం పలకరించడ మెందుకని వారనుకోరు వారనుకొన్నా యీాయన వూరుకొనే వారుకాదు కూరలమ్మేవాణ్ణి కూడా చమత్కారంగా పలకరిస్తూ కూరలు కొంటారు చెప్పుకు పోతున్న నవలో, నాటకమో, వ్యాసమో ఆతుణాల్లో ఆపుతారు మళ్ళావచ్చి వెనక ఏమిచెప్పిందీ చదవమనకుండా క్రొత్త వాక్యం మొదలుపెడతారు అక్కడ సందర్భానికి సరిగా అదే వాక్యంచెప్పాలి అలాగేచెప్తారు.విషయసూత్రం తెగదు. ఎన్నిసార్లుఆపినా సరే ఆయన వ్యగ్రతకు భంగం రాలేదు అనాడు చెప్పదలచిన భాగమంతా చెప్పేసేవారు

ఈ బాహ్యా విషయాలమీద ఆయన ఎంతో ఆసక్తితో కన్పించేవారు. లోపల గ్రంథం గూర్చిన ఆలోచన అది అలాగేవుండేది కాబోలు! గ్రంథం దగ్గరకువస్తే ఆ ధారణ చూచి ఆశ్చర్యపోయేవాణ్ణి అయన శరీరం నేలమీద ఒక మోటారు ఆయన మనస్సు ఆకాశంలోని ఒకవిమానం

"ఈ జనసమూహామునయందు నేశరీర
మాత్రముగ బోవుచుంటి నామానసంబు
నమిత తృప్తాలసం బంతకంత భూమి
మీదినుండి స్వర్గానికి మెట్లుకట్టు"

అని ఆయన గిరికుమారుని ప్రేమగీతాల్లోఅన్నారు.

"ఏదొ నన్ను వెంటాడెడు నెందుకొఅకొ
అగునొ జన్మాంతరమ్ములయందు జేసి
నట్టి సంస్కారలేశము ప్రాణములకు
వేచుకొని యున్న యాశయేమో చివరకు" అనికూడా అనుకొన్నారు.

కిన్నెరసాని వాగును భద్రాచలం అడవులలో చూచినప్పుడు ఆయన మనస్సు ఆ వాగుతో సంవదించింది చుట్టూపులులూ పుట్రలూ ఏమీ పట్టలా పాములు ప్రక్కగా పోయినాయి ఆయనకు పట్టలేదు ఆవాగు వలెనే తన భావ ప్రవాహం సాగిపోయింది కులపాలికా ప్రణయ పూతమైన తన హృదయంలో పడిన ఆవాగు పవిత్రచారిత్రయైంది "కిన్నెరసాని" అందమైన పేరు కాని ఒక దొరసాని గారికి ఆపేరు చాలా వికటంగా తోచిందిట గురువు గారే చెప్పారు ఈవిషయం "నేను కిన్నెరసాని పాటలు వ్రాసేనాటికే గొప్పకవినని అభిమానించిన శ్రీ సురవరంప్రతాపరెడ్డిగారు నాకు సహాయం చేయించాలని కొందరు సంస్థానాధీశులవద్దకు తీసుకొని పోయారు. ఆరోజుల్లో నైజాం యిలాకా జమీందారులకు సివిల్ క్రిమినల్ అధికారాలుండేవి సరే! అందరి సంగతీ అలావుంచుదాం ఒక సంస్థానాధీశుని యింటికి తీసుకు వెళ్ళారు ఆజమిందారు చనిపోయి కొద్దికాలమైంది ఆయనగారి రాణివుంది పరదా చాటున ఆమె ఇవతలనేను నన్ను ఆమెకు పరిచయంచేశారు. ఆమె విజ్ఞురాలని నాకు చెప్పారు ఆమె పరదా చాటునుండి "కవిగారూ! మీరు సంప్రదాయబద్ధంగా వ్రాస్తారన్నారు, కాని సానిపాటలు వ్రాశారేమిటి?" అన్నది నేను ఎంత పొగరుబోతునైనా వినయం తక్కువైనవాణ్ణి కాదుగదా! "అమ్మా! 'కిన్నెరసాని' అన్నది ఒక వాగు పేరు కదా! దానిపేరుతో దాని గురించి వ్రాయటంలో తప్పేమిటి" అన్నాను ఆమె ఊరుకోవచ్చు కదా! "అబ్బే! ఏమైనా సానిసానే" అన్నది పరదాలోపల పెదవి విరుచుకొని వుంటుంది నేను వెంటనే "అలాగా అమ్మా! ఇందాకటి నుండి తమను సమ పరిచారకులు దొరసానిగారు దొరసానిగారు అంటే ఏమో అనుకున్నాను ఇక సెలవు వస్తాను " అని చరచరా బైటికి వచ్చేశాను అక్కడనేవున్న శ్రీ రెడ్డిగారు, మరొక దేశముఖ్ గడగడలాడి పోతూ ఆమెకేమో చెప్పు కొని బయటకు వచ్చారు "ఇవ్వాళ ఎంతపని చేశావయ్యా! ఆమె నిన్ను అరెస్టు చేయవచ్చు ఏమైనా చేయువచ్చు నీపని ఏమయ్యేది' మా పని ఏమయ్యేది?" అన్నారుట. "ఏమయ్యేది! చంపుతుందా! అదేనయం యథార్థం చెప్పడానికి భయపడడం కన్నా అది నయం కదూ! శబ్దానికి అర్థం తెలియని ప్రతివాడూ విమర్శకుడైతే చచ్చిన చావుకదండీ! ఏమ బ్రతుకే తమకు తెలియనివాళ్ళు కవుల తప్పులెన్నే వాళ్ళా? ఆమె మహా

పతివ్రత కాని తెలుగు పలుకులో ఆమె దొరసాని సందర్భంనుండి పదాలను విడగొట్టి కవుల తప్పులెన్నే వాళ్ళనిచూస్తే నాకు ఒళ్ళుమంట" అన్నాను. అప్పుడు రెడ్డిగారు నవ్వుతూ కారులో కూర్చొని అన్నారు "ఏమైతే ఏం ఇవాళ మాటపదహోర్లు పోగొట్టుకున్నారు" అని నాఅభిమానం పోగొట్టుకోలేదు. అదే నాకు పదివేలు అన్నానునేను అప్పుడు నాకుద్యోగం లేదు. ఇల్లు గడవటం చాలా కటకటగావుంది నా అభిమానం నన్ను ఎవరికీ తలవంచనీయదు నన్ను పొగరుబోతుఅంటారు గిట్టనివాళ్ళు అననీయవోయ్! నాజన్మే అంత

"నేనచ్చముగా పాఱుడ
గాను సుమీ! క్షత్రరక్త కాండమ్ములు నా
మైనరములఁ బ్రవహించున్
శ్రీనిభృతమనోజ్ఞహాస చిత్రితవదనా!"

నా రామాయణంలో ఆ మాటలు పరశురాముడు శ్రీరామునితో అన్నట్లు వ్రాశాను. నేనే ఆ ప్రభువుకు అలా మొర పెట్టుకున్నాను ఆయన నవ్వాడు నా తీవ్రతకు ఆయనకు నవ్వు వచ్చివుంటుంది- అన్నారు నేనన్నాను "కాదు మాష్టారూ! క్షత్రియుడై తన కథను సమానధర్ముడైన ఋషి చెప్తున్నాడని సంతోషించాడేమోనండి" అని ఆయన నావైపు చిత్రంగా చూశారు.

"నాకవిత్వం అంతా నా జీవితంలోని అనుభవాలమయం లోకవ్యక్తిని కావ్యవ్యక్తి నయ్యాను దశరథుణ్ణి గూర్చి బంధుజ్యేష్ఠుడన్నాను వేయి పడగలలో "రామేశ్వరశాస్త్రి బంధుజ్యేష్ఠుడు" అన్నాను ఎవరీ బంధుజ్యేష్ఠుడు? మా నాయనగారు నీ చుట్టువున్నలోకంలో నీకు చెందని భావం ఏముంటుంది? నీవు పొందని అనుభవం ఏముంటుంది? ఈ భావాలు, ఈ అనుభవాలు నీ మనస్సుపై వేసిన ముద్రలలో నుండే నీ మాటలు దొర్లుకొనివస్తాయి నీవు కవివయితే ఆ శబ్దము వ్యంజకమై కావ్యత్వాన్ని

పొందుతుంది కవివయితే నంటే ఏమిటి? కవియైనవాడు లోకాన్ని చూచే దృష్టివేరు వానికి కనిపించే లోకము అందరు చూచే లోకమే

"పలుచని బురదలోపల మానిసినిఁ జూచి
నెగచి యూఁకున దూకె నీటిపాము
వెలివడ్డ బొరియముంగిలనిక్కి తెల్లఁబో
యెను కొంగ కెఱగాని యెంద్రకాయ
ఒడ్డున బురదలో గొడ్డు గిట్టలు దిగి
పడె జంఘుదఘ్నమై పంటకాల్వ
జనుము చల్లుటకు తీసిన పాయ పాపట
చక్కఁదీగిచి దిద్దె సస్యలక్ష్మి
పలుచగా వేడియెక్కుఁ బవళ్ళతోడఁ
బైరగాలి పొరల్ తడియారఁజొచ్చె
పగటి కూసను నా నొప్పె నవార్షుకములు
కాఱులకుఁ దొల్తగా శరత్కాల లక్ష్మి"

తెలుగు ఋతువులలో ఈ పద్యం వ్రాశాను నేను మా పల్లెలో చిన్ననాడుచూచిన దృశ్యాలు చెప్పాను ఆ దృశ్యాలు ఎవరూచూడలేదా? చూసేవుంటారు కాని చెప్పలేదు. శక్తిలేక చెప్పలేక పోవచ్చు లేక ఆ దృష్టి లేక చెప్పకపోవచ్చు. కనుక ఎవడు కవి? ఆ శక్తి, ఆ దృష్టి ఉన్నవాడు

"ఉరుదరీకుహర సుప్తోత్థ శార్దూలముల్
ఝురవారి శోణిత శంకద్రావ
వనకుంజమధ్య శాద్వల చరన్మృగపంక్తి
దావపావక భీతిఁ దల్లడిల్ల" ఇత్యాది మను

చరిత్రలోని పద్యముందికదా అది కవి చూచిన దృశ్యమా? అన్న ప్రశ్న రావచ్చు. కవి చూడ నక్కరలేదు ఉత్ప్రేక్షించాడు. అప్పుడు మాత్రం

పంచేస్తున్నాడు? పులులలో, తేళ్ళలో ఉన్న సహజమైన ప్రవృత్తిని ఎన్ని చెప్తున్నాడు నేను పట్టి స్వభావోక్తి చెప్పాను అచ్చమైన తెలుగులో చెప్పాను నీవు వ్రాసిన వన్నీ నీవు చూచినవేనా? చెప్పాను గదా! కవియైన వాడు లోకాన్ని చూస్తాడంటే అన్నం అంతా పట్టి చూడనక్కరలేదు

నా రామాయణంలో అరణ్యకాండవుంది అక్కడ అడవిలోని ఎన్ని చమత్కారాలు చూపించాను?

"ఉద్భవచ్ఛృంగమౌ యువకురంగము దడి
పొడిచి లోనికిఁజూచి పోవుచుండ
నిస్తబ్ధమౌగాలి నిల్చినిల్చి తరంగ
ధృతిఁజెట్లపై ముర్మురించుచుండ
అపుడప్డు రోమంథమాపి పరున్న ఆ
శ్రమగవి నిట్టూర్పు జార్చుచుండ
నడికిరే ఘూక స్వనము సింహగర్జయు
వదలి వేర్పఱ్వడి మెదలకుండ
ధరణి సంతానమునకు నిద్రామనస్సు
స్వామి జాగ్రత్తపడి పతిపైని జేయి
చాచి మాటికిమాటికిఁ జూచుచుండ
బ్రభుసుఖాపాదిని గతించె రాత్రియెల్ల"

అడవిలో సీతారాములు గడిపిన మొదటిరాత్రిని గురించి చెప్పాను. నేను ఈపద్యం వ్రాయాలంటే అడవిలో కాపురముండనక్కరలేదు. ప్రకృతిలోని ఆయావేళల ఆయాతావులస్థితిని భావించగల మనస్సొకటి ఉండాలి. అది నాలో నిత్యజాగ్రదవస్థలోవుంటుంది నేను రైలులో వెళ్ళినా కారులో వస్తున్నా ఎప్పుడూ ఆమనస్సు ఈ భావనతోనే నాచుట్టూ చూస్తూవుంటుంది దీనికితోడు నేను అడవిని గూర్చి సవాలక్షగ్రంథాలు చదివాను అడవిలో తెగ తిరిగాను. వేటను గూర్చిన గ్రంథాలెన్నో

తిరగేశాను Jim cobet, Henderson Singh—ఇలాంటి వాళ్ళ గ్రంథాలన్నీ చదివాను ఇవన్నీ నాకేమి ఒరిగించినాయి వాటిలోని విషయాలు నామనసులోపడినతరువాత వాటికి కలిగే సంస్కారం వేరు ఆవి నా అనుభవ విషయాలవుతాయి ఏనాడో ఎక్కడో నేను అలా అడవిలో రాత్రిళ్ళు గడపివున్నాననే అనిపిస్తుంది. నా (పాడు) మనస్సుకి విశ్రాంతి ఏది ? ఎప్పుడూ ఇలా ఎదోభావించనిది దానికి తోచదాయె దాంతోనాకు విశ్రాంతి అన్నమాటలేదు కాసేపు ఆమనసును పట్టించు కోకుండా వుందామని చీట్లపేక ఆడుతూ కూర్చుంటా అప్పుడూ ఆగదు ఈమనస్సు నేను ఎన్ని రాత్రులు నిద్రలేకుండా ఆకాశంవైపు చూస్తూ గడిపానో. మనకు తిథులున్నాయి కదా ప్రతి తిథిలోనూ చంద్రుడెప్పుడు ఉదయిస్తాడు? ఎప్పుడస్తమిస్తాడు? పదిళనుండి వెన్నెలలు ఎలా పడతాయి? చీకట్లు ఎలాక్రమ్ముతాయి ఇవి చూడకుండా వ్రాసినవి కావు నా నవల్లో చూడు నెలకు సరిపడ రాత్రులన్నింటి స్వరూపం తెలుస్తుంది నా రామాయణం "నా సకలోహావైభవసనాథ" మని వట్టి గప్పాలు చెప్పుకో లేదు నాయనా వాడికి మనస్సనేదేవుంటే, చదవటమనేదితెలిస్తే నా రామాయణం చదివిన వాడు లోకాన్ని నేను ఎంతనిశితంగా అనుశీలిం చానోతెలుసుకుంటాడు కాలంలోని ప్రతిలిప్తనునేను చూచాను దేశంలోని ప్రత్యంగుళంనేను కొలిచాను ఇలా ఉపన్యాసాల్లోచెప్తే వీనికి అహంకారం అనుకుంటారు కాదు నాయనా నాగ్రంథాలు చదవండి నేను ఏమి చెప్పానో చూడండి అంటాను. నాపుస్తకాలు చదవకుండావిమర్శించేవారే నాకుఎక్కువైనారు నేనేం చేసేది '' ఇలా గురువుగారు అప్పుడప్పుడు తన ఊహా పద్ధతిని, తన రచనావైలక్షణ్యాన్ని మాటవరసకు చెప్తూ వుండేవారు

ఆయన యేమో చెప్పారనికాదు. ప్రత్యక్షంగా కొన్నివిషయాలు నేను చూచాను. ఒకసారి మేము ఇల్లెందులో ఒక సభకువెళ్ళి తిరిగి వస్తున్నాము టాక్సీలో ఇల్లెందునుండి కంభంమెట్టుకువచ్చేరోడ్డు రెండు ప్రక్కలా ఎడారిలాగవుండి, అంతాకొండలూ గుట్టలూ అక్కడక్కడా చిన్నచిన్నచెట్లు. ఒక కొండమీద రెండుచెట్లు చూపించారాయన. ఆరెండు

చెట్లునర్తకీనర్తకుల జంటలాగా కనిపించినాయి టాక్సీ రెండుమైళ్ళదూరం పరుగెత్తినదాకా ఆ దృశ్యం అలాగే కనిపించింది ఇంతలో టాక్సీ ఆకొండ ప్రక్కకువచ్చేసరికి, ఆకొండమీద ఒక్కచెట్టేవుంది రెండోచెట్టు మరి రెండు ఫర్లాంగులదూరంలో నర్తకీభంగిమలోనేవుంది దూరానికి ఈ రెండు చెట్లూ ఒకే జంటగా, అందులో నర్తకీనర్తకులుగాకనిపించాయి రామాయణంలో యిలాంటివి కొన్ని విచిత్రాలు వ్రాశామన్నారు

"ఎదురుగా నేగుచోనెదలపై హారనాయకరత్నముల కంశులప్పువెట్టి
యెడమకుదిరుగుచునేగుచో గుడిబుజమ్ముల నంగదచ్ఛవుల్ గిలకరించి
కుడివైపుతిరిగియేగుటయందు వామాక్షి లాలితాపాంగమాలలనుగదిపి
యాగ్నేయమీశానమ్మై యేగ ముప్పాతికమొగంబు వెలినీడగామలంగి
సాగిప్రొద్దెక్కినకొలంది చండకరుడుదారిమలకలుతిరిగిన దశరథేశు
సైన్యములయందుఁగాంతి ప్రసారచిత్రవల్గుగమనంబులన్ వళావళులు జేసె"

ఇలా చూపాలంటేఎన్నోవున్నాయి

"రాత్రివేరె మరల భార్యాభర్తలకు గలసికొను వేళయయి యింటిలో చివగకు సర్దుచున్న పాత్ర సామగ్రి మ్రోతలే మన్మధుని జ్యాటంకారమువలె ధ్వనించెను" అంటారు ఇవి ఆయన అనుభవాలకుప్రతిధ్వనులన్నారు

"ఆయన సామాన్య మానవుణ్ణి పటించుకోలేదు పేదబ్రతుకులను గూర్చి వారి జీవితాన్నిగూర్చి వారికష్టసుఖాలనుగూర్చి వ్రాయడు ఏవో పుక్కిటి పురాణ గాధలను, మతవిషయాలను నవలలుగా అల్లుతాడు" అని ఏవేవో కులవిమర్శలు కువిమర్శలు చేసేవాళ్ళున్నారు ఆయనకుజీవితముపైన ఎంతసమగ్రదృష్టివున్నదో ఆ విమర్శకులకుతెలియదు తెలిసికూడా సామాన్యులను వంచించుటకు యత్నమేమో తెలియదు ఆయనవేయిపడగలు సరిగాచదివితే ఆయనజీవితం, జీవితంపైన ఆయన దృష్టి, ఆయన ఆశయాలు, ఆయన వ్యక్తిత్వం సంపూర్ణంగా తెలుస్తుంది. "మత మెప్పుడును వ్యక్తివిషయము సంఘవిషయముకాదు దుర్జనులు సంఘవిషయమని భ్రమింపజేసి స్వలాభపరాయణులగుచున్నారు" (వేయిపడగలు-చూ) "పేదవారినెత్తురుత్రావి ధనవంతుడు ధనవంతుడుకావలె ఎవని నెత్తురుత్రావి తాను బలిసెనో ఆపేదవాని శిరసునే యెక్కి తాను సవారి చేయవలె

మలల, ఇదే చిత్రము" (వే ప చూ) ఇటువంటి భావాలను ప్రపంచించిన మహానుభావుడు వ్రాసినది సామాన్యుని కథకాదా!

ఆయన కృతజ్ఞతాలక్షణం గాఢమైనది. ఆయన గుంటూరులో ఉన్నప్పుడు తన అర్ధాంగి మరణించిన తరువాత తనపిల్లలను ముద్దుచేసిన వారికి తాను యావజ్జీవితమూ సాయంచేస్తూనేవున్నారు ఒకనాడు ఒక బీద బ్రాహ్మణుడు ఆయనను చూడడానికి వచ్చాడు "సత్యనారాయణా! కులాసాగా వున్నావా? "అంటూ ఆయన కుశలప్రశ్నలు ప్రారంభించాడు "సరిగా గుర్తురావటంలేదు ఏమనుకోకండి" అన్నారు మాస్టారు. ఆయన తమఊరూ పేరు చెప్పారు "ఓయ్! నీవుటోయి! లక్ష్మీనారాయణ! అబ్బో ఎన్నాళ్ళనాటి మాట! 40, 50 ఏళ్ళయిందా మనం కలుసుకొని"అన్నారు. "ఇంకాపైనే" అన్నాడాయన ప్రేమగా చూస్తూ. ఇద్దరూ కాసేపు తమ చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకున్నారు. ఆయన తన బావమరిది యింట్లో పెళ్ళికి వచ్చానని చెప్పి వెళ్ళివస్తానన్నాడు. "వెళ్ళి వస్తావా......ఉండు" అని మాస్టారు లోపలికి వెళ్ళి ఐదు నిమిషాలైన తర్వాత బయటకువచ్చారు. "లక్ష్మీనారాయణా! ఏమీ అనుకోకు, నీచేయి పట్టు ఇదిగో" అని చేతిలో నలభయ్యో ఏభయ్యోరూపాయలు పెట్టారు ఈ బట్టలు తీసుకో అని రెండు దోవతుల చాపులు పెట్టారు "నాకెందుకు సత్యనారాయణా! యివన్నీ" అన్నాడాయన "నాకోసం" అన్నారీయన. ఆయన వెళ్ళిపోయిన తరువాత "ఏనాటి మిత్రుడు! ఎటువంటి కుటుంబం! ఇప్పుడు ఆ సంసారం బాగాచితికి పోయినట్లున్నది. అడగడు. ఇస్తే పుచ్చుకోనంటాడు కాని అతనికి ఎంతో అవసరంలో వున్నాడు" అన్నారు. నాకాశ్చర్యమైంది

జ్ఞానపీఠం బహుమానం వచ్చిన తరువాత ఆయన ఒకనాడు తమ తమ్ముళ్ళను వెంకటేశ్వర్లు గారినీ, రామమూర్తిగారినీ, నన్నూ ఇంకా ఒకరిద్దరుమిత్రులను వెంటబెట్టుకొని గుడివాడ తాలూక కపిలేశ్వరపురంకు టాక్సీలో తీసికొనివెళ్ళారు అక్కడ ఆనాడు ఆయన దాదాపు ఆరువేల రూపాయలు ఇద్దరు ముగ్గురికిచ్చారు. వారు చిన్ననాడు తనను ఆదుకొన్న ఉదారులు వారి పిల్లలకు బహుమానంగా ఆ పైకం యిస్తున్నామన్నారు

బలవంతాన వారిని ఒప్పించి యిచ్చారు ఆ తరవాత ఇలాంటివి ఎన్నో చేశారు దాదాపు పదిహేను ఇరవై వేలు అలాచేశారు

నేను ఒకనాడు ధైర్యంచేసి "మాష్టారూ వేయిపడగలలో ధర్మారావు మీరేనంటారు అది సత్యమేనా" అన్నాను ఆయిన నవ్వి "ధర్మారావు ఎవరోగాని కిరీటి ఫలానా సూర్యపతి ఫలానా, కుమారస్వామి ఫలానా, రాఘవరావు ఫలానా అని అందరికీ తెలుసు వారికి కూడా తెలుసు" అన్నారు (ధర్మారావు తండ్రి) రామేశ్వరశాస్త్రి గారికి కట్టుకొనుటకు దోవతి యొక్కటియే యుండెను పైనుత్తరీయము కూడాలేదు అంగ వస్త్రము కలదు అవి రెండే యాయనకుగల సర్వవస్త్రములు......శాస్త్రి పై యంగవస్త్రము ధరించి దోవతి వానికిచ్చి యింటికి వచ్చెను" వేయి పడగలలోని ఈ శాస్త్రిగారు "దూసిన సర్వర్ధివై మిగులు దోవతినొక్కడు దాల్చిన" శోభనాద్రిగారే' ధర్మారావు ఎవరని వేరే అడగలా?" అని నేనన్నాను మాష్టారు నవ్వి వూరుకున్నారు తాను చిన్నప్పుడు చాలా చాయగా ఉండేవారని దబ్బపండువలె ఉండేవారని చెప్పారు క్రమంగా ఆ చాయ అంతా మారింది నా దస్తూరి ముత్యాల కోవలాగా ఉండేది ,అది కూడా పెద్దయిన తర్వాత చెడిపోయింది అన్నారొకసారి. "సామాన్యముగా జీవితము మొదలిదినములలో కష్టపడినను జివరినాళ్ళలో భాగ్యమనుభవించిన వారిదే మంచి జాతకము" అన్న లక్ష్యాన్ని ఆయన సాధించారు ప్రాత దినములు పోవుచు క్రొత్త దినములు వచ్చుచున్న సంధివేళ పుట్టిపెరిగిన వాడాయన ఆయన "ప్రతి దినము రాత్రులందు భోజనముచేసి తలవైపున ప్రక్కవద్ద దీపము పెట్టి చదువుట కారంభించును ఆ చదువుట చదువుట తెల్లవాటి కోడికూయువరకల్లే చదువును ఈ రీతిగా (ఆయన) ఇంగ్లీషు నవలలు, (కావ్యములు) చదివెను తెలుగు వానికన్న నవి చాల బాగున్న వని యూహించెను"

"వేయి పడగలతోనేల దాల్చిన వాడు రెండు పడగలతో దంపతుల పాలించువాడు. ఒక్క పడగవిప్పి పైరు పచ్చకు గొడుగుపట్టినవాడు త్రిమూర్త్యాకృతి, శూలము నాలుకయందు, శంఖ చక్రములు ఫణాగ్రముల యందు దాల్చిన దేవుడు, ధర్మమయ తనువు, కరుణాతరంగితాంతరంగుడై

తన్ను గూడ తన పితరులవలెనే సంప్రదాయమునకు దూరము గాకుండ కాపాడువాడు నాకు ప్రసన్నుడగుగాక! నన్ను సర్వదా రక్షించుగాక!" ఈ ప్రార్థనకు ఉత్ప్రేక్షుడైన సర్పాకృతియైన స్వామి ఆయనకు పిలిచిన పలికిన దైవమనుటలో నాకేమీ సందేహంలేదు ఒకనాడు మధ్యాహ్నం ఒంటిగంట వేళ నేను వారియింటి వరండాలో కూర్చొని వుండగా కొబ్బరి చెట్టువైపుగా ఒక పెద్ద గోధుమవన్నె పాము బంగారపు తళతళతో బైట కనిపించింది " పావనీ పావనీ అని నేను భయపడుతూ పిలిచాను అప్పుడు మాష్టారు నిద్రపోయేవేళ పావనికి నా మాట వినిపించలేదు పాము మళ్ళా కనిపించలేదు ఇలా అని నేను చెప్తే మాష్టారు "అది మనలనేమీ చేయదు" అన్నారు నమస్కారముద్రతో పావని "అదా అప్పుడప్పుడూకనిపిస్తూనే వుంటుందిలే అన్నయ్యా" అన్నాడు

ఆయన తన చిన్ననాటి కవితా వ్యవసాయాన్ని గూర్చి చెప్తూ ఒక సారి యిలా అన్నారు "భరతశర్మా! నేను చిన్నప్పుడు పద్యాలు వ్రాసే వాణ్ణి ఎన్నాళ్ళైనా వాటికి ఒకపాటు కుదరలేదు మా నాయనగారికే నచ్చేవికావు పింగళి బాగా వ్రాసే వాడని మా నాయనగారు మెచ్చుకొనే వారు నాకూ అవి బాగానే వుండేవి నేను పట్టుబట్టి అభ్యాసం గాఢంగా చేశాను ఒక్కొక్క దశలో నా కవితలో ఒక్కొక్కవైచిత్రి బైటపడుతూ వచ్చింది అసలు నేనూ పింగళీ జంటకవులం కావలసింది ఇద్దరం బందరులో రాత్రి ప్రొద్దుపోయే దాకా గుళ్ళచుట్టూ గుళ్ళల్లో కలిసితిరిగే వాళ్ళం. ఒక కంచములోతిని ఒక మంచంలో పడుకొని పెరిగిన వాళ్ళం అతనిలాగా మెత్తగా వ్రాసే పద్ధతి నాకు అలవడలేదు అదినాకు కొఱతగానే వుండేది రాను, రాను నా కవితలో ఒక్కొక్క మెట్టులో ఒక్కొక్క విలక్షణత కనిపిస్తూవచ్చింది నా గుండెలోనుండి వస్తున్న మాటల్లో ఒకకూర్పు వినూత్నంగా నాకుతోచింది అప్పుడు నాకు తెలిసింది నా శైలి ఒకటివున్నది; అది సకల పూర్వాంధ్రకవుల కోవలోనిదే కాని వానికంటె యిది చాలా విలక్షణమైనది భగవంతుడు నాకిచ్చిన యీ శైలి సహస్రముఖమైనది విచిత్రమైనది ఇది యింకొక శైలితోలగించదు. కొన్ని వేల పద్యాలు వ్రాసి, నాకు నచ్చక చింపిపారవేశాను. బహుశా అచ్చులో పడినన్ని చింపి

వేళానేమో నాకొక పరినిష్ఠితమైన శైలిఏర్పడిన తరువాత నాకు అంతంత మాత్రపు కవితలపై మోజుపోయింది ఒక మహాకావ్యము వ్రాయాలి. అది నా జీవితానికి చరితార్థత. ఆ ప్రతిజ్ఞ భగవంతుడు చెల్లించినాడు" అని.

తాను ఒక మహాకవి అవుతానన్న గాఢమైన నిశ్చయం ఆయనకు ఆ శైలి ఏర్పడినప్పుడే కలిగింది. గిరి కుమారుని ప్రేమ గీతాలలో—

"ఇది ప్రతిన బూనితిన ప్రవహింపజేతు
నీయడుగుదమ్ములందు ననేక నాక
వాహినులు వాని నీరముల్ ప్రాశనమ్ము
గాగ భావ్యాంధ్రదేశ సత్కవులకెల్ల
మధురహైమచ్ఛదాభిరామయును
మదవతీ రణన్నూపురంక్రేకృతి ప్రశస్త
కూజితయునైన హంసిపై గూరుచుండి
భావి శారదామూర్తిని ప్రజ్వలింతు
ఆ సరస్వతి నిన్ను జిహ్వాగ్రసీమఁ
దాండవింపించినట్టి విధాతృమూర్తి
నన్ను నా సృష్టినేమి యనంగగలరొ
మన శిశువులైన భావి సంపన్నకవులు,"

ఎన్నడో 1920 ప్రాంతమున వ్రాసిన ఈ కావ్యఖండిక ఆయన సాహితీ జీవితములో ఆయన నిర్వహించిన పాత్రకు అక్షరమైన సాక్ష్యంగా ఉన్నది

ఆయన జపతపోఽనుష్ఠానాదులు ఆడంబరం లేనివి రోజుకు కనీసం ఒక్కొక్క మంత్రము మూడు వేలు చొప్పున మూడు మంత్రాలు జపించే వారు ఆయన జపం పగలు తక్కువచేసేవారు. రాత్రి 8గం. మొదలు

పూర్తిగా ఆ జపాలు పూర్తిచేసి వార్ధక్యంలో పడుకొనేవారు చిన్నప్పుడు గ్రంథ పఠనం చేసేవారు రాత్రి ఏ రెండు గంటలకో పడుకోవటం, ప్రొద్దున కొంచెం ఆలస్యంగా నిద్రలేవటం తరువాత వ్యాయామం, ఆసనాలు, శీర్షాసనం, "పొట్ట అక్కళించటం ఆడించటం" ఇవి రోజూ తప్పనిసరిగా చేసే వారు మయూరాసనం, హలాసనం, సర్వాంగాసనం- ఇవి కూడ 75 ఏండ్ల వయసులో కూడా వేసేవారు ప్రాణాయామంలో ఆయనదొక ప్రత్యేక ప్రక్రియ ఉండేది ఆయన ఆచారం ఎక్కువ ఛాదస్తంగా పాటించేవారు కారు కాని మనసంతా జపమయమే తపోనిష్ఠమే అందులోనాకు సందేహం లేదు

ఆయన చాలా లౌకికమైన వ్యావృత్తులలో జంజాటంలోపడి కొట్టుకు లాడుతున్నట్లు కనిపించేవారు కుమారుడు బజారునుండి ఆల్యసంగావస్తుంటే పదిసార్లు గేటుదాకాపోయి తొంగిచూస్తూ నిలబడేవారు నేను ఏమయింటికి వస్తానన్న వేళకు రాకపోతే అమాంతం పైన తువ్వాలువేసికొని మాయింటి వైపు వస్తూండేవారు

బజారుకు కలిసివెళ్ళే వాళ్ళం శుక్రవారం నాడు ఎప్పుడైనా ఏ కొట్లోనన్నా టెంకాయముక్క ప్రసాదంపెట్టే ఆయన ఆ కొబ్బరి ముక్క వెంటనే నోట్లో వేసుకునేవారు కా... ఆ కొట్లోనో ప్రక్క కొట్లోనో అంత ఉప్పుగల్లు తీసుకొనేవారు కూరల మార్కెట్టుకు పోయేదాకా ఆ కొబ్బరి ముక్క ఉప్పుగల్లు చేతులోనే వుండేవి పచ్చిమిరపకాయలు కనపడగానే ఈ కొబ్బరి ముక్కకూ ఉప్పుగల్లుకూ ఆయన రుచులు దిల్పించేవారు నోట్లో ఇంతలౌకికమైన రుచులు మరిగిన లక్షణం వారిలో కనిపిస్తూనేవుండేది అదే క్షణాలలో ఆయన భగవద్విషయికమైన భావనతో ఒక యిరవైముప్పై పద్యాలు మనసులో వ్రాసేవారు ఇంటికి రాగనే వాటిని కాగితంమీద పెట్టేవారు ఆయన శరీరంతో లోపలవున్న జీవుడు అంటీ ముట్టకుండా వున్నాడంః?అన్నదానికి సమాధానం ఆయన కల్పవృక్షంనిండా ఖండాంతము లందున్నది

ఆయన ఎన్నో కష్ట సమయాలను, ఆపద్దశలను పోతనగారి భాగవతంలోని షష్ఠస్కంధంలోని నారాయణకవచ పారాయణంతో పోగొట్టుకున్నామని చెప్పారు. నన్నుకూడా ఒకసారి చేసిచూడుమన్నారు నా కుమారుడికి 106° జ్వరంలో ఆయన చెప్పిన ప్రకారంగా గురితో చేశాను జ్వరం తగ్గింది వాడికి ఎన్నిమందులిప్పించినా తగ్గని అనారోగ్యం ఆప్రక్రియతో పదిరోజుల్లో తగ్గింది. ఈ కాలంలో ఇది చెప్పటం చాలా అనాగరకంగా వుంటుంది కాని జరిగింది చెప్పకుండా ఎలావుండను?

ఆయన మంచం చుట్టూ ఒక పరివేషం వున్నట్లువారికి చాలసార్లు కనిపించిందట ఒకసారి ఆయనకు చాల భయం కలిగింది. ఆ భయం మంత్ర ప్రయోగాన్ని గూర్చి అప్పుడాయన తన దగ్గర వున్న ఒక్క మంత్రాన్ని జపించారు ఆయన మంచం కుడిప్రక్క ఎడమ ప్రక్కలవైపు కాళ్ళుతనా యించి ఒక మహాకాయుడు నిలిచి తన మంచం చుట్టూ తోకచుట్టుగా చుట్టి వున్నట్లు కనుగొన్నారుట

ఎన్ని మంత్రాలున్నా, ఎన్ని మందులున్నా, జీవునకు కాలంచెల్లి నప్పుడు వాని బహిరుపాధిని విడిచిపెట్టక తప్పదు పూర్వాపూర్వ కర్మాను బంధంచేత అన్ని వ్యాధులూ అప్పుడే ముంచుకువస్తాయి ఏమి వ్యాధి లేకుండా పోవచ్చు వ్యాధి నిమిత్తంగానూపోవచ్చు

ఒక మహాకవి జీవితమే ఒక మహాకావ్యము.

ఆయనను తమ జీవిత చరిత్ర వ్రాయుమని చాల మంది కోరారు. చాలకాలం ఆయన వ్రాయలేదు చివరకు 1971లో కాబోలు మొదలుపెట్టి తమ బాల్యం అంతా చెప్పారు అది 200 పేజీలు చిన్నసైజు వ్రాతప్రతి అయింది తరువాత ఆయన దాని ఊసుఎత్తుకోలేదు

ఒకనాడు నేను వారితో అన్నాను "మాష్టారూ మీ జీవితచరిత్ర ప్రారంభించారు పూర్తిగా చెప్పండి వ్రాస్తాను" అన్నాను.

"భలేవాడివి! నీకుకూడా ఈ పిచ్చి పట్టిందా? నా గ్రంథాలన్నీ చదివినవాడికి నా జీవితమంతా తెలుస్తుంది ఇక నా పుట్టిన తేదీ, చచ్చిన తేదీ—

మధ్యతేదీలలో నేను బ్రతకలేక చచ్చినవీ చావలేక బ్రతికినవీ అయిన ఘట్టాలే కదా చరిత్రగా వ్రాయాలంటే అలాంటిచరిత్ర వ్రాయటమంటే నాకు తలకాయనొప్పి ఆ పనీ నాచేత కొంత చేయించారు కదా!"

"నేను అనే వాణ్ణి ఈ శరీరం కాదు గదా! ఆ నమ్మకం నాకు గట్టిగా వుంది నీకుందోలేదో నాకుతెలియదు. ఆ "నేను" అనే వాణ్ణి నాపుస్తకాల నిండానింపాను నా శరీరం తీసికెళ్ళి తగలేస్తారు నా పుస్తకాలను తగలేస్తే ఆ "నేను" అనే వాణ్ణికూడా తగలేసినట్లవుతుంది ఎవరైనా తృప్తి పడితే అది వాని కర్మ నేను తగలేస్తే తగలబడేవాణ్ణి కాను పాతిపెట్టితే పాతిపెట్టబడేవాణ్ణికాను " అన్నారు

ఆయన భారతదేశము యొక్క యాత్మ ఆయన త్రయీవిద్య కొక వ్యాఖ్యానము

# విశ్వనాథవారి విశిష్టత

## శ్రీ చతుర్వేదుల లక్ష్మీనరసింహం

అది 1934 పూర్వాశ్రమంలో స్వామి నిర్వికల్పానంద గుంటూరులో మా సహవాసి. ఓ నాటి సాయంత్రం నాతో "యీ పూట భోజనంమాని ఫలాహారం చేద్దాం కిమ్మనకుండా నేరమ్మన్న చోటికిరా" అన్నారు విషయంచెప్పడు. అప్పట్లో సినిమాలు మూకీలు మాత్రమే మరి? ఆలోచిద్దామన్నా. ఆయనకు తెలుసు అంతమాత్తానికి అనుస రించనని 'నీతో ఒక పెన్నిధి పంచుకుంటా' అన్నాడు అప్పట్లో అర్థ సంగ పరిత్యాగి మాత్రమే ఈ దాగుడు మూతలు కాదు పని ఏమిటో చెప్పి వివరించమంటే, లాభంలేదనుకొని, మనకాలేజీలో క్రొత్త ఆంధ్ర అధ్యాపకులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారితో పరిచయం చేస్తా నన్నాడు. అది అంత సాధ్యమనిపించలా ఆయనా, శ్రీ కొడాలి సుబ్బారావు (హంపీక్షేత్రం) గారూ అదొక లెక్కుపోతూ అదో ప్రపంచంగా తిరిగేవారు కవిత్వం వ్రాస్తున్నారన్న మాట విన్నా వాళ్ల వేషంలో సాహితీ సమితి ముద్రలేనందున నమ్మకం కలగలేదు

అప్పటికే పేరుమోస్తున్న శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి మేనల్లుడు కావటం, చెప్పుకోటం వల్ల స్వామి వారికి అక్కడప్రవేశం లభించింది

ఆనాటిరాత్రి 12 గంటలైంది అడగ్గా, మా యింటిపేరు చతు ర్వేదుల అన్నా వైదికవాసన కనపట్టంలేదు, మీ పాకిట్లో నాలుగు అరుగు లుంటాయేమో చూడాలన్నారు అదే ప్రథమ పరిచయం కాస్త బాధపడి మాతాత ముత్తాతలు చైనం యజ్ఞం చేశారన్నా తరువాత మా ఊరువచ్చినప్పుడు రెండూ నిజమే నన్నారు అసలు సంగతి ఆరాత్రి అప్పటికి వెలుగు చూడని (పుస్తక రూపంగా) కిన్నెరసాని పాటలు,

మూగనోము, హనుమత్సందేశం, యింకేవేవో చదివినారు ఆనాటితో ప్రారంభమైన మా పరిచయం, పెరిగి, పెనవేసుకుపోయి వృద్ధిచెందింది ఎంతగానంటే ? మా ఉన్నత పాఠశాల స్వర్ణోత్సవానికి మే 76 విచ్చేసి, ముఖ్యమంత్రి, విద్యామంత్రి యితరులు ఆహూతులన్నా కారణం అటుంచి, 'సంఘకార్యదర్శి నరసింహం మొదట్లో నాశిష్యుడు, తర్వాత స్నేహితుడు, యిప్పుడు నాగురువు వాడి మాట కాదనటం ఎట్లా ?" అని చమత్కరించి వేలాది ప్రజలకు నన్ను పరిచయం చేసినంత వాత్సల్యం ఏర్పడ్డది ! గురువంటే జ్ఞాపకం వచ్చింది. 1935 లో హైద్రాబాదులో కవితా గోష్ఠి నన్ను రమ్మన్నారు వేసిన పూలమాలలన్నీ ప్రక్కనుంచినవి అక్కడి వారు నాకివ్వబోతే, 'వాడు నాశిష్యుడనుకున్నారా యి వన్నీ మోయటానికి ? నాగురువని' చెప్పి ఓ మానసిక వ్యధనుంచి రక్షించారు

అష్టాదశ పురాణాలు శ్రీవ్యాసులు చెప్తూంటే లేఖకుడుశ్రీగణపతి.

తమ్ముడు శ్రీ వెంకటేశ్వర్లుగారు వ్రాస్తూంటే వేయి పడగలు పూర్తిగా నెల రోజులు పట్టలా చెప్పుకుంటూ పోవటానికి

శ్రీ విశ్వనాథ ప్రచురించిన నవలలన్నీ యిలా చెప్పగా లేఖకులు వ్రాసినవే-వీరవల్లడు, జేబుదొంగలు, కడిమిచెట్టు, బద్దన్న సేనాని వారు చెప్పగా వ్రాసే అదృష్టం నాకూ దక్కింది

ఆయన చెప్పగా వ్రాస్తూ ఉండటం అదొక అసిధారావ్రతం. వక్క పలుకులు నవుల్తూ సుదీర్ఘసమాసాలు దొల్లించుకుంటూ పోతూ ఉంటే ధారణతో వ్రాయాలి విషయం లేఖకుడు పట్టించుకోకుంటే వ్రాయటం అసంభవం అంత పట్టించుకోకుండానూ వీల్లేదు పాత్రల పేర్లుకాస్త ఓదానికొకటి చెప్పినప్పుడు సందర్భాన్ని పట్టి మార్చుకొని వ్రాయాలి

నవలలో కథావస్తువు రేఖామాత్రంగా పూర్వనిర్ణయంచేసి, చెప్పు కుంటూపోతూ సర్వాంగ సౌందర్యం సంతరించటం జరుగుతుంది పాత్రల పేర్లు అప్పటికప్పుడే నిర్ణయం జేబుదొంగలు, కథానాయకునికి వాపేరు

పెడ్తే నేను వ్రాయలేదు ఒకగికి 'చతుర్వేది' అని ఉంచి ఉభయులం రాజీపడ్డాం.

పద్యరచన ఆయనేచేసేవారు అంటే మానసికంగా అంతా నిర్మించి చరచరా వ్రాయటమే కల్పవృక్ష రచనా అంతే

పద్య పఠనం లేదా కవితాగానంలో చెళ్ళపిళ్ళవారిలో ఒక 'ఊపు" ఉండేది (శ్రీ) సత్యనారాయణగారిది ఒక ప్రత్యేకబాణీ — సమాసం దొర్లించటం,విరవటం, అవసరమైనచోట రాగం ప్రస్తరించటంచేర్పరచారు

సంగీతం అంటే జ్ఞాపకం వచ్చింది ఆయన గొంతు చాలా చక్కగా రసానుగుణంగా, రాగాలు పలికేది ఆయన అనేవారు తన సహచరుల గురించి–నేను అన్ని రాగాలు పాడుతాను పేర్లు తెలియవు కృష్ణమూర్తి (వకీలు) గారు పాడరు అన్ని రాగాలు తెలుసు నరసింహం హంసధ్వని మాత్రం పాడ్తాడు-అని

శ్రీ సత్యనారాయణగారి గ్రంథములు ప్రచురించటానికి వారిశిష్యులు ముగ్గురం ఒక ముద్రణాలయం (S K. N. Press) స్థాపించి పని ప్రారంభించి. కొన్ని రోజులయాక వారికి ఇవ్వటం జరిగింది

సాహిత్య పరంగా (శ్రీ) విశ్వనాథవారి విశిష్టత గురించి తెలిసినంతలో ప్రస్తావించాలి. వర్ణనలు సందర్భోచితమే కాక కథాగమన సూచన సాధిస్తవి. 'జేబు దొంగలు' లో కథానాయకుని మనస్తత్వం, వానజల్లులు పెనవేసుకొని నడుస్తూ ఉంటై

కవిత్వంలో ఆయన చేయని సాముగరడీలు లేవు. భాష, జటిలత, మృదుత్వం, సమాసముల సుదీర్ఘత లేక విడుపు, శబ్ద సేకరణ యివన్నీ భావానుగుణంగా ఉండాలనీ, పఠితే అర్థం చేసుకొనే ప్రయత్నం చెయ్యాలి అనీ కవిత్వంఅంటే అరటిపండొలిచి చేతనుంచటంకాదు అనే సుస్థిరభావాలు కలవారు.

పరిశీలన, భావన చాలా చమత్కారంగా ఉండేవి. ఓరోజు పొలాల్లో మేమిద్దరం నడుస్తున్నాం ఎండ కాస్తోంది వానకురుస్తోంది ఇంద్రధనుస్సు ఎన్నడూ చూడనంత అందంగా సంతరించింది 'ఏరా అది పులితోకలాగాలేదు?' అన్నారాయన అని కాళిదాసునుంచి కృష్ణశాస్త్రి వరకూ ఇంద్రధనస్సును ఎలా వర్ణించారో వివరించటం మొదలు పెట్టారు

కవితా ప్రపంచంలో కీచులాటలు పూర్వంనుంచి ఉండేవి. తిరుపతి వెంకటకవులు కొప్పరపు కవులూ వివాదపడ్డారు సత్యనారాయణగారు రామాయణ కల్పవృక్షంలో ప్రయోగాల సాధుత్వం గురించి శ్రీ వెంకట శాస్త్రిగార్కి చదివి వినిపించటం,వారు అట్టి ప్రయోగాలు ఎవరే గ్రంథంలో ఎలాచేశారోచెప్తూఉంటే, నోరుతెరచుకొని వినబుద్ధిఅయేది శ్రీ సత్యనారాయణగారి కవిత్వం 'చెణుకులు 'అనేశీర్షికను శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు విమర్శించే వారు మధ్య మేం బాధపడేవాళ్ళం చివరకు మా యింటివద్దే శ్రీ శాస్త్రిగార్కి శ్రీసత్యనారాయణగారు రామాయణంచదివి వినిపించటం వారు ఆనందించటం జరిగింది

వేయి పడగలు ఎన్నో పునర్ముద్రణలు జరిగినై చాలా మంది చదివి ఉంటారు కాని గడియారం ముందుకే నడిచిందిగాని ఆగనూలేదు, వెనక్కు తిరగనూలేదు ప్రగతిని, తిరోగతిని సారస్వతం సాధిస్తుందనుకోటం సమంజసం కాదు వేయి పడగలు ఫ్యూడల్ సిద్ధాంతాన్ని శ్లాఘించి, ప్రగతిని నిరోధించి ఏదేదో చేస్తోందనే వారి బాధకు కారణం వేరు. అంటు విశ్వకథావస్తువు-పోటీ నవలా రచనకు ఆంధ్ర కళాపరిషత్తు వారు నిర్ణయించిన పరిధికి ఆనాటి సంఘవ్యవస్థ ప్రతిబింబించటం జరిగింది

దీన్ని గురించిన దుమారం ఒకటి మా మిత్రులు ప్రగతి సంపాదకులు శ్రీ ముక్కామల నాగభూషణం గారిది ఆయన గారిని అడిగితే ఆయనకు వేయిపడగలలోని తిరోగతి కాదు పట్టింది మాస్కోలోని తెలుగు ఎకాడమీ అధ్యక్షురాలు యీ గ్రంథాన్ని స్తుతించటం గురుజాడ వారి పూర్ణమ్మను సత్యనారాయణ గారి కిన్నెరను ఒకే గాట కట్టెయ్యటం ఇలాగే విమర్శకులకు సారస్వతేతర కారణాలు ఉంటై.

నేనెరిగినంతలో భాష్యం, వేదపఠనం, చివరి రోజుల్లో సంగీత సాధన, చాలా నిష్ఠగా చేసేవారు వ్యాకరణ, వేదాంత, అలంకార, భరత శాస్త్ర విషయాలు తన కవితా సంభార సేకరణకు అవసరమైనంతా గ్రహించారు విషయసేకరణకు శ్రీ శంకరులు పరకాయప్రవేశం చేయవలసి వచ్చింది!

ఉపాసనా ఫలం ఎదురు లేనిది జన్మాంతర సంస్కారబలం అటుంచి, కవిసమ్రాట్ గా ఆయనకు జరిగిన సన్మానములు, లభించిన అర్థము, గౌరవము, ప్రతిష్ఠ, ముఖ్యంగా ఆరోగ్యము ఉపాసనాబలం వల్లనే అని నావిశ్వాసం.

ఆయనగారు దరిద్రపు అవధి ఎరుగును ఐశ్వర్యపు శిఖరాలూ చూచారు అందుచేతనే ఎదిరికష్టం తనలోగత అనుభవాలను రేకెత్తించి వీటిని అధికంచేసేది యువకవులనెందరనో అన్నివిధాలా ప్రోత్సహించి ఆర్థికంగా సహాయంచెయ్యటం నేనెరుగుదును

శారీరకంగా వ్యాయామం, యోగాభ్యాసం ఆయన నిత్యమూ అభ్యసించేవి చివరలో ఒక దశాబ్దం వ్యాయామం లేదేమో; యోగాభ్యాసం మాత్రం తప్పనిసరిగా కొనసంటూ ఉంది. శారీరకంగా కష్టపట్టం అలవాటు విశేషం ఏమంటే, తెచ్చిపెట్టుకొనేవి కొన్ని ఆగిరిపల్లి, మంగళగిరి కొండలు వెనుక నుంచి ఎక్కి గుడిచేరటం ఆయనకు సరదా చిన్నవాణ్ణి అయినా ఆయనతో యీ అధిరోహణ అసాధ్యమనిపించేదినాకు

ఆహార పుష్టిగల మనిషి. ఉప్పూకారం ప్రత్యేకంగా ఎక్కువ పాలు యిష్టం కాఫీలోగాని తాంబూలంలోగాని పంచదార ఎక్కువ వాడేవారు నాకనిపించేది గిట్టని వారివిషయంలో కారం పాలు, గిట్టిన వారి విషయంలో మధురవాక్కు దీని వల్లనా ? అని,

ఆజాను బాహువు బ్రహ్మతేజస్సు ముఖాన, సరస్వతీ సంపద వాక్కున, హృదయ స్థానాన లక్ష్మీకటాక్షు చిహ్నంగా బంగారుతో

మెలచిన తులసీమాల మనస్సు నవ్య నవనీతం వాక్కు దారుణా
ఖండల శస్త్రతుల్యం వేషం కొంతలో ఆధునికం భాష సనాతనం
చదివేవి ఎక్కువ ఆంగ్లగ్రంధాలు-ముఖ్యంగా Jungle, Weird, Ghosh
పుస్తకాలు వ్రాసేవి ఆంధ్ర సంస్కృత గ్రంథాలు చిన్నలలో చిన్న
పెద్దలలో పెద్దగా ఎదిగిపోయే స్వభావం విమర్శలూ స్తోత్రాలూ, తిట్లు
దీవనలూ, దారిద్ర్యం ఐశ్వర్యం - యిలాంటి ద్వంద్వాతీతుడు కాదు
మబ్బులు అధోభాగాన్నే ఆక్రమించి శిఖరం నిరంతర సూర్యరశ్మి సంపద
కలిగే హిమాలయ శృంగం ఆయన ఒక మాటలో ఆయన అపూర్వ
మైన "దినుసు"

# సాహితీమాన్యునితో సామాన్యుని పరిచయం

**శ్రీ కోట సుందరరామశర్మ**

"థోంకిట కిటథోం కిటధోం।
థోంకిట యని బ్రాహ్మి నృత్యనూపుర రవముల్
 సంకులమయ్యెడు మాపురి
వేంకట చెళపిళ్లసుకవి విచ్చేసెనాకో!"

ఎవ్వరీ అందమైన కందమన్నది? ఎప్పుడు? నలభై సంవత్సరాలనాటి సంగతి అస్మద్ (ఉభయార్థక) గురువులు బ్ర। వే॥ చెళ్లపిళ్ళ వేంకట శాస్త్రిలవారు ఒక పర్యాయం బందరు వచ్చినపుడు, టౌనుహాలులో జరిగిన సభలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు చదివినది. ఏమిటీ పద్యంలో గొప్ప, 'హాటకగర్భవధూలీలాటన' ... అన్న చాటువున కనుకరణం తప్ప? ఇలాటివి కోకొల్లలుగా ప్రతి సన్మానోత్సవంలోనూ వింటూనే ఉంటామే" అంటారేమో! "థోంకిట" తో ప్రారంభించి రెండవపాదంలో మళ్ళా అదే వాడి, ఇదంతా "వేంకట" తో ప్రాసకోసమని, ఏనాబోటివాడో వ్రాస్తే అనేస్తారు విశ్వనాథవారి విషయంలో కూడా అట్లాగే అందామా? ప్రాసకు వేరు మాట దొరకకనా ఆయన అలాఅన్నది? మనవిచేస్తా బ్రాహ్మి బ్రహ్మ భార్య, సరస్వతీదేవి బ్రహ్మ జిహ్వాగ్రంమీద నర్తిస్తున్నది నలువ నాలుగు మోముల నిగమ నాదము ఉత్పత్తిల్లినవని మన ప్రాచీన విశ్వాసం కావున సరస్వతి వేదస్వరూప ఇట్లు కావ్య సరస్వతికీ వేదసరస్వతికీ అభేదం సూచించు ఒక్క "బ్రాహ్మి" శబ్దంతోనే ఆగితే, అది నాకల్పన అనవచ్చు. కాని ఘన (జటా) పారం జ్ఞప్తిచేసి (ఉదా॥ హాగ్ం సచ్ఛుషి షచ్ఛుషిషద్ హాగ్ంసత్ —), ధ్వని మార్గమున వేదమను 'నిత్య'వస్తువును ఈ పద్యంలో ప్రతిష్ఠించి, 'గురుర్ బ్రహ్మ' అన్న ముక్కకు కవితాభాష్యము

నవతరింపజేసిన విశ్వనాథవారి ప్రతిభకు జోహారులర్పించకుండా ఉండ గలమా? ఆంధ్ర ప్రశస్తిలో నన్నయను గూర్చి 'ధారణి నీకుమిన్న కవితా నవపట్టము గట్టికొన్నవారేరని' అన్న పంక్తిని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారికే అన్వయిస్తే అంగీకరింపని వారుండరని నా విశ్వాసం.

శ్రీ డా॥ దివాకర్ల వేంకటావధానులుగారి జాబుద్వారా శ్రీ విశ్వనాథ వారి నిర్యాణవార్త, ఆఫీసు నుండి యింటికి రాగానే, గ్రహించాను సచేల స్నానంచేసి, అశ్రుతర్పణంతో బాటు జలాంజలి సమర్పించాను. ఆ వేగం అపుకొనలేక నలుగురైదుగురాంధ్ర మిత్రులకు టెలిఫోను ద్వారా తెలియబరచాను అప్పటినుండి విశ్వనాథ వారిని గూర్చి అనుకోని దినమే లేదు శ్రీ సత్యనారాయణగారికి, దేశకాలరీత్యా, సన్నిహితులనేకు లున్నారు. ఆంధ్ర దేశాన్ని అంటిపెట్టుకొనక, పొట్టకోసం, ఆంధ్రేతర ప్రాంతసంచారినైనాను ముప్పై సం॥లుగా. అయితే ఏమి? ఆయన ఎవరి హృదయంలో ఉంటే, వారే ఆయనకు సన్నిహితులు దేశకాలములను జయించగలిగినవాడే నిజమైనకవి అందరికీ వినబడే చప్పట్లయితే,కనపడని కనువిప్పు నాబోటివానిది.

ఈ విశ్వనాథ వాఙ్మయాధ్వరంలో యథాయోగ్యంగా నేనూ ఒక సమిధను సమర్పిస్తున్నాను ఆయనతో నాకు ముడిపడిన పరిచయ ఘట్టాలు (నలభై సం॥ల కాలంలో) నా జీవనపటంలోని చెరగనివేకాదు. చెదరనివీని. ముడివేసినచోట గుడ్డ ఒక పట్టున చిరుగదుగా? ఇంతకు మించి వ్రాయబూనితే, అయథాయోగ్యం అవుతుంది. కనుక, కొన్ని పరిచయ ఘట్టాలు మాత్రం మనవి చేస్తాను విశ్వనాథ వారిని గురించి వ్రాయమంటే సొంత ప్రసంగం చేస్తున్నాడంటారేమో! మీరుఇప్పుడు వ్రాయమన్నారు, విశ్వనాథ వారిని గూర్చి, బహుళఃవచనంలో-ఆయన వేయిపడగల ఆదిశేషువంతటి ప్రతిభాశాలి; శేషాంశమైన బలరాముని హలాయుధమంత నిశితమైనది ఆయన వాక్కు; దానిముందు ఎదిరి నిల్చువారు లేరు; ఆయన కవిత్వం ధ్వని ప్రధానమైనది; ఇల్లే వీలయితే సోదాహరణంగా ఆయనకవితాశక్తు లుగ్గడింపుడని. నాదగ్గర ఇప్పుడొక్క గ్రంథం లేదు ఆయన రచించినది

కాని ఎప్పుడో వ్రాసికొన్నాను, ఆయనను గూర్చి పద్య రూపంలో, తేడా ఏమిటి? కాబట్టి చిత్తగించగోర్తాను

1 ఇరవై సం॥ల క్రితం ఢిల్లీలో ఒకనాడు చి॥ శ్రీ అచ్యుత దేవ రాయలూ, శ్రీ సత్యనారాయణ గారూ కరోల్బాగు బస్సుస్టాండు వద్ద కనుపించారు సైకిలుదిగి నమస్కరించాను కుశల ప్రశ్నానంతరం ఆయన అన్నారు: "ఇవ్వేళ సాయంత్రం, సుప్రీంకోర్టు న్యాయమూర్తి శ్రీ బచ్చు జగన్నాథదాసుగారింట్లో శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోంచి పద్యాలు చదువుతాను నీవూ రావాలి" అని బహిరంగ సభ కాదాయె, నన్ను పిలువ లేదాయె అని సంకోచం వెలిబుచ్చాను "నేనుపిలుస్తున్నాను, రా అర్థం చేసుకొనేవాడొక్కడున్నా, చదివేవాళ్లకు ఉత్సాహం అందుకోసం నిన్ను పిలుస్తున్నా" అన్నారు అలాగే అనివారి ఆదేశోపదేశానుసారం సభకు వెళ్ళాను పట్టుమని పదిమందికూడా లేరాసభలో వారందరూ ఆర్థిక దృష్ట్యా నాకన్న పదిరెట్లుపెద్ద విశ్వనాథవారి పద్యాలు అభినందించ గలిగింది, దాసుగారితో బాటు ఆసభలో శ్రీ సూరి నారాయణమూర్తి గారగుపించారు వట్టిచేతులతో వచ్చానే కవిదర్శనానికి, సభఏర్పాటు చేసిన గృహస్థు దాసుగారింటికీని అనుకొని, సభాప్రారంభానికి ఇంకా పది పదేను నిమిషాలుంటే, వరండాలో ఒకమూలకూర్చొని రెండుమూడు పద్యాలు గిలికాను. ఒకటి మాత్రం జ్ఞాపకం ఉంది దానికి కారణమూ ఉంది చిత్తగించండి

పలుకుల లోతులో ధ్వనులు పందెముపల్కఁగ, విశ్వనాథ వా
గ్జాలముఖ తెజరోధమునకై యెదురేదన, వార్ధిపొంగి, వే
పడగల మారుతాహతికిఁ బాటుమెయిన్ వెనుకంజవేయఁగాఁ
దెలివరివెట్టి పోలికల తెల్ల మొగంబులు వైచె నల్గడన్

వెంటనే విశ్వనాథవారు, "విన్నారా, యీయనగట్టివాడు. నా మాటలలోని నైశిత్యానికి అకారంత 'తేజ' శబ్దంతో మెరుగుపెట్టి, బల రాముణ్ణి, అదిశేషువునూవస్తుధ్వనిచేసి, ఉపమోత్ప్రేక్షలు అలంకారధ్వని

"బహువనపాద పాథికుల పర్వతపూర్ణ సరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్రసహస్ర ఫణాళిదాల్చి, దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికి శాయకశయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుడనంతుడుమాకు ప్రసన్నుడయ్యెడున్"

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు నన్నయ్యగారిని ఎంతగాఢంగా జీర్ణం చేసికొన్నారో చూడండి.

2 ఇంకొకసారి ఢిల్లీలో నా (అముద్రిత) పర్వతేశప్రభు శతకం వినిపించాను నామీది వాత్సల్యంతో నూరుపద్యాలూ ఒక్కబిగిని శ్రద్ధగా విన్నారు ఒక పద్యంలో నా శతకం ధాన్యపు (గంప). శివా! నీ పాదాల దగ్గర పెడుతున్నాను కైకొంటివా, సరి లేదా నాకే మంచిది నీ పాద రజములు పడిపడి, నా యీధాన్యం పాతర పడుతుంది వెల హెచ్చు పల్కు తుంది అని నేను అంటే, 'వెల హెచ్చడం తీసి, పథ్యానికి పనికి వస్తుందని' సవరించవలసిందిగా ఆదేశించారు అట్లాగే మార్చాను "నైష్కర్మ్యము" అని ప్రారంభించిన మరోపద్యం చదివినప్పుడు, మనమంతావిద్యారణ్యంలో విహరించినా, నిష్కము(=మాడ) ల అరణ్యంలోంచి బయటపడలేకుండా ఉన్నామని ధ్వనిస్తున్నావా అన్నారు నిజానికి నేననుకొన్నది నిష్కార ణత్వమనే అర్థమే. నా అదృష్టంకొద్దీ ఆ శతకానికి పరిచయ వాక్యాలు వ్రాశారు విశ్వనాథవారు

3 భారత ప్రభుత్వంవారు నియమించిన సంస్కృత కమిషన్ (1956-57)లో ఆంధ్రరాష్ట్రం పర్యటించినపుడు, శ్రీ విశ్వనాథవారి అధ్యక్షత నున్న ఆంధ్రవిద్యాపీఠంవారు, కమిషనును బెజవాడకు ఆహ్వానించారు. ఆ కమిషనులో ఉద్యోగిగా నన్ను విద్యాశాఖవారు నియమించడంవల్ల, సభల, ప్రయాణాల, కమిషను మీటింగుల, ఇతర సౌకర్యాల ఏర్పాట్లు బాధ్యతవల్ల, రాజమహేంద్రవర కార్యక్రమం ముగియకముందే బయలు దేరి, కమిషన్ మెంబర్లకన్న ఐదారు గంటలు ముందుగా, బెజవాడ రైలు

స్టేషనులో దిగాను కమిషను అంతా వస్తోందనుకొని, పూలదండలు పుచ్చుకొని శ్రీ సత్యనారాయణ గారు సపరివారంగా వచ్చారు నేనొక్కడనే దిగడం చూచికూడా వారు, వారించినా వినక, నా మెడలో పూదండ వేయగా, మీరాముక్తమాల్యదా ప్రియులని, ఆ దండ తీసి వారి మెడలో వేశాను. మర్నాడు ఉదయం బందరు కార్యక్రమం పూర్తి చేసికొని, సాయంకాలానికి కమిషను వారిని బెజవాడ చేర్చాను శ్రీ రామమోహన గ్రంథాలయంలో జరిగిన సభకు శ్రీ సత్యనారాయణగారు అధ్యక్షత వహించవలసింది. కాని వారు శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారిని అధ్యక్షపీఠం ఎక్కించి, తాము సభావేదికను మాత్రం అలంకరించారు ఇదేమిటని నేను చాటుగా అడిగితే, విశ్వనాథవారన్నది ఇది. " మీకమిషనువారనుకొన్నట్లుగా నేను మాట్లాడక, పైగా ఏదయినా విరుద్ధంగా అంటే మీకందరికీ, సభలోని వారికీ కష్టం తోస్తుందేమో అన్న భయంతో మౌనం వహిస్తున్నాను "

4 ఒకసారి బెజవాడ ఎస్ ఆర్ ఆర్ అండ్ సి వి ఆర్ కాలేజీలో దేనిని గురించో నన్ను మాట్లాడమన్నారు శ్రీ విశ్వనాథ వారధ్యక్షులు అప్పుడు మనవి చేసిన ఒక ముక్కకు సభవారు ఇది ఇంతవరకూ ఎవ్వరూ అనలేదని నన్ను అభినందించారు నేనన్నదేమిటంటే ఆధునికాంధ్ర కవితా ప్రపంచంలో రెండే ధోరణులు - ఒకటి శ్రీ చెళ్ళపిళ్ళ వారు వేసినది, రెండవది శ్రీ విశ్వనాథ వారిది మిగిలినరచనలన్నీ వేర్వేరు పాళ్ళలో ఈరెండింటి కలగాపులగం అని నా ఉద్దేశ్యం ఈ ముక్కకు ఉదాహరణలు శ్రీ విశ్వనాథ వారి శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోంచి ఇస్తాను: మొదటి దానికి—

జడముడి వీడలేదు, ముఖ సంగతతేజము మారలేదు..."

(అయోధ్య, దశరథుని శాపవృత్తాంత ఘట్టంలోని, శరాహతుడయిన ఋషి కుమారవర్ణన); రెండవ దానికి "ఆశ్చలద్గీరుగ్రప్రమథమ్ముగా ధనువు ప్రమోగెన్ శైవలోకమ్మనన్" (శివధనుర్భంగ ఘట్టం)

5 25 సం॥నాడు వారు మద్రాసులో మా యింట ఆతిథ్యం స్వీకరించిన భాగ్యం నాకు కలిగింది. "అమ్మాయీ, ఆవకాయ బాగుంది, యింకాస్త వెయ్యి" అని వారన్న మాట, చివరిదాకా జ్ఞాపకంచేసుకొంటూ

ఉడేంది నా భార్య, ఆవకాయ తీస్తున్నపుడల్లా, విశ్వనాథవారు వ్యంగ్య ప్రియులేకాదు, వ్యంజన ప్రియులు కూడాను

ఈ విధంగా పరిచయ ఘట్టాలు చెప్పడం ఇంతో ఆపి వ్యక్తిగా ఆయనను కవిత్వంలో దర్శింపజేయగల ఒక పద్యాన్ని ఉదాహరిస్తాను అయోధ్యలోనిదే అని జ్ఞాపకం. ఆశ్వాసాంత పద్యాల్లోనిది —

"చేయఁగలన్ని పాపములుచేసితి మున్ వెనుకల్ గణింపకే
చేయఁగనైన పున్నెములుచేసితి నీదయగల్గుదాక, దూ
రాయితమయ్యెనీజనిదురాత్మత, రామకథాప్రపూర్తివే
లాయుతిగాగ దేహమవలంబన చేయుము చాలు నో ప్రభూ!"

ఇక అందరికీ ముఖ్యమనితోచే కొన్ని సూచనలతో ఈనాప్రసంగం ముగిస్తాను

(1) సంచిక ప్రకటనతో ఆగక, తగినంత మూలధనం సేకరించి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి స్మారకంగా, కవిత్వాది రంగాల్లో పోటీలు జరిపించడం, బహుమతులివ్వడం, వట్టిమాటలుగా గాక గ్రంథ రూపం తాల్చగల ఉపన్యాసా లిప్పించడం.

(ii) ఎప్పుడో కొన్ని సం॥ల తర్వాతకన్న, త్వరలోనే విశ్వనాథ వారి వసతిగృహాన్ని జాతీయ భవనం (National Monument) గా కనీసం ఆంధ్రప్రభుత్వం ద్వారా జరగడం. (విశ్వనాథవారి కుటుంబానికి ఆవసతిపట్ల ఉండేమమకారంకంటె, యావదాంధ్రులమమకారం అధిక మనివారికి నచ్చజెప్పి, తగిన వేరువసతి వారికి కల్పించడమున్న) అందు వారి గ్రంథాలయం, వారివ్యక్తిగత వస్తుదుస్తులు, ప్రశంసాపత్రాదులూ— చక్కగా ఫ్రేముచేయించి-చూడమాత్రం వీలయిన భవనంలోనిఒక్క-అద్దాల గదిలో ప్రదర్శించడం.

(iii) వారి కావ్యాలను అవసరమైనచోట్ల టీకాటిప్పణులతో ప్రకటించడం, కనీసం రామాయణ కల్పవృక్షంలోనివైనాను పోతన్నగారి

భాగవతఘట్టాలు, రుక్మిణీ కల్యాణం, గజేంద్రమోక్షం, ప్రహ్లాదచరిత్రము॥ తెలుగునాట, చదువరులనోళ్లనిలిచినాయంటే, కారణం, చిన్నచిన్న గ్రంథాలుగా వావిళ్ళమున్నగు ప్రకాశకులు వాటిని టీకాతాత్పర్యములతో ప్రకటించడం ఒకటి, పార్వ భాగములుగా వానిని పలుమార్లు నిర్ణయించిడంఒకటీని ఆంధ్ర మహాభారతమహాభాగవతములతో బాటు శ్రీమద్రామాయణమునకున్నూ తెలుగు సాహిత్యంలో సమానపీఠంవేయడం జరుగుతుంది.విశ్వనాథవారిపట్ల మనకున్న గౌరవాన్ని నిలబెట్టడం అనే ఉద్దేశ్యంతో బాటు పెద్దలు చిత్తగింతురుగాక సెలవు

# సహృదయాభిసరణము

శ్రీ మల్లంపల్లి శరభయ్య

ఈ కృష్ణాగౌతమీ తీరములలో మాది విద్వద్వంశమని తెలియనివారెవ్వరు? కీ॥ శే॥ మా నాయనగారు మల్లంపల్లి మల్లికార్జునారాధ్యులవారు నాకు పన్నెండేండ్లు నిండకమునుపే కావ్య నాటకాలంకారములతో సాహిత్యవిద్య ననుగ్రహించిరి. అప్పటికే కవితావిద్య నన్ను వలచినది స్వప్న సందర్శనములలో చెళ్ళపిళ్ళవంశస్వామి నారాధించిన ఏకలవ్యుడను. సంస్కృతాంధ్ర సాహిత్యములలో కొన్ని వేల పద్యములు నాకు కంఠస్థములు. నేను కవినగుటలో నాశ్చర్యమేమున్నది? అప్పటికింకను శాస్త్రమేమియు మొదలుపెట్టలేదు మా నాయనగారిని విడిచి ఒకసారి రెండు మాసములుండుట తటస్థించినది.

కైకలూరువద్ద శోభనాద్రిపురమని కాశీనాథునివారి యగ్రహారము వారు మాకు బంధువులు నేనాయూరు వెళ్ళితిని అచ్చట మా మేనల్లుడు కీ శే కాశీనాథుని శ్రీశైలపతియు, దూరపుబంధువు మల్లంపల్లి నాగభూషణంగారునుగలరు నాగభూషణముగారివద్ద విశ్వనాథ సత్యనారాయణగారి గ్రంథములన్నియు గలవు. మా మేనల్లుడు నాకన్న అయిదేండ్లు పెద్ద మా నాయనగారి యొద్ద నాతో సంస్కృత సాహిత్యము చదివెను. ప్రతిభాశాలి అతనికింగ్లీషు సారస్వతములో గూడ మంచి ప్రవేశముగలదు. నా పద్యముల బాగోగులు విమర్శించి నన్ను తీర్చిదిద్దుచుండెడివాడు నిరంతర గ్రంథవ్యాసంగశీలి. నాగభూషణముగారి యొద్దనున్న విశ్వనాథవారి గ్రంథములన్నియు నతడు చదివెను. ఆ గ్రంథములను గూర్చి వారిద్దఱు ప్రసంగించుకొను వేళలలో నన్ను కుఱ్ఱవానివలె చూచుచుండువారు. నాకది మనసులో చాల బాధగానుండెడిది నేనెప్పుడు వేంకటశాస్త్రిగారి పద్య

ములు చదువుచుండెడి వాడను వారు నాకు విశ్వనాథ వారి పద్యములు వినిపించెడివారు. నాకవినచ్చెడివికావు అప్పటియూహాలో సత్యనారాయణ గారిపేరు ప్రక్కన M.A అను అక్షరములుచూచి ఈయనకు సంస్కృతము సరిగా వచ్చియుండదని నాకొక అనుమానము. "పసిమి బాలెంతావు పాల సంద్రమ:లోన జున్నులంకల మీద నున్న నీవు"—అని నాగభూషణముగారు చదువుచుండగా ఆయూహాలోని నవ్యతను ఆస్వాదించుట యెట్లో తెలియక నేను-బహుశః ఇంగ్లీషుచదివినవారి యూహాపద్ధతి యిట్లుండునుకాబోలును; మనకది యర్థమగుటలేదని నిస్పృహ చెందెడివాడను; కాని తీసివేసెడు వాడను మాత్రముకాను

మా మేనల్లునియందు నాకుఁగల ప్రామాణ్యమట్టిది

ఒక కావ్యము చదివినంతనే అందలి ప్రాణస్పందము తెలిసికొని ఆకవి మనోధర్మమునందికొని— ఆకవితో తాదాత్మ్యమును పొంది, కొన్ని దినములదియే లోకముగానుండుటయన్నది నాకు జన్మసిద్ధమైన లక్షణము. అప్పటికే నాచిత్త పద్మమునందు కాళిదాసభవభూతులు, బాణమయూరాదు లగు సంస్కృత కవులును-నన్నయ్య తిక్కనలు, శ్రీనాథ పోతనలు మొద లైన తెనుఁగుకవులు చిత్రీకృతులై యుండిరి

పరమ భావుకుడైన నా మేనల్లునికి ఇంత నచ్చిన విశ్వనాథ కవితా ప్రతిభ నాకేల తెలియుట లేదని అమర్ష దుఃఖములతో నాగభూషణముగారి వద్దనుండి తీసికొని ఒక్కొక్క గ్రంథము చదువ మొదలు పెట్టితిని

ముందు కిన్నెరసాని పాటలకు చెవి యొగ్గితిని

ఈ జన్మకు అగమ్యమనుకొన్న ఆ కవిమనోధర్మము నాకు మిక్కిలి సజాతీయమని తెలియవచ్చినది. తెనుగు పాటలలోని తీయదనమెట్లుండునో తెలిసినది. తెనుఁగు దేశములోని నదులు, కొండలు అడవుల మాధుర్య మేమియో తెలిసినది రసాకృతియైన ఆ వాగుతోనాకు తాదాత్మ్యము

సిద్ధించినది నా వెనుకటి జన్మలో ఎచ్చటనో ఆ నది పూర్వజన్మమునకేదో సంబంధమున్నయట్లు తోచినది తేనిచో ఆ పాటలలోని తీయన "ఎన్నడో వెనుకటి బ్రతుకున మిక్కిలి విన్నవానివలె" నన్నింత వెన్నంటి యుండవు

అనార్కలీ ఆలోకించితిని.

అందలి గీతి మాధుర్యము ఆషాఢ మాసమునందు గిర్యుపత్యకలలో పరువులు వెట్టుచున్న సన్నని సెలయేళ్ళ సంగీతమువలె వినిపింపజొచ్చినది

మాస్వామి పఠించితిని

శ్రీనాధునకు పిమ్మట ఇన్ని శతాబ్దముల వఱకు అంతటి ప్రాణ ప్రహ్లాదనమైన స్నిగ్ధ గంభీరనిర్ఘోషముతో ఆంధ్ర శారద నాచెవులలో ప్రతి ధ్వనింపలేదు

నర్తనశాలలో ప్రవేశించితిని

భాసుడు తెనుఁగు భాషలో నాటకము వ్రాసినట్లున్నది

ఆంధ్రప్రశస్తి హృదయగతమొనరించుకొంటిని

ఒక అతీంద్రియశక్తి నాలో మేలుకొని 'ఎన్ని జన్మమ్ములుగాగ ఈ తనువునన్ ప్రవహించునొ ఆంధ్రరక్తముల్' అన్న యనుభూతి గాఢముగ నన్నలమి కొనెను

వేనరాజు నామనములో నిలిచెను

"కలువపూలోని పచ్చనిదిమ్మచుట్టును ముసరి తుమ్మెదగమి మ్రోసి నట్లు-మెత్తైన యిసుకలమీద సన్నని నీటిపొరజాలు ముర్మురపుట్టినట్లు-

శుక్లాష్టమివెన్నెలలో చంద్రకేతకీ ప్రాసాదశిఖరములనుండి జాలు వారుచున్న ఆమహావైణికుని నాదవాహినిలో చేతనాచేతనసృష్టి యంతయు అప్లావితమైనట్లు నాతనూసృష్టి యంతయు నివతశించినది.

ఏకవీరతో తాదాత్మ్యమందితిని,

సంస్కృతమహానాటకకర్తల నాయికాసృష్టి యందలి పరమభావుకతాలక్షణమంతయు చారుదత్తుని ప్రావారమునందు జాతీకుసుమ పరిమళరేఖవలె నామనసునావరించుకొనెను.

చివరకు వేయిపడగలు చదివితిని

తెనుఁగుదేశముయొక్క ఆత్మ సాక్షాత్కరించినది. కొన్ని కొన్ని అధ్యాయములు నాకన్నీళ్ళతో తడిసి పోయినవి

ఒక్క నెలరోజులలో ఈ గ్రంథములన్నియును చదివితిని నామనో ధర్మమేమారినట్లయ్యెను భూమియు ఆకాశము గాలియు క్రొత్తవి యైనట్లు తోచెను ఏదో క్రొత్త జన్మయెత్తిన అనుభూతి కలుగజొచ్చెను ఆరోజుల మాధురవ్యమిప్పుడేమిచెప్పగలను!

అహో! పుస్తకముల మహిమయెట్టిది? భౌతికరూపంలో పూర్వకవులెట్లుండిరో తెలియదుగదా. వారిప్రతిభలన్నియు రాశీభావము నంది నట్లున్న యీకవి నేనున్న కాలములోనే,యీఆకాశముక్రింద, ఈ భూమిపై నావలెనే నడయాడుచున్నాడు ఈ గాలి మమ్మిరువురను సమానముగ స్పృశించుచున్నది. నాకింతటిసమాన ధర్ముడైన కవి యెట్లుండునో!

ఈ కవిని నేను చూచి తీరవలయును నాయంతటనేనేచూడవలయును మూడవవారి ప్రమేయము ఉండరాదు ఆయన యెవరో నేనే గుర్తుపట్టగలను ఇన్నిగ్రంథములలో ఇంతవిస్పష్టముగ ఆయన ఆత్మ నెఱిగియున్న నేను- అట్టిరసాత్మనివసించుచున్న ఆ శరీరగృహములో ఆయనను గుర్తుపట్టలేకపోవుటకన్న అసంభవమైన విషయమింకొకటి యుండదు

ఇట్టి స్థిరనిశ్చయంతో బెజవాడవెళ్ళితిని అప్పటి నాసాహసము తలంచికొన్నచో ఇప్పటికిని నాకాశ్చర్యమే కలుగుచుండును. ప్రాణాధికుడైన కవికై నిర్వ్యాజరసముగ్ధమైన సహృదయాభిసరణమది.కాళిదాసాది. మహాకవులను రసోన్మత్తులైన ఏ యజ్ఞాత సహృదయు లిట్లభిసరించిరో ?

మహాశ్వేత చేసిన పుండరీకాభిసరణముకన్న — పురూరవసునికై ఊర్వశి చేసినదానికన్న ఇది దివ్యమును, అపార్థివమును.

ఎవ్వరితోడను చెప్పలేదు, ఆయూహాలోని మాధుర్యాభర మెవ్వరికిని చెప్పనీయలేదు

ఆయన యెవ్వరు ? నేనెవ్వరు ?

వచ్చినపనియేమి ? అనియడిగినచో చెప్పుటకేమున్నది ?

దీనిపరిణామమెట్లుండునో? అసలు నన్నాయనలెక్కచేయునా ?

లెక్కచేయుటకు ముందు నేనెవ్వరో నామనస్థితి యెట్టిదో తెలియవలయునుగదా. నాయాకృతి ఆయన తెలిసికొనుటకు వీలుగనున్నదా ? నేనెవరో బికారివలె, ఉన్మత్తునివలె నుంటిని గదా. తెలియక నన్నవమానించునేమో ? ఈ వికల్పములనుగాని నాయాభిజాత్యదర్పమునుగాని, ఆయుత్కంఠాభరము నిలువనీయలేదు.

నాకున్నసర్వస్వమును నాహృదయమొక్కటియే. నేనెట్లున్ననేమి ? నావేషమెట్లున్ననేమి ?

మాసినలాగు, చొక్కా, మెడలో గొడరుద్రాక్ష-ప్రజాగరారుణమైనకన్నులతో భారభుగ్నమైనహృదయముతో -ప్రాణాధికుడైన కవికై విజయవాడ వీథులలో నా అన్వేషణము మొదలు పెట్టితిని. ఉయ్యూరు రాజావారికళాశాల అప్పుడు గవర్నరుపేటలో ఒకమేడలో నుండెడిది.

నేనా మేడప్రాంగణమునకు వెళ్ళితిని. ఆ యింగ్లీషువిద్యార్థులవేషభాషలెక్కడ? నేనెక్కడ? లోపలకడుగుపెట్టుటకే తెగనిబిడియముగానుండెను. అచ్చటనన్ను లక్ష్యపెట్టువారెవ్వరు? ఎవ్వరినైన-ఏమైన-అడుగవలయున్నచో, నాకువల్లమాలిన నత్తియొకటిగదా! ఎల్లరును నా

మాటవినిపించుకొనకయే నవ్వుదురు అదికాక - నేనెవ్వరిని అడుగదలుచు కొనలేదుగదా.

తుటుములు తుటుములుగా విద్యార్థులు వచ్చుచుండిరి ఒకరిద్దరు ఉపన్యాసకులును వచ్చుచుండిరి నేనొకమూలనిలుచుండి వ్యగ్రహృదయంతో పరిశీలించుచుంటిని ఎవరెవరోవచ్చుచుండిరి లోనికి పోవుచుండిరి ఘూర్ణమానార్ణవమైన నాగుండెలోని సంక్షోభమెవ్వనికి తెలియును? నా ప్రతీక్ష ప్రతిక్షణ మహాయుగాలుగా నుండెను. నాలోపలినుండి యెవ్వరో

"అనుభూయతా మితమిదంపురస్థితం పూర్ణ నిర్వాణమ్"

అని—హెచ్చరించు చున్నట్లుండెను.

ఇట్లు - ఒక పదినిమిషములుగడచినవి.

రావలసిన వారందరువచ్చుటయైనదనియు, వచ్చిన వారిలో నాకు కావలసిన వారులేరనియు నాకు నిశ్చితమైనది. నేడాయన కేమైన పని యున్నదో !

నా ప్రతీక్షయంతయు భగ్నమైనది.
నాహృదయ మంతయు శూన్యమైనది.
కాని - నేనాప్రదేశము నుండి కదలలేక పోవుచుంటిని.

ఇంతలో ద్వారభూమియందు-ఉత్తాలఫణామండలముతో తోకపై నిలిచి-ముందునకు తూగివచ్చు చున్నట్లు దుర్నిరీక్షమైన ఒకానొక యాకృతి భాసించెను ఆయాకృతి అంతస్సంగీతముతో కదలుచున్నది కావలయును. నా కాళ్ళలో వణకుపుట్టినది. నాయొడలు నాకు తెలియుటలేదు. నిశ్చేష్టుడనై యుంటిని.

ఆయన లోనికేగి రెండు నిమేషములలో తిరిగివచ్చి ద్వారముదాటి మఱల వీథిలోనికేగెను. ఆయాకృతితో నాహృదయమును, ప్రాణము

లును అనుగమనించినవి కావలయును ఒకక్షణములో - ఇంకిపోయిన సముద్రమువలెనైతిని నా సర్వస్వమును ఎచటకోపోవుచున్నట్లనిపించెను.

కొన్ని క్షణములలో నేను తెప్పరిల్లి - వచ్చినదెవ్వరో నా శరీరము సందలి ప్రత్యణువునందును వేయిశంఖములూదినట్లు ప్రతిధ్వనించుచున్నను- వ్యావహారికమైన నిర్ధారణకై ఫలానా వారు వచ్చిరా! అని అచ్చటివారి నడుగుటయును ఇప్పుడు వచ్చి వెళ్ళినది వారే అన్న సమాధానము వచ్చుట యును ఒక్క లిప్తలో జరిగెను

పూర్ణమనోరథుడనై నేను వీధిలోనికి వచ్చితిని అప్పటికప్పుడే ఆయన నా ముందు దూరమున నడిచిపోవుచుండెను సవేపథుస్ఖలితపదన్యాయముగా సమీపించి, కొన్ని యడుగుల వ్యవధిలో అనుసరించినడుచుచుంటిని. అప్పటి నా మనస్థితి నెట్లు చెప్పనలవియగును!

అర్ణవశ్యామసీమయైన అవని అంతయు నాకు కైవసమైనట్లు; ఉపత్యక యందునిలిచి - కైలాస శిఖరమును సందర్శించుచున్నయట్లు, రాశీభూత మైన పూర్వాంధ్ర మహాకవుల ప్రతిభ అంతయును నా ముందు సాకారమై నడచుచున్నట్లు, భాసకాళిదాస భవభూతి దిఙ్నాగుల భావుకతలోని పరమ సౌకుమార్య ముద్రచే నాచేతస్సంపుటము ముద్రితమైనయట్లు, ఈ త్రిలింగ విషయాకారమును, భూమిని, వాయువును వనములను పర్వతము లను యుగ యుగములుగా - ఆవరించుకొనియున్న ఆత్మయేదో ఆకృతి కొదిగి నాకు ప్రసన్నమైనయట్లు; నేను దానిలో లీనమైపోవుచున్నయట్లు; ఒకానొక అంతస్సంగీతమును వినుచు నేనాయన వెనుకనడచుచుంటిని. ఎచ్చ టికిపోవుచుంటినో తెలియకయే అవశముగా పోవుచుంటిని పోవుటయెచ్చ టికి? గమ్యమునందెలీనమై యుంటిని.

కొన్ని వీథులు గడచినవి ఆయన ఒక యింటిలో ప్రవేశించిరి. అది స్వగృహము కాదు, మిత్ర గృహము కావలయును. ఆ గదిలోనెవ్వరును లేరు. ఆయన ఒక ఆసనముపై నాసీనులైరి. అవశముగా పాదములపై వ్రాలి

పోవుచున్న నన్నుచూచి- ఎవ్వరో భిక్షుకశిశువనుకొని 'ఛీ నన్ను తాకెదవేల? కావలసినదేమో దూరముగా నిలిచి అడుగరాదా!' అని ఆయన నన్ను గద్దించెను

రుద్ధమైన కంఠము నుండి కొన్ని ఛందోమయాక్షరములు పెగిలిపడి ఇంక వశముగాక యేడ్చుచున్న నన్ను చూచి - విభ్రాంతుడై లేచివచ్చి నన్ను దగ్గఱకు తీసికొని - ఒడియందు కూర్చుండబెట్టుకొని—ఏడ్పు మాని పించి-నాచిబుకము నెత్తి -నీవెవ్వరని అడిగి నా సమాధానము విని నిలువున నీర య్యెను

"ఇంకెన్నడును, ఎవ్వరికిని గోత్ర నామగ్రహణ విరహితముగ పాదాభివందనము చేయవల"దని శాసించిరి బాష్పపరిపూర్ణనయనములతో 'ఎవ'మవిజ్ఞాతాని దైవతాన్యభ్యవ ధూరుస్తే'అని తనలో తాను డగ్గుత్తిక పెట్టికొనెను

అజ్ఞాతహేతువగు దైవయోగమున— ఇట్లు కలిసిన నన్ను వెంటబెట్టుకొని, త్రోవలో నా విద్యాభ్యాసమును గూర్చి - నేను చదివిన తమ గ్రంథములను గూర్చి ప్రస్తావించుచు తమ యింటికి తీసికొనిపోయి స్వజనముతో కలిపికొనిరి వానలో నడిసిన అడవివలె కన్నీరోడ్చిన నా హృదయము తేలికపడి - ఒక ప్రహ్లాదభావమును దాల్చెను.

అది మొదలు - ఈ ముప్పదినాలుగేండ్లలో మేమెప్పుడు కలిసినను ఆ తొలనాటి అనుభూతియే భాసించెడిది. ఆయనకంటికి నేనెప్పుడును పన్నెండేండ్ల బాలునివలెనే కనిపించెడివాడను. నేడు వార్ధకచ్ఛాయనాపై పడుచున్నను. ఆయనను చూచినప్పుడెల్ల నాకును అట్లే అనిపించెడిది. ఆ ప్రేమబలము నా వయోజ్ఞానమును గూడ స్తంభింపజేసినది కావలయును.

అప్పుడు పగలు రెండుజాములైనది. నేనేమైయుందునో తెలియక బంధుజనము నాకై అలజడి పడుచుందురన్న యూహ అప్పటికి వచ్చి—

"ఇంక నేను పోయివత్తు" ననగా-

'సాయంకాలము రమ్మని ఆయననన్నా దేశించిరి

నాడు వృష సంవత్సర శ్రావణ శుద్ధ ప్రతిపత్తు

ఆ సాయంతనము నేను వారి యింటికేగి ఆయనకై ప్రతీక్షించు చుంటిని.

" ఉద్విగ్నమైన ఆ ప్రొద్దుటిప్రతీక్షకును - స్తిమితమైన ఈసాయంతన ప్రతీక్షకును ఎంతభేదము?

ఆయన వాహ్యాళికేగి చీకటిపడియింటికి వచ్చిరి వచ్చుచునే నన్ను చూచి ఈ అబ్బాయి వచ్చెనే" అనుచు లోపలకేగివచ్చి "ఏమిచదువుచుంటి" వని నన్నడిగిరి. ఆ సాయంసమయమున నేను రచించిన దేవీస్తుతులు చదువుచుంటిని. అదివిని, నీకు అమ్మవారన్న ఇష్టమువలెనున్నదే, నేనును అమ్మవారిపై పద్యములు వ్రాసితిని, వినుమని కొన్నిపద్యములు చదివిరి ఆ కంఠమునుండి-తొలిసారిగా వెలువడి-నాశ్రవోయుగళిలో పడినంతనేనాకు కంఠస్థమైన ఆప్రథమసరస్వతీ నిష్యందమిది-

కోకిలకామినీ మధుర కూజితకోమల వాయువీచి సం
ధ్యాకపిశమ్ములైన జడలల్లినజీబులలోన- తాండవ
శ్రీకమనీయ జాహ్నవిధరించిన దేవునిగేహదీపమా
లాకృతి మందహాస కలితానన మాకుప్రసన్నమయ్యెడున్.
నిగమమహార్థముల్ జగమునిండెను; తన్నిగమాంత
వైఖరుల్
నిగమచయమ్ముకన్నహావణించెను: తన్నిగమాంతచూడమై
తగిలెను బ్రహ్మనాఁ బడుపదార్థము-బ్రహ్మముమౌళితల్లిక్రొం
జిగురుపదమ్ము గోటిరుచిచే రుచిమంతమిదెంతచిత్రమో.

అమ్మధురావలోకనము లద్భుతమయ్యెడు తల్లిలోచనాం
తమ్ములు సాగినంతన శతప్రమితుల్ మధురేక్షుచాప ఖం
డమ్ములవారు రత్నమకుటమ్ములవారు జగద్విలోభనా
స్యమ్ములవారునున్ ప్రభవమందెద రంబుదనీలరోచిషుల్

ఆరాత్రి మేమిరువురము కలిసి భుజించిభోజనాంతరము మఱలగోష్ఠికి గూర్చుంటిమి తమ "మాస్వామి" "సర్వాశీస్సులతో" నాకు వ్రాసియిచ్చి, ఆ గ్రంథము నాకు వినిపింప మొదలిడిరి అది శ్రావణ మాసము గదా. బయట ధారాసారముగ వర్షము కురియుచుండెను

మా స్వామిలో శ్రీ కాళహస్తీశ్వర స్వామియును, కాశీవిశ్వేశ్వర స్వామియు వచ్చి లీనమై యుండగా, ఆ పద్యముల మాధుర్యములో ధూర్జటి శ్రీనాథులు లీనమై యుండక యేమగుదురు !

"శ్రీ మంజూషిక" వద్దనుండి మొదలిడి కైలాసాచల సానువుల మీదుగా నా మనస్సు ఆయన త్రిప్పినచోనెల్ల తిరిగి తిరిగి చివరకు.

సాబ్రాముల్ మసకాటలో విడుచుకూసా లాజడల్ ముండ్లలో
జీబుల్ గట్టినయేటి క్రొత్తరగలో చిన్నారి జాబిల్లిగా
రాబంపున్ ననుసోగవెన్నెలల దారాలల్లులో కీలుబో
మ్మైబందిన్ గొని - తెమలింపరాక చిక్కువడియుండెను.

బయట శతసహస్ర వీణాధ్వనులవలె వర్ష ధారాధ్వనులు. నడుమ నడుమ మేఘస్తనితములు.

ఆయన కంఠసీమలో తేనెలు పారుచుండెను. మేఘగర్జనలు వినిపించుచుండెను. పికీకన్యకానూన వ్యాహృతిని పంచమ మధువు చిందుచుండెను ద్యోన దాంభఃకణశ్రీలు తాండవించు చుండెను. శతకమీరీతిగ ముగియుచుండెను.

రాత్రి రెండుజాముల య్యెను

పియస్నిలాతినీల ప్రభా (శ్రీ) కృష్ణమోహనవర్ణ భాంద్రపద
సంశ్లేష ప్రగర్జ

ద్విలాసైకాంథ దతనూప్రకాశిత వధూసౌదామనీ దేహావల్లీ

కల్యాణ మనోజ్ఞాదీధితులై ఒక్కసారిగా - స్వామికా
రుణ్యము మెఱసి - అందు

విశ్వమంతయును దేదీప్యమానముగ వెలుగొందుచుండెను.

ఇట్టులొకరొకరిలో లీనమగుచున్న [illegible] హృదయులను తనలో విలీనమొనరించికొన్న ఆ ప్రథమసంభోగనిశాక్షణముల స్మృతి మాధుర్యమే నేటికిని నన్నునిలిపి - ఈ విధ నాచే నిట్లు చెప్పించినది

# విశ్వనాథ వ్యక్తిత్వం-ఒకవ్యాఖ్యానం

**శ్రీ దుర్గానంద్**

విశ్వనాథ సత్యనారాయణగారిని ఎవరూ స్పర్శించలేరు ఆయన అందరినీ స్పర్శించగలుగును ఆయన అస్పృశ్యుడు, అగ్నిహోత్రుడు ఆయన ప్రాచీనభారతదేశం లాంటివాడు ఆకాలంలో భారతదేశం ధర్మ సంవర్ధితంగా ఉండేది యజ్ఞయాగాదులు చక్కగా సాగుతూ ఉండేవి. అప్పుడు తెలుగుదేశం ఉన్నదో లేదో తెలియదుగాని విశ్వనాథ సత్యనారాయణగారు ఉన్నారు. ఆయన కవిత్వం 20వ శతాబ్దములో మొలకెత్తింది. ఆయన పాకం రెడ్డియుగం నాటిది ఆయన ఆంధ్రలో పుట్టటం ఒకఘటన. ఆయన కవిత్వం వ్రాయడం ఒక మహాఘటన, ఆయన మరణించడం ఒక దుర్ఘటన. ఆయన మనోవాక్కాయకర్మలన్నీ పూర్వ కాలవైభవంతో నిండి నిబిడీకృతమై యున్నాయి.

"నా శరీరమందివతళించిన గాలి ఎంత పౌరాణసత్వమేమ కొనెను" అని చెప్పుకొనెను ఆయన భారతదేశం అజ్ఞాత దివ్యత్వంగలది. అలాంటి దేశం అస్వతంత్రతతో బాధపడ్డది. అందువల్ల "అస్మదజ్ఞాత పూర్వ దివ్యత్వమొప్పు నీ పునీతావనీ ఖండ మిచట నిలిచి యస్వతంత్రత దొరలు "నా యాంధ్ర శక్తి" అనియుద్ఘోషచేసెను. ఒక సుసంపన్నమైన సుబలిష్ట మైన రాజ్యపరంపర గలిగిన ఆంధ్రుడు బానిస అయిపోయినప్పుడు ఎంత విలపించుతాడు! "ఇమ్మగ గాకుళమ్ము మొదలీ వజ్రకుంగిత యాంధ్ర పూర్వరాజ్యమ్ములపేరు చెప్పిన హృదంతరమేలా చలించి పోవు" అన్న ఆయనకవిత "భిన్నగిరిశిఖర దుర్గ పరిదీనగీతి"

విశ్వనాథవారిది పాతయునివర్సిటీ. ఆయన ప్రాచీన ఋషి గోత్రీకుడు. గోత్రమంటే యునివర్సిటీ. మేము వశిష్ఠ గోత్రీకులం,

భరద్వాజ గోత్రీకులం అని అంటారు అంటే వాళ్లందరూ వశిష్ఠునీ భరద్వాజునీ విద్యాపీఠానికి చెందినవారని. ఆ స్కూల్ ఆఫ్ థాట్ కు చెందినవాళ్ళు విశ్వనాథ సత్యనారాయణగారు అనాగరికుడు అంటే నగరవాసకాదు, గ్రామవాసీకాదు, దేశవాసఅంతకంటేకాదు ఆయన ఏ దేశ వాసీకాదు కాలవాసి, ఒకానొక కాలంలో జీవించారు. ఆయన కవిత్వం కొందరికి ఎబ్బెట్టుగా ఉంటుంది ఎందుకంటే చదివే పాఠకు లంతా ఉప్పుసత్యాగ్రహంలో కొంతా బోల్షివిక్కు విప్లవంలో కొంత, ప్రపంచ శాంతిమహాసభలలో కొంత చంద్రమండల యాత్రలలలో కొంత మారనవారు. ఇన్ని మెట్లెక్కి మారినవారికి ఆయన కవిత్వం వెనక్కి పోయినట్టు కనిపించుతుంది. దేవుడులేడు అంతా మా ప్రతాపమే అని సైంటిస్టులు చంద్ర మండలం మీదకు వెళుతుంటే నేనూ వస్తాను పదండి,అక్కడ నేను వేణుగోపాలస్వామికి గుడికట్టించుకోవాలి అంటారు దానితో పాఠకులు ఉడ్డుగుడిచి పోతారు లెబిబ్బు లౌతారు ఇంతకి ఆయన ముందుకు వెళుతున్నాడా! వెనక్కి వెళుతున్నాడా అని దేవుడు వెనక్కి వెళ్లేవాళ్ళకు వెనకా ఉంటున్నాడు,ముందుకు వెళ్లేవాళ్ళకు ముందూ ఉంటున్నాడు అందువల్ల దేవుడి సమస్యా తేలడంలేదు. విశ్వనాథ సమస్యా తేలటంలేదు, కులం, మతం, దేవుడూ ఎంతి వద్దన్నా మననెత్తినెక్కి కూర్చుంటున్నాయి. వీటికి గిరిగీసి అడ్డు గోడలు కట్టి మీరు రావద్దని ఖచ్చితంగా చెప్పివస్తే చిక్కులేదు అడ్డుగోడలకు మళ్లీ చిన్న చిన్ని కిటికీలూ రంధ్రాలూపెట్టి తొంగితొంగి చూస్తున్నాము తొంగిచూచినకొద్దీ అవి మళ్ళీ మనవెంటే పడుతున్నాయి. మరి ఈ సమస్య ఎప్పుడు తెగుతుంది? ఇది ఎప్పుడూ తెగని సమస్య. ఈ యథార్థం గ్రహించినవాడు గాబట్టే విశ్వనాథ నిలిచాడు మతం అనేది గుడ్డిది, పిచ్చిది అనే బదులు అది మానవుని ఆదిమ సంవేదన ఆ పద్ధర్మ కవిత్వమూ అనుకుంటే పరమపావనంగా కనిపించవచ్చు. మానవుడు అన్నిటా సర్వశక్తిమంతుడుగాదు ఎందుకు కాడో కూడా అతనికి తెలియదు. అతడు తాను శక్తిచాలనివాడై సహాయంగా రక్షణగా రాజును నిర్మించుకున్నాడు, రాజుకూడా కొన్ని విషయాల్లో చాలడు అనుకుని

దేవుణ్ణి తెచ్చుకున్నాడు. ఇది సహజమైన మానవ దౌర్బల్యం అనండి ఇంకేమైనా అనండి, దేవుడు మానవుడిమీద పెత్తనం చేస్తున్నాడు. కొందరు ఏజెంట్లనుపెట్టుకొని మనతోవ్యాపారం చేస్తున్నాడు అయినా ఆర్థికరాజకీయ వ్యాపారుల కంటే అతడేం లాభం పంచుకోవడం లేదు. మనుష్యుడికి సంఘభీతి, పాపభీతి, విద్యాభీతి, దేశభీతి మొదలైన కొన్ని భీతులున్నై విశ్వనాథ వారికి ధర్మభీతీ దైవభీతీ ఉంది. అది ఆయన్ను రక్షించిందేమో రోడ్డు రవాణా భీతి ఉన్నవానికి గాయాలుతగలవు, విద్యాభీతిఉన్నవాడు డిగ్రీలు పొందుతాడు కాని ధర్మభీతి ఉన్నవాడు అధర్మపరుడుకాలేడు. ధర్మం అనే దాంట్లో సంఘమూ, మానవుడూ, జీవితం, రాజకీయం అన్నీవస్తాయి రోజుకు కొన్ని వందల వేదికలమీద గంభీరోపన్యాసాలుయిచ్చే నాయకుడికంటే మౌనంగా సుదూర గుహలో కూర్చుని మౌనధారణచేసే యోగి దేశానికి ఎంతో సేవ చేస్తున్నట్టు ఇంటింటా తిరిగి చందాలు వసూలుచేసే మహిళామండలి సభ్యురాలి కంటే ఇంట్లో కూర్చొని ఏకాదశి రోజున ఉపవాసం చేస్తున్న గేస్తురాలు చాలా గొప్పది ఎందుకంటే సభ్యురాలు ప్రోగుచేసిన చందా డబ్బు ఏమైపోయిందో ఎవరికీ తెలియదు ఉపవాసిని ఉపవాసంలో ప్రత్యక్షంగా ఆమె ఆరోజున అన్నంవసానుకోవడం చూస్తున్నాము అది ఇంకొకరికి మిగలడం చూస్తున్నాము ఆమె ఆరోజునమౌనధారణ చేసిందిగాబట్టి ఆరోజు వ్యర్థప్రలాపాలకు ఆటవిడుపు కలిగింది ఆత్మనిగ్రహం క్రమశిక్షణా ఆమె దేశం పేరు చెప్పకుండా తన యింటినుండే ప్రారంభించింది వినోబాభావే కూడా ఇదే అంటారు ప్రజల ముందుకువెళ్ళి నీవు దేశసేవచేయి అని చెప్పబోకు, వాళ్ళకు అర్థంగాదు గ్రామసేవ, మాతృసేవ అను, వాళ్ళకు అర్థమౌతుంది విశ్వనాథ సాహిత్య ధర్మముకూడా ఇదే అందువల్లే ఆయన డిక్షనరీలో దేశసేవ, రాష్ట్రీయతా, మానవహక్కులు, వ్యక్తిస్వాతంత్ర్యం, కుటుంబనియంత్రణ, సాంఘికన్యాయిం లాంటి పదాలు లేవు. జీవకారుణ్యము, భూతదయ, దానధర్మాలు, గురుభక్తి, శిష్యవాత్సల్యము లాంటి పదాలుఉన్నై. ఈ యుగపుపదాలు ఈ యుగపు అర్థాలతో మనం నేర్చుకున్నవి. పాతవి, మనపుట్టుకతో వచ్చినవి. ఆ

పదాలవెనుక ఆదేశం, ఆకాలం, ఆ సంస్కృతి ఉన్నవి మనకు నాగరికత అంటే సభ్యత. అంటే సభలో కూర్చొనగలగడం. తాను పండితుడు కాకపోయినా పండితుడు చెప్పేది అర్థంచేసుకోగలగడం. పాశ్చాత్యులకు నాగరికత అంటే నగరాలలో ఉండగలగడం. దీనివల్లే మనదేశపు సభ్యత సభల సభ్యత అనీ, పాశ్చాత్యులది నగర సభ్యత అనీ తేలిపోతుంది. మనవి, దేశీయసత్యాలు, పాశ్చాత్యులవి ప్రచారం వల్ల వచ్చినవిగాబట్టి ప్రచారసత్యాలు విశ్వనాథ సత్యనారాయణగారు దేశీయ సత్యాలకే ప్రాముఖ్యం ఇచ్చారు. దేశసేవను ఆయన పరోపకారం, దానధర్మాలు, అనే పదాల్లోనే చూస్తారు మనం దేశీయ సత్యాలమీద నడుస్తున్నామో ప్రచారసత్యాల సత్యాల మీద నడుస్తున్నామో ఇంకా తేలడంలేదు నాగలిలో అరసున్నా తీసివేసి "నాగలి" అని వాడే స్థితికే వచ్చాముగాని "నాగలి" బదులు ట్రాక్టరు వాడేస్థితికి రాలేదు, అందువల్లే దేశీయవాది విశ్వనాథా ప్రచారవాదులైన ఆధునికుల మధ్యా సమరం నడుస్తూనే ఉంది

విశ్వనాథను కులతత్వవాది అంటారు ఎవరు కులతత్వవాది కాదు! అందరూ ఏదో కులంనెత్తినవేసుకునేపుట్టారు. అసలు నా ఉద్దేశ్యంలో కులాలు అంటే స్కూళ్ళూ, అడ్రసులూ అని. అతడు ఏ కులంలో పుట్టాడు అంటే ఏ స్కూల్లో చదివాడు అని. మనం ఐదవ యేటనుండీ ఒకస్కూల్లో చదువు తుంటాము అందుకు ముందు పుట్టుకలోనూ పుట్టుక ముందూ కూడా ఒక స్కూల్లో చదువుకుని వచ్చాము ఆస్కూలునే కులమంటాము ఇది మన చర్మమూ, రంగూ, రక్తము, వంశపారంపర్యము, అభిరుచులూ, బుద్ధిసూక్ష్మతలకు సంబంధించిన స్కూలు ఇతడు ఫలానాపేటలోనివాడు ఫలాని తాలూకావాడు, ఫలాని జిల్లావాడు అన్న స్థానికమైన అడ్రసు మనవ్యవహారానికి ఎంత అవసరమో మన శారీరక మానసికమైన అడ్రసూ అంతే అవసరం. నీది ఏ ఊరు అన్నతరువాత, నీది ఏకులం అంటారు కులంచెపితే ఇతడు ఫలానా రంగువాడనీ, ఫలానా రుచులువాడనీ ఫలానావాసనలవాడనీ తేలిపోతుంది ఇది ఒకరకమైన జన్మపత్రిక, పుట్టుకకు సంబంధించిన అడ్రసు ఇది ఎప్పుడూపోదు పాశ్చాత్యులకూ కులంలేక పోలేదు. కాని వాళ్ళు దాన్ని తమస్వార్థానికి

వినియోగించుకోరు మనం వినియోగించుకుంటాము అంతే తేడా కులం మమకారంతో ఉద్యోగాలూ అవీ ఇచ్చుకోనడం మానాలిగాని అదితీసి వెయ్యాలనడం అర్థంలేనిమాట ఇదికేవలం ఆధునిక మ్మన్యులూ రాజకీయ ప్రయోజన పరులూ చేసిన ప్రచారం మాత్రమే కులంపేరెత్తినా విశ్వనాథ వ్యక్తిత్వం మాధుర్యంగాఉన్నదంటే అదికులమాధుర్యమే అదిమానవునకు విడదీయరాని మధుర ఆత్మీయబంధనం

కులం మతం దేవుడినీ వెనక ఉంచుకొని వ్రాసినందువల్లే ఒక రచయితత్వం పాతదికాదు ఒకరక్రొత్తదికాదు దేవుడుకాకపోతే ఇంకొకరిని, ఇంకోటేదో ఉండినడిపిస్తుంది కాని అందులోనూమానవీయభావాలూ ఆవేశాలూ చెరగనివి ప్రజలకుఅవి కావాలిగాని బాహ్యావిషయాలు అక్కరలేదు చరిత్రల విషయమే చూడండి ప్రజల చరిత్రలు వేరుగా ఉన్నాయి, చరిత్రకారులువ్రాసే చరిత్రలు వేరుగాఉన్నాయి ప్రజలు జ్ఞాపకంపెట్టుకునే చారిత్రికపురుషులు మగువమాంచాల, తాండ్ర పాపారాయుడు, డొక్కాసీతమ్మ దాసీపన్నా, అల్లూరి సీతారామరాజు మొదలయినవాళ్ళు చరిత్రకారుల నాయకులు అక్బరు, ఔరంగజేబు, అలెగ్జాండరు మొదలైనవాళ్ళు. వాఠ్యపుస్తకాల్లో బలవంతంగా చదివించకపోతే వీళ్ల నెవరూ జ్ఞాపకం పెట్టుకోరు వీళ్ళ రాజ్యాలు ఎంతపెద్దవైనా వీళ్లెంత శూరులైనా వీళ్ళుప్రజలకు అక్కరలేదు. ఎందుకంటే వీళ్లయుద్ధాలుగానీ, జీవితలక్షణాలుగాని ప్రజల ప్రతిభకు సంవేదనలకూ, ఆవేశాలకూ ఆదర్శాలకూ అనుగుణంగాలేవు పల్నాటి యుద్ధం ఎందుకు వచ్చిందో కోడిపందాలకే వచ్చిందో చాపకూటికే వచ్చిందో ప్రజలు ఆలోచించరు వాళ్లకుకావాలసిందల్లా మగువ మాంచాల ఎంత ఆత్మసమర్పణ చేసింది, బాలచంద్రుడు ఎంత వీరావేశం చూపించాడు అన్నదే అలాగే కవుల రచనల్లోకూడా. దేవుడూ, మతం మొదలైన బాహ్యావిషయాలను పట్టించుకొనకుండా దానిలోని ఆవేదనే చూస్తారు ప్రజలు.

విశ్వనాథ సత్యనారాయణగారు దైవాంశసంభూతుడు. కాని మానవాంశ తక్కువుగా ఉంది సృష్టి కర్తగాబట్టి బ్రహ్మ. వ్యాసుడు

గాబట్టే విష్ణువు ఒక రకమైన పోషణభారం వహించాడు కవిత్వంలో లయకారుడు మాత్రం కాదు. నిటలాక్షుడు, గరళకంఠుడు నవలల్లో చంద్రశేఖరుడు కూడా కొన్ని లౌకికవిషయాల్లో విఘ్నరాజు సాహిత్యంలో గజాననుడే. దైవాంశతోపాటు ఆయనలో రాక్షసాంశకూడా ఉంది. లేకపోతె అంతసాహిత్యం సృష్టించలేడు ఆయన దుస్సాహసి-శబ్దరీత్యా, అర్థరీత్యా కఠినశిలో ద్భిన్నఝురీపాతవేగం ఆయనలో ఉంది. అప్పుడప్పుడు పెద్దబండరాయిలాంటి శబ్దాన్నీ భావాన్నీ ఎత్తుకుని దించుకోలేకపోతుంటే పాఠకులేవచ్చి దించుకుంటారు. అందుకనే ఆయన పద్యంలో ఎన్నో నానార్థాలు, పర్యాయపదాలూ, వ్యాఖ్యానాలూ దొర్లుతుంటాయి అసలు ఆయన కవిత్వంలో ఇంత దుస్సాహసం ఎందుకు వచ్చింది? లోపల ఏదో కసి ఉండాలి ఈ దేశం తగులడి పోతుంది. ఉద్ధరించాలి. ఈ కసితో ఆయన తనకలం పరశువునెత్తాడు శ్రీశ్రీ, నర పీడకుల్ని దోపిడీ ముఠాలను చీల్చి చెండాడాలి అని శబ్దాల ఈటెలు పుచ్చుకునిలేచినట్టు. ఇద్దరిలోనూ వీరావేశం ఉంది. ఒకరిది ధర్మ వీరావేశం; రెండవవారిది ప్రజావీరావేశం. మొత్తానికి ఇద్దరి వీరావేశాలూ పాఠ కులు ఆదరించారు ఇద్దర్నీ కవులుగాగుర్తించారు వాళ్ళకు "ధర్మ", "ప్రజ"తో సంబంధంలేదు. ఆవేశమేకావాలి

విశ్వనాథవారు తన గ్రంథాలని వ్యావహారికంలో వ్రాయకుండా గ్రాంథికంలో వ్రాసి ఒక సాహిత్య రహస్యాన్ని సంరక్షించారు మనం వ్యావహారికం ప్రచారంచేసి చాలా చిక్కులు నెత్తిన ఎత్తుకుంటున్నాము కవిత్వం వ్యావహారికంలో వ్రాయడం చాలాకష్టం, అది ప్రజలభాష, ఏకొంచెం తప్పుచేసినా దొరికిపోతాము రచయిత అనేవాడూ కవిఅనే వాడూ ప్రజలకి దొరక్కుండా మభ్యపెడుతూ తిరగాలి అందరికీతెలిసే భాషకాకుండా ఒక "కాకా" భాష నేర్చుకోవాలి. రహస్యంగాచెవిలో చెప్పినట్టు చెప్పాలి కవిత్వం చెవిలో చెప్పదగిందే. మన ఆత్మీయుడి ఆత్మనూ హృదయాన్ని కదిలించడానికి చెవిలో చెప్పడానికి ఉద్దేశించిన రహస్య పత్రం అది. రాజకీయ ఉపన్యాసాల్లాగా పబ్లికుప్లాటుఫారాలమీద చెప్ప

దగినవికావు. అందుకనే సాహిత్యాన్ని ఎప్పుడూ నర్మ గర్భంగా పాండిత్య ప్రచ్ఛన్నంగా సజెస్టీవ్‌గా సాంకేతికంగాచేసిచెబుతారు ఇవన్నీ చెవిలో చెప్పడం లాంటివి. గ్రాంథికంలో రహస్యంగా చెప్పదగిన కుహానా సౌందర్యాలూ, కుతంత్రాలూ ఉన్నాయి. ఎందుకంటే అది ఒక ప్రత్యేకమైన భాష. పిల్లలభాష వేరు పెద్దవాళ్ళభాష వేరు ఆడవాళ్ళభాష వేరు "కన్నా! నీవు లాలబోచికుని బువ్వతిని బజ్జో" అని తల్లి అంటుంది మనభాష వాడకుండా పిల్లలకీభాష ఎందుకువాడుతున్నాము? మనకఠోరభాష పిల్లల సుతిమెత్తని భావాలకు చాలదని ఇంకో భాషతయారుచేసుకోవలసివచ్చింది కవులుకూడా ప్రజల్లోఅరిగి పోయినందువల్ల వ్యావహారికం పనికిరాక గ్రాంథికం తయారుచేసుకున్నారు ఇది సంవేదనాత్మకమైంది, సంగీతాత్మకమైంది, "పూచెం జెర్వుల చూచితే కమలముల్ పూర్ణేందుబింబాననా!" దీన్ని విడగట్టి "కమలాలు చెరువుల్లో పూచినాయి చూచావా చంద్రుడివంటి ముఖందానా!" అంటే దాంట్లో అర్థం ఉండవచ్చు గాని సంగీతం, లయా ఉండదు. సంగీతంలేని భాషను మనం ఎక్కువకాలం జ్ఞాపకంపెట్టుకోలేము సినిమాల్లో వ్యావహారికంలో గేయం వ్రాసి పాడిస్తున్నారంటే అదివేరు దానికి ఒక్కొక్క పాట పాడించడానికి 30 వేలు 40 వేలు ఖర్చు అవుతాయి గ్రాంథికంలో వ్రాస్తే ఇన్ని వేలూ ఖర్చు తప్పుతుంది. విశ్వనాథవారు తన పద్యాలూ పాటలూ వ్యావహారికంలో వ్రాసిఉంటే అవిపాడించడానికి ఎన్ని వేలు ఖర్చుపెట్టవలసి వచ్చేదో?

ఈవ్యాసంలో నేను విశ్వనాథసాహిత్యాన్ని గ్రహించి దానిరసాస్వాదన పద్ధతుల విషయం చర్చించలేదు. ఆంధ్రసాహిత్యంలో విశ్వనాథ అనే ఒకతుఫాను వీచి వెళ్ళిన తరువాత దానిప్రభావ పరిమాణాలను గురించి సమీక్షించడానికి ఒక ఎంక్వైరీ కమిటీవేసినట్టు ఎంక్వైరీచేసి రిపోర్టు ఇచ్చినట్టే వ్రాశాను

విశ్వనాథ అన్ని రచనల్లోనూ ఆవేశం ఉంది, కల్పన ఉంది, పదాల షోకం ఉంది నుడికారం, భావావిస్ఫాలనం, కంఠదీప్తి, భ్రుకుటీ

కుంచవం, చక్కిలిగింత, తాండవనృత్యం ఉన్నై ఆయన స్వయంభువ ప్రతిభా సంపన్నుడు మానవులందరికీ అనుభూతులుంటాయి గాని కొందరి చేతుల్లోనే అవి మంచికట్టడాలుగా రూపొందుతాయి అందరి దగ్గరా ఆకలపా, ఆసైటూ, ఆ లోకాలిటీ ఉండదు కవులు ఎన్నో వేల పద్యాలూ గ్రంథాలూ రచించి పోతుంటారు అవన్నీ ప్రజలు జ్ఞాపకం పెట్టుకోలేరు, పెట్టుకోగూడదు కూడా వాళ్ళది ఏ ఒక్క పదమో పాదమో జ్ఞాపకం పెట్టుకుంటారు, అదిచాలు వాళ్ళు నిలిచి ఉన్నారని చెప్పడానికి "ఏరాజుపంచెనో యిచట శౌర్యపు బాయసమ్ముల నాగుల చవితినాళ్ళు", "ఈ పొలాలెంగ చేవెక్కించుకున్నవో గుండెవ్రయ్య సముద్ర గుప్తుడడలె" ఈ మాట ఒక్కటి చాలు ఆయన బాహోచాలనం కంఠ దీప్తి స్పష్టంగా చెప్పడానికి ఒక మహార్థం, మహాసంకేతం ఆయన కవితలో ఉన్నదంటారు ఉన్నదనితోపింపజేసిన ఒక శక్తి, ఆ శక్తే ఆయనకవిత నవలల్లో ఏకవీర, చెలియలికట్టలాంటివి శాశ్వతంగా నిలవ గలవని నా నమ్మిక, మన ఇంట్లో దొంగలు పడినప్పుడు ఒకవీరుడు ఒక దివిటీని చేత్తో త్రిప్పి వాళ్ళను తోలివేశాడు, ఆ దొంగలెవరో తెలియదు. ఆ దివిటీ ఏమిటో తెలియదుగాని అలా త్రిప్పి గిరవాటు వేసిన ఆ వెలుగు రేఖ మాత్రం మనకు చాలాకాలం జ్ఞాపకం ఉంటుంది, ఆ చీకటిలో ఆ శబ్దాలూ, ఆ అర్థాలూ స్పష్టంగా తెలియకపోయినా ఇదీ విశ్వనాథవారి కవితను గురించినాకు తోచిన అభిప్రాయం.

# శ్రీవిశ్వనాథ సాహిత్యసభలు

**శ్రీ యడవల్లి ఆదినారాయణ**

1937లో సనిగుర్తు ఏలూరులో ఒక సినిమాహాలులో ఆంధ్రనాటక కళాపరిషత్సభ జరిగింది ఆసభకు శ్రీ విశ్వనాథ వస్తున్నారని తెలిసి వెళ్ళాను వక్తలు శ్రీయుతులు వేలూరి శివరామశాస్త్రి, శ్రీ విశ్వనాథ, శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు. అంతకుపూర్వము వినడమేగాని వీరినెవ్వరినీ నేను చూడలేదు. ముందుమాట్లాడ వలసినవారు శ్రీ వేలూరి, "అస్వస్థంగా ఉంది, తర్వాత మాట్లాడుతాను రెండవవారిని మాట్లాడమనండి" అన్నారు శ్రీ వేలూరి రెండవవారు శ్రీ విశ్వనాథ, ఆయనలేచి నాకస్వస్థత లేదనికాదు, అంటూ ఐదారు నిముషములు శ్రీ వేలూరిని విమర్శించి నాటకపద్యాల్లో సంగీతము అనే విషయంగురించి మాట్లాడారు తర్వాత శ్రీ భమిడిపాటిగూడ అదేవిషయం మాట్లాడారు ఈవిషయంలో వీరిద్దరూ భిన్నదృక్పథం గలవారు తెలుగుపద్యంలో సంగీతం లీనమయ్యే ఉంటుంది, అదిలేకుండా తెలుగు పద్యంలేదు, అందుచేత సంగీతంతోనే పద్యం చదవాలి అన్నారు శ్రీ విశ్వనాథ. పద్యాన్ని తగు మాత్రం నడకతో చదివితేచాలు. పెద్దగా సంగీతం అక్కర లేదని అన్నారు శ్రీ భమిడిపాటి కొన్నాళ్ళు పత్రికల్లోకూడ ఈవిషయం వీరు చర్చించారు చివరకు శ్రీ వేలూరిలేచి ఒకపద్యం చదివారు చక్కగా రాగయుక్తంగా (తోడిరాగంలో అనుకుంటా). దానిభావం ఒక విటుడు ఒక ఇంటి కోడలి కోసం ఇంటబయట తారాడుతున్నాడు ఆదుర్దాగా అదిచూచి ఆ కోడలు "నేనస్వస్థురాలను ఊరికేగోడవజేస్తే ఏంలాభము అట్లా ఎందుకు తారాడతావు ఎదుటివారిబాధ పట్టించుకోవేమి"? అనివ్యంగ్యంగా తెలిపిందిట. ఇది శ్రీ విశ్వనాథ తనపైజేసిన విమర్శకు వ్యంగ్యసమాధానము శ్రీ విశ్వనాథకు ఆయనకుపడదు కాబోలునని అనుకున్నాను శ్రీ విశ్వనాథ పడనివాళ్ళతో సూటిగా ఎదుర్కోవటమేగాని చాకచక్యంగా సమాధానమిచ్చే ఓపిక లేనివారని అనుకున్నానప్పుడు. కాని ఆస్థానకవులకు నమస్కారమనే శీర్షికతో

శ్రీశ్రీ పాదవారికి శ్రీవిశ్వనాథ ఇచ్చిన సమాధానం చదివితే ఆయన సంయమనశక్తి కన్పిస్తుంది, మాట్లాడేటప్పుడుతొందరైనా వ్రాసేటప్పుడు ఆయనకు చాలసంయమనముంది

1938లో కృష్ణాజిల్లాలో శాయపురమనే ఒకఅగ్రహారంలో ఒకగ్రంథాలయవార్షికోత్సవం. అక్కడ శ్రీవిశ్వనాథవారి ఉపన్యాసంఉంది ఆగ్రామంలో ఆర్ష సంప్రదాయాలు ఉట్టిపడే జీవనంగల కొద్దోగొప్పో చదువుకున్న బ్రాహ్మలెక్కువ ఉన్నారు. ఆగ్రామంలో జీవనవిధానం శ్రీ విశ్వనాథకు తృప్తి కలిగించింది. మధ్యాహ్నం పదకొండు గంటలకు వేసవిలో 2 మైళ్ళు కాలినడకన ఆఊరుచేరారు. సాయంకాలంసభ నన్నయనలోపాఖ్యానంచదివి హంసదౌత్యంలో ప్రత్యక్షరసౌందర్యాన్ని విమర్శన పూర్వకంగా నిరూపించారు వారు ఉపన్యాసం ఇస్తారని చుట్టుప్రక్కలగ్రామాల్లో కొందరు వచ్చారు. ఉపన్యాసం అత్యద్భుతంగాఉంది

తర్వాత 1949లో బందరుహిందూ కళాశాలలో తెలుగుశాఖ ఆధ్వర్యాన ఒకసభ ఏర్పాటు చేయాలని అనుకొని, నేను శ్రీ విశ్వనాథను ఉపన్యసింప వలసిందని విజయవాడకుపోయికోరాను సరేనన్నారు "పెద్దన మనుచరిత్రంపై ఉపన్యసించండి దయచేసి" అన్నాను. నాకెవ్వరూ ఫలాన విషయం మాట్లాడండి అనిఅడగరే! నీవువిషయం కూడ నిర్ణయిస్తున్నావే! అన్నారునవ్వుతూ! మీరేదయినామాట్లాడుతారు ఫలానవిషయమని మాకు తెలియకపోతేముందు మేము సిద్ధపడలేముగదా! అన్నాను, ఊఁ నీవుగడుసు వాడివిలాఉన్నావు! సరే! అన్నారు, తర్వాత సభకువచ్చి ఒక్క పొల్లుమాట అయినాలేకుండ సూటిగా విషయం గంటన్నరసేపు మాట్లాడారు మాట్లాడుతుంటే నేనువ్రాసి కళాశాలసంచికలోప్రకటించాను ఒకప్రతి వారికీ అందజేసాను. ఆతర్వాతనే అల్లసాని వాని అల్లికజిగిబిగి" వచ్చిందనుకుంటాను శ్రీవిశ్వనాథకు ఒకవిషయమని నిర్ణయించకపోతేవారిమనస్సుకు ఆక్షణంలో ఏదితోస్తే అది మాట్లాడుతారు! మహాప్రతిభావంతులుకాబట్టి మన అదృష్టవశాత్తూ అదిఒక్కొకప్పుడు అద్భుతవిషయంగావచ్చు, ఒక్కొకప్పుడు ఆసభలో వారికినచ్చని ఏదో ఒకవిషయమో, వ్యక్తియో విమర్శకు గురికావచ్చు. అందుచేత వారికి విషయం నిర్ణయించాలి. అప్పుడు అద్భు

తంగా మాట్లాడుతారు 'నేను ఏర్పాటు జేసిన అన్ని సభలూ విజయ వంతమైనాయి కొంతమంది "ఆయన మీసభల్లో బాగామాట్లాడారు మా సభల్లో తిట్టిపోయాడేమయ్యా" అని నాతో అన్నారు కూడ

తర్వాత 1950లో కాకినాడలో వారి ఉపన్యాసం ఉందంటే ఒకపని మీద నేను బ్రహ్మశ్రీ జంధ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అక్కడకు వెళ్ళాము. మేము రైలుదిగివెళ్ళేసరికి రాత్రిఎనిమది గంటలు అయింది కాకినాడ కళాశాలలో శ్రీజమ్ములమడక మాధవరామశర్మగారి ఉపన్యాసం మహాప్రవాహంగా సాగిపోతోంది "అయిపోయింది ముగిస్తున్నా" నంటూ ఇంకోఅరగంట సాగించారు ఉపన్యాసం ఆయన సభ్యులు కిటకిటలాడుతున్నారు. శ్రీవిశ్వనాథ మాట్లాడతారన్నారు అధ్యక్షులు శ్రీవారు లేచి "ఇప్పుడు రాత్రిఎనిమిదిన్నర అయింది. రెండున్నర గంటలనుండి శర్మగారు ఊపిరాడకుండా ఉపన్యాసం జేసారు మీరాప్రవాహంలో కొట్టుకుపోతున్నారు మిమ్మల్ని పైకితేల్చటం ఇప్పుడు సాధ్యంకాదు, సెలవు" అనిదిగిపోయినారు అధ్యక్షులు, కార్యకర్తలు శర్మగారు ఒకే విధంగా బ్రతిమిలాడారు ఆయన బసకు వెళ్ళిపోయారు వారేమనుకుంటారో నని ఆయనకొంచమైనా బాధపడలేదు. బసకువచ్చి మాధవరామశర్మగార్ని "ఉపన్యాసమంటే నీదేనయ్యా! ఒకవిషయమని లేకుండా, ఉపన్యాసం జేయటం-సామాన్యమా!" అంటూ ఏవేవోచమత్కరించారు నాకుచాలాబాధ వేసింది, శ్రీశర్మగారికి వారంటె చాలా గౌరవం విశ్వనాథవారికి కూడ వారంటే విరోధమేమీలేదు పాపం! శర్మగారు అట్లా నిర్విణ్ణులయి నిల్చున్నారు

అక్కడినుండి మాతో తణుకు పోదామన్నారు శ్రీవిశ్వనాథ తణుకులో వారిమిత్రులు శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజుగారున్నారు. వారు నన్నయ్య వర్ధంతిజేస్తున్నారు సభలో 100-150 మంది ఉన్నారు. ఆ రోజు నన్నయ యయాతిచరిత్రచదివి ప్రసన్నకథా కలితార్థయుక్తిని గూర్చి ఉపన్యసించారు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గీర్వాణాంధ్రాలలో ఉత్తమ శ్రేణికిచెందిన పండితులు సహృదయులు. శ్రీ సత్యనారాయణరాజుగారు కూడ తెనుగుసాహిత్యంలో పూర్తి అభినివేశం గలవారనుకుంటాను. వారు రచయితలు గూడ శ్రీ శాస్త్రిగారంటే విశ్వనాథవారికి గురుభావం

ఉండేది అలాంటి సాహితీవేత్తలు సభలో ఒకరిద్దరున్నా వారిప్రతిభ సట్టలేనంతగా విజృంభిస్తుంది ఆరోజు సభ అపూర్వంగా అత్యద్భుతంగా ఉంది

తర్వాత 1952లో పెదకళ్ళేపల్లిలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి వర్ధంత్యుత్సవములు భాష్యాంతవ్యాకరణపండితులు మైసూరు విశ్వవిద్యాలయంలో ఆంధ్రశాఖలో రీడరు అయిన శ్రీ నిష్ఠుభట్ల విశ్వనాథశాస్త్రి శ్రీ విశ్వనాథ కలిసి మాయింటికి వచ్చారు మాఇంట్లోభోజనము చేసుకొని నన్ను తీసికొని కళ్ళేపల్లి వెళ్ళారు అక్కడ సాయంకాలం 6గం॥ నుండి 7 1/2 వరకు శ్రీవారు మారీచఘట్టం చదివి ఆపేశారు సభ నిశ్శబ్దంగా ఉంది సభలో ఆంధ్ర, మైసూరు, మద్రాసు, ఉస్మానియా విశ్వవిద్యాలయాల ఆంధ్రశాఖకు చెందిన ఉపన్యాసకులు ఉన్నారు అంతలో దూరాన్నుంచి "నోటిముందరి విస్తరి లాగేశారండి" అన్నమాటలు వినపడ్డాయి మేమంతా అటుతిరిగాము శ్రీ విశ్వనాథ వేదికమీదనుంచి" ఏమిటి అన్నారు మళ్ళాఅదేమాట వినపడింది ఎవరుబాబూ!" ఇలారా అన్నారు విశ్వనాథ ఆయనముందుకివచ్చారు ఏమిటి మీరన్నది - అన్నారు విశ్వనాథ ఆయన - ఏముంది' నోటిముందర విస్తరిలాగేశారు అన్నాను-అన్నారు అంటే-అన్నారువిశ్వనాథ మంచిపట్టులో ఆపేశారు-అందుకని అన్నాను అన్నారాయన. మీరేం జేస్తారు - అన్నారువిశ్వనాథ "నేను వ్యవసాయం జేస్తాను" అన్నారాయన నాకవిశ్వంనీకేమర్థం ఐయింది-చదువుకున్నవాళ్ళే-పాషాణ పాకం అంటుంటే! అన్నారు విశ్వనాథ నాకాలేజీ కళ్ళకు కట్టినట్టుంది ఎందుకుఅర్థంకాదు? అన్నారాయన! శ్రీ విశ్వనాథ "చదువుకున్నది నీవో,ఈకూర్చున్నవాళ్ళో తెలియడంలేదు"-అంటూ శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు మొ॥ వారివంక చూశారు ఆయనకోసం మళ్ళాఅరగంటచదివి ఆపేశారు. ఆయనకొకబాధ ఉండేది తనప్రతిభా సర్వస్వమయిన కల్పవృక్షం ప్రజాదరం పొందుతుందా! అని పైసన్నివేశాలవంటివి, వారికి ఉత్సాహము కలిగించేవనుకుంటా! అక్కడనుండి రెండెడ్ల బండిలో కొన్ని మైళ్ళప్రయాణంజేసాము దారిపొడవునా చమత్కారసంభాషణ. ప్రతిచిన్నవిషయం పైన సునిశితమైన విమర్శ ఎన్నో అపూర్వవిషయాల ప్రతిపాదన వారు జేస్తుంటే నేనాశ్చర్యపోయాను

1955లో బందరులో 2 సభలేర్పాటు జేశాను. ఒకటి నాచనసోముని ఉత్తరహరివంశముగూర్చి ఈ సమయంలోవారు తెలుగున ముగ్గురు విలక్షణకవులున్నారు - నాచనసోమన, రామలింగకవి, కృష్ణరాయలు అన్నారు సభలో సోమన నరకాసురవధనుగూర్చి మాట్లాడారు అది ఖగోళ విషయికమైనకథ నరకుడు భూమినుండిజారిన ఒకచిన్నభూగోళిక భాగం- ఇతరగోళాలకుమధ్య అదితిరుగుచూ వానిభద్రతకు భంగం కలిగించకుండ ఉండటానికి పరమేశ్వరుడు దానిని ధ్వంసంజేశాడు ఇదే నరకాసురవధ అని చెప్పారు ఉపన్యాసం చివరిలో ఒకపిల్ల కిన్నెరసానిపాట పాడండి అంది అంతే అమ్మా! నేను రామాయణం వ్రాశాను ఇంకా కిన్నెరసానిపాటలే పాడనా? అని సరే! పసిదానివి! నీకోసం చదువుతాను అని చదివారు కిన్నెర మీటినట్లేఉంది ప్రతిభావంతులు ఏదిచేపట్టినా రసవత్తరంగానే రచిస్తారు అనుకున్నాను

గుడివాడలో శ్రీ విశ్వనాథకు షష్టిపూర్తి సన్మానసభ ఏర్పాటయింది అక్కడ శ్రీ కోటపద్మనాభంగారు, శ్రీ కేశవరపురామకోటిశాస్త్రిగారు- విశ్వనాథవారికి సన్నిహితులు కాని ఆధ్వర్యం అడుసుమిల్లి నారాయణ రావుగారు కాటూరివారి వియ్యంకులు చిన్నకోట మాధవరావుగారు ఆ సభలో స్వాగతపత్రమే వ్యంగ్యార్థయుక్తంగా అవమానకరంగా వ్రాయబడింది కాని శ్రీ విశ్వనాథ అన్నికార్యక్రమాలు చాలా మనోనిగ్రహంతో తిలకించారు శ్రీ దాశరథి, శ్రీ నారాయణరెడ్డి గార్లు కూడ ఆ సభలో పాల్గొన్నారు. చివరిసభ శ్రీవారికిసన్మానం; దానికి అధ్యక్షులు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. వారికివీరికి పడదని ముందు వ్రాశాను. సభలో శ్రీ కాటూరి నాషష్టిపూర్తి అనేవ్యాసం చదివారు. వ్యంగ్యంగా శ్రీ విశ్వనాథను అవమానించేదే! శ్రీ విశ్వనాథమాట్లాడుతూ వేలూరివారు మాపెద్దన్నగారు, మాకు మా శాస్త్రులవారివంటివారు - గౌరవనీయులు అంటూ ఉపన్యసించారు,చాలమనోనిగ్రహంతో! కాటూరివారి ఉపన్యాసము గూర్చి ఏమీ అనలేదు కాటూరివారన్న శ్రీ విశ్వనాథకు సోదరప్రేమ శ్రీ విశ్వనాథ కాటూరివారలకు శ్రీమల్లంపల్లి శరభయ్యగారు పరమ ఆప్తులు ఆయననేను ఒకచోటనే ఉండి సభాకార్యక్రమాలు చూస్తున్నాము.

మేమిద్దరం శ్రీకాటూరివారివ్యాసాలువిని చాలాబాధపడ్డాము ఆపుకో లేక శ్రీ శరభయ్య కాటూరి వారిని కలిసి దుయ్యబట్టారు ఆయన సమాధానం చెప్పలేక నేనేమీ చెడు అభిప్రాయంతో వ్రాయలేదు అంటూ నీళ్ళునమిలారు అందుకే ఆవ్యాసాన్ని తనుబ్రతికిఉండగా ప్రకటింపనీయలేదు ఆయన పోయిన తర్వాత దాన్ని ప్రకటించారు ప్రకటించేవరకు తృప్తి లేక పోయింది చివరికి వేలూరి వారుకూడ అధ్యక్షోపన్యాసంలో అదేపద్ధతిన మాట్లాడారు కార్యకర్తలు శ్రీవారికి రు 1116/- చదివించి ఇంకా కొంత డబ్బు వసూలుకావలసి ఉంది, తర్వాత పంపుతామన్నారు విశ్వనాధవారు అక్కడికక్కడ ముష్టిఎత్తి నాకుసన్మానంచేయకపోతేనేమి? ఎందుకింతశ్రమ పడ్డారంటూ- నేనే ఎంతమందికోదానం జేస్తూఉంటాను. నాకీ డబ్బెందుకు? వసూలు చేశారు కాబట్టి వచ్చినమొత్తాన్ని నిధిగాఉంచి దానిమీదవచ్చే వడ్డీతో ఈకళాశాలలో తెనుగున ఉత్తమోత్తమవిద్యార్థికి పారితోషికం యేటాఇవ్వండి అన్నారు. సభచాలించి రాత్రి 11 గం॥లకు విజయవాడ వెళ్ళిపోయారు అవసరమైతే ఎంతయినా నిగ్రహంతో వ్యవహరించ గలరు అనేదానికి ఈసభ తార్కాణం.

ఈ సభల్లో నేను సన్నిహితంగా ఉండి వారి విమర్శనావిధానాన్ని ప్రత్యక్షర సౌందర్య ప్రయోగవైశిష్ట్యం, శిల్పనిర్మాణ చాతుర్య ప్రతిపాదనలు మనసా భావించి వారిమార్గంలో ప్రాచీన కావ్యానుశీలనము నా నేర్చినంతవరకు చేయగలిగాను కవితను ఎలా ఆనందించాలో ఏకవిని ఏ దృక్పథంలోచూడాలో అసలుకవిత్వ మంటేఏమిటో నేర్పింది వారిసాహచర్యమే! వారికి అధికసంఖ్యాకులు సభలో వుండాలన్నభావంలేదు. ఒకప్పుడు నాతో "బహిరంగ సభలు బహుజన మిశ్రితంగాఉంటాయి. అక్కడమాట్లాడే తీరు వేరు అచ్చమయిన సాహిత్యసభ అంటే విషయగ్రహణశక్తిగల ఏకొద్ది మందిసహృదయులో ఉన్నది. అక్కడ అచ్చంగా సాహిత్యమే మాట్లాడ వచ్చు. సాహిత్యంలోతుల్లోకిదిగి శ్రోతల్నిదించి ఆనందింప జేయవచ్చు అటువంటిది పెట్టరాదా! ఎందుకీబహిరంగసభలు" అన్నారు ఇది విశ్వనాథ వ్యక్తిత్వంలో ఉపన్యాసధోరణిలో విషయ ప్రతిపాదనలో అభిరుచుల్లో ఉండే కొన్ని అంశాలని స్థాలీపులాకంగా తెలియజేసిన యత్నం.

# బాలకాండములో కమనీయ శిల్ప ఘట్టములు

శ్రీ కాజ లక్ష్మీనరసింహారావు

కల్పవృక్షము ఆంధ్రీకరణము గాదు. కథను మాత్రము వాల్మీకి చెప్పినట్లే చెప్పును కథలోఁ గొద్ది మార్పులున్నవి అనేకములు పెంచినట్లు కన్పించును వాల్మీకి తన కథను సంగ్రహరామాయణముగాఁ బ్రారంభించెను కల్పవృక్షకారుఁడు వాల్మీకి యాత్మకు భాష్యము వ్రాసెను వాల్మీకి క్రౌంచద్వంద్వ వియోగమును జెప్పెను. నారదుఁడు వచి యడుగుట, బ్రహ్మవచ్చి యనుజ్ఞయిచ్చుట, వీని యన్నింటితో వాల్మీకము ప్రారంభమగును కల్పవృక్షమున నివియేమియు లేవు. దశరథుఁడు కొడుకులు లేక దుఃఖపడుటతోఁ గథ యారంభింపఁబడినది

కల్పవృక్షము యొక్క ప్రాశస్త్యమునకుఁగల యనేక హేతువులలోఁ గథా కథన మొకటి ఈ విషయమును గూర్చి కల్పవృక్ష కారునికి గాఢమైన యభిప్రాయమున్నది తన కథా కథన వైలక్షణ్యమును దానే వివరించి చెప్పెను.

శా॥ "..............గాధి సూతి పరిహాసాశ్చర్య భీ రౌద్ర శృం
గార స్థానములౌ కథానకములన్ గాకుత్స్థులన్ సమ్మదాం
భోరాశిన్ మునుగంగఁజేసె, శిశువుల్ ముగ్ధాత్ములై తత్కథా
ధారా యోగ్యముగాగ నుద్ధతిని దత్తద్భావముల్ బొందగన్.

బాలకాండము - అహల్యాఖండము.

తా నే కథను జెప్పుచున్నాఁడో ఆయాకథలలోని భావములతో శ్రోతలను దన్మయీభావము నొందింపఁ జేయఁగల వాఁడుత్తమ కథకుఁడు. శ్రోత యెట్టివాఁడై యుండవలయును? వర్ణనీయ వస్తుతన్మయీ భావమును బొందఁగల్గి యుండవలయును.

రామలక్ష్మణులకుఁ గథలను జెప్పుచున్న విశ్వామిత్రుని స్థానమున విశ్వనాథయే యున్నాఁడు

సిద్ధాశ్రమమును విడిచి రామలక్ష్మణులు శోణానదీ తీరమునకు వచ్చిరి ఇచ్చట విశ్వామిత్రుఁడు కుశాంబునికథను వారికిఁజెప్పెను అపుడు శ్రీరాముఁడనుచున్నాఁడు—

చం॥ తపములు కల్గునేమొ, యరుదారు మహాత్ములు గల్గునేమొ, యీ
కృపయును గల్గునేమొ, మఱియే ఋషులందుననే *రసోల్బణా*
*నుపమముగాఁ గథా కథన ముండదు మీవలె.........*"

బాలకాండ - అహల్య

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకుఁ గుశాంబుని కథను జెప్పి, యనంతరము తన జన్మవృత్తాంతమును గూడఁజెప్పెను. ఆ సమయమున విశ్వామిత్రుఁడెట్లుండెను? విశ్వనాథ యిట్లు చెప్పెను—

కం॥ అలఘువు, మౌని *కథాకథ*
*నలపన దళదళి ముఖీన నయనుండగుచున్*......ఉన్నాఁడు

బాల - అహల్య

శ్రీరాముఁడు ప్రార్థింపఁగా విశ్వామిత్రుఁడు సగరచక్రవర్తి కుమారుల చరిత్రను వర్ణించి చెప్పెను విశ్వామిత్రుని కథను చెప్పుటలోని చాతుర్యమును దత్తత్త్వులైన ఋషి సంఘము కూడ వినెను. వారు ఋషులు వారిట్లన్నారు—

గీ॥ ఏమి సాగరుల్ వారలదేమి ప్రభులు
*ఏమి కథ! యేమి చెప్పుట! యేమి సొగసు!*

విశ్వామిత్రుఁడు చెప్పిన యీ కథలిట్లుంచి శతానందుఁడు రామునకు విశ్వామిత్రుని కథ జెప్పెను ఇక్కడ కథకుఁడు శతానందుఁడు. శ్రోతలలో జనకుఁడు నున్నాఁడు. ఆయన యిట్లు ప్రశంసించినాఁడు—

"ఈ కథా విస్తృతి వినిన నానిరంత మోదము చెప్పలేను స్వామి."

"అంత నేకాంతమ్మున శ్రీరామచంద్రుండు లక్ష్మణునితో నిట్లనియె"

కం॥ ఈ ఋషులెవ్వరు చెప్పిన
సార కథాకథన మొక్క చాయనె నడచున్
వీరంతర్దృష్టులు బహు
ధారూపిత సూక్ష్మతరకథాంశులు సుమ్మీ......"

రాముని దృష్టిలో ఋషులు చెప్పిన కథలయొక్క కథనమునందు భేదము గన్పించుటలేదు. కథాకథనముకూడ ఋషుల లక్షణమా? ఐనచో విశ్వనాథ ఋషియే విశ్వనాథ యొక్క యీ సారకథనము నంతర్దృష్టులై భావించి ప్రసన్నము చేసికోవలయును

వాల్మీకి చెప్పిన "వాక్యవిశారదత్వము", నన్నయ్యగారి "ప్రసన్న కథాకలితార్థయుక్తి", విశ్వనాథ "సార కథాకథనము" లకు నభేద ప్రతిపత్తి

దశరథునకుఁ బుత్ర సంతతిలేదు ఆయన దుఃఖించెను ఆ రాజునకు ముగ్గురు రాణులు మఱియు నాయన కనేకు లంగన లున్నారు. వాల్మీకము నకుఁ గల్పవృక్షమునకు భేదమున్నయొక చోటిది అశ్వమేధయాగము చేయు ఘట్టము వరకుఁ గౌసల్యాదేవి ప్రసక్తి వాల్మీకమున గానరాదు. పాయస ప్రదానవేళ వరకు సుమిత్రాకైకలను భార్యలను గూర్చి ప్రసంగింపఁబడదు కల్పవృక్షమున దశరథుని గూర్చి చెప్పిన వెనువెంటనే ఆ రాజు భార్యలను గూర్చిన వర్ణనయున్నది. ఈ వర్ణన సామాన్యమైనదికాదు. రామాయణము వేదమేనన్న మహార్థమును స్థాపించునట్లున్నది. "ఇష్టి" ఖండారంభము నందలి యీ రెండు పద్యములివి

ఉ॥ ఆరయ నెందఱేని కలరాయన కంగన లందు మూగు రిం
పారిన ప్రేయసుల్ గుణగణాబ్ధులు, కోసల రాజపుత్రి దే
వేరి, సుమిత్ర శాంతగుణ పేటిక, కేకయ రాజకన్య హే
లారతి డాగురేకుల తళత్తళ కాటుక రాజుకంటికిన్.

సీ॥ కౌసల్య ముక్తికాంతాసమానాకార,
నలి సుమిత్ర యుపాసనాస్వరూప
విజయ రమాకార వినయాంబుధి సుమిత్ర,
కైకేయి మధుసామగాన మూర్తి,
కౌసల్య నవశరత్కాల మందాకిని,
సితపుండరీకంబు (శ్రీ)సుమిత్ర,
మందార పుష్పంబు మహిళామణి సుమిత్ర,
కైకేయి నునునల్ల కల్వపూవు,

ధర్మకామంబు లీరెంట దశరథుండు
ముగురు భార్యలందును రసమూర్తులందు
నమృత సౌఖ్యానుభూతి, నధ్యయనసుఖము
తీర్థభోగ సుఖమ్ము సిద్ధింపఁ గనియె—"

ఈ పద్యద్వయగత భావము కేవల విశ్వనాథోపజ్ఞకము.

దశరథుని ముగ్గురు రాణులు "గుణగణాబ్ధులు", గుణసమూహము చేత నాలుగు సముద్రముల వంటివారని యర్థము. ముగ్గురు భార్యలను నాలుగు సముద్రములతోఁ బోల్చుటయేమి? కౌసల్యా సుమిత్రా కైకల గర్భవాసమున నారాయణుఁడు నలుగురు అన్నదమ్ములుగా నవతరింపఁ బోవుచున్నాఁడన్న యర్థమున కిది సూచన యనిచో నొక రమ్యమైన చమత్కారమైన భావన యనవచ్చును ఇంతకు మించిన వైశిష్ట్యమున్నది "కౌసల్య ముక్తి కాంతా సమానాకార"... యను పద్యమునఁ గౌసల్య యొకసారి, సుమిత్ర రెండు మారులు, కైక యొకసారి వర్ణింపఁబడిరి. ఈ క్రమము అన్ని పాదములందుఁ బాటింపఁబడినది ఇట్లొకసారి కౌసల్య, రెండుసారులు సుమిత్ర, యొకసారి కైకయు వర్ణింపఁబడుటచేత నా కౌసల్యకు రాముఁడొకఁడు, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్ను లిరువురు, కైకకు భరతుఁడొకఁడు జన్మింపఁ గలరన్న సూచ్యార్థసూచన యిందున్నచో నిది సామాన్యుఁడైన కవిమాత్రుఁ డెవడైనను జేయగల చమత్కారమే

విశ్వనాథ వారి లక్షణ్యము వేఱే యున్నది. వేదార్థమును శిల్పరమణీయముగా గుప్పించి చెప్పిగాని వదలని లక్షణము నందున్నది పై సీసపద్యమునందు రామాయణ తత్త్వమంతయు నిక్షిప్తము చేయఁబడినది. అది యెట్లు? శ్రీరాముఁడు మోక్ష స్వరూపుడు. సర్వకర్మబంధములు త్రెంచుకొన్నగాని ప్రాపింపరాని మహాపదార్థము మోక్షము. శాంతులైన జీవులకు గాని మోక్షము లభింపదు శ్రీమహావిష్ణువు కౌసల్యాదేవి గర్భమున శ్రీరాముఁడై యవతరించును. ఆ తల్లి యెంత పవిత్రురాలు? సాక్షాన్మూర్తి స్వరూపిణి. తల్లి గుణములు కొడుకునకు సంక్రమించినవో, స్వామి, మోక్ష స్వరూపము నా తల్లికిచ్చి తానా మెయందవతరించెనో! లోక మర్యాద యొకవంక, అవతార రహస్యమొకవంక నిరూపింపఁబడినది రెండవయామె సుమిత్ర. ఈ తల్లి లక్ష్మణశత్రుఘ్నులను గన్నది ఆమెకు రెండు విశేషణములు వాడబడినవి అపి-సుమిత్ర యుపాసనా స్వరూపయనుట యొకటి, విజయరమాకార వినయాంబుధి సుమిత్ర యనుట రెండవది. ఈ రెండును సుమిత్రానందనులయినలక్ష్మణశత్రుఘ్నులకు వరుసగా నన్వయించుచున్నవి. లక్ష్మణుఁ డుపాసనా స్వరూపుడు శ్రీరామోపాసనా ధురంధరుఁడు రామునకు లక్ష్మణుఁడు నిత్యసమీపవర్తి లక్ష్మణుఁడు రామోపాసకుఁడనుట యట్లుంచి సుమిత్రదయిన యుపాసన యెట్టిది? సుమిత్రకుఁ గౌసల్య యొక దేవీసర్వస్వముగాఁ గనపట్టును రామాయణ గత బహు స్త్రీ పాత్రలు దేవీ స్వరూప నిరూపణకుగాఁ గల్పవృక్షమున జిత్రితములయినవి అందు సీత సాక్షాత్పరమేశ్వరి ఇది యిట్లుండఁగా సుమిత్ర కౌసల్యానిత్యసమీపవర్తిని కౌసల్య కేమి జరిగినను అది తనకుఁగూడ జరిగినట్లు తృప్తినొందు జీవలక్షణము గలది యజ్ఞవుగావించి పుత్రులను బొందెదనన్న వార్తను దెలియఁజేయుటకై దశరథుఁడు సుమిత్రాసౌధమునకుఁ బోయెను ఆమె రాజుతో నన్నది-

చం॥ "...................పట్టపురాణి కక్కకున్
దనయుఁడు కల్గుటొక్కటియు నాకునుగల్గుట యొక్కటా! భవ
త్తనయుఁడు నీదు భార్యలకుఁ దాఁగనయుండె యగున్గదా"

బాల ఇష్టి.

సుమిత్ర యొక్క యీ మాటలు ఆమె కౌసల్య నుపాసించు విధానమును ద్యోతమానము చేయుచున్నవి కౌసల్యను సుమిత్ర యెట్లుపాసించి నదో రాముని లక్ష్మణుడ ట్లుపాసించెను మరల సుమిత్రను గూర్చిన రెండవ విశేషణమున్నది "విజయ రమాకార వినయాంబుధి సుమిత్ర". శత్రుఘ్నుడు వీరరసావతారుడు. మరియుదన యన్నలందు వినయ సముద్రుడు మూడవయామె కైక ఈమె పాత్రను రామకథా భాష్యకారులెవ్వరును దెలిసికొనలేనంత సమృద్ధిగా కల్పవృక్షకారుడు తెలిసికొనెను ఆ తెలిసిన రహస్యమునంతటిని ఒక్క యీవిశేషణమున ధ్వనింపజేసినాడు "కైకేయి మధుసామగానమూర్తి" అని కైకను గూర్చిన వర్ణన. "తతో బ్రహ్మా ఏద్రూప స్వాధ్యాయస్తపః తస్మిన్ నిరతం సామగాన లోలత్వమిత్యర్థః వేదానాం సామవేదోఽస్మి, ఇతి భగవతా గీతత్వాత్ ఏవం వేదాధ్యయన ముక్తం అథ యదధీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే కేవలాధ్యయన స్సనిందితత్వాత్ తదర్థజ్ఞ ఇత్యాహ..." రామాయణము వేదము వేదము లందుసారభూతము సామవేదము. కేవలము వేదపఠనచేసిన వారికంటెదదర్థ జ్ఞానులుత్తములు కైకి మధుసామగాన మూర్తి యనగా రామాయణ వేదము యొక్క సారమును సరిహస్యముగా దెలిసకొన్నదని యర్థము కైకి మధురమయిన సామగాన స్వరూపిణి యనుటలో మరయు విశేష మున్నది మధు శబ్దము యొక్క తద్ధిత రూపము మాధవుడన్నది రామాయణమునమాధవుడనగా శ్రీరాముడు. రాముడనినచో కైకకు బట్టరాని యంతప్రేమ మరయు విష్ణుముఖ వినిర్గత వాయువీచీ ప్రసారముచేత బూరింపబడిన శంఖము వేదమునే ధ్వనించుచున్నది ఆశంఖము యొక్క యవతారమే భరతుడు ఆభరతుని తల్లియేకైకి ఈకైకయే రాక్షస సంహారార్థము రాముని నడవులకుబంపి భరతునిరాజుజేసి రామావతార రహస్యమును దెలిసిన యామె యయ్యెను. అహో! విశ్వనాథ ఋషిత్వము! బహుధారూపిత కథాంశముల సారమిట్లుండునా! సీసపద్యమున రెండవ పాదమిట్లున్నది- "కౌసల్య నవశరత్కాల మందాకిని, సితపుండరీకంబు శ్రీ సుమిత్ర మందార పుష్పంబు మహిళామణి సుమిత్ర కైకేయి నును నల్లకల్వపూవు"

సుమిత్రను గూర్చి ప్రయోగింపఁబడిన సితపుండరీకము, మందార పుష్పము లను విశిష్టపదములు భావకవితా ధోరణియందున్నవి విశ్వనాథ కేవలభావకవికాడు మహాకవి శబ్దవాచ్యుఁడు "గడుసరియౌ కథాకథనము" యొక్కలోఁతులు తెలిసినవాఁడు సితపుండరీకమనఁగాఁ దెల్లకలువ, లక్ష్మణుఁడు శేషుని యవతారము, తెల్లనిమేని చాయగలవాడు. భావకవితాసరళి లోననే భారతీయ సంప్రదాయమును శిల్పవృతము వ్యాఖ్యానించుచున్నది తెల్లకలువతోఁబోల్చినంత మాత్రమున (లక్ష్మణుని) నేమివచ్చినది? మల్లెపూవుతో బోల్చరాదా? పోల్చరాదు ఇది యిట్లుండఁగా "మందారపుష్పంబు మహిళామణి సుమిత్ర.." యని మరొక వర్ణన వీరరసమునకు నరుణవర్ణమును ఆలంకారికులు నిర్ణయించిరి శత్రుఘ్నుని వీరరస స్వరూపమును ధ్వనింప జేయుటకు సుమిత్ర మందార పుష్పమయినది రసములకు (శృంగారాది) అధిదేవతలను, వర్ణములను ప్రాచీనులైన ఋషులు నిర్ణయించిరి సితపుండరీకంబు శ్రీ సుమిత్రయను వర్ణనకు, నవశరత్కాల మందాకిని కౌసల్యయను వర్ణనకు సన్నిహిత సంబంధమున్నది కౌసల్యను సుమిత్రవిడువలేని లక్షణమున్నది శరత్కాల మందాకినీగత ధావళ్యము నందు సితపుండరీక ధావళ్యము లీనమై పోయినట్లే కౌసల్యలో సుమిత్ర నిత్యము లీనమైయుండును తెల్లనికలువ, తెల్లనిగంగానది యీరచన యందంతయు శుద్ధమైన సత్త్వగుణము భాసించుచున్నది మందాకిని గలువలచేత శోభాదీప్తి మంతమగును. మందాకినీ సదృశుఁడైన రాముని సాహచర్యముచేత సితపుండరీకము వంటి లక్ష్మణునకు జీవము కల్గినది పుండరీకము నదీజలమును విడిచి జీవింపఁజాలని యట్లుగా రామునివిడిచిన లక్ష్మణుఁడు మనఁజాలఁడని యిందుధ్వనించుచున్న మహారహస్యము రాముని సాన్నిధ్యము గోల్పోయిన లక్ష్మణుఁడు నిర్జీవ మ్లానకుసుమ తుల్యుఁడనుటలో విశ్వనాథ యొక్క సకలోహావైభవనాథమైన యౌత్కృష్ట్యము స్ఫుటమగుచున్నది రామలక్ష్మణుల సోదరానుబంధ మింత గాఢమైనది. కైకనుగూర్చిన మరియొకవర్ణన ఆమె నునునల్లకల్వయనుట. కైక మధుసామగాన మూర్తియనుటలోని రమణీయార్థ మెంతటిదో విశదీకరించితిని కైక నల్లనికలువయగుటయేమి? (సుమిత్ర తెల్లకలువ యనఁబడినది) లక్ష్మణుఁడు తెల్లకలువ, భరతుడునల్లకలువయగుటలో సొగసున్నది భరతునకురామునకు సామ్యమున్నది. రామునివలెభరతుఁడును నల్లనివాఁడు.

రాముని స్థానమున నిల్పబడి రాజ్యము నేలినాడు. శ్రీ రాముడు మందాకిని కాగా లక్ష్మణ భరతులు తెలుపు నలుపు కలువలైనారు. కలువలచేత గంగా నదీ గుణోత్కర్ష ప్రకాశించినట్లుగా లక్ష్మణ భరతులు సోదరులు కాగా రాముడు లోకారాధ్యుడైనాడు భారతీయులకు ఆదర్శమైన శ్రీరామ చంద్రుని సోదరుల యనుబంధమీ తీరున కథితమైనది

కల్పవృక్షారంభమునందలి దశరథుని రాణులను గూర్చిన యీ రెండు పద్యములు అమూలకములైనవి ఈదృశమైన కథనముచేత రామకథా భాష్యకారుల యందు విశ్వనాథ శిరోమణియయ్యెను.

"ఇష్టి" ఖండారంభమే యింత యందముగా నున్నది మరియొక కథ యున్నది అది అహల్యాఖండము నందలి కుశనాభునికథ అందలి కథాకథన శిల్పమును కదియే సాటి రామ లక్ష్మణులను వెంటనిడికొని విశ్వామిత్రుడు సిద్ధాశ్రమమును విడిచి శోణానదీ తీరముచేరెను అపుడు రాముడు విశ్వామిత్రునితో నిట్లు పలికెను—

శ్లో॥ భగవన్ కోన్వయం దేశ స్సమృద్ధ వనశోభితః ।
శ్రోతు మిచ్ఛామి భద్రం తే వక్తుమర్హసి తత్త్వతః ॥

నిఖిల ఋషి మధ్యమున,తద్దేశ కథను విశ్వామిత్రుడు చెప్పనారంభించెను వాల్మీకమున నీకథ యెనుబది శ్లోకములలో వర్ణింపబడినది. రసోల్బణానుపమముగా, నాన్యతోదర్శనీయముగా నలుబది యారు పద్యగద్యములలోఁ గల్పవృక్షకారుడీ కథను జెప్పెను. విశ్వామిత్రుని జన్మకథ కూడ వర్ణింపబడినది విశ్వామిత్రుని మాతృదేశ గౌరవమెంతదో నిరూపితమైనది. దేశభక్తి యనగాఁదాను జన్మించిన దేశముయొక్క పురాణ సంస్కృతి యందభిమానము గల్గియుండుట, ఆ దేశము నందలి యల్పిష్టమైనవిషయము మొదలు అత్యుత్కృష్టమైన విషయము వరకు సమస్తమును భావించి పులకరించుట, ఆదేశపు గాలులు, ఆదేశపు నీరు, వీనిపై గాఢానురాగమును గల్గి యుండుట- యీ మొదలయిన లక్షణములు దేశ

భక్తిగల వానియందు నిత్య జాగ్రతములై యుండును ఇది యెందుకుఁ జెప్పవలసి వచ్చెననఁగా విశ్వామిత్రుఁడు తన జన్మవృత్తాంతమును జెప్పుచుఁ దన మాతృదేశభక్తినిఁ బ్రకటించుకొన్నాఁడు. అమూలకమైన యిట్టి కథనము చేతఁ గవి యాత్మీయతను గుర్తింపవచ్చును విశ్వనాథ యుదంచత్ దేశభక్తిదీక్షాపరుఁడనుట నిర్వివాదమైన విషయము

కం॥ ఇది యీ దేశపుఁ గథన
మ్మిదియును నాజన్మకథన మీ వడుగుటచే
నిది చెప్పకుండ నాఁగక
వదలితి సర్వంబుఁ ద్వత్కృపాశ్రోతృతకై

అని విశ్వామిత్రుఁడు శ్రీరామ చంద్రునితోఁ బలికెను. ఈ కథ యందనేక "సూక్ష్మతరకథాంశములున్నవి" "లో నారసిమే" అన వలసిన యంశములున్నవి "అలఘువు" అయిన విశ్వనాథ "కథాకథన దశదశి ముఖీసనయనుఁడై" కథను ప్రారంభించిన తీరు ఆశ్చర్యకరముగా నున్నది.

శ్లో॥ "బ్రహ్మయోనిర్మహా నాసీత్కుశో నామ మహాతపాః
అక్లిష్ట వ్రత ధర్మజ్ఞః సజ్జన ప్రతిపూజకః"
బాలకాండ 33సర్గ 1వశ్లో.

బ్రహ్మ పుత్రుఁడైన కుశుఁడున్నాడు, అతఁడు ధర్మజ్ఞుడు......... ఇత్యాది. ఈ విధముగాఁ బ్రారంభింపఁబడిన కథను విశ్వనాథ తనదైన ప్రతిభచేత నొక నూతనమార్గమున నడిపెను. అసలీకథ చాలచిన్నది. ఒక రాజున్నాఁడు ఆయన పేరు కుశనాభుఁడు. ఆయనకు వందిమంది కుమార్తెలు వారిని వాయువు ప్రేమించి విఫలుఁడై వారిని మరుగుజ్జులను జేసెను. బ్రహ్మదత్తుఁడను రాజు ఆ కన్యలను బెండ్లాడెను వారందఱు గత్తెలయిరి. కుశుని వరమున కౌశికుఁడు పుట్టెను కౌశికున కొక యక్క గారున్నది ఆమె నదియై పాఱుచున్నది ఇది కథ

ఉ॥ తీరికయైన యీ వసుమతీపతి యౌన వసుక్షితీశ్వరుం
గీరమణీయముల్ గిరులు నీ సుమనోహరముల్ వనీతతుల్
శ్రీ రఘురామ! యైదగు గిరీంద్రములంబడి వేళ్లు ప్రాఁగెనాన్
బాఱెడు మాగధీనదియుఁ బాయలు పాయలుగాగ నిచ్చటన్

ఉ॥ నా పినతాత యావసువు నాయన! నేనిటఁ జిన్ననాఁడు క్రీ
డా పరమాత్ముఁడై మెలుటన్ బ్రతియంగుళమైన భూమి సం
ధాసరిదీప్తమై పరచితంబగు నా కిట, నిందు గాలులున్
నాపయి నల్లనాఁడు కిరుణామయముల్ మృదువాస్నిపీమముల్.

గిరులు, నదులు, వనముల యొక్క ప్రశంస వాల్మీకిమునందున్నది గాలులయొక్క వర్ణన వాల్మీకిమునందులేదు రెండవ పద్యమునందు వర్ణితమైన గాలుల ప్రసంగము వలన తొలి పద్యమునందలి నదీవర్ణనకుఁ గథాకథన సౌందర్య మేర్పడినది కుశనాభుని కథయందుఁ బ్రధాన పాత్రలలవోకగాఁ బరిచయము చేయబడినవి. నదీవర్ణన చేత విశ్వామిత్రుని యక్కగారయిన కౌశికీనదియు, గాలుల యొక్క వర్ణనచేత కుశనాభుని కూఁతుంద్రను మరుగుజ్జులను గావించిన వాయువును సూచింపఁబడిరి. నదీ వాయువులను సామాన్యముగా వర్ణించినట్లు వర్ణించి యసలు కథనే యారంభించుట యొక శిల్పము

కుశుఁడు మహాతపస్వి ఆయన భార్య వైదర్భి ఆయనకు నలుగురు కుమారులు—"కుశాంబుఁడు, కుశనాభుఁడు, నధూర్తరజసుఁడు, వసువు నను నలువురు సుగుణోల్బణులు పుత్రులు కలిగిరి." వీరి తండ్రియగు కుశుఁడు తన కుమారులను బిలిచి "నిర్మల ధర్మంబును సౌఖ్యపాలనముగా మన్నించుఁడీ ధాత్రి" నని యాదేశించెను కుశాంబుఁడు కౌశాంబీ నగరమును, కుశనాఁభుడు మహోదయమును, అధూర్తరజసుఁడు ధర్మారణ్యమును, వసువు గిరివ్రజపురమును నిర్మించిరి వీరిలోఁ గుశనాభుఁడు—

"ఘృతాచియను నప్సరసయందు రూపవతుల. స్వలంకృతల యౌవనవతులఁ గన్యాశతంబు నావిర్భవింపఁజేసిన"......వాఁడయినాఁడు కుశనా

ఘుఁడు రాజర్షి ఘృతాచి యప్సరస వారికి నూర్గురు కుమార్తెలు గుణ మునఁ దండ్రిని, అందమున దల్లిని బోలినవారు ఘృతాచి దేవకాంత ఈమె నిత్య స్థిరనివాస మాకాశము ఈమె శరీరము తేజోమయమై మెఱసి పోవుచుండును. ఆమెయిపుడు భూమి మీఁదఁ గాపురము చేయుచున్నది అప్సరసలందఱు సమష్టిగా విహరించినట్లే ఘృతాచి కూఁతుండ్రు నంద మందియుఁ గలిసియే తిరుగుదురు వారి యందమున హెచ్చు తగ్గులు లేవు వారందఱు "రూపవతులు, స్వలంకృతలు, యౌవనవతులు" కుశనాభుఁడు కూడ వారి నందఱను ఒక్క రీతిగానే పెంచెను ఆ కన్యాశతము విహారా ర్థము క్రీడావనము వెళ్లిరి అప్పటి వారి యందమును గల్పవృక్షకారుఁ డిట్లు వర్ణించెను ఈ పద్యము యొక్క యన్వయ వైలక్షణ్యము తెలిసిన గాని యిందలి శిల్పము తెలియదు

గీ॥ నూఱు తెలినీటి పడియలు, నూఱు మెఱపు
లొక్క మొగి మిన్ను మన్నున నొరసె ననఁగ
నగలతో నృత్య వాద్య గానములతోడఁ
బోయి రుద్యానమునఁ గ్రీడపొంతెవారు......"

నూఱు తెలినీటి పడియలు (చెరువులు), నూఱు మెఱపులు మిన్నున మన్నున నుండుటయేమి? చెరువులాకాశము నందుండునా? మెఱపులు భూమిపై నుండునా? విమర్శకమ్మన్యుల మాట యట్లుంచి కావ్యమర్మజ్ఞుల కీ పద్యము పరమశిల్పాభిరామమైనది మహాకవులు తాము చేయుచున్న రచనలోఁ బరమమైన రహస్యములను సూక్ష్మముగా నెచ్చటనో నిక్షిప్తము చేయుదురు భావుకులు గుర్తింతురు నూఱు మెఱపులు భూమిపైనుండునా? ఉండును ఈ కథయందుండును. ఎట్లుండును? ఘృతాచి యప్సరస కదా! ఆమె మిన్నున మెఱపువంటిది ఆకాశవీథియం దప్సరలు తిరుగుదురు మెఱపులవలె వెల్గిపోవుదురు. అందు ఘృతాచి యెట్టిది? "ఘృతవత్ పురుషం దృష్ట్వా ద్రవతి సతీ అంచతీతి ఘృతాచీ" అనిగాని, "ఘృతవత్ పురుషం కృత్వాంచతీతివా అప్సరసః" అని గాని యర్థము ఆకాశమునందలి మెఱపువంటిదైన ఘృతాచి భూమిమీఁద కుశ నాభునితో సంసారము చేయుచు మరలఁదాను నూఱు మెఱపుల వంటి

కన్యలను బ్రహ్మకవించినది ఈ మెఱపుల యందము నిశ్చలమయినది కావుననే "నూఱు మెఱపులు మన్నున నొరసె" నని చెప్పుటలోని రమ్యమైన శిల్పము "నూరు తెలినీటి పడియలు" ఆకాశము నందెట్లుండును? అప్సరసల శరీర ములు రక్తమాంస నిర్మితములుగావు "ఆప్యతైజస వాయవ్యాణి లోకాంతరే శరీరాణి" - అప్సరసల దేహములు జల, తేజో, వాయు సంబంధము లయిన కాంతిచే నిర్మితములయి యుండును "నూఱు తెలినీటి పడియ" లనఁగా స్వచ్ఛమయిన నీటియొక్క లక్షణము (అప్ =నీరు) కన్యాశతము నందుండి, వారి యందమును వ్యంగ్య మర్యాదా విలసితముగా జెప్పు చున్నది హెచ్చుతగ్గులులేని సౌందర్య రాసులయిన యీకన్యకలను సమ దృష్టితోఁ బెంచుటయేగాక వారినందఱను ఒకనికే యిచ్చి పెండ్లి చేయ నిశ్చయించెను ఈనిశ్చయమును గుణనాథుఁడు వాచ్యము చేయఁడు. ఆరాజు నూహను మంత్రులు తెలుసుకొందురు తెలిసికొన్నామని చెప్పరు; చేయు దురు ఈ రహస్యములను గల్పవృక్షకారుఁ డిట్లు శిల్పాభిరామ కథనము ద్వారా వ్యంగ్యము చేయును.

గీ॥ మంత్రులంగాంచి నాదు కుమార్తెలకును
బేరి సంబంధమును జూచి పెట్టుఁడనిన
వారు కాంపిల్య పతియైన బ్రహ్మదత్తు
పేరు చెప్పి తన్మహిమలు పేరుకొంచు......

రాజేమి యడిగెను? తనకుమార్తెలకు(బహువచనము) సంబంధమును జూడుమని యడిగెను (ఏకవచనము, సంబంధము) మంత్రులేమి చేసిరి? కాంపిల్య పతియగు బ్రహ్మదత్తునిఁబెండ్లికొడుకుగాఁ దెచ్చిరి. వందమంది కుమార్తెల కొక్కఁడేమి పెండ్లికొడుకు గాఁగలడని రాజనఁడు పైగా తన కూఁతుల నందఱిని వానికిచ్చి పెండ్లిచేసెను.

చిన్న పద్యము నందేమియు లేదని యన్నట్లుండి యింత నిపులా ర్థము పుట్టుచున్నది. ఈ దృశమైన కథాకథనవైఖరి నన్నయగారి యందు న్నది. నన్నయ్య పెట్టినాఁడు గదా తిక్కనాదులకు భిక్ష. "నన్నయ్యయు

దిక్కన్నయు నన్ను(విశ్వనాథను)ఆవేశించిరి" ఈ తేటగీతియందు మరియు కథా శిల్ప రహస్యమున్నది అది మీద వివరింపబడును

కన్యాశతము కేళీవిలాసముగా నుద్యానవనమునకు వెళ్లెను. ఇచ్చట నొక పద్యమున్నది,

శా॥ ఆలీలావని కేళివీచి యనిలుండా స్నిగ్ధ లావణ్యశో
భా లాక్షాపద లోభనీయ తనులన్ బ్రాదుర్భవద్యౌవన
జ్వాలా దీప శిఖాభిరామతనులన్ బర్వేందు బింబాననా
లోల శ్రీరుచి తోరణాచ్ఛ తనులన్ లోనూరి లో
నూరుచున్....

వాయువు చూచిన కన్యాశతము యొక్క యందమీ పద్యమునందు వర్ణితము మరల నిదేపద్యము వేరొకచోట వ్రాయబడినది బ్రహ్మ దత్తుఁడు, కన్యకలను చాకఁగా వారు పోయిన యందమును దెచ్చుకొనిరి. పూర్వమెంత యంద గత్తియలో నేఁడును అంతే యిందగత్తియలు. వాస్సి యేమియు లేదని ధ్వనింపఁజేయుటకై యిదేపద్యము తిరిగి వ్రాయఁబడుట లోని శిల్పరహస్యము.

కుశనాభుని కథ ప్రారంభించిన విశ్వామిత్రుఁడు తనపై వీచిన గాలు లను రమ్యముగా వర్ణించి గాలియొక్క పాత్రప్రవేశమును గావించెనని చెప్పితిని. ఆ వాయువు కేళివనమునఁ దిరుగుచున్న కన్యకలను జూచిప్రేమిం చెను.

ఉ॥ జాలిగఁగాంచి కాంచి యెద జాలిసొదంబడి డింది డింది కాం
తాలినిఁజూచి కోరెదనె యంగన లందఱు మిమ్ము నాంధ్రుగా
నోలిని వందమంది యగుఁ డొప్పుగ నాకన వారు చప్పటుల్
గాలలిగాఁ గిలాకిలలుగాఁ బెనునవ్వుల చిల్కరింపుగా...చేసిరి.

వాయువు నందు టీవిలేదు, దర్పములేదు. జాలియున్నది, ప్రార్థనా ధీనమయిన లక్షణమున్నది వాయువుయొక్క యీ చేష్టలు కన్యలకు నచ్చ

లేదు చులకనగాఁ జూచిరి వాయువు వారిని బ్రతిమలాడెను "కోరెదనె ముంగిన నందఱ మిమ్ము నాండ్రుగా" నని యాచించెను కన్యక లేమిచేసిరి? చప్పటుల్ గా లలిగాఁ గిలాకిలలుగా చప్పటుల్" చేసిరి ఈపదముల యొక్క పోహళింపు, 'ల' కారము యొక్క తిరిగి తిరిగి ప్రయోగింపఁబడుట—గాలి యందుఁ గన్యకలు చేయు చులకనను వ్యంగ్యము చేయుచున్నవి గాలి యొక్క చాంచల్యమును సూచించుచున్నవి

కల్పవృక్షమునకు, వాల్మీకమునకుఁ గించిద్భేదమిచ్చట నున్నది కన్యాశతము వాయువుపై నాగ్రహించినట్లు వాల్మీకము కన్యాశతము వాయువును బరిహాసము పట్టించినట్లు కల్పవృక్షము

శ్లో॥ మా భూత్సకాలో దుర్మేధః పితరం సత్యవాదినమ్-
నావమన్యస్వ ధర్మేణ స్వయంవర ముపాస్మహే...

వాల్మీకి - బాలకాండ

కల్పవృక్షమున—కన్యల మాటలిట్లున్నవి.

శా॥ తాతాయంచు నొకర్తు నొర్తు మొగమందంబెల్ల నొయ్యారమై
నీ తాత్పర్యము వంద చాలుదుమె? కాని చాలమేమో...

కల్పవృక్షము—అహల్యాఖండము

కన్యకలు వాయువును పరిహసించిరి గాని ధర్మాతిక్రమణము చేయ లేదు

చం॥ అడుగుము పోయి మాదు పిత నాయన యిచ్చెన యేని నీకహో
యుడుగర లౌదు......... మని వాయువునకుఁ గన్యలు

చెప్పిరి సమ పెండ్లి బాధ్యతను దండ్రిపైఁ బెట్టుట యుచితమే కదా! కాముకుఁడైన వాయువునకు కోపమువచ్చెను ఇది లోకముయొక్క లక్షణము కామముచేతఁ గోపము రగ్గి యా కోపము సర్వనాశనకారి యగును. వాయువు కామపీడితుఁడు తత్కామ వ్యాపార విఫల ప్రయత్న జనిత క్రోధ పరవశుఁడు ఆ వాయు వేమిచేసెను? కుశనాథుని యనుగు లేగు కన్యకలపై విరుచుకు పడెను.

చం॥ .. ... ... ... ... ప్రభంజనుం
డిడియఁగఁ జేసె తత్తనువులెల్లను గోపనుఁడై కుదించి వా
రడలుచుఁదండ్రియిల్లు జని సాస్ర విలోచనలౌచు సత్రపల్"

ఇచ్చటనుండి ప్రభంజన, తనూ శబ్దములచేత సర్వకథయు నడచుచున్నది ఈ కథయందంతట కుశనాభుని కూఁతుంర్డ శరీరమును వర్ణించు నన్నివేశములందెల్ల తనూశబ్దమే ప్రయోగింపఁబడి విశ్వనాథ జ్ఞానశిల్పి యయ్యెను శరీరము, దేహమునంటి శబ్దములు విడిచి తనూ శబ్దమునే స్వీకరించుట తెలిసినది. దంతి, ఇభము, హస్తి, అనేకపాది శబ్దములనువిడిచి గజ శబ్దమునే శాకుంతలమున కాళిదాసు ప్రయోగించుటలోని రహస్యము తెలిసిన వారికి - విశ్వనాథ పునః పునః ప్రయోగించిన తనూ శబ్దప్రయోగ రహస్యము తెలియును - "ప్రభంజనుం డిడియఁగఁజేసె" - ప్రభంజనుఁడనగా (భంజు అవమర్దనే) విరుగగొట్టువాఁడు గాలియని యర్థము తత్కాల గత వాయువునందలి తైక్ష్ణ్యమునకుఁ ప్రభంజన శబ్దము వ్యంజకము - ఈవాయువు, ఆ కన్యల తనువులను గుదించివేయఁగా వారు మరుగుజ్జులయిరి

లీలా వనమునఁ దిరుగుచున్న యీ కన్యకలను వర్ణించుచు— "లోభనీయ తనులన్, అభిరామ తనులన్; తోరణాచ్ఛ తనులన్" అనియు, తన కూతులకెట్లు పెండ్లిచేయవలయునో విచారించుచు కుశనాభుఁడు "తనూద్భవలన్" విడిచి వెళ్లి మంత్రులను గలసెననియు - బ్రహ్మదత్తుఁడు కన్యాశతమును బెండ్లియాడి వారిని స్వహస్తముచేఁదాకఁగా "రమణీ తనూలతలయందనిలుండు వికుంభితుండై" నాఁడనియు-సర్వస్థలముల యందును తనూ శబ్దము ప్రయోగింపఁబడినది అప్సరసలయొక్క శరీరనిర్మాణమును, వారివయిన గుణములను భాసింపఁజేయవలయును తనువనఁగా విస్తరించు స్వభావము గలది "తను విస్తారే" అప్సరసల దేహములు జల వాయువుల యొక్క తేజస్సు చేత వృద్ధినొందును గాని రక్తమాంసములచేఁ గాదు రక్త మాంసములచే విస్తరించిన శరీరమును ఖండ ఖండములుగా నరికివేయ వచ్చును తేజోమయ శరీరములను నరుకుటయెట్లు? వారియందలి తేజస్సు నుపసంహరించవలయును అట్లుచేసినచో విస్తరించిన వారి దేహములు

ముడుచుకొని పోవును. శరీరములు చిన్నవియై, వికార రూపములై, యందము గోల్పోయినవై కన్పించును విస్తరించుకొని లావణ్యము నొందిన వారి శరీరములను వాయు వీరీతిగాఁ గుదించివేసి తన కక్షఁదీర్చుకొనెను ఇట్లు "తనూ" బద్దమును బ్రయోగించి యప్సరసల శరీర నిర్మాణ వైఖరులను గల్పవృక్ష కారుఁడు వ్యాఖ్యానించినాఁడు కుదించుకొని పోయిన కన్యలను బ్రహ్మదత్తుఁడు కరస్పర్శచేయఁగానే వారి శరీరములయందు గాలి ప్రవేశించినది వారి శరీరములు యథాపూర్వము విస్తరించుకొన్నవి. ఈ రహస్యమును బాఠకుఁడు సావధానుఁడై గ్రహింపవలయును పెండ్లియయిన కన్యలను వర్ణించుచు నొక పద్యము వ్రాయఁబడినది

శా॥ ఆ లీలావతులున్ మనోజ్ఞ తనులై యాస్నిగ్ధలావణ్యశో
భాలాభా పద శోభనీయ తనులై ప్రాదుర్భవద్యావన
జ్వాలాదీప శిఖాభి రామ తనులై పర్వేందు బింబాననా
లోల (శ్రీ) రుచితోరణాచ్ఛ తనులై లోలాక్షులై యొప్పగన్.

తిరిగి యదే పద్యము వ్రాయబడుట, తిరిగి తిరిగి తనూ శబ్దమే ప్రయోగింపఁబడుటలోని శిల్పమింతయున్నది—

మరుగుజ్జులయిన కన్యలనుజూచి కుశనాభుఁడు, క్రుధాపరవశుఁడై నాఁడు తన కూఁతులు వాయువును శపింపగలరు కాని శపింపలేదు తన కూఁతులయొక్క క్షమా గుణమును బ్రశంసించినాఁడు

కం॥ క్షమ తల్లులార క్షమయే,
క్షమ యెంతటిదందు? క్షమయె జన్నము యశమున్
క్షమ సత్యంబును దానము
క్షమచే నా విష్టమగు జగంబఖిలంబున్

ఇది నానారుచిరార్థ సూక్తి నిధి యగు నన్నయ్యగారినిఁ దలపింపఁజేయు సూక్తినిర్మాణ కౌశలము.

తన కూఁతులను బెండ్లాడుటకెవఁడు ముందుకు రాఁగలడు? పోయిన యందము తిరిగి వచ్చునా? రాజునకు వేదన పట్టినది "తనూద్భవలన్ విడి" కుశనాభుఁడు మంత్రులతోఁబలికెను ఆమంత్రులు నిశితబుద్ధికలవారు

"నాదు కుమార్తెలకును, బేర సంబంధమును జూచి పెట్టుఁ"డనఁగా వారుసంబంధముతోఁబాటు కన్యలకుఁ దిరిగియందమును బ్రసాదించువానిని తెచ్చినారన్నది వ్యంగ్యము మంత్రులు బ్రహ్మదత్తుని సంబంధమును జెప్పి యూరకొనలేదు - "తన్మహిమలు" పేరు కొనిరి రాజు సంతృప్తి నొందెను

ఉ॥ పేరిమి బ్రహ్మదత్తుఁ బిలిపించి సుతాశతమిచ్చె రాజు, దాఁ
బేరిమి బ్రహ్మదత్తుఁడును బెండిలియాడెను వారినెల్లనా
ధారణినేత హస్తమున దాకినఁ దన్మహిమ ప్రతారితుం
డై రమణీతనూలతల యందనిలుండువికుంభితుండుగా

బ్రహ్మదత్తుని మహిమ యిట్టిది తన మహిమచేత కుశనాభుని కూతుంద్రందఱు సందగత్తెలైరి ఈ బ్రహ్మదత్తుఁడెవఁడు? మంత్రులకెట్లు తెలిసినాఁడు? సోమదయను నప్సరసకు బ్రహ్మదత్తుఁడు కుమారుఁడు

బ్రహ్మదత్తునకీ మహిమ యున్నట్లు వాల్మీకమున లేదు.

శ్లో॥ స రాజా సౌమదేయస్తు పురేమధ్య మవసత్తదా।
కాంపిల్యాం పరయా లక్ష్మ్యా దేవరాజో యథాదివమ్..."

ఇట్లు బ్రహ్మదత్తునిపరిపాలనాసామర్థ్యమునే వాల్మీకము వర్ణించినది కల్పవృక్షమున "తన్మహిమలు" వర్ణింపఁబడినవి

కల్పవృక్షము వాల్మీకమునకు భాష్యముకదా! ఇట్లే యుండును నదీవాయువులను భావకవిత్వముగా వర్ణించుట, తనూ శబ్దమును దిరిగి తిరిగి వాఁడుట, "తన్మహిమలు" పేర్కొనుట,—ఇట్లు చిన్నకథ యందెంతయో కథాకథన శిల్పము బ్రదర్శించి తన రామాయణమును విశ్వనాథ శిల్ప వృక్షముగాఁ జేసెను.

అహల్యా కథయున్నది. వాల్మీకి రామాయణములో నింద్రుఁడు మేషాండములు ధరించిన కథయున్నది అది వైదికమైన కథ కల్పవృక్షకవి యాకథను తీసివేసి లోకమునకు ధర్మోపదేశము చేయుటకై యింద్రుఁడు సహస్రాక్షుఁడయినట్లు వ్రాసెను. ఈకవి లోకజ్ఞుఁడు, ఈయన ధర్మమును జెప్పుటలోని చమత్కారములు ఎంతయుఁ గ్రొత్తగా నుండును కల్పవృక్షకారుడు అహల్యా కథను వ్రాసిన తీరువేఱు అహల్యా కృత రామస్తోత్రమున్నది దాని కదియే సాటి యనవలయును అహల్య ఱాయియయినదో, ఱప్పయయినదో! రాముని కాలుసగిలి ఱాయి స్త్రీయయినదని పూర్వకవులు వ్రాయఁగా, రామునిమీఁదిగాలి, రాముని కాలి సవ్వడి, రాముని శరీరదర్శనము మొదలయినవి జరుగగానే యహల్య యందుఁ గ్రమ క్రమముఁగా బంచేంద్రియములు మేల్కొనినట్లు కల్పవృక్షకారుఁడు వ్రాసెను ఇది యాశ్చర్యమని చెప్పవలయును పూర్వకవు లెవరు నిట్లుచేయలేదు అహల్యను రాముఁడు తన తల్లియగు కౌసల్యను వలె గారవించుట, ఆ యహల్యా ప్రేమ, తన కుమారుడయిన శతానందుఁడు జనకుని యాస్థానమునందున్నాఁడని యహల్య చెప్పుట — యివి యన్నియుఁ గల్పవృక్షము నందు మాత్రమే కన్పించు విషయములు

మిథిలానగరపుఁ బొలిమేరలకు రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁడు వచ్చెను. అట గౌతముని యాశ్రమమును జూచి రాముఁడు—

శ్లో॥ మిథిలోపవనే శూన్యమాశ్రమం దృశ్య రాఘవః
పురాణం నిర్జనం రమ్యం పప్రచ్ఛ మునిపుంగవమ్...

శ్లో॥ శ్రోతు మిచ్ఛామి భగవన్ కస్యాయం పూర్వ ఆశ్రమః
తచ్ఛ్రుత్వా రాఘవేణోక్తం వాక్యం వాక్యవిశారదః...

బాలకాండ - సర్గ 48

కథను బెంచుట, కుదించుట, వ్యాఖ్యాన ప్రాయముగాఁ జెప్పుట — యివి యన్నియుఁ గథకుని సమర్థతను బట్టియుండును కల్పవృక్షమునందలి యహల్య కథ 'వాల్మీకమునకు వ్యాఖ్యాన సదృశమైనది మిథిలా రాజ్య

ప్రాంతమునందలి గౌతముని యాశ్రమ వర్ణన తొలి శ్లోకము నందున్నది ఆ శ్లోకమునకుఁ గల్పవృక్ష గతాహల్యాకథ వ్యాఖ్యానము

విశ్వామిత్రునితో నున్న రాముఁడు చూచిన యాశ్రమము — "శూన్యము, పురాణము, నిర్జనము, రమ్యము" నై యున్నదని వాల్మీకము శూన్యమైన యాశ్రమము యొక్క ప్రాచీనతను జెప్పుటకు "పురాణ" మన వచ్చును ఆ యాశ్రమమునందు జనులు లేరుగావున "నిర్జన" మనియు నన వచ్చును పురాణము, నిర్జనము, శూన్యము నైనయాశ్రమమును "రమ్య" మని వాల్మీకి యనుచున్నాఁడేమి? ఇందుకు సమాధానము కల్పవృక్షము నందు మాత్రమే గోచరించును

నిర్జనము, శూన్యమునైన యాశ్రమము - పురాణము, రమ్యమునై యుండుటయే విశేషము-పురాణమనఁగానేమి? వాచస్పత్యము సందిట్లున్నది "పురానీయతే ఇతి పురాణమ్" అని. యాస్కుని నిరుక్తమునందు— "పురా నవం భవతి పురాణమ్" అని, "పురాతనస్య కల్పస్య పురాణాని విదుర్బుధాః॥ అని మత్స్యపురాణము-పురాణశబ్దము యొక్క యర్థమును వ్యాఖ్యానించుచున్నవి మరియుఁబురాణము పంచ లక్షణ లక్షితము సృష్టి ప్రతిసృష్టి, మన్వంతరముల చరిత్రలకుఁ బురాణమున చోటులున్నవి ఈవిష యములేల చెప్పఁబడవలసి వచ్చెననఁగా శ్రీమద్రామాయణ గాథ కొన్ని మన్వంతరములకుఁ బూర్వము జరిగియున్నది మరల నీ త్రేతాయుగము నందు జరుగుచున్నది ఆపురాతన కల్పమున నహల్య, గౌతముఁడు, నంద ఱున్నారు తాను వచ్చెను ఆ యీ విషయములు రామునికిఁ దెలియును; తెలియవు రాముఁడు మానుషమానుష విగ్రహుఁడు తన యీనాటి రాక చేత నీ పురాణాశ్రమము మరల రమ్యము కాఁగలదన్న యూహ రాముని యాత్మలో నస్పష్టముగాఁ బయలుదేరినది. రాముని దృష్టి కాయాశ్రమ సీమ రమ్యమైనను సామాన్యుల దృష్టికా యాశ్రమము నిర్జనము, శూన్య ముగాఁ గన్పడును. గౌతముని యాశ్రమము నందలి రమ్యత రాముని మనస్సులో నొక పర్యుత్సుకతను గల్గించినది— వాల్మీకమున సూచితములైన యీ విషయములను గల్పవృక్షకారుఁడు వ్యాఖ్యానించిన తీరు "అనుత్తమ" మైనది.

జీర్ణించిన యాశ్రమము భ్రష్టయోగమువలె, రాముని ముఖము హరివదలి చన్న వైకుంఠమువలె నున్నది ఈ యుపమలు కథకు ప్రాణముపోసినవి భ్రష్టయోగము వంటి యాశ్రమమని వర్ణింపఁబడినది, భ్రష్టయోగమనఁగా శిథిలమైపోయిన అహల్యా గౌతముల సంగమము మరల వారికి సంయోగము జరుగవలయును తత్సంయోగ కారకుఁడు శ్రీరామచంద్రుడు ఆయన రావలయును ఆయన యెట్లువచ్చును? వైకుంఠమును వదలి రావలయును అహల్యకు రాముని ముఖదర్శనము చేసినంతనే వైకుంఠ దర్శనమైనది

అహల్యా గౌతములు భార్యాభర్తలు అహల్య తప్పుచేసినది. భర్తయైన గౌతముడా యహల్యను శపించెను ఇల్లాలులేని యింటి యందాయన యొంటరిగా నుండలేక- "ఆ ముని యేగె హిమాచలంబునన్..." అహల్య కథ మొదట నొక సీస పద్యమును, అహల్య కథ చివర నొక సీసపద్యమును కల్పవృక్షకారుఁడు వ్రాసెను మొదటి పద్యము ఆశ్రమము యొక్క శైథిల్యమును వర్ణించును చివరి పద్యము ఆశ్రమము యొక్క సౌభాగ్యస్థితిని వర్ణించును అహల్య లేని యాశ్రమమునకు అహల్యయున్న యాశ్రమమునకు గల భేదమీ పద్యము లందు వర్ణింపఁబడినది గృహస్థ జీవితమున నిల్లాలి ప్రాముఖ్యమింత గొప్పది సంసార జీవితము నందలి మాధుర్యము నింత యందముగా జెప్పి, రాముని కళ్యాణజీవితము యొక్క కథకు ప్రాతిపదిక కల్పింపఁబడినది ధనుఃకళ్యాణ ఖండములకు అహల్యాఖండము పూర్వరంగ మగుచున్నది

సీ॥ ఈ కావి కొనకేల యేగెనో తరుశాఖఁ
గాషాయమును బీలికలుగ వ్రేలు
నీ నీరు కొనకేల యేగె నొక్కొ కమండ
లువు నీరు పురికియై సవురుమాయు-
నీ తోలు కొనకేల యేగెనో కృష్ణ చ
ర్మము వానకెండకు మాఁగిపోవు
నీ మాల విడి యేల యేగెనో స్ఫటికముల్
ప్రీలి యట్టిట్టుల విరిసిపోవు...

అహల్య లేని యాశ్రమమిట్లుండగా, అహల్య యున్న యాశ్రమమిట్లున్నది—

సీ॥ నేత్రపర్వముగ నిండిన పూలచివురుల వృక్షశాఖలఁ గావు లెండు
చుండె
నట్టిదైవత గంగఁ బట్టితెచ్చిన కమండలువారి శుభ్రమై వెలుఁగు
చిమ్మె
నవనవలాడి కృష్ణమృగాజినంబంత యప్పుడేపఱచిన యట్లుతోఁచె
వృక్షశాఖలయందు వ్రేలాడు జపమాల స్ఫటికాచ్ఛ కాంతులు
చౌకళించె-

అహల్యా గౌతముల దాంపత్యజీవిత రామణీయకమును వర్ణించు సీ పద్యము సీతారాముల దాంపత్యజీవిత రామణీయకమునకు నాందివాచకము పల్కుచున్నట్లున్నది ప్రభావతీ ప్రద్యుమ్నమును దలపించు రచనా శిల్పమును విశ్వనాథ యీ కథ యందు జూపించెను—

గౌతముఁడు ఋషి విశ్వామిత్రుఁడు ఋషి. ఆ ఋషి కథను చెప్పుటలో విశ్వనాథ ఋషిత్వము ద్యోతకమగుచున్నది

శ్లో॥ స చేహ తప ఆతిష్ఠ దహల్యా సహితః పురా
వర్ష పూగా ననేకాంశ్చ రాజపుత్ర! మహాయశః॥
వాల్మీకము-బాలకాండ

(అహల్యను గూడి గౌతముడిందు బహుసంవత్సరములు తపముచేసెను)

ఉ॥ గౌతమమౌని సాధువు నఖండ తపస్వి, లతాంగితో నహ
ల్యాతరళాక్షితో నిచట నాశ్రమమై పటుధర్మమూర్తియై
ప్రీతుల నెల్లచో నదుపుపెట్టి హృషీకములన్ మలంచి ప్ర
స్ఫీత హృదగ్నియై తపముచేసెనయా బహువర్షపూగముల్

ఉ॥ అందపుఁగోన యామెయు నహల్యయు గౌతమ మౌనియున్ శతా
నందు...తపోనిధాను ముని నాధునిఁగాంచిరి ... ఈ రెండు పద్యములుపై వాల్మీకము నందలిశ్లోకము ననుసరించుచున్నవి అనుసరించుటలేదు. సాటి ఋషియనఁగా విశ్వామిత్రున కెంత యభిమానము! ఒకవంక ఋషి

త్వము- ఒకవంక కథాకథనము— "గౌతమ మౌని సాధువు, నఖండ తపస్వి...," "అతనికతఁడు మంచివాడే. వాని భార్యయే వానిని ముంచినది..." సానుభూతితో మాట్లాడిన తీగిట్లుండును అహల్య యెట్టిది? "లలితాంగితో, తరళాక్షితో" గౌతముని కాపురము— సాధువు, తపస్వియైన గౌతముని దారివేఱు లతవంటి దేహము, తరళములైన కన్నులతో కూడిన యహల్యదారివేఱు దేవేంద్రునితో సంయోగము చేయబోవు నహల్య యొక్క పాత్రను సమస్తమైన వ్యభిచారశీలకమైన లక్షణమును పై రెండు - లతాంగి తరళాక్షి పదములు సూచించుచున్నవి అహల్య శీలమంతయు ధ్వనించినది లతవంటి శరీరమునకు, తరళమైన కన్నులకు నైశ్చల్యమెట్లుండును? అహల్య యొక్క యీ తరళాక్షులే యింద్రునంతటి వానిని సహస్రాక్షుని జేసెను అహల్య భ్రష్టయోగిని యగుటకే లక్షణములుండదగునో యా లక్షణముల వర్ణనతోఁ గథ యారంభింపఁబడినది. ఏ కథాశిల్పము దానిది రెండవపద్యమున్నది మాతృమూర్తియయిన యహల్యను గూర్చిన వర్ణన. ఆమె యెట్టిది? ఆమెకొక కొడుకున్నాఁడు ఆయన పేరు శతానందుఁడు మంచివయస్సు నందున్నవాఁడు విదేహనరనాథుల యిండ్లలోఁ బురోధసుఁడు ఇంత పెద్ద వయసు వాఁడయిన శతానందుని తల్లి యెట్టిదై యుండవలయును? వయసు మళ్ళినదై యుండవలయును. కాని యామె వయసుతో బాటు నందముకూడ పెరుగుచున్నది కాలమెంత గడచుచున్నను ఆమె చూపరులకు "అందపుఁ గోనగా" కనపడుచున్నది ఈ యందమే యహల్య కొంపఁగూల్చినది ఇంద్రాహల్యల సంగమము జరిగినది ఈ పద్యము యొక్క యెత్తుగడయందు "అందపుఁగోన" యను మాటల నుంచి యహల్యాదేవేంద్రుల సంగమ కథకుఁ బాఠకుని మనస్సును సిద్ధము చేసిన కల్పవృక్షకారుని కథనమే కథనము

కథకుఁ బ్రాణభూతములైన మాటలను, గొన్నింటిని పద్యము యొక్క మొదట నిల్పుట, ప్రాసస్థానమున నిల్పుట, యతిలో నిబంధించుట- యిట్టిది విశ్వనాథ యొక్క కథాకథన శిల్పము నందలి యొక పద్ధతి మరియు ననేక పద్ధతులున్నవి ఒక్కొక్కచోఁ బదముల పునరుక్తిచేయును.

ఇంద్రునకు నహాల్యాసంగమ వాంఛయున్నది. అహల్య పరస్త్రీ. పైగా ఋషి పత్ని లోకాచార విరుద్ధమైన యింద్రుని యీ యకార్యమును కల్పవృక్షకారుఁడు చెప్పుట కవలంబించిన పద్ధతి యిట్లున్నది

మ॥ ఒక సిద్ధింబడి వేలు వర్షములుగా నున్నన్ దపోమూర్తియై
యకటా గౌతముఁడట్టివేళను నహల్యాబుద్ధియై యింద్రుఁడా
యకతోఁ గేళిని దీర్ఘకాలముగ మోహాగ్రస్తుఁడై కోరుచున్...
ఉన్నాఁడు.

"ఇంద్రుఁడు అకతోఁ" గేళిని కోరెను. అక శబ్దము ప్రాసస్థాని నిబద్ధము. అక, అక్క శబ్దములు రూపాంతరములు సోదరి యనియర్థము. ఇంద్రుడు సోదరీసంగమ మహాపాప పంకమలినీకృత దేహయష్టికాఁగోరుచున్నాఁడని యిందు ధ్వనించుచున్న యర్థము

గీ॥ ముని తపము సందుఁగని పెట్టి మునియవోలె
వేషమును గట్టి యాశ్రమ వీథికేగి
యోసి యోసి యహల్య యిట్లొక్కసారి
రావె.........అని యింద్రుఁడహల్యను బిలిచెను.

వేషమున గౌతముఁడు కాఁగల్గెను గాని గౌతముని మాట తీరు ఇంద్రునకురాలేదు జారుఁడు పల్కినట్లే యున్నది అహల్యకు, నింద్రుని వేషము, మాటతీరు తెలిసినది అనియందహల్యకు వ్యామోహమున్నదని యింద్రునకుఁ దెలియును

ఇంద్రుడహల్యనుబిలిచి—
కాముకులకు ఋతువగుటయుఁ
గామి యగుటకలదె యోసి కామిని యన్నన్
బో!ముని చూచిన నీకును
స్వామీ నాకును మఱింత ప్రాణాంతకమౌ.

ఓసి కామిని! యని సంబోధన, సాభిప్రాయమైనది ఋతుకాలము రాలేదన్న వ్యాజమున తాత్కాలికముగా నింద్రుని నాపదలంచిన యహల్యతో నింద్రుడనుచున్నాడు— "కాముకులకు ఋతువగుట, కాకుండుట యనునది యెందుకు? నీవు కామినివి నేనును గాముకుడను"

"ఋతువగుటయుఁ గామి యగుట కలదె యోసి కామిని!" కామి యనఁగా కాకుండుట యని యర్థము ఇది తెలుఁగుమాట వ్యతిరేకార్థమున ప్రయోగింపఁబడినది "అగు" అను క్రియకు వ్యతిరేకమైనది "కామి" ఇట్టిదే 'వచ్చు' అను క్రియకు 'రామి' యనునది వ్యతిరేక రూపము. ఈ యర్థము నిట్లుంచి యహల్యా దేవేంద్రుల యందలి వ్యామోహము నందలి సామ్యమును జెప్పుటకై, పైఁబ్రయోగింపఁబడిన "కామి" యను మాటను చమత్కరింప నగును "కామియగుట..." యనఁగా నేను కామము గలవాఁడనగుటచేత,... "ఓసి కామిని".. నీవును కామముగల దాన వగుటచేత,... మనయిరువురికి సరిపోయినదియని యింద్రుఁడు పల్కినాఁడన వచ్చును ఇంద్రుఁడు చేయదలఁచిన దెంత యనాచారమో, అహల్యచేయఁదలచినదియు నంతే యనాచారము కామి (పులింగము) కామిని (స్త్రీలింగము). తన రూపము దాల్చి వచ్చిన యింద్రుని గౌతముఁడాగ్రహం పడెను . హాస్యాస్పదుఁడవుగమ్మనియింద్రుని శపించెను అహల్యను శపించెను. ఆమెలోని మోహము నశించునట్లుగా-శ్రీరామచంద్రుఁడు వచ్చునప్పటికి శాపమోచనమగునట్లుగాఁగట్టడిచేసెను "అద్భుతంపుక్రియ నైశ్చల్యంబు" పొందినది

శ్రీరామ చంద్రుఁడు వచ్చెను గాధేయుని వెంటనచ్చెను అహల్య చేసిన కర్మపరిపక్వమై

సీ॥ "ప్రభు మేని పై గాలి పైవచ్చినంతనే పాషాణ మొకటికి స్పర్శవచ్చె-
ప్రభుకాలి సవ్వడి ప్రాంతమై నంతనే శిలకొక్కదానికిఁ జెవులువచ్చె-

ప్రభుమేని నెత్తావి పరిమళించిన తోన యశ్మంబు ఘ్రాణేంద్రి
యంబుఁ జెందె-

ప్రభునీల రత్నతోరణ మంజులాంగంబు గనవచ్చి యూతికిఁ
గనులు గలిగె-

శ్రీరామచంద్రుండు అహల్యా పాదాభివందనం బాచరించెను కుమారుని రాకవల్లి కెంతయానందము! అహల్యాకృతరామస్తోత్రమున్నది. ఆశ్చర్యము, నద్భుతమునైన యీస్తోత్రము ఏడుసీసపదములయందుఁ జేయఁబడినది ఏడుపద్యముల యందే చేయబడుటయేమి? స్తోత్రమంతయు వివిధమైన పద్యములలో వ్రాయఁబడినచో నీప్రశ్న యుదయింపదు. సీసము అను ఒకేఛందము నందు ఏడు పదములు వ్రాయబడుటచేతఁ గల్పవృక్షకారుఁడు ఏడు అను సంఖ్యను ఉద్దేశపూర్వకముగా నిబంధించి నాఁడన వలయును ఆ సప్తసంఖ్యా ప్రయోజనమేమి? రామాయణమునకు సప్తసంఖ్యకు సంబంధమున్నది. రామాయణము సాంఖ్య శాస్త్రము రామునిది యేఁడవ యవతారము రాముని జన్మతార పునర్వసువు నేడవది ఈ రహస్యము లహల్యకుఁదెలియును. తెలియునని యెట్లు తెలియుచున్నదనఁగా నామె రాముని ఆశీర్వదించినది.

గీ॥ రామ! రఘురామ! దశరధరామ! యో య
యోధ్యరామ! జానకీ రామ! యోయి తండ్రి!
అసుర సంహార రామ! పట్టాభిరామ!...
యనుచు నీరాజనం బొసంగిన దహల్య.

నిర్మలినాంతఃకరణ ప్రవృత్తిగల్గి రామావతార రహస్యతత్వము నెరింగిన యహల్య రామునికి మాతృస్థానమున నిల్చి 'జానకీరామ' యని యాశీర్వదించి నన్నదైన వాక్కుయొక్క పావిత్ర్యమును నిరూపించినది. ఏడుసంఖ్యకును జానికిరామ యను సంబుద్ధికిసి గల యంతరార్థమిది.

ఇట్లు కల్ప వృక్షము నందలి ప్రతికథయందు విశ్వనాథ తన యనుభవమును, తనక్రొత్తపద్ధతిని, పద్యరచనాశిల్పమును రకరకములుగాఁ జూపుచుండును

యజ్ఞవేళ జనకుడును, జటాయువును వచ్చినట్లు కల్పవృక్ష కారుఁడు తెలిపెను వీరిరువురును వచ్చినట్లు వాల్మీకమున లేదు ఇది యీాయన కల్పన యజ్ఞము జరుగుచున్నది. యజ్ఞము యొక్క భిన్నాంగ ములను, హోమములను అనేకములను విశ్వనాథ వర్ణించెను ఈకవి వేదాధ్య యనపరుఁడు వేదమును చదివినవాఁడు వేదములోని పలురహస్య ములు తెలిసి ప్రాచేతసుని వలన వేదము రామాయణాకృతిగా వచ్చిన దన్న మాటను క్రొత్తగా వ్యాఖ్యానము చేయును

అగ్నిహోత్రునిలో నుండి ప్రజాపతి యుద్భవిల్లి రాజునకుఁ బాయస మిచ్చెను- ఆ పాయసమున భగవంతుఁడు ప్రవేశించెను అప్పుడు జనుల కనులు మూఁత పడెను. ఇది కల్పవృక్షములోని కమనీయకల్పన ఆ విష్ణువు పాయసమున బ్రవేశించునప్పుడు రెండు సీసపద్యములు వ్రాయఁబడెను మొదటిది నారాయణమూర్తి వర్ణన రెండవది రాముఁడుగా జన్మించి యాయన చేయబోవు కార్యముల సూచన ఇవి వాల్మీకములో లేవు, ఈయన చేసినవే యజ్ఞసమయమునందు దేవతలు వచ్చిరి నారాయణుఁడు వచ్చెను శార్ఙ్గధనువుతో వచ్చెను నిత్యఋషివలె వచ్చెను ఇది క్రొత్త కల్పన

రాముఁడు భవిష్యత్తులో నడవికిఁబోవుననియు, అచట ఋషివేష ముననుండుననియు, ధనుస్సుచేతఁగొని పోవుననియు, రాక్షస సంహారము చేయుననియు నిందు సూచితమయినవి దేవతలు తమ కష్టములను భగవంతు నితో విన్నవింతురు ఇంద్రుఁడు తన కష్టాలను భగవంతునితోఁ జెప్పుట-ప్రభా వతీ ప్రద్యుమ్నమున నింద్రుఁడు తన కష్టాలను భగవంతునితో విన్నవించిన వైఖరి కనిపించును కల్పవృక్ష కవికిఁ దెలుఁగు పూర్వమహాకవులనిన చాల గౌరవము. అంత స్వతంత్రుఁడయ్యును, పద్యరచనలో నంత వాఁడయ్యును, వారికంటె నెక్కువ వాఁడయ్యును వారి యందుఁగల గౌరవము నటనటఁ బ్రదర్శించెను ఈ దేవతలు తమ దుఃఖమును జెప్పుట లోఁగూడ భవిష్యత్కథయంతయుఁ జమత్కారముగాఁ దెల్పఁబడినది. వాలి సుగ్రీవులు, ఆంజనేయుఁడు, వారివారి జన్మలు, భగవంతుఁడు రాముఁడై జన్మించినచో వారెటుల సాయపడుదురో-ఈ సంగతియంతయు

వారు తమ దుఃఖములోఁ జెప్పుచున్నట్లు కవి దానియందుఁ బొసగించెను మొత్తము మీఁద వాల్మీకి మొదట వ్రాసిన సంగ్రహ రామాయణమును ఈయనయు వ్రాసినట్లేయున్నది

ఏ చిన్ని కథలో నయినను కల్పవృక్షకవి వాల్మీకి ననుసరించినను తన కల్పనలు తాను చేయును.

విశ్వామిత్రుఁడు దశరథుని బిడ్డలనుదీసికొని వెళ్ళెను ఒక ఋషి తాను జదువు చెప్పెదనని తీసికొని వెళ్ళిన రాజకుమారుల నెంతశ్రద్ధగా జూడవలయును ? ఎంతప్రేమగాఁజూడవలయును ? రాముఁడవతార పురుషుఁడని వాల్మీకికిఁ దెలియును ఆ వైపున సీరహాస్యము, నీ వైపున లోక మర్యాద-రెంటిని జోడించి యీ ఘట్టము నంతయుఁ గల్పవృక్ష కారుఁడు పరమరమణీయముగా వ్రాసెను

సీతాకళ్యాణము జదువుచుండఁగా వాన చినుకులు పడుట తెలుఁగు దేశపు కథ ఇది కల్పవృక్షమున జొప్పింపఁబడినది విశ్వనాథ కల్పనలు పూర్వకవులను మించి యుండును

ఇక రస విషయమున్నది వాల్మీకి రామాయణము కరుణ రసమని ప్రతీతి ధ్వన్యాలోకకర్త యటులే చెప్పెను. ఉత్తరకాండను దీసికొన్నచోఁ గరుణరస విషయము సమర్థనీయమగును. కల్పవృక్షమున నుత్తర కాండ లేదు. ఇందు శాంతము ప్రధానరసము రాముఁడు పలు మంది రాక్షసులను జంపెను. ఖరదూషణులు, విరాధుడు రావణుడు మొ॥ రాక్షసులను జంపి —అయ్యో! యీజీవులు చిత్రముగా మడియుచున్నారని వారిని గూర్చి దుఃఖము కాదు, వారు మాయలో పడుచున్నారని విచారములో రాముఁడు మునుఁగుచున్నాడు ఈ రాముని స్థితినిజూచి యితరులు- ఆయన జాలి పడుచున్నాఁడని తలంతురు రహస్యమెచ్చట నున్నదనఁగా రాముఁడు మాయామానుష విగ్రహుఁడు; కృష్ణుఁడు లీలామానుష విగ్రహుఁడు·

కృష్ణునకి వేమియుఁబట్టవు రామునకుఁబట్టింపు. తాను సాక్షాత్పరమేశ్వరు డనన్నది రామునకు సంపూర్ణముగాఁ దెలియదు అప్పుడపుడు తెలియును తక్కిన యపుడు మహావివేకియై సృష్టి రహస్యములను భావించు నొక మహర్షివలె యత్నించును

ఈ రీతిగాఁ గల్పవృక్షము వాల్మీకికి భాష్యమువలె నుండును.

# రామాయణ కల్పవృక్షము

—అయోధ్యాకాండము

డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రి

రామాయణ మాదికావ్యమని భారతీయ సాహిత్యవేత్తల విశ్వాసము అది కాలమును బట్టి మాత్రమే ఆది కావ్యముకాదు "క్షణే క్షణే యన్నవతా ముపైతి తదేవరూపమ్ రమణీయతాయాః" అను లక్షణ లక్షితమగు రామణీయకమును బట్టి కూడ ఆదికావ్యమే. అనగా రామాయణము సానబెట్టిన జాతిరత్నమన్నమాట ఈ కావ్యకథను దేశభాషలలో రచించినపుడు మూలకథకు మెరుగుపెట్టుటకు ప్రయత్నించుట దేశభాషామహాకవులకు సులభమైన విషయము కాదు జాతిరత్నమునకు సానపెట్టునపుడు ఆ రత్న స్వరూపభంగను కారాదు కదా.

మహాపురుషులుగా భారతీయుల హృదయముల యందు ప్రతిష్ఠను పొందిన ఆదిరాజుల పాత్రపోషణాదుల యందు మహాకవులు చాల జాగరూకత వహించవలసి యున్నది ఆ కవులు కూడ ఉదాత్తభావనామహితులైనప్పుడే ఉదాత్త చరితులగు పురాణపురుషుల పాత్రచిత్రణమును శ్లాఘాపాత్రముగా నిర్వహింపగలరు. కావుననే కాళిదాసు వంటి మహాకవి కూడ రాజర్షులగు సూర్యవంశ ప్రభువుల చరిత్రమును వర్ణించుటకు తన వినయముతో పాటు జంకును ప్రదర్శించెను-

క్వ సూర్యప్రభవోవంశః క్వచాల్ప విషయామతిః
తితీర్షు ర్దుస్తరం మోహాదుడు పేనాస్మి సాగరమ్॥

పై విషయమును మనస్సునందుంచుకొని రామాయణకల్పవృక్షమును మనము పరీక్షించినచో విశ్వనాథ కృతకృత్యులైనారనుటలో ఎంతమాత్రము సందేహము లేదు వాల్మీకివిశ్వనాథుల రామాయణము అందలి అయోధ్యాకాండ కథల తులనాత్మక పరిశీలనము ఈ వ్యాసవిషయము

భాషాకవులు మూలకథయందు కావించు మార్పులు మూలకథకు మెరుగుపెట్టునవిగానే యుండవలెను గాని మూలకథయొక్క స్వరూప భంగము కావించునవి కాకూడదని చెప్పితిని రామాయణ కథా స్వరూపమున ముఖ్యాంశములు పట్టాభిషేక ప్రయత్నము, కైకేయి వరములను కోరుట అభిషేక భంగము, సీతారాముల వనవాసము, రావణుడు సీతను హరించుట, రావణ సంహారము ఈ అంశములను మార్చినచో మూలకథాస్వరూప భంగముతప్పదు. అది రామాయణ మనిపించుకొనదు.

మూలకథకు స్వరూపభంగము కాకుండగా విశ్వనాథ కావించిన మార్పులెట్లు మూలకథకు పుష్టినొనగూర్చునో పరిశీలించుదము.

అయోధ్య కాండయందు మూలకథ—

భరతుడు శత్రుఘ్నునితో మాతులకులమున కేగెను. పుత్రులందఱిలో రామచంద్రుడు దశరథున కెక్కువ ప్రీతిని గూర్చుచుండెను ఈ సందర్భమున వాల్మీకి సుమారు 25 శ్లోకములతో రాముని వర్ణించెను అట్టిరాముని ప్రభువునుగా ప్రజలు కోరిరి. వృద్ధుడగు దశరథుఁడు కూడ తాను జీవించి యుండగనే రామచంద్రుని యువరాజును చేసి యానందింపఁ గోరెను. అతఁడు మంత్రులతో నాలోచించి శ్రీరాముని యువరాజును జేయనిశ్చయించి జానపదులను ప్రధానభూపతులను పిలిపించి తన యభిప్రాయమును వారికెరింగించును వారందరు శ్రీరామచంద్రుని గుణ విశేషణములను వర్ణించి ప్రజలందరు ఆతని రాజునుగాఁ గోరుచున్నారని దశరధునికిఁ దెలిపిరి. ఇచ్చట వాల్మీకి 25 శ్లోకములలో ఆ సభ్యులు రాముని రాజ్యార్హతను నిరూపించినటుల వ్రాసెను.

ఇచ్చట పాఠకులకు కొన్ని ప్రశ్నలుదయించును. భరతుఁడయోధ్య యందు లేనప్పుడే దశరధునకు రాముని రాజునిఁగాఁ జేయు కోరిక యేల కలిగెను? రాముని రాజునుగాఁ జేయు తలంపుతో పెఱభూపతుల యభిప్రాయమును గూడ తెలిసికొనఁ గోరిన దశరథుఁడు ఆ భూపతుల నాహ్వానించువాఁడై కేకయ జనకులనేల యాహ్వానింపలేదు? కేకయరాజు తన

యభిప్రాయమున కంగీకరింపఁడని దశరథుఁడు భయపడినాడా? కేకయ భూపతి శ్రీరామచంద్రుని పట్టాభిషేకమున కంగీకరింపక పోవుటకు కారణ మేమి కలదు? భాసుఁడు మొదలగువారు వ్రాసినటుల కైకేయి వివాహ సమయమున ఆమె పుత్రునకు రాజ్యము నిచ్చెదనని దశరథుఁడు వాగ్దానము చేసినటుల వాల్మీకి చెప్పలేదే? అట్లు వాగ్దానము చేసి యుండినచో కైకేయి ఆ వాగ్దానము చెల్లింపుమని దశరథుని అడగవలెను గాని, తనకు దేవాసుర సంగ్రామ సమయమున ఇచ్చిన వరములను జ్ఞాపకము చేసి ఆ వరమునకు ఫలమును గా భరతుని రాజునుగా చేయుమని అడుగుట యేల?

పాఠకులకుఁ గలిగెడి యే తాదృశ సంశయముల నివారించి కథకు నౌచిత్యమును సంతరించుటకు విశ్వనాథ యిచ్చట చక్కటి కల్పనఁ జేసెను. శ్రీరామచంద్రునకు వైరాగ్యభావముదయించెను కాని ఆ విషయము దశరథుని చెవిని పడునప్పటికి చాలకాలము పట్టినది వెంటనే దశరథునకు రాముని రాజునుగాఁ జేయ తొందరపుట్టెను ఆ యభిప్రాయ మును సమర్థించుటకు విశ్వనాథ లోకమున గృహస్థుల స్వభావమునిట్లు వివరించెను.

"బ్రహ్మచారి సుతుండు విరాగియైన
జనకుఁడూహించు సుతు గృహస్థునిఁ బొనర్పఁ
దా గృహస్థుండె సుతుఁడు విరాగియైనఁ
దండ్రి వ్యవహార మతనిని దాల్పఁజేయు."

బ్రహ్మచారియైన పుత్రుఁడు విరాగియైనచో తండ్రి యతనికి వివాహము చేయఁగోరును వివాహితుఁడైన పుత్రుఁడు విరాగియైనచో తండ్రి యాతనికి ఇంటి వ్యవహారమప్పగించును. లోకమున గృహస్థుల కెల్ల యిది యనుభవ సిద్ధమైన విషయము ఇచ్చట ఈ కల్పనలో కల చమత్కార మే మనగా శ్రీరాముఁడు పరమేశ్వరుడు; వైరాగ్యమతని సహజలక్షణము మానవుఁడుగా నవతారమెత్తినను అప్పుడప్పుడు శ్రీరామచంద్రుఁడు తన భగవల్లక్షణములను వ్యక్తీకరించెను. శ్రీరామచంద్రుఁడు తన సహజస్థితినిఁ బొందగా రామచంద్రుని కేవల తనయునిగానే భావించిన దశరథునకు

తత్తరపుట్టి ఆతనిని రాజునుగాఁ జేయఁగోరుట సహజమే. లోకమున ప్రతి తండ్రియు తన పుత్రుఁడు గృహస్థుఁడై కీర్తిని సంపాదించి తన వంశోద్ధారకుఁడు కావలయునని కోరును. తన పుత్రుఁడు విరాగిగా నున్నట్లు తోచినచో ఆ విషయమును తన బంధువులకెరిగించుట కిష్టపడడు-కావున దశరథుఁడు వారి యభిప్రాయములను దెలిసికొనఁగోరి ఇతర భూపతుల నాహ్వానించినపుడు జనకుని, కేకయరాజును ఆహ్వానింపలేదు ఏలయన వారాత్మ బంధువులలోని వారు గావున, వారు వచ్చినచో రాచనగరులో వ్యాపించిన శ్రీరామచంద్రుని వైరాగ్యభావము వారి చెవినిఁ బడవచ్చును అది దశరథున కభిమతము కాదు అందుచేత దశరథుడు వారి నాహ్వానింపలేదు

లేక లేక తపముచే గలిగిన పుత్రునకు, అందునను వివాహితుఁడైన పుత్రునకు వైరాగ్య భావముదయించెనని దశరథునకు భీతి జనించి ఆతని పట్టాభిషేకమునకు ఉపక్రమించెను దశరథునకు తమ యామోదమును వెలిబుచ్చిన చాతుర్వర్ణ్యముల వారు రెండు మూడు వాక్యములలోనే శ్రీరామచంద్రుని గూర్చి తమ యభిప్రాయమును దెలిపినటుల విశ్వనాథ రచించెను, దీనినిఁ బట్టి రామచంద్రుని పట్టాభిషేకమునకు కాలవ్యవధానమును సహింపని దశరథుఁడు వారి యభిప్రాయములను క్లుప్తముగా చెప్పుడని యడిగి యుండునని ధ్వని మూలమున 25 శ్లోకములలో వారి యభిప్రాయమును దెలిపినటుల కలదు. వనవాసమునకుఁ బొమ్మని కైక తన యభిప్రాయమును దెలిపిన వెంటనే శ్రీరామచంద్రుడంగీకరించుటకు ఆతని యీ సన్నిహిత పూర్వ మనస్తత్వము దోహదకారియగుట కూడ ఈ కల్పనకు మరియొక ప్రయోజనము,మఱియు శ్రీరామచంద్రునకు వైరాగ్య భావముదయించినదని వినినంతనే యింతభీతి, యింత తత్తరపాటు కలిగిన దశరథుఁడు నిజముగానే రామచంద్రుఁడు మునివృత్తిని అరణ్యమున కేగవలసి వచ్చినప్పుడెంతగా దుఃఖించునో పాఠకులు భావించుకొనుటకు కూడ ఈ కల్పన తోడ్పడును

దశరథుని భయమును, తత్తరపాటును, చెప్పుచు విశ్వనాథ యిట్లు రచించెను—

"అని లోకతంత్ర మెంచుచు
ననఘ మతిని యౌవరాజ్యమందున నభిషి
క్తునిఁ జేయ రామచంద్రుని
మనమున స్ఫురియించినంత మానవపతియున్"
"తాదృశోత్సవములకు సుతద్వయంబు
భరతశత్రుఘ్నులను బిల్వఁబంపలేదు
నొకరితోఁ జెప్పలే దెంత చకితుఁడయ్యె
నంత తొందరపడుచు ధరాధినేత."

తన వార్ధక్యమున పుత్రుని కిట్టి మనోభావము కలుగుట దశరథునకు మరీ భయహేతువైనది తన పరిషత్సభ్యులతో తన ముదిమిని గూర్చి దశరథుఁడు పలికినటుల వ్రాసిన యీక్రింది పద్యరచన, వార్ధకము యొక్క భయంకరత్వమును, వార్ధకము యొక్క లక్షణమును కళ్లకు కట్టినటుల భాసింపచేయుచున్నది -

"తనకున్ గుండలహేమ నూతన హరిద్రాకాంతి కర్ణాంతకే
శనిపీతోగ్రవమజ్జరాసిత విశేషాక్రాంతి డీల్పోయెడున్
తనకున్ షష్టిసహస్రవర్షధరణీ తాత్పర్య చింతా చిరం
తనరేఖన్ బతయాళుతాలు చలితత్వక్పర్యయంబేఁచెడున్"

ఉగ్రవ మజ్జరా అను సమాసరచన దశరథుని వార్ధక సాంద్రతను వ్యక్తీకరించుచున్నది

తర్వాత రామాయణ కథకు జీవభూతమైన యంశము కైక దశరథుని వరముల కోరుట లోకకంటకుఁడగు రావణసంహారమునకై యానందించు మనము రాముని వనవాసమున కంపిన కైకమ్మపై యేల యాగ్రహపడవలెను ? మనము మానవులము తత్తత్కాల సన్నివేశ జనిత భావోద్రేకములకు మనము వశమగుట సహజము శ్రీరామచంద్రుఁడు సద్గుణ ఖని 'అతఁడు జ్యేష్ఠ పుత్రుడు అట్టివానిని కైక దుస్సహమగు వనవాసమునకు పంపనేల యని మాత్రమే మనమాక్రోశపడుదుము. మనమే

యనవేల ? దురత్యయమగు మాయామోహితుఁడై బ్రహ్మణ్యుఁడగు వసిష్ఠుడుకూడ కైకపై యాగ్రహపడెను. సుమంత్రుడాగ్రహపడెను తత్త్వదర్శియగు శ్రీరామచంద్రుఁడొక్కఁడే కైకయందు సానుభూతిని ప్రదర్శించెను.

కాని విశ్వనాథ చేతిలో కైక అనవద్య చరిత్రగా శస్త్రవిద్యాశేముషీనిష్ణాతగా దేవకార్య నిర్వాహకురాలుగా వెలిగినది విశ్వనాథ చిత్రించిన కైక రామచంద్రునికి శస్త్రవిద్యోపాధ్యాయ దైవప్రేరణ చేతనే యామె రామచంద్రుని వనవాసమున కంపినది తనకు క్లిష్ట సమస్య లేర్పడినప్పుడు రామచంద్రు డామె సలహాలనే పాటించును మంథర యొక్క బోధచే కైక దశరథుని వరముల నడిగినది—

"ధాత్ర్యాస్తువచనం శ్రుత్వాకుబ్జాతి ప్రమమర్షితా
కైలాస శిఖరాకా రాత్ప్రాసాదా దవరోహత
సాదహ్యామానా కోపేనమన్థరాపాపదర్శినీ
శయానామేత్య కైకేయీ మిదం వచన మబ్రవీత్"

అని మూలము. మంథర రామచంద్రుని పట్టాభిషేకమును విని సహింపలేక క్రోధముతో కైకేయినిగూర్చిపలికినటుల మూలమున చెప్పఁబడినది. కాని రామచంద్రుని పట్టాభిషేకమును మంథర సహింపలేకపోవుటకు కారణము మూలమున చెప్పబడలేదు. ఈ సందర్భమున విశ్వనాథ మంథర నిట్లు ప్రవేశపెట్టెను –

"తన జనిహేతువై చనిన దైత్యగుణంబది పొంగి రామచం
ద్రుని యభిషేకమంచని యెఱుంగక యే సహజక్రుధామతిన్
జని పరిచారికాసమితిసంగతి కన్గొని కర్ణవీథిఁదా
కిన యభిషేకవార్త భుజగీవిష మెక్కిన యట్టులెక్కినన్"

కల్పవృక్షమున, మంథర రామచంద్రుని పట్టాభిషేకమును సహింపక పోవుటకు ఆమె దైత్యాంశజననమే కారణముగా చెప్పబడినది. సత్పురుషులను ద్వేషించుటయే రాక్షస లక్షణము కదా !

దశరథుఁడు శ్రీరామచంద్రునితో మఱునాఁడే పట్టాభిషేకమని చెప్పి ఆ రాత్రి సీతతో కూడ ఉపవాసాది నియమపరుఁడవు కమ్మని యాతని నాదేశించెను ఉపవాసియగు రాముఁడా రాత్రి సమాధి నిష్ఠుఁడయ్యెను ఆ సమాధియందు శ్రీరామచంద్రునికి తనను దేవతలు పిల్చుచున్నట్లును,

"స్వామికి జ్ఞప్తి యుండదు ప్రపన్నత కల్గదు నిర్వికారస
త్తా మహనీయ వార్ధికిని దానవసింహము పంక్తికంధరుం
డేమయిపోయె మా మనవులేమయిపోయె భవత్ప్రతిజ్ఞతా
నేమయిపోయెఁ గోసల నరేశ్వరు యజ్ఞహవిస్సమాహృతిన్"

"పలికకున్ ధరావలయ మేలుట యిష్టమయేని వేలయేం
డ్లేలఁగవచ్చు నేడుజగ మేలఁగవచ్చును ధర్మకాష్ఠపై
వ్రాలిన దానవేశు నొక వాలిక తూపునఁ గూలనేసి యా
పై లసమానధాత్రి సతిపావన గర్భముతో సుఖింపుమా !"

అని పలికినట్లయ్యెను. ఇది యంత యసంభావ్యమయిన విషయము కాదు. పట్టాభిషేక కారణముగా నయోధ్యా నగర మంతయు నలంకృతమైనది ఎచ్చటఁ జూచినను రమ్యాదృశ్యములే మంగళ తూర్యానాదములు వినవచ్చు చున్నవి అట్టి సమయమున ఏకాగ్రచిత్తుడైన రామచంద్రునకుఁ దనయవతార ప్రయోజనము స్మరించుట సహజమే.

ఇట్టి సన్నివేశములయందు మానవాంతఃకరణ వృత్తుల స్వభావమును కాళిదాసమహాకవి "రమ్యాణి వీక్ష్య" యన్న శ్లోకములో చిత్రించియే యున్నాడు కదా!

దేవతలచే నిట్లు ప్రబోధితుఁడైన రామచంద్రుఁడు వికలచిత్తుడై వ్రత భంగమును సరకుగొనక పినతల్లి యగు కైకేయి గృహమున కేగెను ఆమె శ్రీరామచంద్రుని జూచి తద్వ్రతష్ఠలనమతిన్ ంతమ్మో భయమంది-

"చెలువుగ యౌవరాజ్య మభిషేక మిదేమిటి జేపుప్రొద్దునన్
వెలువడి నీవు సద్వ్రతము వీటనుబుచ్చి యిదేమిరాక? లో

కులు నను నాడి పోసెదరు కుట్టని సద్వ్రతభంగ కారిణిం
బలె మఱి యేమి ముంచుకొని వచ్చిన దీ నడిరాత్రివేళలో"

అని పలికినది ఇచ్చట మనము గమనింపవలసిన విషయములు—శ్రీరామచంద్రునకు క్లిష్ట సమస్య లేర్పడినప్పుడు ఆ సమస్యాపరిష్కారమున కాతఁడు పినతల్లి నే ప్రార్థించును శ్రీరామచంద్రునిఁ జూడగనే కైకేయికి భీతికల్గినదట. కారణము పట్టాభిషేక సిద్ధికి రామచంద్రుడు పూనిన వ్రతమునకు భంగమగుటయే వ్రతభంగమనగా పట్టాభిషేకభంగమే దాని కామె చకితురాలైనది ఆ భంగము కూడ తన కృత్యముగా భావించి జనులు తనను నిందింతురనియు కూడ ఆమె భయపడినది ఈ సందర్భము కైకేయి యొక్క విమల హృదయమును మనకు పట్టియిచ్చుచున్నది అంతియే కాదు పటస్థింపనున్న పట్టాభిషేకభంగము, దానివలన ఆమెకు రాబోవు లోకనింద ఆమెకు తెలియుకుండగనే యామె వాక్యములు ధ్వనింపజేసినవి

రామచంద్రుఁడు తనను దేవతలు రాజ్యము చేయవద్దనినట్లును, వాస్తవమున తనకు గూడ రాజ్యమునందు ప్రీతి లేదనియు చెప్పెను అట్టి రామచంద్రునితో కైక ఇప్పుడట్లే యుండును లే, రేపు సింహాసనమున అంకమున జానకిని గాంచినప్పుడు వేఱుగా నుండును లె యనినదట. ఆ మాటను వినగానే - "రాముని నేత్రంబుల నొక్క తీవ్రకళయై మున్నీవు నువ్వెత్తునేర్పిన కోదండకళావిచిత్రగమనశ్రీ యేమగుం జెప్పవే" అని రామచంద్రుఁడనెనట

ఈ రచనయందు మానవ మనస్తత్త్వ చిత్రణ మద్భుతముగా కావింప బడినది లోకమున పురుషులు అత్యున్నత పదవులను గోరెదరు. ఆ పదవులు లభించునపు డానందింతురు వారికా పదవులు లభించునపుడు వారి సతీ మణులు తమ కాయాపదవులు లభించినటుల ఆనందించెదరు ఆ సతీమణుల యానందమును గాంచిన పురుషుల యానందమే ఉత్కటమైన యానందము. సింహాసనము నధిష్ఠించినపుడు సీతమ్మ యానందమును గాంచినపుడు రాముని

కిప్పుడు కల్గిన భావము మాసిపోవునని కైక లోకసాధారణ పురుషుని గూర్చి పలికినటుల రాముని గూర్చి పలికినది తనను గూర్చి అట్లు తేలికగా పలికినందులకు రాముని మనస్సు చివుక్కుమన్నది. ఈ భావమును విశ్వనాథ రాముని నేత్రముల నొక్క తీవ్రకళయై యనుమాటలో సూచించెను.

తాను పట్టాభిషిక్తుఁడైనచో తనకామె నేర్పిన కోదండకళా నైపుణ్య ప్రయోజనమేమనియు, తాను రాజ్యము చేయుట నిక్కముగ దైవాభిమతము కాదనియు, రామచంద్రుఁడు కైకమ్మకు దెలుపగా తీక్ష్ణనేత్రములతో చూచి యాతనితో మఱుమాటాడకయే కైక సౌధములోనికి వెళ్లిపోయినదట

రామచంద్రునకు కోదండకళా చాతుర్యమును నేర్పుటకు ప్రయోజనమేమియో కైక యెఱుగును. రామునకిప్పుడు పట్టాభిషేకము దైవాభిమతము కాదనియు, పట్టాభిషేకమిప్పుడు జరుగదనియు కూడ కైక యూహించినదేమో! కాని,ఆ విషయముల నిప్పుడు బయల్పఱుప కూడదు అందుచేత రామచంద్రుని ప్రశ్నల కామె సమాధానము చెప్పకయే గంభీరముగా వెడలిపోయినది

మంథర యాక్రోశముతో సుఖాసుఖ నిద్రపోవుచున్న కైకేయిని మేల్కొలిపినదట నిద్రయనగానే యేదోకొంత సుఖముండి తీరును కాని యానిద్ర గాఢసుషుప్తికాదు కాని రామచంద్రునకు తటస్థించిన సమస్యా పరిణామములను గూర్చి చిత్తక్షోభముతో కూడిన నిద్ర అందుచేత ఆమె సుఖాసుఖ నిద్రపోయెనని కవిచెప్పెను. రామచంద్రుఁడభిషేకము వద్దనినట్లామెకు కలవచ్చినదట ఇదికూడ దైవప్రేరణయే కావచ్చును. కావునను చీదరించుకొనుచు నిద్రనుండి లేపుచున్న మంథరతో "రామచంద్రుఁడు పట్టాభిషేకమున కంగీకరించినాడా?" యని ప్రశ్నించినది మంథర రామచంద్రుఁడు రాజైనచో వచ్చు నిక్కట్టులను గ్రుక్క త్రిప్పుకొనకుండగా చెప్పినది ఎన్ని చెప్పినను కైకకు రామునిపై విశ్వాసము సడలలేదు. అప్పుడు మంథర పెద్దపెట్టున నేడ్చుచు యురిపోసికొనుటకు ప్రయత్నించినదట. అప్పుడు కైక మంథర యాథార్థ్యంబును గుర్తించినదట. గుర్తించి

నాపుత్రుఁడు రాజ్యమేలును రామచంద్రా నీవడవులకు పోవలె'నన్నచో ఆతడెంతమాత్రము ఎదురు చెప్పడు కాని, సాధించుట యెట్లని కైక మంథరను ప్రశ్నించినది. ఆమె దశరథుడిచ్చిన వరములను జ్ఞాపకముచేసినది చేసి——

"అరదము నేర్పుమైఁదివిచినందులకే ధరయెల్లనేలఁగా
భరతుని రాజుఁజేయవలెఁ బ్రాణములన్ నిలఁబెట్టినందుకున్
బోరిఁబదుమూఁడు వర్షములుపోవలెఁ రాముఁడు వన్యసీమలన్
దిరుగుచు దైత్య సంహనన దీక్షను, నీవనినావుగా యనన్"

అని మంథర పలుకగా——

"బిరుసు గాలిపడగ పెడగాఁగఁ దాఁచిన
బుస్సుమన్న త్రాఁచు పోలతివోలె
కైక రామమూర్తి కఠిన రాక్షస కీట
రాజిఁగాలి క్రింద రాచునన్న"

కైక కోపవిజృంభణమునకు "అంతటి కోపమేమిటికి? నౌననియే కద చెప్పుచుంటి" నని మంథర పలికినది ఈ కైకేయి మంథరల సంభాషణము కైకేయి స్వభావమును, ఆమె హృదయాంతరాళమున నిగూఢముగా నున్న భావమును స్ఫురింపజేయుచున్నది. ఈ సంభాషణను బట్టి ఇంతకు పూర్వమే కైక మంథరతో రాముఁడు దైత్యసంహనన దక్షుడని పలికి యుండినట్లు తెలియుచున్నది దానినిప్పుడు జ్ఞాపకముచేయుచు, ఆపని కొఱకే యిప్పుడు రాము నరణ్యమునకుఁబంపుమని దశరథుని కోరుమని మంథర పలుకగా తానేదో యలవోకగా పలికినటుల మంథర భావించిన దనియు, తనమాటయందామె యప్రత్యయము వెలిబుచ్చినటుల తోచిన వెంటనే తోకత్రొక్కిన త్రాచు వలెనయి కైక రామమూర్తి కఠిన రాక్షస కీట రాజిఁ గాలిక్రింద రాచునన్నదట దీనినిబట్టి కైక తన మాటల సత్యములనుగా నితరులు భావించుచో సహింపనేరని యాత్మాభిమానము, రాక్షస వధకై యామె పడు తహతహ వ్యక్తమగుచున్నవి.

మంథరమాటలు విన్న కైక క్రోధమూర్తియైనది తన యెదుట నిలువవద్దని మంథరను పొమ్మన్నది ఆ తర్వాత కైక స్థితిని విశ్వనాథ యిట్లు వర్ణించిరి—

"లీనాంతర్వ్యధ మందుఁదిన్న పులివోలెన్ గైకలోలోన లో
లోనన్ దా గుడుసుళ్లు పొందుచు మనోలోభంబో, ధాత్రీవచో
దానక్లేశము, తోఁచరానిది యెదో దైవత్యమో ప్రేరణ
గ్లానిన్ గన్నులు చింతనిప్పుగఁ దనూకంపంబు సంధిల్లఁగన్"

"మాపనులెల్లనుం జెడు సుమా! రఘునాయక! యబ్ధిమేఖలా
వ్యాపృత బుద్ధివైన నని యాడిరఁటా సుర, లంతె కావలెన్
గోపన నన్నుఁగాని కయికోఁడలె ఱేఁడటు లైనఁగాని యే
లా పతి జ్యోతిషాంపతికులంబున మాటనువీటిఁ బుచ్చెదున్"

"ఓహో! కైకయి! నీప్రయోగము విధివ్యూహప్రభేదక్రియా
బాహాటంబగుఁబో సుధాంధసులునై పాలింత్రుపో నీమతి
వ్యాహారంబులు రామభద్రుని వనీ పర్యంతముం జూచికా
నీ! హా! హా! పినతల్లి కైకయి మఱిన్ నిద్రించ దేనాటికిన్."

ఈ రచనయందు రాముని వనమునకు పంపుటకు కైక హృదయమున యెంత యారాటము చెందినదియో సూచింపఁబడినది

రామా! నీవబ్ధిమేఖలా వ్యాపృత బుద్ధివైన, మాపనులెల్ల చెడును సుమా అనుదేవతల మొఱ నాలించుటయే యామె కర్తవ్యమునుగా దలచినది.

ఆమె ప్రయోగము విధి వ్యూహమును భేదించెడి కార్యసమయముననే బాహాటమగునట. ఇచ్చట విధివ్యూహమనగా బ్రహ్మ రావణునకు దేవతలచే అవధ్యత్వమును ప్రసాదించి యాతనిని లోకోత్తరునిఁగాఁ జేయుట; ఆ వ్యూహ భేదమనగా రావణుని వరబాహ్యమగు మానవావతారమున

రావణుని వధించుట. ఆ సమయమున గాని కైకయొక్క కోరికలోని అంతరార్థము బాహాటము కాదట కైకమ్మయొక్క తెలివితో కూడిన పలుకులు దేవతలే పాలింతురట, అనగా దేవతలు హర్షింతురని భావము. ఆమె రాముని అడవికి పంపి గాని నేను నిద్రింపనన్నది కాని భరతునికి పట్టాభిషేకము చేయించికాని నిద్రింపననలేదు అనగా ఆమె యభిలాషము రాముని వనవాసమునందేగాని అనగా రాక్షస నిర్మూలనమునందే గాని భరతునకు రాజ్యమును దక్కింపజేయుటయందు కాదు.

మరియొక విషయము. మూలమున మంధర శంబరాసురునితో యుద్ధ సమయమున నీవు నీపతిని రక్షించితివి అందులకై నీపతి నీకు రెండువరముల నిత్తుననెను ఆరెండు వరముల నిప్పుడడిగి, భరతుని రాజ్యాభిషేకమును, రాముని వనవాసమును కోరుమని మంధర చెప్పినట్లు కైక అడిగినట్లును కలదు. కాని కల్పవృక్షమున రథమును చాతుర్యముతో యుద్ధభూమినుండి వెడలించిన కార్యమునకై యిచ్చిన వరమునకుగాను భరతుని పట్టాభిషేకము చేయుమనియు, పతి యొక్క ప్రాణములను కాపాడినందులకై యిచ్చిన వరమునకు గాను రాముని యడవికి పంపుమని యడుగమనెను ప్రాణములను గాపాడుటకు, రాముని యడవికి వెడలనంపుటకు గల సంబంధమేమి? దశరథునకు రాముడు ప్రాణముతో సమానము ఆతనిని అడవులకు పంపుట యనగా దశరథుడు ప్రాణముల నిచ్చినట్లే, ప్రాణములను కాపాడిన వారలకు ప్రాణముల నిచ్చుటయే సమానమైన వరము కదా! ఇట్లు ఈ మంధర మాటలలోనే శ్రీరాముని వనవాసఫలితమైన దశరథుని మరణము సూచింపబడినది ఇంకను మంధర పలికిన—"ధాత్రిపుడ సురాజితో నయినఁదీర్చును నీ వరణీయ మెంతయేన్" —అనుమాటల యందును దశరథుని మరణము సూచితమైనది.

కైకవరములను కోరినది మూలమున దశరథుడు కైక యొక్క కోరిక వినగనే మండిపడెను కైకను దూషించెను ప్రతిమాలెను. పాదములపైఁబడెను కాని, కైక రౌద్రమూర్తియై దశరథునితో నీవు సత్యమును పాలింపక "సత్యం ధర్మం పరిత్యజ్య రామం రాజ్యేఽభిషిచ్యచ,

సహ కౌసల్యయా నిత్యం రన్తు మిచ్ఛసి దుర్మతే" అని దశరథుని దూషించిమాటలాడినది, కైక వాక్యములను సుమారు 10 శ్లోకములలో వాల్మీకి రచించెను.

శ్రీరామచంద్రుని రాజు చేసినచో కైక విషముత్రాగి మరణింతు నన్నది ఒక్కదినము కూడ కౌసల్యను రాజమాతనుగా తాను గౌరవింప నన్నది కల్పవృక్షమున కథా కథన రీతి వేరు కైక వరములను గోరినది దశరథునకు పచ్చని చెట్టుపై పిడుగు పడినట్లైనది ఆతడు కైక యొక్క క్రౌర్యమును పరిపరివిధముల వివరించెను తన మాటల కుచితమైన సమాధానము లాశించెను. కాని, కైక యేమియు మాటాడలేదు లోకములో ఒకరు కష్టమును కలిగించు నొక మాటను మాటాడినప్పుడు, ఎదుటివాడు అట్లేల మాటాడితివని యడిగినచో మాటాడినవాడు సమాధానము చెప్పక పోయినచో ఎదుటివానికి మరీకోపము హెచ్చి మాటలాడినవానిని ఒకే విధముగా దూషించుచుండును. ఇక్కడ దశరథుడట్లేచేసినాడు ఆతడెంతగా దూషించినను, బ్రతిమాలినను, బెదరించినను కైక ఒక్కమాటకూడ మాటాడదు మూలమునందు కైక పతిని "దుర్మతే" యని కూడ దూషించినది కాని కల్పవృక్షమున కైక—

"పతి వచోభిముఖినమౌ పడఁతి యాత్మ
నిముసనిముసంబునకు నేదో నిలువరించె
క్ష్మాతలేంద్రుఁడు దుఃఖవాచాలుఁడై నఁ
దరుణి కైకేయి దుఃఖనిస్తబ్ధయయ్యె"

ఈ రచన కైక రాముని వనవాసమునకు పంపవలసినందులకు హృదయమున ఎంత కుమిలినదో తెలుపుచున్నది దశరథుని ప్రశ్నలకు కైక సమాధానము చెప్పవీలులేదు ఏది చెప్పినను రాముని వనవాసమున కంపుటకు దశరథు డంగీకరింపడని కైక యెరుగును విశ్వామిత్రుడైనచో "అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్" అని రాముని అడవికి పంపుమని చెప్పకలిగెను. కాని కైక యెట్లు చెప్పగలదు? కల్పవృక్షమున కైకేయి హృదయమున నెంతవ్యథ చెందినదో–పతి దుఃఖవాచాలుడు కాగా కైక

దుఃఖ నిస్తబ్ధురాలైనదనుమాటచే తెలుపబడినది ఇచ్చట తన వృద్ధపతి దుఃఖమును చూచికూడ కైకకు దుఃఖము కలుగవచ్చును ఒకప్పుడు ఒకరి దుఃఖమును చూచినపుడు వారి దుఃఖమునకు తాము కారణమైనను తాముకూడ దుఃఖించుట కలదు. ఆడపిల్లను అత్తవారింటికి పంపినపుడు వాపోవు తల్లి దండ్రులను గాంచి కన్నీరు పెట్టుకొనిన వరులను ఈ వ్యాసరచయిత దర్శించిన యుదాహరణములు పెక్కులు కలవు ఇచ్చట కైక పరిస్థితి యట్టిదియే ఇట్లు మౌనముతోనే కైక అగాధములైన తన మనోభావములను వెలువరించినది ఇది విశ్వనాథ యొక్క శిల్పము. కవి యొక్క శిల్పనైపుణ్యముచే ఒక్కొక్క పాత్ర నిర్మాణవైఖరి కథాగమన వేగము నుండి పాఠకుని హృదయమును నిలువరించి ఆ పాత్రకు పాఠకుల హృదయమున చిర ప్రతిష్ఠను కలిగించి రసాస్వాదమునకు తోడ్పడును. రామాయణమున ప్రధాన రసము కరుణము ఆరసమును పోషించుటకు సమృద్ధమైన సామగ్రి ఈ అయోధ్యాకాండమున నిక్షిప్తమైనది

ఇట్టి రచనాశిల్పము తిక్కనలో కలదు. సోమనలో కలదు పోతనలో కలదు. విశ్వనాథలో కలదు ఒక్కొక్కరిలో ఒక్కొక్క శక్తియుండును. ఈ కవులలో ఈ శక్తి ముమ్మాటికి కలదు

సుమంత్రుడు రామచంద్రుని కైకేయి గృహమునకు తీసుకొని వచ్చును రామచంద్రుఁడు తండ్రి యొక్క శోచనీయస్థితికి వెఱగంది కైకమ్మను కారణమడుగును కైక—

"నరాజా కుపితో రామవ్యసనం నాస్యకించన ।
కించిన్మనోగతంత్వస్యత్వ ద్భయాన్నాభిభాషతే"—అని ప్రారంభించి

"యది తద్వక్ష్యతే రాజా శుభం వాయది వాశుభమ్। కరిష్యసి తత స్సర్వ మాఖ్యాస్యామి పునస్త్వహం" అని రామచంద్రుఁడు తండ్రియాజ్ఞను పాలింతునని వాగ్దానము కావించినచో దశరథుని స్థితికి కారణము చెప్పెదనను. రామచంద్రుఁడు వాగ్దానము చేయును. తర్వాత- "తమార్జవసమాయుక్త మనార్యాసత్యవాదినమ్। ఉవాచరామమ్ కైకేయీ వచనం భృశ ధారుణమ్ । పురాదైవాసురే యుద్దేపిత్రాతే మమ రాఘవ। రక్షితే నవరా

దత్తౌ సశల్యేన మహారణే । తత్ర మేయాచితో రాజా భరతస్యాభి షేచనమ్ । గమనం దండకారణ్యే తవచాద్యైవరాఘవ । యది సత్య ప్రతిజ్ఞం త్వం పితరం కర్తుమిచ్ఛసి । ఆత్మానం చనర శ్రేష్ఠ మమ వాక్యమిదం శృణు । సన్ని దేశే పితుస్తిష్ఠ యథాతేన ప్రతిశ్రుతమ్ । త్వయారణ్యం ప్రవేష్టవ్యం నవవర్షాణి పంచచ । భరతశ్చాభిషిచ్యేత యదే తతభిషేచనమ్............ ...........ఏతత్కురు రేంద్ర సత్యవచనం రఘునందన । సత్యేనమహాతా రామతారయ స్వనరేశ్వరమ్"—తానుకోరిన వరములను రామచంద్రునకు తెలిపి తండ్రిని సత్యప్రతిజ్ఞుని కావింపుమని కైక రామచంద్రునకు తెలుపును రామచంద్రుడు —"ఏవమస్తు గమిష్యామి వనం వస్తుమహం త్వితః జటాజినధరో రాజ్ఞః ప్రతిజ్ఞా మనుపాలయన్"—తానట్లే పితృాజ్ఞను శిరసావహింతునని పలుకును రాముని పలుకులకు కైకసంతసించి "సాహృష్టా తస్య తద్వాక్యం శ్రుత్వా రామస్య కైకయీ ప్రస్థానం శ్రద్ధదామీ త్వరయామాసరాఘవమ్" అని రామచంద్రుని వనగమనమునకు త్వర పెట్టును కైకమ్మ యాతురతను గమనించి రామచంద్రుఁడు "నాహ మర్థపరోదేవి లోకమా వస్తుముత్సహే విద్ధి మామృషి భిస్తుల్యం కేవలం ధర్మమాస్థితమ్" అని తనస్వభావమును పినతల్లికి తెలుపును. తర్వాత అతఁడు "వన్దిత్వా చరణౌ రామో విసంజ్ఞస్య పితు స్తథా కైకేయ్యాశ్చా ప్యనార్యాయా నిష్పపాత మహాద్యుతిః । సరామః పితరం కృత్వా కైకేయీంచ ప్రదక్షిణం నిష్క్రమ్యాన్తః పురాత్తస్మా త్స్వందదర్శ సుహృజ్జనమ్॥ —తండ్రికి కైకకు ప్రదక్షిణము గావించి అచ్చటనుండి వెడలిపోయెను. ఇట్లు మూల కథ నడచినది. ఈ సందర్భమున కల్పవృక్ష కథాకథనరీతిని గమనింపుఁడు—

రామచంద్రుఁడు మానసికవ్యధచే కుములుచున్న తండ్రిని గాంచి కైకమ్మను కారణమడుగ కైక యిట్లు పలుకును—

"అవునోయీ రాఘవుడ। పి
తృ వాక్య పరిపాలనంబు దెప్పరమై పా
ల్య విధిం గొప్పరమౌ వ్రత
మవినయులకుఁ జేతకానిదగు వ్రతము సుమీ।"

అది నీవు చేయగలవా? అను కైకేయి ప్రశ్నమునకు రామచంద్రుఁడు యేదో స్మరణభావము కొట్టినయట్లు తోఁచి ధీదశ పులకించి" నీవు చెప్ప నతమే అహల్యాదేవి చెప్పినది మీ యిద్దరి ఆత్మయు ఒకటేనా యని కైకేయిని ఎదురుప్రశ్న వేయును కైక రామచంద్రుని తీక్ష్ణముగాఁ జూచి తాను కోరిన వరముల నిట్లు తెలిపెను—

"మును పల నాకు రెండు వరములల్ దయచేసెను నీదు తండ్రి దా
నను నొకదాన నీవునయినన్ బదునాలుగు వత్సరంబు లే
గనువలె వెంబడిం జటివి కానకు, రెండవదానఁ జేసి నా
తనుభవుఁడిప్పుడే సకల ధాత్రికి నీవలె రాజు కావలెన్!"

"రామా! యిన్ని దినాలు దాఁచితినిరా రక్షోవిధంబై సప
త్నీమాత్సర్యము నేఁడు బ్రద్దలయి పండెన్ గండ్రకోనన్ ధనురి
(శ్రీ) మత్పాణివి నీవు నొంటరివి నీ సేమంబు క్లిష్టంబె యా
నో మాటిచ్చిన మీరు రాఘవులు పోరో సత్యవాక్పాలనన్"

"రక్షోజాతిని నాదు యౌవన దశాప్రాచుర్యముం బోదు వృ
ద్ధక్షోణీపతి నీదు తండ్రికిని జేతః కామముం జావ దో
రా! క్షోణీ భర వారణావతరణ ప్రాచీన లీలాకృతీ!
దక్షుం డొక్కఁడ వీవు భూమిపతి దత్తం బౌ వరవ్యక్తికిన్"

"నాకున్ నీ కృతమైన యేయపకృతిన్ నాకోర్కి యిట్లా నటం
చాకారించెదవేమొ ? చెప్పితిని గాదా నేను రక్షస్సు నం
తే కాదెంతయుఁ గోసలాధిపసుతా ప్రీంక్షేత్రకుద్దాలన
ప్రాకామ్యాకృతి నీ వెఱుంగవు ననున్, రాజో యెఱుంగున్
ననున్"

మా పువ్వురు రాణులకును
స్వామీ! పుత్రకులు మీరు జన్మింతు రటం
చేమో యెఱుఁగుదు నెప్పుడో
యీ మంచియనేహ మెంచి యిట్టులు సేయన్"

"ఆయెంబో, ననుఁ బెంచినట్టిది కదా యారండ, కాండీరుఁడౌ
దో యాప్టీకుఁడ వౌదొ, యమ్ములను మున్గాయంగ
వెన్దాయన
ధ్యాయాధ్యాయము చాపశిక్షణ కళన్ దైతక్క లాడించినా
వే యామంథర, యూరకే చనునటో యీచిన్ని కార్యంబు
లేన్"

విశ్వనాథ చిత్రించిన యీకైక యొక్క సంభాషణమామె యొక్క ప్రగల్భ తను సూచించుచున్నది. మూలమున జనకుని యాజ్ఞను పరిపాలించెదనని రాముడు వాగ్దానము చేసిన తర్వాత కైక తన వరములను తెలిపినటులను,ఆ వరములను సఫలము చేయుమని రాముని కోరినటుల మాత్రమే కలదు కాని కల్పవృక్షమున కైక ప్రౌఢముగా రామునితో సంభాషణ నెఱపినది.

ఇచ్చట కైక తానా వరములను కోరిన కారణముగ తనను జనులేమని నిందింతురో, ఆ లక్షణములు తన స్వభావములనుగా చెప్పికొనుట తన నిర్దోషిత్వమును వ్యంగ్యముగా వెల్లడించు కొనుటయే. ఒకడు నిజముగా సద్గుణములు కలవాడు లోకులచే దుర్గుణుడుగా తలపబడు చుండగా వాడు తన యాప్తునితో నేను దుర్గుణుడను గదా! అని చెప్పినచో అది ఒక విధముగా తన సద్గుణములను వెల్లడించుకొనుటయే. అటులనే కైక ఇన్నిదినములు తాను సపత్నీమాత్సర్యమును దాచితిననియు ఈనాడది రామచంద్రుని నిష్కాసన రూపముగా బద్ధమై కార్యరూపము ధరించినదనియు, ఆమెయందు యౌవనస్ఫూర్తి నశింపలేదనియు దశరథునికి కామము చావలేదనియు, కౌసల్య హ్రీక్షేత్రమునకుద్దాలనము వంటిదాన ననియు చెప్పుట - లోకులు తననట్లు దూషింతురని చెప్పుటయే. కైకమ్మ ఈమాటలకు లోకులు తననట్లు నిందితురు కాని తానట్టిదానను కానను భావమిచ్చుట వ్యంగ్యమని, రామచంద్రుని సమాధాన వాక్యములు నిరూపించును.

రామచంద్రుని సమాధాన వాక్యములను గమనింపుఁడు,

"అనుచుం జేయుప్రసంగవాహినిబడిన్ ప్రారంభదుఃఖంబుతోఁ
పని యుద్విగ్నగళస్వనం బెసఁగ సంబంధించుఁదల్లిన్ గనుం
గొనలన్ దెల్విని నవ్వినన్ రఘుకులాకూపార జైవాతృకుం
డును గన్గొంచును నిట్లు చెప్పె మృదుపాండు ప్రౌఢగండా
గ్రుఁడై"

"నీయుపకారమున్ మఱువనే మఱి యోజననీ! యెవండుగా
నీయొక సత్కృతిన్ సలుప నీవగు దింకొక రాదు రెవ్వరో
చేయక యే సహాయపడి చేయఁగరాదను దత్ఫలంబు రాఁ
జేయఁగరాదు లోకమున నేమము త్వాదృశులందు
నిల్చెడున్"

"జననీ! యేమహనీయులైన నుపదేశం బిచ్చినన్ దాని భా
వనయున్ భావనగాఁగ నిల్చినఫలంబా! దేవతామూర్తి ని
న్నును బోలెం జనుదెంచి యాచరణమందుం జొన్పకున్నన్
నినున్
నిను మన్నింతు నహల్యకన్నను హిమానీసత్కృపారాశిగన్"

"ఏ వరయుగ్మ మీవడిగితే వరయుగ్మము రాజొసంగె నే
నావరయుగ్మపాలన కృతార్థ జనుష్కుఁడ నైతినేని నా
యా వరపాలనాత్తసుకృతాఖిలదివ్యతయందుఁ దల్లి! శ్రీ
దేవతవీవు, నన్ననుమతింపుము నీదు పదార్చకుండుగా"

"వసుధయు దీని వెంటఁబడి వచ్చెడుఁ జొక్కులు తన్పు
లింతయున్
ముసరవు నామనస్సునను బున్నెపుకర్జ మొకండు సేయు నూ
హ సొరిది నాయెడంద మఱియాఁచినయట్టుల నివ్వియాఁచ వీ
రసమది నీకునిచ్చిన వరంబున బుట్టిన సేగి కామవే"

రామునితో కైక చేసిన ప్రసంగము దుఃఖముతో మొదలుపెట్టి క్రమముగా దుఃఖము తగ్గి యుద్విగ్నగళస్వనంబైనదట! రాముని వనవాసమునకు పంపుట దశరథునకు దుఃఖకారణమని యామె యెఱుగును అందువలన ఆమెకుకూడ

దుఃఖము. వనవాసఫలము రాక్షస సంహారణము సంతోషకారణమైనను, వనవాసము దుఃఖకరమైనది యగుటవలనను ఆమెకు దుఃఖము అట్టితన ధ్యేయమును సాధించితీరు స్వభావము గలదగుటచే వరమడిగి, ఇచ్చితీరవలెనని బట్టు బట్టినది కాని కౌసల్యాదులు చివరకు దూషించుచున్నారు కదా తన ఇంగితమును తెలిసికొనక యని యుద్వేగము

కైక హృదయమును రామచంద్రుఁడు గ్రహించినాఁడు. గ్రహించినట్లు పైకి చెప్పవలను పడదుకదా; "కనుకొనలన్ తెల్వొని నవ్వునన్ తల్లిన్ కని రామచంద్రుఁడు" పలికెనట! ఆమెహృదయము తనకవగతమైనట్లు చూపులతో, నవ్వుచేతను అతఁడు సూచించినాఁడట !

ఇతరులకు రామచంద్రుఁడు గంభీరుఁడు కావున అడవికి పొమ్మన్నను ఖేదపడక ప్రశాంతమగు చూపులను నవ్వును కలిగి యున్నాడని మాత్రమే తోచును కైకమాటలకురామచంద్రుని సమాధానమునుగమనింపుడు. కైకేయి సహాయమును ఆయన మరువడట లోకములో ఎవరయినను ఒక మంచిపని చేయవలెననిన కైకేయివంటి వారెవరో సహాయపడకుండగా చేయుటకు సాధ్యముకాదు, ఒకవేళ చేసినను ఫలము లభింపదు ఈమాటలో రామచంద్రుఁడు తానుసర్వశక్తిమంతుడైనను,రావణసంహారమునకు తనకు సుగ్రీవాదుల సహాయమవసరమని ధ్వనింపజేయుచున్నాడు అనగా ఈ మహాకార్యమునకు మొదట వరమును గోరి సహాయబడినది కైకేయి తర్వాత సహాయపడినవారు సుగ్రీవాదులు అంతియేకాదు. రామచంద్రుడు లోకక్షేమను కైకవంటివారి చేతులయందే ప్రతిష్ఠిత మనుచున్నాడు లోకులెన్ని విధములుగా తనను దూషించెదరో వాటి నన్నిటిని తన యందారోపించుకొని, రాముని హృదయమును పరీక్షింపగోరి, తన సపత్నీమాత్సర్యమానాడు బద్ధలయినదనియు, తాను రాక్షసిననియు, కౌసల్య యొక్క మంచితనమును నశింపచేయుటయే తన కర్తవ్యము కావున తానట్టి కోరిక కోరితినని కైకేయి పలికినది ఆమె కంటె ప్రగల్భుడు రామచంద్రుడు. కావున ఆమెను తానట్లు భావించుట లేదనియు, లోకము నిందించుచున్నను లోకులను రక్షించుటకు ప్రయత్నించువారి యందే.లోకక్షేమము ప్రతిష్ఠితమైనదనియు రాముఁడు చెప్పుచున్నాడు.

కేవలము ఉపదేశములనిచ్చిన లాభము లేదని, యుపదేశములను ఆచరణలో పెట్టు నవకాశము కూడ కల్పించిననాడే ఆ యుపదేశము సార్థకమగునని చెప్పి అట్టి యాచరణమునకు తన కవకాశము కల్పించిన దేవతామూర్తినిగా కైకనుభావించినాడు శ్రీరామచంద్రుడు ఇచ్చట చమత్కార మేమన కైకేయి తాను రాక్షసిననగా, రామచంద్రుడు కాదు నీవు దేవతామూర్తివనును!

ఇచ్చట కైకచెప్పిన మాటలలో "నా తనుభవు డిప్పుడే సకల ధాత్రికి నీవలె రాజుగావలెన్" అను మాటలలో రాముడెట్లు మునివేషము ధరించునో అట్లే మునివేషముతోడనే రాజగునని సూచితము తర్వాత పద్యమునందు "సపత్నీ మాత్సర్యము బ్రద్దలయి పండెన్" అనునప్పుడు పండినది అను మాటలచే సపత్నీ మాత్సర్యమునకు సత్ఫలితము కలిగినదని ధ్వని. ఇచ్చట కైక రామచంద్రుల సంభాషణము కైక యొక్క ప్రౌఢ సంభాషణాచాతుర్యమును, ఆమె హృదయములోని గంభీర భావముల నవగతము చేసికొనగలిగిన శ్రీరామచంద్రుని ధీపటిమ, దూరదర్శిత్వములను వెల్లడిచేయుచున్నది.

వాల్మీకిపై కొందఱు సాహిత్యవేత్తలు ఒక దోషారోపణము కావింతురు ఊర్మిళపాత్రకాయన చాల అనౌచిత్యము చేసెనని యే వారి దోషారోపణము. మనము సహృదయతతో పరిశీలించినచో ఈ దోషారోపణము న్యాయముగాఁ దోపదు

వాల్మీకి తాను రచించిన కావ్యమునకు రామాయణమనియు, లేక సీతాచరితమనియు లేక పౌలస్త్య వధమనియు పేరు పెట్టెనుకదా దీనినిఁ బట్టి వాల్మీకి వర్ణింపఁ దలచినది సీతాచరిత్రమని తెల్లము కదా! మహాకవి తన కావ్యమునకు నాయికానాయకుల పాత్రములను వర్ణించుట యందును, వారికి సంబంధించిన కథాపోషకములగు పాత్రలఁ వర్ణించుట యందును బద్ధాదరుఁడగును కాని ఇతర పాత్రల వర్ణనమున నాతనికి ఆదర ముండదు కదా! అట్టి సందర్భములో వాల్మీకి ఊర్మిళాసతికి న్యాయము కావింపలేదని ఆయనలో లోపమెన్నుట యేమి న్యాయము ?

లక్ష్మణుడు అన్నతో నరణ్యవాసమున కేగునపుడు ఊర్మిళతో చెప్పఁ బని లేదా ? అరణ్యవాసము కూడ కొలది కాలము కాదు కదా ! పదు నాలుగు సంవత్సరములు మరలిరానివాడు భార్యతో చెప్పకుండగా వెళ్లునా? లక్ష్మణుడు ఊర్మిళతో చెప్పి వెళ్లినట్లు వాల్మీకి వ్రాయలేదు ఇది వాల్మీకి లోపమని యీ విమర్శకుల అభిప్రాయము

వాల్మీకి అట్లు వ్రాయకపోవుటకు కారణమేమయి యుండును ? వన వాసమునకు పోవుచున్న లక్ష్మణుడు ఊర్మిళతో సంభాషించియున్నట్లు వ్రాసిన ఆ సంభాషణ మా యిద్దఱి వ్యక్తుల ఉదాత్తమగు పాత్రపోషణము నకుఁ గాని, రసపోషణమునకుఁ గాని దోహదకారి కాఁజాలదని వాల్మీకి యా వృత్తాంతము జోలికి పోలేదేమో లక్ష్మణుడు అన్నగారితోఁగూడ తాను వనవాసము పోవుచున్నానని చెప్పినప్పుడు ఊర్మిళ తాను కూడ వెంట వత్తునని అనియుండునుగదా! అడవి భయంకరము అచ్చటకు స్త్రీలు రాగూ డదని లక్ష్మణుడనినచో సీతమ్మ వచ్చుచున్నది కదా ! నేనేల రాగూడదని ఊర్మిళ అనినచో లక్ష్మణుడేమి సమాధానము చెప్పవలసియుండును? ఇట్లే సంభాషణ మా యిద్దరి వ్యక్తుల ఉదాత్తతకు దోహదము కాకపోగా దానికి భంగము కూడ అగునేమోయని వాల్మీకి వ్రాసి యుండకపోవచ్చును. వాల్మీకి భరతుని కథా సందర్భమున మాండవినిఁ గూర్చి కూడ చెప్పియుండ లేదుకదా దీనినిఁ గూడ లోపముగా విమర్శకులేల యాక్షేపింపరో తెలియకున్నది.

ఈ సందర్భమున విశ్వనాథుని కల్పనను అనుశీలింపుడు. ఎట్టకేలకు లక్ష్మణుని వనవాసమున కంగీకరించిన రామచంద్రుఁడిట్లనును-

"అమ్మతోఁ జెప్పి నీ భార్య ననుమతింపఁ
జేసి రావోయి సౌమిత్రి, సీతవోలె
నూర్మిళయు వత్తునన్న నే నొప్పికోను
పురము పురమెల్లఁ గదలిపోవుదుమె కుఱ్ఱ!"

వ॥ అంత సౌమిత్రి యూర్మిళా భవనంబు కేగి
"తన యసృగధ్వముల్ పరిచితంబులు పావనముల్
వ్యపేతకా
మనములు సంచితేంద్రియ సమాజములౌ నొకసాధువాహిని
వినమితమైన సంచలన వీచికలం జన నూర్మిళాగృహం
బునఁ దన భర్తృ భావమును బొందియుఁ బొందకయుండె
నచ్చటన్."
"ఊర్మిళయున్నచోటు నొకయుగ్మలిచెప్పఁగ లక్ష్మణుండునా
ధర్మగృహంబుఁ జేరి యటభార్య నిమీలితనేత్రయై మృగీ
చర్మమునందు నున్కిఁగని చానయు వెంటనె కన్ను విచ్చిహా
సోర్మిపవిత్రనేత్ర యయి యుత్సవభావము గోచరింపగా."
"లేచి సమర్ఘ్యపాద్య విమలీకృతవారి శిరోగ్రవీథికన్
రాచి సమీపధాత్రిని గరంబులు మోడ్చి గృహీతభక్తి రే
ఖాచరమాకృతిన్ నిలువఁగాఁబతి యిట్లనె నోసియోగినీ!
యాచితభారమైనయది యంతయు నైనది యెంతచెప్పితో."
"కైకమ్మ వరము కోరెను
(శ్రీ)కాంతుఁడు వనములందుఁ జేరెనె కోరెన్
భూకాంతాసుతయును దా
నై కాంతారము పోవనై యాసించెన్."
"నేనుం బోవుచునుంటినే యడవికిన్ నీవిట్లు లౌనన్నదే
చానా! యక్షరశః ఫలాకృతిఁగనెన్ సౌమిత్రి కాంతారవీ
థీనై స్త్రీంశకతాస్వరూప మిక నాదేశింపు, నేనింక ల
క్ష్మీనారాయణసేవ యేపగిదిగాఁ జేయంగనౌ నూర్మిళా!"
"చెలువ యూర్మిళ మఱల నాసీనయయ్యె
మఱలఁజొచ్చెను బూర్ణ సమాధిలోనఁ
గూరుచున్నట్టి సౌమిత్రి కూరుచుండి
యున్నయట్లుండియే తన యొడలుమఱచె."

"ఉరకన్ జ్ఞానపథంబులన్ దిరిగె నేవో నూత్ననిర్మాణవై
ఖరిఁగాంతారమునందు లక్ష్మణుడు రాకాజ్యోత్స్నలో నూరకే
తిరుగన్ వెంటనురా బలాతిబల లాదేశించు గాధేయస
త్కరుణామూర్తులు క్షుత్పిపాసలనునిద్రాదేవిశాసించుచున్."

"ఆదేవత లిద్దఱు ని
ద్రాదేవిని గికురువెట్టి తద్రక్షితుఁడౌ
నే దీప్తమూర్తినో యవ
సాదించిరి తోడియస్త్రశక్తుల బలిమిన్".

"అంతనొడలు తెలిసె నాతని కూర్మిళ
కనులు తెఱచె నామె ననియె భర్త
మొదలు తెలిసెఁగాని తుది నెఱుంగ ననంగ
నోయి స్వామియంచు నూర్మిళయును."

"యోగి జనౌఘసంసదుది తోజ్జ్వల సత్ప్రథమావతార!నీ
యీ గురుసత్కృపాకలిత నేనొక చెప్పెదు దాననా యనన్
సాఁగిన పిన్ననవ్వుల పిసాళితనంబున లక్ష్మణుండు నే
నే గెదనంచు లేచె హరిణేక్షణ భర్తృపదంబు ముట్టుచున్."

"నీవిచ్చిన సత్కరుణా
శ్రీవైభవ మొప్ప నీదుచిత్తమునందే
నేవెలయుచుందు నిత్యము
భావస్థిర విప్రయోగపద్ధతిఁగను నే?"

"లేమయు భర్తయున్ గవుఁగిలించి రొకళ్ళ నొకళ్ళు బాహులన్
శ్రీమృదుదేహవల్లులు స్పృశించిరి నవ్వులు నవ్వి రచ్చముల్
కామన లేద యున్నదియుఁగావలెఁ జిత్రము కర్మయోగులౌ
నేమహితాత్ములా ప్రభువులీగతినంటియు నంట రన్నటుల్."

వాల్మీకి లక్ష్మణుఁడూర్మిళతో నరణ్యమున కేగుచున్నానని చెప్పినట్లు వ్రాయలేదు వాల్మీకి మౌనమునకు వ్యాఖ్యానమే ఇక్కడ విశ్వనాథ కావించినది

ఊర్మిళ జనకుని ఔరసపుత్రిక జనకుఁడు బ్రహ్మనిష్ఠుడు. అతడు కర్మ యోగమున బ్రహ్మనిష్ఠుడైనవాడు తండ్రినిఁబోలిన పుత్రిక అదృష్టవంతురాలు గదా ఇచ్చట యాయదృష్టము బ్రహ్మనిష్ఠయే కనుకనే యామెను విశ్వనాథ యోగిని యనిరి సీత లక్ష్మీస్వరూపిణియైనను భూమియందు జన్మించుటనుబట్టి భౌతికవికారము లామెయందు స్ఫుటమగుచుండును

ఊర్మిళను ప్రవేశపెట్టక మునుపే, ఊర్మిళాభవనమును ప్రవేశించిన లక్ష్మణుని స్థితిని వర్ణించుటలోనే ఊర్మిళా శీలస్వభావములను విశ్వనాథ వర్ణించెను ఆభవనమున ప్రవేశింపగనే లక్ష్మణుని రక్తనాళములు, పరిచితములై, పవిత్రములును, కామరహితములును, వశీకృతేంద్రియములునగునొక ప్రవాహతరంగములలో నోలలాడినవట ఆగృహంబున అతడు భర్తృభావంబును బొందియుఁ బొందకయుండెనట. మహర్షుల తపఃప్రభావము వారియాశ్రమములనుగూడ నావరించునుగదా! కనుకనే మనపురాణములలో ఆశ్రమములందు సహజవిరోధులగు మృగాదులుకూడతమలోతాము విరోధము లేకుండగా కలసిమెలసి తిరుగునట్లు వర్ణింపబడినది, ఊర్మిళానియమప్రభావమూమెభవనమునుకూడ పవిత్రము కావించినది.అట్టిభవనము ప్రవేశింపగనే తాను భర్తృభావనమును పొందినవాడైనను పొందనట్లే యుండెనట! లక్ష్మణుడాభవనములోనికి పోవుసరికిఊర్మిళ యే స్థితిలోనున్నది? మృగచర్మమునందున్నదట. వెంటనే ఆమెకన్ను విచ్చినదట కన్నువిప్పి, నేత్రములచే హాసమును వెలిబుచ్చి సంతోషభావమును ప్రకటించినదట. ఇచ్చట"మృగీచర్మమునందు నున్కిఁగని"అనిపాఠము ముద్రితపుస్తకములలో కనబడుచున్నది.'కనె' అనుపాఠమును పొరపాటుగా 'కని' అనిముద్రించి యుందురని నాయభిప్రాయము.లేనిచో లక్ష్మణుడు అను కర్త అన్వయించు సమాపకక్రియ పద్యములో లేకపోవును. తనచిరునవ్వుతోను, సంతోషప్రదర్శనముచేతను,తనకు జరిగిన విషయమంతయు తెలియుననియు, జరిగిన విషయములు తనకామోద

కరములేయనియు ఊర్మిళధ్వనించినదన్న మాట లక్ష్మణుఁడు కైకవరములను నూర్మిళకుఁ దెలుపునపుడు కైకమ్మపై నెట్టి క్రోధమును వెలువరింపలేదు. ఆమెను దూషింపలేదు ఆతనిలోనున్న తాత్కాలికములగు క్రోధాది మలిన భావములన్నియు ఊర్మిళాభవనమున కాలిడగనే మటుమాయమైనవి సత్యము గోచరించినది. ఇది ఊర్మిళా తపఃప్రభావమే

లక్ష్మణుఁడు ఊర్మిళను 'యోగినీ' అని సంబోధించినాడు కైకమ్మ వరముల నడుగుట, రాముఁడు వనవాసమునకు ప్రయాణమగుట, సీతమ్మ రాముని యనుసరించుట అన్నియుచెప్పి తానును అడవికేగు చున్నాననియు నీవు చెప్పినదంతయు అక్షరాలా సత్యమైనదనియు లక్ష్మణుఁడు తన సతికిఁ జెప్పెను

విశ్వనాథ యొక్క కల్పనామహిమ యిచ్చటనేగలదు ఈ కల్పన వలన విశ్వనాథ లక్ష్మణుని సమస్యలను సులభముగా పరిష్కరించినారు. లేక ఊర్మిళ కిట్టి యోగప్రభావము లేకుండగా సామాన్యురాలైన ఉత్తమ క్షత్రియవనితగా చిత్రింప, బడియుండినచో లక్ష్మణునకామె అయోధ్యయందు యుండ వలెనని యొప్పించుట దుర్ఘటమై యుండెడిది. అట్లుకాకయామెను యోగినిఁగా చిత్రించి ఆమెకు తన యోగప్రభావమున భవిష్యత్తు అంతయు కరతలామలక మైనట్లును వారివనవాసమట్లు తటస్థించునని ముందే తన పతితో ఊర్మిళ చెప్పియుండినట్లును, ఆమెహాసముచేతను, సంతోషముచేతను తనయంగీకారము సూచించుటచే లక్ష్మణునకామె యనుమతిని అడుగవలసిన పని లేకపోయినది అందుచేత తానికమీద సీతారాముల రక్షణసాధనము మాత్రము గానే యందుననిచెప్పి, తానువనమున లక్ష్మీనారాయణుల సేవయెట్లు చేయ వలయునో తెలుపుమని మాత్రమే ఊర్మిళనడగెను.

లక్ష్మణుని ప్రశ్నకు ఊర్మిళ యేమియు చెప్పకయే మఱలసమాధిలో కూర్చుండెను ఊర్మిళ సమాధి ప్రభావమువలన లక్ష్మణునికి యప్రయత్నము గానే మైమఱపు కలిగినది. అతని జ్ఞానమయకోశమున ఆతఁడు వనవాసము చేయుట, ఆసమయమున గాధేయుఁడనుగ్రహించిన బలాతిబలవిద్యలు క్షుత్పిపాసలను, నిద్రాదేవినినిగ్రహించిన యనుభూతి పొందెను

లక్ష్మణుని ప్రశ్నకు ఊర్మిళ "యోగి జనౌఘ సంసదుదితోజ్జ్వలప్రథమావతార!" నీకునేను చెప్పుదాననా యనినది లక్ష్మణునియామె సంబోధించిన మాటలో లక్ష్మణుని స్వరూపము నామెగుర్తుకు తెచ్చినది యోగి జనులనగా కర్మయోగులు, వారియొక్క ఉజ్జ్వలమగు ప్రథమావతారము లక్ష్మణుడు లక్ష్మణుఁడాదిశేషుని యవతారమని మనము జ్ఞాపకముంచుకొనినచో ఆతడేగదా పరమేశ్వరోపాసకులగు కర్మయోగులలో మొదటివాడని చెప్పవలెను ఆతడు ఆదిశేషుని యవతారమను మాటను జ్ఞాపకముచేసి నీకు లక్ష్మీనారాయణసేవ యెట్లుచేయవలయునో నేనుచెప్పుదాననా యనినదట దానికి లక్ష్మణుఁడునవ్వి తానువెళ్లెదనని లేచినాడట.

ఇచ్చట ఊర్మిళ బలాతిబలవిద్యల యావాహనము గావించి లక్ష్మణునకు వానిస్ఫూర్తిని కలిగించి వనవాసమున పరమేశ్వర సేవకు ప్రతిబంధకములగు క్షుత్పిపాసలను నిద్రను తొలగించినది ప్రతిబంధకములు తొలగిన తర్వాత ఆ సేవ యెట్లుచేయవలెనో లక్ష్మణుడే యెరుగును. అతడు కర్మయోగుల ప్రథమావతారముకదా!

ఇచ్చట "యోగిజనౌఘ సంసదుదితోజ్జ్వల ప్రథమావతార" అనుచోట 'జనౌఘసంసదకు, బదులుగా 'యోగిజనౌఘ సంపద' అనుపాఠముచితమగునేమో యని నాకుతోచుచున్నది. ఓఘయనిచెప్పిన తర్వాత సంసదను పదమనవసరముకదా!

ఊర్మిళాలక్ష్మణులు కవుగలించుకొనిరట అచ్చములైన నవ్వులు నవ్విరట వారికి కామనలేదని చెప్పలేము ఉన్నదనియు చెప్పలేము

ఇచ్చట యీ సన్నివేశమును-లక్ష్మణుఁడు "తన భర్తృ భావమును బొందియు బొందక యుండె నచ్చటన్" అను పద్యముతో ప్రారంభించి "కర్మయోగులౌ నే మహితాత్ము లా ప్రభువు లీగతి నంటియు నంట రన్నటుల్" అను పద్యముతో నంతము చేసెను ఇట్లు ఉపక్రమోప-సంహారములకు నైక్యము సంధించి ఊర్మిళా లక్ష్మణుల సంసారరహస్యమును విశ్వనాథ తెలియఁ జేసెను ఈ సన్నివేశమున వాల్మీకి మౌనము వహించెను. ఆమౌనమునకు విశ్వనాథ అద్భుతమగు వ్యాఖ్యానము కావించెను.

వైదిక సంస్కృతి,సంప్రదాయము,తాత్త్విక సిద్ధాంతముల నాధార ముగాఁగొని విశ్వనాథ కల్పనలను జేయును.వాని పొంతపోని వారికి విశ్వనాథ కల్పనలనుచితములుగాఁ తోపవచ్చును

మహాకవికాళిదాసు రాజర్షి సూర్యవంశపు ప్రభువు నిట్లు వర్ణించెను

"జుగోపాత్మా నమత్రస్తః। భేజేధర్మమనాతురః

అగృధ్ను రాదదే సోర్థ మసక్త స్సుఖ మన్వభూత్ !"

ఈ అనాసక్తి యోగముతో సంసారయాత్రను సాగించినవారినిగా ఊర్మిళా లక్ష్మణులను విశ్వనాథ చిత్రించెను.

# అనసూయాఖండము

శ్రీ ఎం. వి. యస్. శర్మ

శ్రీమద్రామాయణ కల్పవృక్షమునందలి అయోధ్యా కాండములోని చివరి భాగమగు "అనసూయాఖండము-కథాశిల్పము"ను గూర్చిన పరిశీలన ఈవ్యాసవిషయము యథార్థముగా జెప్పికొనినచోనిందుకథ చాల తక్కువ వర్ణనలును సన్నివేశములును నెక్కువ అయున్న కథకూడ యీఖండమందు చివరనున్నది. అసలుకథ ముందరచెప్పి కొందము సీతారామలక్ష్మణులడవులలో బోవుచు యత్రిమహర్షి యాశ్రమమునకేగిరి వారు పోవునప్పటికి మహర్షి సమాధి యందుండెను. తరువాత కొంతసేపటికాయన కనులు దెరచి "కుడికంటమటొక్క చంద్రుడై" చూచెనట! అనగా చల్లని చూపు చూచెను అంతియ కాదు. ఆమహర్షి కుడికంటి నుండి చంద్రుడు పుట్టుటచే నట్లు చెప్పబడెను ఇందింకను విశేషమున్నది. అట్లుచెప్పుట వలనను సీతపై ఆచల్లనిచూపు ప్రసరించిన దనుటవలనను అత్రిమహర్షి కనులు తెరుచుసరికి ఆయన కుడివైపున ముందు సీతయు, తరువాత రాముడును, నటువెనుక లక్ష్మణుడును నిలచిరని యర్థము. వారెట్లునిలచిరో చెప్పకచెప్పెను ఆచల్లనిచూపు ముందు సీతపై ప్రసరించుటచేనామె కొకవిధముగ నాయాశ్రమమున నొక మేలు జరుగుననియు ధ్వని. సీతారామలక్ష్మణుల నత్రి "ప్రేయోభావము నొల్కబోసి" చూచెను ఆచూపులో పిలుపున్నది; వారికి మహర్షిరూపమున తండ్రియగు దశరథుడు వచ్చినట్లనిపించెను. అది శుభసమావేశము; యువదంపతి భావవిలసితులైన సీతారాములయు,వృద్ధదంపతి భావసము న్మేషులైన అత్ర్యనసూయలయు సంధానము.అదిఇద్దరు యోగీశ్వరులయు, యోగేశ్వరులయు కలయిక శ్రీరాముడా మునిని సీతకుజూపి "ఈయన ఎవ్వరో నీకుతెలియునా?" అని ప్రశ్నింప ఆమె, "తెలికంటి వెలుగుముక్కొ మిల మిలలవు పచ్చిపాల మీగడతరకో..." అని తానావృద్ధ తపస్వి యొక్కచూపు వలన కలిగిన అనుభూతిని వర్ణించినది. ఆయన యత్రియని ఆమెతెలిసి కొన్నది. పిమ్మట

నాముని అనసూయను "ఓసి వృద్ధతపస్విని! రా! రా! మిపులంబ్రాతచుట్టాలు వచ్చిరని" తెలుగువారి స్వాభావికమైన పిలుపుగా బిలిచినాడు ఆ మిక్కిలి ముదుసలి తపస్విని వచ్చినది ఆమె "ఎండిబెరళ్ళు పేడెత్తిన వంకర రావి పుల్లయు బోనిరమణగఁ ది..." ఇత్యాదిపదక్రమున నావృద్ధు రాలిరూపము కన్నులకు గట్టునట్లు వర్ణితమయ్యెను.అట్లువచ్చిన ముసలియామెతో ఆ వృద్ధుడైనముని "అమ్మ! ఎవరో ఎఱుంగుదువె యీపసిదానిని సీత, సీతయే (మన సీతయని మిక్కిలి యాప్యాయముగ చెప్పుట); ఆయన ఇంద్రనీల శకలాకృతి మైథిలు నల్లువాడు" అనియొడలు మరచిన ప్రేమతో చెప్పినాడు జానకిచేత ననసూయకు సేవచేయింప వలసినదిగా జెప్పించినాడు ఆగౌరవనీయురాలు వృద్ధురాలునగు భారభ్రమనతను గూర్చియుగ్గడించినాడు. పూర్వమనసూయ దేవతలకు మేలుచేసిన విషయమును కందమూలములను సృష్టించిన మహిమను జెప్పి దైవత నమస్కారార్హమైన అనసూయ జానకిని దయదలచినచో రాముడు నిర్భీతిగా నడవులలో బోవచ్చునని సూచించినాడు. ఇందనసూయ మహిమ కథగానికథగా మూడుపద్యములలో వ్రాయబడెను అసలు కథలో ప్రస్తావనగా వచ్చిన విషయమును ప్రస్తావనగానే క్లుప్తముగ చెప్పుట యిందలి సొగసు. అప్పుడు రాముడు అనసూయను గూర్చి సీతతో "మా యమ్మవలె నున్నదనియు ఆమెకు సపర్యజేయ వలసిన దనియు జెప్పెను. సీత అనసూయకు నమస్కరించి "జనకాధీశుని కూతురన్ దరణి వంశస్వామికిన్ గోడలన్" అని తన్నుతాను పరిచయము చేసికొన్నది. ఇందుస్త్రీ సహజముగ సీత ముందుతన పుట్టినింటిని తరువాత తన మెట్టినింటిని పలుకరించుట స్వాభావికము. "కాళ్ళ బొమికల మధ్య హత్తుకొని పోయిన ఎండిన చర్మమైన" అనసూయ పాదములకు సీతనమస్కరించెను ఆపాదము లామె తపమునుతెలియ జేసెనట. తరువాత పాతివ్రత్యము నుగ్గడించి అనసూయ తనతపో మార్గము నామెకు తెలిపినది దానితో అట్టితపము మొదలు పెట్టిన సీత గట్టిపడవలయును. ఆమెమార్గమీమె కనుసరణీయమని యర్థము. ఈఅనసూయా సంభాషణములో సీతనామె యప్పుడప్పుడు సంబోధించినది. ఈసంబోధనలు అనసూయ సీతనెట్లుచూచినదో తెలుపును.అవి "వారిధరాసితాలకా!" "ఇరమ్మద కాంతిలోచనా!"— "హరిద్రవామల చిబుకా!"— "లేఖనది పద్మకలికాంజలీ!"— వరుసగా నల్లనిమబ్బులవలె సుందరముగ నున్న

సీతాదేవి ముంగురులను, మెఱుపుతీగలవలె కాంతిల్లిన కన్నులను, పసుపు ముద్దవలెనున్న గడ్డమును, అనసూయకు సీత తనచేతులను జోడించి మొగ్గ వలెనుంచి నమస్కరించుటయు చెప్పబడినది. సీతపై అనసూయకు హృదయ మెట్లు ప్రేమాస్పద మైనదో యీసార్థకములైన పిలుపులు తెలుపును

ఋషిపత్ని సీతను కౌగలించుకొన్నది ఆమె కౌగిలి నమ్రతతో సీత తొలగించుకొని, పతిననుసరించివచ్చిన దానికితన్ను మెచ్చుకొనిన యనసూయతో లేతజాబిల్లివెలుగుల పూతవలన చంద్రకాంతంబు కరగుట సద్గుణము కాక అదిదాని స్వభావమనియు, అట్లేగ్రహములు సూర్యునిచుట్టు తిరుగుట వారి యుదారగుణముకాక దివాకర పటుగోళశక్తి పరికల్పిత చంక్రమణ మనియు శాస్త్రీయముగ జెప్పినది. సీత తనమామగారికి మూడువందలమంది మగువలనియు వారినెల్ల రాముడు కౌసల్యనువలె జూచుననియు జెప్పెను తన భర్తవంటి పరమసాత్త్వికుడు ఉండడట సత్త్వరూపము దైవపదార్థము కదా! మరివాని యందమునుచూచి వారిశత్రువులైన దైత్యస్త్రీల కైనను నిల్వనైన గలుగదట! తానాతని యందు బతివ్రత యగుట తనగుణము కాదట అట్లుకాకుండ నుండుట అసంభవమట! పిన్నవయసున నున్నదైనను సీత యింత చక్కగచెప్పుటచే చివురుం జెక్కిలి కొట్టి అనసూయ మెచ్చుకొన్నది దానికి సీత నవ్వెను. అప్పుడనసూయ "సుమాళదంత మౌళిద్యుతీ!" అని సంబోధించినది పాత్రల యవస్థా విశేషములను నీపద్ధతిలో వర్ణింపకుండ వర్ణించుటయిది అనసూయ, "నీదు మాటలకు న్యాయానందముల్ పొంగులైనవి — 'యవ్వాని ఫలంబు గోరికొనవే నాతల్లి! నీకిష్టముల్" అని తనమిక్కిలి పండియున్న తపమును ధారవోసి సీతకోరిన దాని నిచ్చునట. గుణము గుణమును ప్రేమించును గాని అవగుణము గుణమును ప్రేమింపదు. అనసూయ ఆనందమును పట్టలేక సీతను మెచ్చుకొని వర మిత్తుననెను. సీత వలదనెను. ఇచ్చట సీతాదేవి స్వభావము పరీక్షకు బెట్టబడినది. అనసూయ తాను వరమిత్తుననుటకు తోడు,ఆమెకు తానిచ్చుటయు తపమేయన్నది ఆమె సీత రూపముననున్నది యచ్చటినుండి జగజ్జనని యని అనసూయకు తెలియునన్న మాట. ఈ సులభమైన తెలుగు నుడికారపు సొంపుతోనది మనకును దెలియును సీత తానొనర్చుచున్న పాతివ్రత్య

మునెడు మహాకవపమున కంతరాయముకలుగరాదు; అది పాడుకారాదు అందుచేత తనకు వలదన్నది. ఈ ఘట్టమునందంతను సుందరమైన తెలుగు పదప్రయోగములై గొప్పభావములు బిగుసుకొన్నవి. మఱియొక యుదాహరణము— "నిన్నును బోలుదానవే నీవు" — "నీపతి తన్నునుబోలువాడు" —ముగ్నగు ప్రయోగములు కావ్యత్వమునకు భంగము రాకుండ వాని పరమేశ్వరత్వమును స్థాపించును

సీత వలదన్నను అనసూయ తాను దేవతలకైన వరమిచ్చు నలవాటున గాబోలు వరమిచ్చి వైచినది. అదియేమి? మైపూత, గంధము, చీర, పూమాల కై సేసికొమ్మని చెప్పినది ఆమె యలంకరింపలేదు. ఇది కవితలోని యౌచిత్యము అనసూయ వయసున మిక్కిలి పెద్దది అందుచే అది యిట్లే జరుగవలయును సీత అనసూయా తపః కల్పితమైన పదార్థములను బుచ్చుకొనక తప్పినది కాదు గాన, "ఇంచుకంత లజ్జయు, ఇంచుకంత జాగునుగా" మర్యాద పాటించి వాని నలంకరించుకొని 'పొక్తా తనముగా' ననసూయ దగ్గర కూర్చున్నది ఆమెపై తనకున్న పూజ్యభావము చేత నట్లుండుట సంస్కారుల లక్షణము గదా! సీత అట్లు కూర్చుండిన వెంటనే అనసూయ—

"ఈ పూమాలయు వాడదు
మై పూతయు జిలుగు సెడదు, మధురాపాంగ
శ్రీపాలిత లజ్జా! నీ
యేపు చెడదు చీర నలుగదే! నాతల్లీ!" అనెను.

ఎంత చక్కని తెలుగున ఎంత చిక్కని భావ మిమిడినది! ఇవి ఎంత సత్యమైన పలుకులో అంత స్వాభావికమైన భాషణములు ఆ యలంకార మామె చేసికొనుట వలన భర్తకామెపై నెట్టి యనురాగము గలుగునో చెప్పినది అక్కడ, 'అల్లలంజను దెంచు నప్సరస లాగున దోచెదు వాని కంటికిన్' అని నిర్ణయముగా పలికినది. పై సంబోధనము నందు పాత్ర వర్ణనము గూడ గలదు అనగా అనసూయ ఆ మాటలు చెప్పినప్పుడు సీత సిగ్గుపడినది. అట్లయ్యు, నది యామె కిష్టమైన విషయము ఐనను ఆమె

పవిత్రురాలు గనుక అనసూయ చేతకు తాను గొంకినది మఱియొక విధ ముగ జూచినచో అనసూయ యొసగిన వరము సీత కొంపముంచినది! ఆ జంకుటకిది యర్థము. యుద్ధకాండము చివరి ఘట్టములో సీతాగ్ని ప్రవే శమునకు సంబంధించిన విషయమిది రాముడాయమ శీలము నా శంకించి నాడు పరుడైన రావణునింట నున్న సీత లంక నుండి తన దగ్గరకు వచ్చినపుడు అచ్చర వలెనే గానుపించెను అట్లు కనబడుట కదియే కార ణము మనము రామాయణ కల్పవృక్షమునందు మహాకవి ప్రవేశపెట్టిన కావ్యలింగముల మార్గము నర్థము చేసి కొందుమేని, ఇట్టి కథలు పూర్వా పర సంబంధులై, సునిశిత కావ్యశిల్పాభిరామములై యొప్పారుట దెలిసి కొందుము ఈ మహాకావ్యమున, సముద్రమున నలల వలె నిరంతరములైన కథలను మలచు వైఖరుల శత సహస్రములుగా జూతుము. దీనిని బట్టి పతిశీలయైన సీతను శ్రీరాము డాశంకించిన దానికి విశ్వనాథ మహాకవి యొక్క యపూర్వ వ్యాఖ్యానము మనకు తెలిసినది రామాయణ వ్యాఖ్యాత లెవ్వరు నిట్లు చెప్పలేదు. ఇదియే కాదు శ్రీ విశ్వనాథ వాల్మీకి మహాముని సంయమిగా జెప్పిన కొన్ని వందల విషయములనై నను అనిదంపూర్వ వ్యాఖ్యా ఘంటా పథమున వెలయించెను. అందుచేత నీ మహాకావ్యము శ్రీమద్రామాయణ కల్పవృక్షము గాని విశ్వనాథ రామాయణము గాదు!

ఇంకను సీతానసూయుల యీ సన్నివేశములో తన్ననసూయ యడుగగా తన ప్రభువు శివధనుర్భంగముచేసిన విధమును, సీతారామాదుల కళ్యాణమును గూడ చెప్పినది ఇచ్చట నిది ఎంతవరకెట్లు చెప్పించినచో కథలో కథయై, యౌచితీ పరిపాలనా బద్ధమై యుండునో యంతవరకే చెప్పబడినది. ఈ కథను బాలకాండము నందలి కల్యాణ ఖండములో విపు లముగ జెప్పినట్లిచ్చట చెప్పరాదుగదా? ఒకే రూపముగల వస్తువైనను రంగుల భేదము చేత నేత్రాభిరామముగ జేయుట మహా భావుకుడైన కవి కార్మికుని నైపుణ్యమగును ఈ కథను, సీత చేత ననసూయ చెప్పించు కొనుటయందే చమత్కారమున్నది.

అసలీ కథ మూలమునను తక్కువ ఇది రామాయణ కల్ప వృక్షము నందు రకరకములైన నగిషీ పనులతో నొక్క విశాలమైన ఖండముగా జేయ బడినది. అందుచేత నిది తెలిసిన విశ్వనాథ, కథాశిల్ప మనోజ్ఞముగ రమ ణీయ వచః పారమ్యముగా చేసెను ఇంతవరకును మనము అసలు కథన చెప్పుకొంటిమి. ఈ ఖండమున నీ కథకు ముందున్న లోకాశ్చర్యకర సృష్టి నిప్పుడు బరిశీలింప వలయును

అనసూయా ఖండమునకు పూర్వమున్న కథలో రాముడు దశరథ మహారాజున కుత్తరక్రియ లొనర్చుట చెప్పబడెను. నిత్యము ననేక స్నానము లచే, కర్మకాండచే సీతయు మిక్కిలి బడలియున్నది అత్తలు ముప్వురును, భరతాదులును, పచ్చినవారు పోవుచుండగ, ఆమె యాశ్రమము ముందు బడలికచే నొక్కొకకాలు మార్చుకొనుచు, నాలోచించు నట్లే నిలచి యున్నది అందుచేత శ్రీరాము డగ్నికార్యము నిర్వర్తించు వేళకు వలసిన పదార్థముల నందియిచ్చుటకు ఆమె యగ్నిగృహమున లేదు. రాముడు అగ్ని కార్యమును నిర్వర్తించి, అధిజ్య ధనుసున నొఱిగి ఏదియో నాలోచించు చుండెను. ఇంతలో లక్ష్మణుడు వెలుపలినుండివచ్చి, 'సూక్ష్మ హేలా విచా రుడ' న్నను గాంచెను ఆయన సీతకై తమ్ముని కన్నుల పృచ్ఛ చేసెను తరువాత ఆయన యగ్ని గృహమునుండి వెలుపలికి వచ్చి నిలబడియున్న సీతను గాంచి పలుకరించకుండ నసమ్మతిగ బోయినవాడు తిరిగి వచ్చుచు వచ్చుచు, "నిను వదలి పోయినామని యనుకొను చున్నార యత్తలందఱు నినుఁదో, కొనియైనఁగాని పోమే, యని వారలు వగచు చుండి రంభో జాక్షీ!" అనెను ఇవి ఎంత సాధారణమైన తెలుగు మాటలో అంత నర్థవంత ములు ఆ అర్థము సన్నివేశమునుబట్టి వచ్చునట్లు బెసగకుండ చేయబడినది రాముఁడు సీతనెగతాళిగ మాటలాడుట యిందుగలదు ఆమెపై ఆయనే కీపత్తు కోపము వచ్చుటయు నిందుగలదు దీనికి హేతువేమి? అది పైనను కొంటిమి అసలాయన మతమున దేనికి దానినే ఖండితముగ జూచుటగలదు సీత అట్లు కాదు అత్తలు, మరదులు, అయోధ్యలోని వారి నితరులను గూర్చియే ఆలోచించుచు నిలబడినది ఆమె అచ్చట బాధపడుచు నిలచెను. దానితో నాయన పనిని మరచెను శ్రీరాముని సన్నిధానమున నుండ వలసిన

భాగ్యమును తానొక్క-తెయే అనుభవించుచున్న యథార్థము నుదాత్తముగ తలపోసికొనుచుండెను తన పని చేయు వేళ కామె యచ్చట లేదని ఆత డలిగెను శ్రీరాముని మాటలయందు ధ్వనితమైన వేళుగలపు నామె తెలిసి కోలేనంతటి తెలివితక్కువ స్త్రీ కాదు అది వెంటనే గ్రహించినది అతని యపార్థమును ముందే వాచ్యము చేయక, "సాకేతమ దెప్పుడో తిరిగి పోమా! తాత పాదున్ వశిష్ఠుని ప్రశ్నింతు నరుంధతవ్వ పయి దచ్ఛుద్ధాంత రంగంబునందున నెద్దే ననుమానముం దగిలెనా తోరంబు నీకించుమనున్" అని తాను తిరిగి మెలితి వెట్టినది సీత ఎంత అమాయకురాలో అంత గడుసరి! ఆతరువాత తన భావమును భర్తతో గనుక వాచ్యము జేసి చెప్పివేసినది ఆమాటలకు రామునకు దిమ్మతిరిగెను అంత తెలివైన వాడును నప్పుడు దానామెను ప్రసన్నను చేసికోవలసిన స్థితి పట్టినది ఈ వర్ణనా ఘట్టము మనలను సున్నితముగ నవ్వించును ఎందులకు? ఆమె యలుకను దీర్చుటకై రాము డప్పట్టున చాల త్రిప్పలు బడుటచేత సీతారాముల వంటివారుగాని, అట్టి వారైన సాధారణ దంపతులు గాని పరస్పరార్థ స్ఫూర్తి గలిగిన మార్గమునందర్థ స్ఫూర్తి గలిగించుకొనుచో గార్హస్థ్యమైన ప్రేమము పరస్పరమై ఎదుగు నన్నది సత్యము గదా! అది ఒక చూపుతో, ఒక చేతతో, తేలునది కాదు అని దానిని సాధారణీకరించిన విశ్వనాథ సత్కవి వ్యాఖ్యాన మిది ఇది లోకానుభవమునను నంతియే కదా! జాయాపతులు సీతారాముల వంటి వారగుచో నా ప్రేమము నిత్యనూతనత్వమెనయును మహాకవి ఇచ్చటి వర్ణనా శిల్పమును కథా శిల్పముగ నింద్రజాలమొనర్చి, వెలయించిన దాని మర్మమిదియే

అలుకలు నవ్వులై సీతారాములు, 'పలానల్లకీవనీ నిరీక్షాపేక్ష'తో చేయి చేయి పట్టుకొని పోయిరి వారు పోవు దారిలో కొండ మల్లెల తీగలు దారి నడ్డుచున్నవి; అవి పువ్వులతో విచ్చుకొన్నవి; వానిపై తుమ్మెదలు జారులైనవి అవి రామున కడ్డము రాకుండ తాను ముందేగుచు సీత, 'మృదు మంద హాసమున పాణితలమేకొని తొలగింగ దియించుచుండ శ్రీరాముడు విదేహా రాజ్యప్రచార విభవము' గనెనట! ఆ తెరువడ్డుగ వచ్చుట, 'వంద మంది మరదంద్రుడు పరాచికమాడినట్లు'న్నదట! ఇందెంత

చమత్కారమున్నది! లతలు భూజాతములు సీత తాను భూజాత అందు చేతనే రామచంద్రుడు విదేహరాజ్య ప్రచార విభవముగనుట— వంద మంది మరదండ్రు పరాచికమాడుట (ఇది రాముని అత్తవారింట జరగు నది ఒక్క చురుకైన తెలుగు మరదలున్నచో బావల కూపిరి యాడుట దుర్ఘటము) ఇచ్చట శబ్దౌచిత్యమును, భావౌచిత్యమును వెలుగుల కర ళ్ళను విరజిమ్ముచున్నవి

పిమ్మట సీతారాములు చిత్రకూటపు కొండ లోయలలో, ప్రణయ విహారమునందు బహువైఖరులుగా నున్న సిద్ధ సాధ్య యక్ష కిన్నరుల జంట లను జూచిరి ఈ వర్ణన చైతన్యవంతములైన దృశ్యములను చూచుట ఆ వెనుకనే వారి యలుక విషయము పలుకరింపబడెను మనము కథలో వెనుక నుండి ముందునకు వచ్చితిమి

తరువాత వారు గంగ పట్టెకు జనిరి. అచ్చట ప్రియమునమున్న నీటి బెగ్గురులను, గంగా కూలమున తపముజేసి కొనుచున్న తపస్వులను జూచుచు జనులు మసలనట్టి ఒకరేవున దూరమందు స్నానమాడ బోయిరి. అచ్చట రాముడు ముందు నీట దూకెను అతడామెను గంగలోనికి లాగెను. అచ్చట వారిద్దరును జలక్రీడలు సలిపిరి వారి జలక్రీడ చక్కగ వర్ణింపబడినది ఇందు పూర్వ భాగమంతయు వర్ణనయేకాని కథ కాదను కొంటిమి. కాని అందును చిన్న చిన్న కథలున్నవి అనగా రమణీయ సన్నివేశములు సుందరమైన వర్ణనతో కథలవలె చెప్పబడినవి. వర్ణనలను చిన్నచిన్న కథలుగా చెప్పగల ప్రజ్ఞాశాలియైన మేధానిధి విశ్వనాథ సన్ని వేశములయందు కథా శిల్ప సూక్ష్మగతులను మలచుటలో గష్టమేమున్నది! ఆయనకిట్టి ప్రజ్ఞ చిన్నతనము నుండి యుండి యుండవలయును అది ప్రతిభతో పరిణతి పండించుకొన్నది.

నీటిలో రామున కొక్క మొసలి కనబడినది. వెంటనే సీతను రాము డొడ్డునదించి నీట దూకి మొసలితో పెనగినాడు. అది యాతని పట్టు తప్పించుకొనజూచెను; కాని అది దానికి సమర్థము కాకపోయెను. అది వారిని తినుటకు రాలేదనియు, ఖరుడును, దూషణుడును లగ్నక వృత్తు

లనియు, లంకలో రామున కున్న వైరభావము కారణముగ జాగ్రత్తగ నుండ వలసినదనియు చెప్పెను ఆ చెప్పుట రాముఁడు దాని దౌడలను జీల్చిన వెనుకనే జరిగినది. పిమ్మట 'తలక్రిందులై మొసలి యంబుప్రవాహము లోన బోయినన్' అని విశ్వనాథ జెప్పెను. చచ్చిన జంతువు నీట నట్లగు నని దెలియుట పరిశీలనా ఫలము అది చచ్చినదని వాచ్యము చేయలేదు ఇది చెప్పుటలోని ప్రౌఢిమ. తరువాత సీత అదితెలిసికొని స్త్రీ సహజమైన మాట లతో క్రూర జంతుదుస్తనుత (మొసలి రూపమున నుండుట) దాని సన్మతి పదం బును (ఉపకారబుద్ధిని) తెలియనీయలేదని రాముఁడు విచారింపగా, 'కడు మంచి బాగాయె గాని... ...' ఇత్యాదిగా ఆయన నూరార్చినది ఇచ్చట నబల మాటలాడు వైఖరి చక్కగ చిత్రితమయ్యెను

అటు వెనుక సీతారాములు చిత్రకూట గిరిశృంగ కానన సుమ కుటీ రములందు జొచ్చి పూలదండలు కైసేసికొనిరి అసలు వారిద్దరును ముని వేషధారులైన లక్ష్మీనారాయణులుగదా ఇచ్చట పార్వతీ పరమేశ్వ రుల భావమందు ఆహాత మొనరప్బబడినది ఇది ఇచ్చట సూచితమైనను రామా యణ కల్పవృక్షమునందెట్లు చూచినను అద్వైత భావ వీధీ మనోజ్ఞత్వము నిరూపితమై కథయందిది సర్వదిశావ్యాప్తమై యున్నది

మరొక శైలకందరమునందు ప్రవేశించిరి అచ్చట శిలలయందు దశావతారములలో కొన్ని గండరింపబడియున్నవి వాని యందితర శిల్ప ములును వారికి మనోహ్లాదమును గలిగించెను ఇవి జడశిల్ప దృశ్యములు. రాముఁడు వానినన్నింటిని సీతకు వివరించి చెప్పినాడు. మరియొకవైపు చిత్రములేయున్నవి అవి రమణీయముగ గీయబడియున్నవి సీత వానిని జూచి తన మనోగతి యందు తోచిన భావములను చక్కగ స్వామికిఁ జెప్పెను. అప్పటికామె అలసిపోయెను ఇచ్చట స్వామి శృంగార చేష్టాభి వర్ణనమును కొంతగలదు వారు కొంతదూరము నడచి, అశోక తరు సంతానమున్న వనమునందు ప్రవేశించిరి కమ్మనిపూలవాసన గొనితెచ్చు వాయువును, గాలికూగుచు వారినాహ్వానించు కొమ్మలయందలి పత్రము లును గలిగి యది, వారు విశ్రాంతి నొందుటకు తగియున్నది. అచ్చట సీత

యొక చెట్టుమొదలనున్న యొక శిలపై గూర్చుండెను ఆమెకొప్పున నలంక రించు కోరికతో స్వామి కొంతదూరమున పువ్వులనేరుచుండెను ఆమె కూర్చుండిన తావుననున్న ఆ చెట్టు కొమ్మపై నొకకోతియున్నది అది స్త్రీనిచూచినది కదా! కోతిచేష్టలు మొదలుపెట్టినది. దానిసంబరమునకు మితిలేదు ఆచేష్టలు స్వాభావికముగా వర్ణింపబడెను కొంతసేపటికది యామెముందు నిలచి నృత్యమాడ దొడగెను; అప్పుడామె భయపడెను రాముఁడు తానేరిన పువ్వుల నట్టెపారవైచి కోతి నదిలింపగా నా 'గోలాంగూల మహేశ్వరుండతడు కన్గోల్ నిమీలించి......శిరమున్ హస్తద్వయిం జేర్చి......ధరణి కన్యాభిణి పాయంజనెన్' — ఇందిది సుందరమైన సన్ని వేశమగుటయే కాదు, సుందరకాండలో హనుమ సీతాదర్శనాదికము వట్టి సూచ్యార్థ సూచనగా గాక - ధ్వని మార్గమున నదియంతయు పలుకరింప బడినది! ఆ పదములను పరిశీలించుచో మనకీశ్వరాంశ సంభూతుడైన హనుమంతుడొనర్చు మహాత్కార్యమే కన్నులకు గట్టును ఇప్పుడు మనకీ ఖండమునందు ముందున్న విషయములన్నియు వర్ణనలు, సన్నివేశములనియు వానిని విశ్వనాథ మలచిన లోకోత్తర మార్గమున తెలియబడుచున్నవి. ఇచట చదువరికి విసుగు పుట్టకుండుటయే గాక కావ్యానందము గలుగుట గణనీయమగు విషయము కవిలోకమూర్ధన్యుడగు వాడుగాక ఇతరుడిట్లు చేయలేడు.

ఇప్పుడు మఱియొక సన్నివేశము "ఇంద్రునికొడుకొక కాకము"ను గూర్చి చెప్పుకొందము ఇదియు కథకాదు! సన్నివేశమే కథయైనది ఒకనాడు సీత మాంసముల నెండబెట్టినది, ఆమె వానికి కావలియున్నది అంతక్రితము అలసియున్న రాముడు సీతతొడమీద పండుకొని నిద్రించెను అప్పుడు లక్ష్మణుడచ్చట లేడన్నమాట! ఆకాకి ఎండబెట్టిన మాంసములను దినక సీత స్తనగతమైన పచ్చిమాంసము నాశించికాబోలు, ముక్కుతో నురోజము నుండియుండి పొడిచి యామెఱచి గ్రహించుచుండుటచే నెత్తురు కారినది సీత దానినదలించుచున్నను గాకి యట్లే చేయుచుండెను ఆమె మొగము విన్నబోయినది. తాను కదలినచో రామస్వామికి నిద్రాభంగమగును. చేతిలోని పుల్లతో దాని నదలించినను నదిబోవుటలేదు. ఆమె మొగ

మెట్టబడెను. అంతలో రాముఁడు నిద్రలేచెను ఆమె గాయమును చూచి యదియేమని యడిగెను సీత "పల్లకి బొంగువోని ముక్కు ద్రుచుచు వచ్చు" కాకిని జూపెను నోటచెప్పలేకపోయినదని యర్థము తన ఉత్తరీయముతో ప్రభువు నెత్తురు సద్దెను. కాకిని 'ఉష్ష'ని యదలించెను. ఆకాకి యట్లు పోవు నదికాదుగదా! ఆయనను లెక్కసేయక జానకిపైపోయి మరల నల్లేచేసెను దానికి బ్రహ్మవరమున్న గర్వమాయె! కడకు రాముడోర్వలేక గడ్డిపోచను బ్రహ్మాస్త్రముగా నభిమంత్రించి విడచెను. అది దానిని బ్రహ్మలోకమునకు తరిమెను. అది విష్ణుమూర్తిదగ్గరకు పాలసముద్రమునకు బోయినది. విష్వక్సేనుడు బెత్తాలవాడు దానినదలించెను అది కైలాసమున కేగెను శివుడు దానితో రామునే శరణము వేడుమనెను. అది 'రఘుకులస్వామీ! రమావల్లభా!' (పెద్దన్న) అని శరణు జొచ్చినది. రాముబాణము తిరుగులేనిది గదా! అందుచేత నది తనయొక కన్నిచ్చుకొని, రాముని మెచ్చుకొని, తనకును తనజాతికిని నొక్కకంటి గతియే పట్టిపోవుచు (ఏకాక్షి) జానకితో, 'తల్లిచన్నుగుడుచు దర్పంబు నాయందె, యొకనియందె యుండె నుర్విమీఁద, తప్పులేదు తల్లి! దంతాలనొక్కిన, శిశువుబుగ్గమీద చిటిక పడదె' అనెను.—
ఈ రచన ఎంత స్వభావోక్తి విలాసముగలది! ఎంత పొసగిన హేతువు! రాముడమాయకుడు కాడనియు, యీ ప్రభువు తండ్రివోలె కానిపించును కాని తండ్రి కాడనియు, భర్తగాకనిపించును కాని అదియును కాడనియు సీతకు హితవుచెప్పిపోయెను. ఈ మాటలు నిర్గుణమో, సగుణమో, మరియే లోకోత్తర కవితాగుణమో పరితలమైన మనము భావించుకొనవలసినదే. మనకు భగవద్గీతలోని ప్రభువు వాక్యములు జ్ఞాపకము రావలయును పై వర్ణనాశిల్పమును, తరువాత సన్నివేశగత శిల్పమును, వానికిముందు కథాశిల్పమును ఆయనవ్రాసిన వరుసకు భిన్నముగ మనమిచ్చట చెప్పుకొనుట జరిగినది ఇచ్చట నీకాకి కథను కవిచెప్పెను. మరల నిదియే సుందరకాండములోని ఉపఃఖండమందు జానకియే విపులముగ హనుమంతునకు జెప్పినది. ఈ సన్నివేశమప్పటికి సీతారామ హనుమంతులకును, తరువాత మన

కును దెలిసినది. ఇచ్చట నిది సన్నివేశశిల్పమై ఉపఃఖండమున కథాశిల్పమై రీతిబద్ధమైన కవితాశక్తికి పరమప్రమాణమైనది

ఈ విధముగ అనసూయాఖండమును ముందు వర్ణనాశిల్పముతోడను, పిమ్మట సన్నివేశ శిల్పముతోడను, తరువాత కథాశిల్పము తోడను తన లోకోత్తర కవితాప్రతిభను వెలయించి మహాకవి మలచిన తీరును మనము కనుగొంటిమి

# కల్పవృక్షము-ముని శాపవృత్తాంతము

శ్రీమతి చెన్నాప్రగడ జయలక్ష్మి

రామాయణ కల్పవృక్షము విశ్వనాథవారి కలోహావైభవసనాథము సహస్రముఖమైన వారి ప్రతిభయొక్క ఒకముఖమును దర్శించుటకిందు ప్రయత్నింతును.

వాల్మీకికి విశ్వనాథవారు చేసిన వ్యాఖ్యానములు అతినవ్యములు. అవి వారినవనవోన్మేషశాలియైన అపూర్వవస్తు నిర్మాణక్షమమైన ప్రతిభచేసముత్థితములు ఈదృష్టితో చూచినచో ప్రాతకథనే క్రొత్తదిగా చెప్పుట యనగనేమో అవగతముకాగలదు

వాల్మీకి రామాయణములో స్థూలదృష్టికి అనన్వితములుగ కనుపించు సందర్భములనేకములున్నవి వీనిని సమన్వితము గావించుట సూక్ష్మదృష్టికి మాత్రమే సాధ్యము నేడురామాయణముపై చెలరేగుచున్న ప్రతికూలవిమర్శలకి సూక్ష్మదృష్టిలోపించుటయే కారణము తనసూక్ష్మేక్షతో దర్శించిన నమన్వయసత్యమును లోకమునకు వెల్లడించుట విశ్వనాథవారు లక్షించిన,సాధించినసిద్ధులలోముఖ్యమైనది.ఐనను రామాయణకల్పవృక్షము గోవిందరాజీయమువంటి కేవలవ్యాఖ్యానగ్రంథముకాదు అదియొకకావ్యము కనుకనే వారివ్యాఖ్యానముకూడ కావ్యమార్గముననే—అనగా వ్యంగ్యమర్యాదతోనే చేయబడినది ఆవ్యాఖ్యాస్వరూపమును గుర్తించుటకును కొంత సూక్ష్మదృష్టి అవసరమేమరి

*ఒక్క ఉదాహరణమును ప్రదర్శింతును.*

అయోధ్యకాండలో దశరథునికి మునిశాపము లభించిన వృత్తాంతము కలదు. ఈకథలో అనన్వితములుగా కనిపించు విషయములుకొన్ని యున్నవి అందుమొదటిది దశరథుడు తనకు కలిగిన శాపమునుగురించి రాముడు వన

వాసమునకు పోయిన తర్వాతమాత్రమే కౌసల్యకు తెలిపినాడు అంతవర కేల తెలుపలేదు? అనునది. దీనికి ఒకవిధముగా ఇట్లు సమాధానమునూహింప వచ్చును ఈశాపము దశరథునకు వివాహోత్పూర్వమే కలిగినది కనుక అప్పటిలో అదికౌసల్యకు తెలియవలసిన అవసరములేదు ఇక వివాహానంతర మైనను తనమృత్యువునకు సంబంధించినవిషయమును భార్యలకు తెలిపి వారిని ముందుగనే చింతాగ్రస్తులను చేయుట ఆతనికి ఇష్టము కాకపోవచ్చును చాలకాలము గడచిన తరువాత ఆవిషయమును అతడే మరచికూడ ఉండ వచ్చును మరిఈనాడేల జ్ఞప్తికివచ్చినది? వచ్చినను అతడు కౌసల్యతో ఏల చెప్పవలెను? మృత్యువు దశరథునకు కట్టెదుట కనిపించుచున్నది. శాపము అనుభవములోనికి వచ్చుచున్నది కనుక స్మృతికలిగి యుండవచ్చును అందు చేతనే కౌసల్యకు చెప్పుటకూడ అవసరమని అతడు భావించి యుండవచ్చును

కాని ఇంతకంటె చక్కని సమాధానమును విశ్వనాథవారు చెప్పి నారు చెప్పలేదు, ధ్వనింపజేసినారు. బాణహతుడైన మునికుమారుని వర్ణన ఇట్లున్నది—

'జటముడి వీడలేదు, ముఖసంగత తేజము మారలేదు, లే
నిటలమునందు మాత్ర మవి నిల్చెను రెండవు స్వేద
బిందువుల్ ...
కటకట రామభద్రు డవికారుఁడు కాననమేగువేళ సం
కటపడు నవ్వటూత్తముని కైవడి సాధు జనాగ్రయాయియై'
(అయోధ్య, మునిశాప.175)

అరణ్యా వాసమున కేగుచున్న రాముని వర్ణన ఇట్లున్నది :
'జటముడి వీడ లేదు, ముఖ సంగత తేజము మారలేదు, లే
నిటలమునందు మాత్రమవి నిల్చెను రెండవు స్వేదబిందువుల్'

మునివేషధారియైన రాముడు అచ్చముగా ఆబాణహతుడైన ముని కుమారునివలెనె యున్నాడు కనుక ఈరాముని రూపమును చూడగనే

ఆ ముని బాలకుడును, తదనంతర శాప వృత్తాంతమును జ్ఞప్తికివచ్చి యుండుట సహజము

కాని ముఖ్యమైనప్రశ్న ఇదికాదు. మరొకటున్నది దశరథుడు ముని బాలకుని కావలెనని బుద్ధిపూర్వకముగ చంపినవాడు కాడు గజభ్రాంతితో చంపినవాడు. రాజులకు వేటవిహితమే ఇట్లుతెలియక కలిగిన ప్రమాదమునకు ముని దశరథుని శపింపవచ్చునా! అదియునుగాక దశరథుడు మునిబాలకుని చంపి చల్లగా తనదారిని తానుపోలేదు బాటవెంటనడచు పాదచారిని చంపి వేసియు బండినినిలుపక రక్షకభటులకు చిక్కక తప్పించుకొనిపోవు 'లారీ డ్రైవరు'వలె దశరథుడు దొంగవలె పారిపోలేదు తానేస్వయముగానేగి ముని దంపతులకు తనవలన వాటిల్లిన ప్రమాదమును తెలిపినాడు,పశ్చాత్తాప తప్తుడయినాడు.అతని ధర్మతత్పరత తెలియుచునేయున్నది అట్టిధర్మాత్ముని ముని శపింపవచ్చునా? పుత్రశోకసంతప్తుడైనమునికి ఇంతధర్మమీమాంసచేయగల ప్రశాంతమనస్కత యుండదు. కడుపు మంటకోలది తిట్టినాడు అనినచో అప్పుడతడు మునియేకాడు అప్పుడతని తిట్టుతగిలియే తీరవలసిన అవసరమునులేదు. అదియునుగాక చనిపోవుటకుముందు మునిబాలకుడిట్లని నాడు

'పితుస్త్వమేవ మే గత్వా శీఘ్రమాచక్ష్వ రాఘవ
నత్వా మనుదహేత్ క్రుద్ధో వనంవహ్నిరి వైధితః
ఇయమేక పదీ రాజన్ యతోమే పితురాశ్రమః
తం ప్రసాదయ గత్వా త్వం నత్వాం సకుపితః శపేత్'
(వాల్మీకిరామాయణము,అయోధ్యకాండ,63సర్గ;43-44 శ్లో)

(ఓరాజా!నీవు వెంటనే మాతండ్రియొద్ద కేగి జరిగిన సంగతిని తెలుపుము అట్లయినచో అతడు ప్రవర్ధమానమైన అగ్నివనమునువలె నిన్ను దహింపడు నాతండ్రి ఆశ్రమము ఇచ్చటకొక్క అడుగు దూరము మాత్రమేయున్నది. నీవేగి ఆయనను ప్రసన్నుని గావించుకొనుము. అయన కుపితుడై నిన్ను శపింపడు )

దశరథుడు ఆబాలుడు చెప్పినట్లే చేసినాడు మరి ఆతరువాతకూడముని దశరథుని శపించుటలోగల ఔచిత్యమేమి? మునిచేత శాపమునిప్పింపదలచిన వాల్మీకి బాలునిచేత ఇట్లేలపలికించినాడు? ఇచ్చట పూర్వాపర వైరుధ్యము కనిపించుచున్నది ఇంతవరకు రామాయణవ్యాఖ్యాతలెవరును ఈవిషయమును స్పృశింపలేదు విశ్వనాథవారు ఈవైరుధ్యమునకు చక్కని పరిహారము చూపించినారు ఆయన సాధారణ పాఠకునకు స్ఫురింపని దోషములనుకూడ ఊహించును ఆయన విమర్శదృష్టి అంత నిశితమైనది

విశ్వనాథవారి సమాధానమును అర్థముచేసికొనుటకు హిందూమతపు మూలసిద్ధాంతములను ముందుగా అర్థముచేసికొనవలసియున్నది హిందూ మతము కర్మసిద్ధాంతముమీద ఆధారపడియున్నది.జీవికికలుగు సుఖదుఃఖ ములన్నియు కర్మాధీనములు. ఒక్కొక్కడును తానుచేసిన మంచి లేక చెడు పనులయొక్క ఫలితమును పొందియేతీరును ఆపనులు బుద్ధిపూర్వకముగ చేసినవి కానిండు,అబుద్ధిపూర్వకముగ చేసినవి కానిండు కర్మఫలానుభవము మాత్రము తప్పదు నిప్పుమీదచేతిని తెలిసివేసినను తెలియకవేసినను అదికాల్చి తీరునుగదా. ఈవిషయమునే దశరథుడు కౌసల్యకు మునిశాపవృత్తాంతమును చెప్పుటకుముందు ఉపోద్ఘాతప్రాయముగా ఇట్లుచెప్పినాడు-

'పుణ్యమొ పాపమోను సుఖమో మఱిదుఃఖమొ మంచొ చెడ్డయో
మున్నుఁ బొనర్చినట్టిది ప్రభుస్థితిఁగాంచినదైన కర్మమున్
వెన్నున వచ్చునే తొలఁగఁ బెట్టుఁగ సంసృతిబద్ధమానవుం
డెన్నఁడు చాలఁడేఁ డనుభవేచ్ఛయె జీవికి లక్షణంబుగా'
(అయోధ్య,మునిశాప 155)

కార్యకారణములకు గల అవినాభావసంబంధమును హిందూమతము గుర్తించినంతగ మరేమతమును గుర్తింపలేదు హిందూమతముతో సమాన మగు హేతువాదబద్ధమగు మతములేదు ఆహేతువును గుర్తించుటకు సూక్ష్మదృష్టి అవసరము.

*బాణపుదెబ్బతినిన మునిబాలుడు దశరథునితో ఇట్లనినాడు:*

'నీవయి పోయిచెప్పినను నిన్ను శపింపరు, కోప మారు సం
భావనగాఁగ జెప్పుము, ప్రమాదమువచ్చున యెట్టివారికిన్
నీ వలె దుఃఖ సంభృతుని నేర్తురె తిట్ట, నెఱుంగ కేదియో
నీవును జేసినావు..........'
(అయోధ్య.మునిశాప, 184)

దశరథుడు బాలుని మాటలను అతని తలిదండ్రులకు పూసగ్రుచ్చి నట్లు తెలుపుచు ఈమాటనుగూడ చెప్పినాడు—

'నే నిటకు వచ్చిచెప్పుట
గానీ నామంచి తనముగాదు కుమారుం
డే నీవు పోయి చెప్పుము
మానాయనకున్ శపింప మతిపుట్టదనెన్.'
(అ.ము. 200)

నిజమునకు దశరథుడు శాపమును తప్పించుకొనవలెనని వచ్చినవాడు కాడు ఆ అంధమునిదంపతులకు తనవలన జరిగిన ప్రమాదమును తెలిపి వారిని ఓదార్చుట తన ధర్మమను బుద్ధితోనే అరుదెంచినాడు అయినను వినయపరుడగుటచే తన మంచి తనమును తానే కొంచెపరచుకొనుచు ఇట్లని నాడు తానుచేసిన అపరాధమునకు తనకు శిక్షలభింపవలసినదే అని అతని అభిప్రాయము. అందుచేతనే—

'మీరలు మీదగు దుఃఖాం
భోరాశిని మున్న యొలుకఁ బోసికొనుం డే
దూరము పోవను శోకముఁ
దీరిన యాపైని నన్నుఁ దిట్టుఁడు...'
(అ.ము. 201)

అనినాడు మునికూడ దశరథుని అజ్ఞాతాకృత దోషమును క్షమించినాడు తన కుమారుడే అతనిని క్షమించిన పిమ్మట తానెట్లు తిట్టగలననికూడ అనినాడు.

'నీయెడ నాకుమారునికె నిక్కపు జాలి జనించె; నీవుగా
నా యెడ వచ్చి చెప్పఁగ మనంబున నెంచవయేని నీశిర
స్సాయెను వేయి ముక్కలు;దయార్థివి వచ్చితి, బిడ్డఁదెచ్చినా
వీయెడ కేమి చేయుదు;సరే,పొనరించితి వజ్ఞతామతిన్'
(అ.ము.204)

విశ్వనాథవారి వ్యాఖ్యానములో మునిబాలకుడే గాక అతని తండ్రి గూడ ఇట్లు క్షమామూర్తిగనే సాక్షాత్కరించుచున్నాడు. ఐనచో ఇక శాప ప్రసక్తి ఎచ్చట నున్నది? మరి శాపమెట్లు సంప్రాప్తమైనది?

కొడుకునకు కర్మసమాప్తము చేసిన తరవాత ముని దశరథునితో ఇట్లనినాడు .

రాజా, నీవు నన్నింక వదలిపొమ్ము తెలియక చేసితివనుకొమ్ము, నన్నొక్క బాణముతో నపుత్రకునిఁ జేసితివి తెలియక చేసిన ఈ కర్మ నీకు బ్రహ్మహత్యతేదు. నేను నిన్ను క్షమించినను నీకర్మ నిన్ను క్షమింపదు.

'నీవును నావలెనే పు
త్త్రావిలశోకమున నంత మందెదు నానా
జీవుల నానాకర్మల
నావల నానాఫలంబు లంటియయుండున్.'
(అ.ము. 215,216)

ఇచ్చట ముని చేసినదేమి? అతడు శపింపలేదు భవిష్యత్తును ఆర్షమైన దృష్టితోచూచిచెప్పినాడు అంతే.తాను క్షమించినాడు కాని కర్మక్షమింపదు. కర్మఫలితమును దశరథుడు అనుభవింపకతప్పదు కర్మను దాని ఫలము అంటియే యుండును

ఆ తరువాత దశరథుడు మునిదంపతులకు తానే 'మీపట్టి విధానసేవ చేయుదు' ననినాడు దానికి ముని—

'...................... ...........ఇట్టి నీ
యట్టిఁడు, పాప మే కృతమొ యమ్మునఁ దాఁకితి మత్సుతాసువున్'
(అ ము 216)

అని అతని జాలిగుండెను మెచ్చుకొనినాడు తానును అతని యెడ అనుకంపను చూపినాడు "అయినను బలీయమైన కర్మఫలము ననుభవింపక తీరదు గదా అందుచేత మృతికాక తప్పదు" అనుచునే ముని ఆకర్మ ఫలపు తీవ్రతను తగ్గించుచు ఇట్లనినాడు-

'నీ కర్మ బలీయంబగు
నీ కరుణా హృదయఫలము నెక్కొని మృతియుం
గాకయ పోవదు కానీ
నీ కొడుకు వియోగ మొకఁడె నీకుఁగతంబౌ'
(అ ము 217)

'నీకు కొడుకుతో వియోగము మాత్రమే కలుగును; కొడుకు మృతి కలుగదు "అని ముని అనుగ్రహించినాడు తన తపశ్శక్తిని వినియోగించి దశరథుని బలీయమైన కర్మయొక్క తీవ్రతను కొంతకు కొంత ముని తగ్గించినాడన్నమాట! లేదా అజ్ఞాన కృతకర్మ కనుక ఆ కర్మయే తన శిక్షయొక్క తీవ్రతను తగ్గింపగలదను భవిష్యదర్థమును తెలిపినాడు

అప్పుడేమయినట్లు? ముని దశరథున కొసంగినది శాపమును కాదు వరమును. ఆముని ఎంత క్షమామూర్తి! ఎంత ఉదారుడు! కథలోని వైరుధ్యము తొలగిపోవుటేగాక మునియొక్క ఉదాత్తత ఎంత ఎత్తుపెరిగినది! దానితో ముని కులమంతటి జితక్రోధత్వము ఎంతచక్కగా వ్యంజితమైనది!

విశ్వనాథవారు ఈ కథా భాగమునకు "మునిశాపఖండము" అనియే పేరుపెట్టినారు. ఈ ఖండములో కథాదృష్టితో చూచినచో దశరథుని మృతియే ప్రధాన విషయముగదా మరి ఆపేరే ఏల పెట్టలేదు? విశ్వనాథవారు ఆయా ఖండములకు నామకరణము చేయుటలోనే వారివిలక్షణ దృష్టి గర్భితముగానున్నది కథా కథనములోగాని, వర్ణనలలోగాని, తాము ఎక్కడ

అపూర్వమైన కల్పనలను చేసియున్నారో దానికి ప్రాధాన్యమిచ్చుచు ఆయా పేర్లను పెట్టియున్నారు ఈ ముని శాపవృత్తాంతములో తాను వాల్మీకికి అపూర్వమైన వ్యాఖ్యానము చేసియున్నారు ఆ విషయమును పాఠకుని దృష్టికి తెచ్చుటకే వారు ఈ ఖండమున కీపేరు పెట్టినారు.

దశరథుడుకూడ ముని తనను శపించినాడనియు, తిట్టినాడనియు ఒకటిరెండు పర్యాయములనినాడు ఇది కేవలము లోకపు వాడుకను బట్టి అనినమాట కాని 'ఇక్కడ మునిచేసినది భవిష్యత్కథనము మాత్రమే' అని దశరథునకు కూడ తెలియును

*ఇవి దశరథుని మాటలు ·*

> 'పడతీ! యిన్నిదినాలకేను ఋషిశాపం బొం డబద్ధంబుగా
> నెడఁదంగాంచితి; పుత్రహేతువుగనే మృత్యుప్రతీక్షు ప్తుఁడై
> చెడఁగాఁ దిట్టెను మౌని; కోడలి వనీ సీమం బ్రవేశించుటన్
> జెడితిన్; మౌనికిఁబుత్రశోకమతిఁదోచెన్ సుంతవ్యత్యాసమున్'
> (అ ము 224)

పుత్రశోకాభి హేతుడైన మునియొక్క భవిష్యద్దర్శనము కొద్దిగా మందగించినది మునికిచూపు బాగుగాఅనలేదు అతడు పుత్ర వియోగము మాత్రమే కలుగునని చెప్పినాడు కోడలుకూడ వనగతురాలగునని అతడు చెప్పలేకపోయినాడు

విమర్శాత్మకదృష్టితో చూచువారికి వాల్మీకి రామాయణములో యిట్టివి ఎన్నో అనన్వితములుగా కనుపించునవికలవు దానికి విమర్శకుని సంప్రదాయ సంస్కార రాహిత్యమే కారణము. విశ్వనాథవారి రామాయణములో ఈ కుశంక లన్నిటికిని సమాధానములు కలవు. కనుకనే అది పాఠకుని పాలిటి కల్పవృక్షము.

# రామాయణ కల్పవృక్షము-అరణ్యకాండము

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

శ్రీ సత్యనారాయణగారి రచనలన్నింట నుత్తమోత్తమము రామాయణ కల్పవృక్షమని చెప్పనక్కరలేదు. అదియట్టిదని సాహిత్యాభిమానుల కందఱకు తెలియును, అదిసౌందర్యభూమియని వివిచ్యమానముగా తెలియకున్నను దానియందు వారికాదరముగలదు. దానిసౌందర్యమును వివేకించుట యొకవిధముగా సహృదయుల నారాధించుట. కావున నీనాప్రయత్నము ఆయన రామాయణము నందరణ్యకాండమును గుఱించి యీ నాయనుశీలనము

కవిప్రతిజ్ఞనుబట్టి కావ్యము ననుశీలించుట సహృదయ లక్షణము. రామాయణ కల్పవృక్ష పీఠికలో "తండ్రియాజ్ఞయును జీవునివేదన రెండు, నేకమై నాసకలోహవైభవ సనాథను నాథకథన్ రచించెదన్" అనియు, "రామకథా భాష్యకారులకును మోడ్పుకైఘటించి" అనియు, కాండాంతమున "కథాకథనశిల్పానేక మార్గాభిరామమునిద్దాని నరణ్యకాండము ప్రభూ! మన్నింపవే", "కవితారూప తపస్సు జేసెదను శ్రీకంఠా" అనియు నాయన చెప్పుకొనుటవలన నాయనప్రతిజ్ఞయందలి లక్షణములివి. ఊహాసంపత్తి, కథాకథనశిల్పము, వాల్మీకమునకు భాష్యకరణము అన్నింటినిమించి జీవునివేదన ఇవి యన్నియు పరమేశ్వరార్పణముగా పండించుట కవితారూప తపస్సు. ఈదృష్టితో మనము రామాయణ కల్పవృక్ష అరణ్యకాండ వ్యాసంగము కొనసాగింతము

ఈ అరణ్యకాండములో ప్రధానమైన ఘట్టము మాయలేడి వృత్తాంతము ఇందలి సమస్యరావణుని పన్నాగమెట్లు నెరవేరినదని రావణుడు వేసిన పథకము మారీచునిలేడిగా బంపుట, రామలక్ష్మణుల నెలయించికొని పోవుట, ఒంటిగానున్న సీతను తానపహరించుకొని పోవుట. దీని తుదిమొదళ్ళు

మాత్రము రావణునిచేతిలోనున్నవి మధ్యనున్న యంశములు యెదుటిపక్షము వారు నిర్వహింపవలెను ఇదిపథకము నందలి దౌర్బల్యము. వాల్మీకమునందు మహాప్రతిభావంతుడైన పాఠకుడునైతమీ సమస్యనే కనిపెట్టలేదు ఆసమస్య తోచకుండునంత చక్కగా వాల్మీకి తనమధురమైన శైలియందు కథనవేగ మందు మప్పివేసెను. వాల్మీకిరామాయణము నందెన్నియో సమస్యలు గలవు వానికన్నింటికీ సమాధానములుగలవు ఈసమస్యలను యీసమాధానములను యాయనలోతుగా నిక్షేపించి మప్పివేయును. ఆలోతులకు మునుగ లేనివారికి యీ సమస్యలుతోచవు ఆ సమాధానముల యుక్తియు నుండదు. వాల్మీకి చెప్పిన రామకథ యిట్లు రెండు విధములు - ఒకటి బహిర్వాహిని, రెండవదంత ర్వాహిని

సత్యనారాయణ గారీసమస్యను పూరిచముఖమున విమర్శించును

"వేసినపథకము మూసను
బోసితె యిష్టానుసారముననది నడువన్
దా సీతనకు దొరుకుట
కోసముగాదిద్ది నన్నుకూల్పగగానీ"

"మృగమున్నన్నును జూచి లక్ష్మణుడు గుర్తించున్ ధరాజాతకోరగనే
పోదొకబాణ పాతమున నన్ రాముండు భ్రమందించు నీపగయేమౌను?"

కాబట్టి యీపథకము సరిగాలేదు మఱి దీనిపై తక్కినరామకథ యంతయు నాధారపడి యున్నది ఇదినెరవేరుచో కథలేదు నెరవేరుట కెదుటి పక్షమువారు శత్రువుల చేతిలో కీలుబొమ్మలుగావలసి యుండుట యిందలిదోషము. మఱి యీపథకము నెరవేఱినది. ఎట్లునెరవేఱిన దని ప్రశ్న ఈనెరవేరుటలోని సామంజస్యము దీపింపజేయుటయే కవిప్రతిభకు పరాకాష్ఠ కథలోనున్న సమస్యను గుర్తించుట, దానికి సమాధానము చెప్పుట-ఇది భాష్యము ఈభాష్యమును కథాంగముగా నుపయోగించుటశిల్పము

*. .కి రావణుని సమాధానమిది—*

చ॥ అనవుడు రావణుండు సచివాగ్రణినీ తెలివెల్లనేమియ
య్యెనిదియు నిట్లు సాగు ననునేటికి సాగును దానిలోని ల
క్షణములు నిట్లు సాగుటకుఁజాలును గావున సాగుసాగు నం
చనిదపథకంబు నెత్తిడమ యాగతినెత్తినయట్లు సాగెడున్

ఆపథకము సాగుటకు చాలిన లక్షణములు దానిలోనున్నవట అవి యేవియో రావణుడు చెప్పినాడుగాదు 'సచివాగ్రణివి నీతెలివెల్ల నేమియయ్యెనన్నాడు దానిలోసాగెడి లక్షణములున్నవి యనగా నాపథకమావలి వారు కొనసాగింప వలసియుండగా వారిచేత గొనసాగింప జేయు లక్షణములున్నవి యనియర్థము అనగా నొకరి ప్రేరణలేకయే స్వభావసిద్ధముగా వారు దీనిని కొనసాగించి తీరుదురన్నమాట స్త్రీస్వభావమునుబట్టి సీత కోరును. పురుషస్వభావమునుబట్టి రాముడు తిరస్కరింపడు భార్యకోరుట భర్తయంగీకరించుట యిట్టియున్నతమైన వ్యవహారములో లక్ష్మణుడు గుర్తించినను వ్యవహారములో జోక్యము కల్పించుకొనడు శూరస్వభావమునుబట్టి రాముడు పిచ్చుకమీద బ్రహ్మాస్త్రము వేయడు ఎలయించుకొని పోవుట నీచేతిలోనే యున్నది కావున మానవస్వభావమునుబట్టి యీపథకము సాగి తీరునన్నాడు మరి మారీచుడు విమర్శించిన దిదిగాదు. ఈమానవ స్వభావమతనికి తెలియకపోలేదు ఆమానవ స్వభావములనుబట్టి మన పన్నాగములో బడుట కావలివారు వట్టి యవివేకులైన ప్రాకృతిక జనులుగారని యతని విమర్శ దీనికి రావణుడేమి సమాధానము జెప్పును?

"నాపగ యెత్తికోలునకు నాటిన యట్టి విచారమేటికిన్
నీపగ యెత్తికోలును గణించుము ముందర వైరయోగి"

అన్నాడు కథయెప్పుడును మానవస్వభావమును బట్టియే జరుగును. రావణునికింతవరకే తెలియును కాని వట్టిమానవస్వభావమే కథయందు పరమార్థము గాదు దానిని మించిన మహార్థమొకటి కథాసర్వస్వము నందంతట ననుస్యూతమై యుండును, ఈ మానవస్వభావమును మీరి దానిని జూచు

వాడుద్రష్ట భారతీయకవిద్రష్ట ఇట్టిమానవ స్వభావమును జెప్పుటయే ప్రధానమైనచో దానినిచ్చట బేర్కొని విమర్శించుటలో విశేషములేదు మానవస్వభావాను కూలముగనున్నది గావుననే వాల్మీకి ఈసమస్యను మప్పి వేసినాడు. కావునమరికొంత లోతుగ జూడవలయును, మారీచుని విమర్శయాలోతులను స్పృశించు చున్నది. కానివానికి వానిస్వరూపము తెలియదు మారీచుడీ విమర్శచేసినది రావణుని నట్టిప్రయత్నము నుండి మరలించుటకుగాని యాప థకముసాగదనిచెప్పుటకుగాదు. నిజముగా సాగనిచో వాడెట్లును నివృత్తుడగును కావున విమర్శింప నక్కరలేదు కావున మానవస్వభావానుకూలముగా నది సాగునని వానికితెలిసి యుండుటయొకటి. అవలిపక్షమువారు తాదృశమానవ స్వభావమును నిగ్రహించు కొనగలవారని తెలియుట యొకటి అప్పటికిని వారిపన్నాగము లోనికిఫత్తురేమొయను భయమొకటి. ఇవివానిచేత నిట్టి విమర్శచేయించినవి ఆప్రాకృతికులు మానవ స్వభావానుసరణము చేయుదు రేమొ యన్నభయము దానియందులోతైన కారణ సామగ్రిని సూచించు చున్నది మారీచునికీసూచన తెలిసిలేదు ఈమానవస్వభావానుకూలత బాహిర కారణము దీనికిది కార్యకరణమునందు సమర్థముగాదు సీతారామలక్ష్మణులనట్టి ప్రవర్తనమునందు ప్రేరేపింపజేయుటకు తగిన యాంతరకారణ ముండవలయును అదినిజమైన కారణము సీతయనును—

ఏనొక కోరికం జనన మెయ్యది కోరిననద్ది యిమ్మనెన్
మౌని తదుక్తికిన్ ఫలము మూటగఁ గోరిక గల్గె లేడిపై
మౌని త్రికాలవేది యిది మానసమందు నెఱింగిచెప్పెనో
కానిది నాకు లేడి పయి గాటపుకోర్కి యిదేలగల్గెనో?

పూర్వము సీతారామలక్ష్మణులగస్త్యాశ్రమమునకుబోయినపుడగస్త్యుడు రామునకు సీతయేది కోరినదది కాదనక సాధించియిమ్మని చెప్పినాడు అచ్చట నుండి విచిత్రవర్ణాభిరామములైనలేళ్ళుసీతకంటి నాకర్షించుటకు మొదలిడినవి అసలారాత్రియే సీతకు స్వప్నమునందు బంగరులేళ్ళు తెల్లవారు నంతవరకు దర్శనమిచ్చుచునే యున్నవి అగస్త్యుని యగ్నిగృహమందలి పెంటినిబాసిన దుప్పి రాముని స్వప్నమునందు కన్పించినది. తెల్లవారినతర్వాత నొకరికొకరి

స్వప్నవృత్తాంతములను చెప్పికొనిరి. ఈపంచవటీ నివాసముగూడ నగస్త్యుడు నిర్ణయించినదే. కావున నగస్త్యునకే రావణుని పన్నాగము తెలియును. మాయ లేడిని చూచి సీతకోరునని, తెలియునని చెప్పవలెను. అగస్త్యుడన్నట్లుగనే సీతకు లేడిపై కోర్కి కల్గినది. మరి యగస్త్యుడు రామునకు జెప్పుట యెందులకు? ఆరావణుడట్టి పథకమును వేయవలయునని, యదిసాగవలెనని యగస్త్యుని యూహ అట్లైనగాని వాడుసర్వనాశనముగాడని యాతనిభావన. అనినిభావన యేమి? సర్వఋషుల భావనమునదియే దక్షిణాపథమున నగస్త్యునియాశ్రమము హద్దుగ తక్కినయాశ్రమములున్నవి అగస్త్యుడు వారికి రక్షయన్నమాట అగస్త్యాశ్రమము దాటినతర్వాత గోదావరి అచ్చటనుండి జనస్థానము రాక్షసాకీర్ణము ఆరాక్షసులనుండి ఋషులకొకవిధముగా నగస్త్యుడు రక్ష అందుచేత సర్వఋషుల వాంఛలు భావనలు నగస్త్యముఖముగా నీ పథకమై పరిణమించినవి రావణుడుచూచినది సీతారామలక్ష్మణుల మానవస్వభావమును బట్టిదానియందు బడుదురనియే కానితన రాక్షసస్వభావమునుబట్టి తానందు బడితినని తెలిసికొనలేక పోయెను. ఇట్టిపథకము రావణుడువేయుట సీతారామలక్ష్మణులు దానియందు జిక్కికొనుట ఋషుల భావనకాని రావణుని తెలివికాదు ఋషులభావనయా వ్యక్తుల స్వభావమును ప్రచోదింపజేసి యాకార్యనిర్వాహణమును జేయగల్గినదని సత్యనారాయణగారి వ్యాఖ్యానము ఈఋషుల భావనవెనుక జగత్తత్త్వ పరిజ్ఞానమంతయు నున్నది గాయత్రీ మంత్రార్థమున్నది ఇది రామాయణమునందలి పట్టు, వాల్మీకియందిది బ్రహ్మనాడి. సత్యనారాయణగారచ్చటికి మునిగి యింతలి రహస్యమును వ్యాకరించినాడు. ఇదియీఘట్టమునకు పరిష్కారము, మరిసీతనపహరింపవలెనన్నయాలోచన రావణునకు పుట్టవలెను పుట్టినగదా యాతడీ పథకమును వేయుటకు. రావణుడు మహాశూరుడు, మహాపండితుడు ఇట్టియాలోచనమునెట్టుచేసెను దొంగతనమునకు అతడెట్లొయ్యకొనెను. ఇదియొకప్రశ్న మహార్షులిట్టిపథకమునే యేల యాలోచింపవలసి వచ్చినదని మరియొకప్రశ్న అకంపనుడు జనస్థానమునుండివచ్చి రావణునకు ఖరదూషణాది సంహారమును చెప్పెను. రావణుడదివిని కోపముచే పండ్లుకొరుకుచూ రామునిపైకి పోవుటకు సిద్ధపడును అపుడు కంపనుడు రామునిపరాక్రమమును వర్ణించి అతనినెదరించుట కష్టమనియు, అతనిభార్య యతని ప్రాణరహస్యమనియుజెప్పి

సీతసౌందర్యమును వర్ణించును అచ్చట "అనిన ఏకవస్తు వికారంబులైన భయమోహంబులు గ్రమ్మి రావణుండు" అని సత్యనారాయణగారు వ్రాసినారు. అది యీ రెండు ప్రశ్నలకును సమాధానము ఇంతియేకాదు ఇదిరామకథ నంతయు వెలిగించు మణిదీపిక రావణునకు రామపరాక్రమము విని భయము, సీతసౌందర్యము విని మోహము కలిగినవి ఈ రెండును ఏకవస్తు వికారములట ఆ ఏకవస్తు వజ్ఞానము దానిశక్తులు రెండు, ఒకటియావరణము, రెండవది విక్షేపము ఆవరణము లేక విక్షేపముండదుగాన విక్షేపమునుచెప్పినచో దానినిచెప్పినట్లే ఈభయమోహములు విక్షేపము వానిశూరత్వమును, పాండిత్యమును మరుగువడెనన్న మాట కనుకనే వాడు దొంగతనమునకియ్యకొనెనని సమాధానము దీనితోవానికి ధర్మబలము క్రుంగిపోయినది, పశుబలమే మిగిలినది వానియందు అధర్మాచరణము నిరూపింపక వానిని జయింపరాని ఋషులిట్టి పథకము నాలోచింపవలసి వచ్చినదని సమాధానము

సీతసౌందర్యమువిన్న తరువాత రావణుడు వేరు; వినకపూర్వము వేరు

అప్పటి రావణుడు మహాశూరుడు ధీరుడు; ఇప్పటి రావణుడు పిరివాడు దొంగ ధర్మబలముముందు పశుబలమెంత యధికమైనను వీటుపోకతప్పదని రామాయణమునందలి నీతి. దీనిని ధ్వనింపజేసినాడు కవి. రావణుని ప్రవేశింపజేయుచునే ఈ గుణమునతని యందతుకుట శిల్పము రావణుని చరిత్రనడపినదీ భయమోహములే. సీత సౌందర్యము విని వానిపలకు విసమెక్కినది. పథకమునల్లినాడు

ఇక మారీచుడున్నాడు రావణునకు తెలిసిన మారీచుడు వేరు రావణుడెరిగినది వాని పూర్వస్థితి రామునియందు వానికున్న వైరము వాని మాయా వైశారద్యము దీనిని బట్టి తనకు వాడుపయోగించునని రావణుడు భావించుటలో తప్పులేదు. మారీచుని స్థితి మారిపోయినది. వాడు ప్రవ్రజించి తపస్వియైనాడు రాముడన్న వానికి భయము. భయమువలన వానికి సర్వత్ర రామదర్శనమే కలుగుచుండెను వాడీ పథకమునందెట్లు సహాయపడెనని ప్రశ్న ఇంకొకటి మారీచ సుబాహులిద్దరు నన్నదమ్ములు. విశ్వామిత్ర యాగ సందర్భమున రాముడు సుబాహుని చంపి మారీచుని నంపగాలిచే సముద్రమునందు బడవైచెను. దండకారణ్యము నందు మరి యిద్దరు రాక్షసులతో గలసి రామలక్ష్మలను జూచి వారిపైకి పోయెను.

అప్పుడు కూడ రాముడు వాని వెంటనున్న యిద్దరు రాక్షసులను చంపెను గాని మారీచుని చంపలేదు ఇట్లు రెండు పర్యాయములు మారీచుని విడువ నేల యని ప్రశ్న వాని యుపయోగము ముందు కథలో నున్నది కాబట్టి వాడట్లు విడువబడుట ఋషిభావనా విశేషమని చెప్పదగును ఇది యాంతరమైన కారణము మరి బాహిరమైన కారణము గూడ సంగతముగా నుండ వలెను అదియేది? ఆ కారణము మారీచు డూహించి యతడే రావణునితో చెప్పును కాలాంతరమున సన్మార్గ గామియగునేని రాముడు క్షమించునని. రామునికి తానన్న జాలియని 'తమ్ముని జంపితిన్ మరియు తల్లిని జంపితి వాడు పోవనీయని' రాముడన్నాడట రాముడనుకొన్నట్లు/నే వాడు సన్మార్గగామియైనాడు వాడీ పథకమునందు ఉపయోగపడుట యెట్లు? రావణుడు మొదట మారీచుని యొద్దకు వెళ్ళినపుడు మారీచుడతని మనస్సు సీతాపహారణము నుండిమళ్ళించి పంపివేసెను మఱల శూర్పణఖచే ప్రేరేపితుడై రావణుడు తిరిగిమారీచుని యొద్దకుపోవును రావణుడంతకు పూర్వము వచ్చిన చోటేయది అంతకు పూర్వము చూచిన మారీచుడే యతడు కాని రావణు డతనిని క్రొత్తగా చూచినట్లు వర్ణించును.

తంతు గత్వా పరంపారం సముద్రస్య నదీపతేః
దదర్శాశ్రమ మేకాంతే పుణ్యైరమ్యే వనాంతరే
తత్ర కృష్ణాజిన ధరం జటామండల ధారిణం
దదర్శ నియతాహారం మారీచంనామ రాక్షసమ్.

ఇట్లువర్ణించుట వలన రావణునికి వాడు మారిపోయినాడని యర్థమయిన దన్నమాట శూర్పణఖ సీతను గుఱించి చెప్పినపుడే మారీచుని మనః పరివర్తనమును గుఱించి సందేహము కలిగినది కాని తనకు వాడు తప్ప మఱియొకగతిలేదు వాని చేతనే పని చేయించుకొనవలెను. మారీచునకో యది యిష్టములేదు రావణుడు ప్రభువు వాడు బంటు వాని ప్రభుత్వము నుపయోగించి నిర్బంధములోపెట్టి వీనిచే పని చేయించుకొనవలెను వీడు బంటు కావున నెట్లైన వాని నిర్బంధమునుండి తప్పించుకొనవలెను కావున రావణుడు రెండవ తడవ వచ్చినపుడు వాడు ప్రభువు వీడు బంటు పూర్వము వాడు రాజు వీడు మంత్రి. ఇప్పటిస్థితి మాఱిపోయినది ఈతిస్థి

నుండి యిచ్చటికథ బయలు దేరినది ఈ పరిస్థితి నర్థముచేసికొని ఈ కథను చదువవలెను

'పది తలల కుండలంబులఁ
గదలాడిన రవలకాంతి కదలందున ని
ర్వది జాబిల్లి వెలుంగులు
పొదలినవగు వెల్గుకంబములుగా నొప్పన్.

పది తలలపాము క్రతుసం
పద తూలించెడు నఘంబు బయలు వెడలెనాన్
మొదలిఁటి యసత్ప్రదార్థము
పది వివృతాస్యములతోడ బయలు వెడలెనాన్.'

మొదటి పద్యము రావణుని ప్రభులక్షణమును, రెండవది పాపనిశ్చయమును చెప్పును. ఇచ్చట ఈ వర్ణనమెందులకు ? రావణుడు ప్రభువుగా వాని నిర్బంధించి పని చేయించుకొనుటకు పోవుచున్నాడని ధ్వని ఇట్లు వచ్చిన రావణుని మారీచుడుచూచెను చూచి 'విప్పుకన్నులను రక్షస్స్వామి రాస్వామి' యన్నాడట. అనగా తనపై స్వామిత్వమును ప్రయోగించుటకు వచ్చినాడని, ఆలోచనమునకు కాదని ఒకరి మనోవృత్తి యొకరు గ్రహించినారు మఱి యీ సంభాషణము ఋజువుగా నెట్లుసాగును వక్రముగనే సాగవలెను రావణుడు —

'పదియు బిగించిన మొగముల
పదిలిప్తల పాటుమౌన భావము వెలయన్
వదనంబొకంట నవ్వడి
పొదలగ తక్కినయవి యధరములు కదలంగన్'

తన నిశ్చయమును చెప్పినాడు. వాని బిగింపుమౌనము, వాని తీక్షత్వమును మొండిపట్టును ప్రకటించుటకు. మారీచుడుచూచినది వేరు.

"దనుజు డిట్లు వలుకఁ దాను మారీచున
కొకవిచిత్రమైన యూహకలిగె
పదియుఁదలల నొకడె పలికెడుఁబలికిన
బదియు నొకడెపలుకుఁబది యవేల."

వీడింత యియార్థుడేమియన్న జుగుప్స రావణుడు బయలుదేరునప్పటి వర్ణనమందు పదితలలకు ప్రాధాన్యమిచ్చుట యింతలకన్నమాట. ఈ పది తలలెప్పుడూనున్నవే మారీచుడెప్పుడును చూచుచునే యుండెను కాని యిప్పుడే యిట్టి యూహకలిగినది అనగా మారీచుడు హ్యించుకొన్నది వాని వవార్థత్వమని ధ్వని మారీచునకిట్టి యూహకలిగినదా అతడు చెప్పిన సమాధానం 'నేను వినిలేదేమి దేమి'యని ఆశ్చర్యముతోపాటు అనిష్టముకూడ సూచించినాడు. రావణుడు "ఓహో! విన్పదలేదయేమి ఎదియో యూహించుచున్నావో నీ యూహల్ నేను నెఱుంగుదున్" యన్నాడు. నీ కిష్టము లేకపోయినను చేయక తప్పదుసుమా యని ధ్వని

'అతడు నాకు జేసినట్టి దానికి వాని
కింత సేయదగదొ యేను గాని
అనిన మాట తాను వినలేదట వినలే
దంత యిష్టమేమి యాతఁడనగ'

అని రావణుని వెటకారము తరువాత రావణుడు రాముడు తనకు చేసిన యపకారమును, దాని ప్రత్యపకృతిని చేయకూరకుండరామిని చెప్పును తన పథకమును వివరించి మారీచుడందెట్లు సాయపడవలెనో చెప్పును కడకు-

"ఖరుడేమి తనకు జేసెను
మరి నాచేనైన నేమి మసలెను తనకున్
దురితాచరణు డకారణ
విరోధి మతిహీను డాత్మవిద్ధుడు జడుడున్."

అని తన యుపన్యాసము ముగించును

ఈ యుపన్యాస మంతయు విపరీత కల్పనమే. దీనికి మారీచునేమి సమాధానముచెప్పును 'అనిన దీర్ఘనిశ్వాసుడు కంపిత తనువు నేత్రగత బాష్పుండు మారీచుండు కొంచెమాగి—

నేనొకమాటచెప్పెదను నీకును గోపము రాదయేని నే
నైనను వీరశైవమతమాపితి వైష్ణవబుద్ధిజొచ్చితిన్
పూని భవాదృశుల్ చటుల మూర్తులుసాహసు లుగ్రనిష్ఠచే
మానని చంద్రశేఖరసమాధి వహింతురుగాక దక్షులై

అలుపము శక్తులంగలిగినట్టిరు మాదృశు లీశరీరదు
ర్బలతకు లొంగిపోయెదరు పట్టియుమేశ్వరుజ్ఞానమూర్తిలో
నిలుపగలేమ యేసులభనిష్ఠకునైన సంతసించు వే
ల్పులకయి భక్తిచే దనకు లోగొనువారల గొల్తుమింతటన్
పదిసార్లు తనదునామము
పెదవులు కదలింపనిట్టె ప్రీతింగొను స్వా
మి దయావార్నిధి విష్ణువు
మది నాతనిగొల్తు సులభమార్గము పొందెన్.

రావణుని యుపన్యాసమునకిది వానిసమాధానము వానియుపన్యాసములోని యంశములనేమియు మారీచుడు ఎడవలేదు ఆరాముని సాధింపవలయునని నీకు మొండిపట్టు నాకాపట్టుదలలేదు నన్ను వదలి పెట్టుమని ధ్వని వెనుకనుండి వానిమూర్ఖత్వము నవహేళనము చేయుట. కాని ఈప్రయత్నములో మారీచుడురావణునికి దొరకిపోయినాడు. వాడు తన యుచ్చును బాగుగా బిగించినాడు

వైష్ణవుడవుగాదు పాషండుడవుగమ్ము
భక్తిమాత్రమేల పట్టినమ్మ
కమ్మజాలు మోక్షగామి యన్మతమును
స్వీకరింపుమద్ది నాకునేల.

చెప్పిననాదే సంగతి
చెప్పిన నీదేమి మనసుచెడెనా యేమి?
అప్పుడె తలకెక్కినదో
అప్పా! నీమతము మాట యదుగక యుండన్

అని మఱల తన వివేకమును విశదీకరించి, నేనుచెప్పినదదిదిరాయన్నాడు మారీచుండు మించు నిర్బంధితుడైనట్లే

వినతుండై యల తాటకేయుడు ప్రభూ విన్నాను
విన్నానయా
వినరాకుండుట యెట్టు లెట్టయెదుటన్ పృథ్వీధరంబూర్జితా
శనిపాతంబున భగ్నమైచన దిదృశ్యాప్రశ్న లేదట్లె చూ
డనగుంచూడక తప్పదున్ దనువుతోడన్ పుట్టుదోసంబుగా.
"నీవుసీతదెత్తు నేరాము గానన
భూమి దవ్వ గొంచుబోదు రాము
పడతి లంకలోన భద్రమ్ముగా దాచె
దంతతోన నైనదా" అనివాని మర్మము మాటాడినాడు.

ఇప్పటికైనను భయపడి తన్నువదలునే మోయని వానియాశ రావణుడు మరల తనవాద పటుత్వమును జూపినాడు. చూపి "అజితేంద్రియుడు క్రూరుడధర్మాత్ముడు పితృపరిత్యక్తుడు. వానినిగూర్చి విచారించుచుంటి"వని మారీచుని పొడిచెను మారీచునకు ఇంక ఈమాటలతో కోపమువచ్చి రావణుని వాదమును నజ్జునజ్జుగా చితుకగొట్టినాడు రాముని యథార్థస్వరూపమును వివేకించి చెప్పినాడు మొగమోటమిలేకుండ నీతియుపదేశించి యెంత జూచినను నీవన్నది యాలోచన మాటగా లేదన్నాడు. రావణుడు-నీయాలోచన నాయాలోచన యెక్కడు కావలెనని యెక్కడనున్నది నేనుసీతను తెచ్చెదనవగా నీవురాముని వర్ణింతువేమన్నాడు ఇంతవరకును రావణుడు తానుసీతను తెచ్చుట రామునికి ప్రత్యపకారము సేయుటకని నటించుచు

వచ్చెను ఈమాటలోగని కాముకత్వము బయటపడినది మారీచుడింకను ప
కాశము తీసికొని మరల నీతియుపదేశించెను. కానిరావణుడు చివరకు మారీ
చుని నిర్బంధించి ఈపనిచేయక నీకుతప్పదని చెప్పెను మారీచుడేమిచేయును?
నాకు తెలియును నీయాజ్ఞదాటిన బ్రతుకనీయవు నావంతుకొఱకు చూచు
చుంటిని రెండువిధాలనాకు నాశనమును చేసిని రామునిపైపగ సుర్తుచే-
సి దానినితీర్చుటకు మార్గముచూపితివన్నాడు రావణుడు-అట్లనుము
బాగుగానున్నది ఇప్పుడు మారీచుడవని వానిని ఆనందముగా చఱచి
మఱిబయలు దేరుము నిన్నందు దించెదనన్నాడు ఆవెపెద్ద అనుగ్రహమున్న
మాట మారీచుడప్పుడు ఇదిగోయని తనయాశ్రమమును కుండలన్నియు
పగులగొట్టి పైకప్పంటించి గోడలుపడద్రోసి దన్నుతీవ్రముగా చూచుచున్న
రావణునిజూచక రథంబెక్కెనట నిజముగా రామునిపై పగయైనచో యీనాని
యేమి తానుమఱల తిరిగి వచ్చునదిలేదని నీకామవృత్తికై తన ప్రాణము
తీయుచుంటివని తాను తనయాశ్రమమును నాశనము చేసికొన్నట్లే నీవునీ రాజ్య
మును రాక్షసకులమును నిన్ను చేతులార నాశనము చేసుకొనుచుంటివని వాని
రావణుడు తీక్ష్ణముగా చూచినాడట అనగా రావణుడీధ్వని గ్రహించినాడు
మారీచుడు వానివంకనైన చూడలేదట రావణునిపై వానికింతకోపము
ఇంతవఱకు కోపమునకు కారణము మారీచుని ప్రాణభయమని వానిదైన్య
స్థితి వాల్మీకమునుసరించి మారీచునకు లేడిగాపోవుటకు నిష్టము లేని
కారణములు రెండు-ఒకటి ప్రాణభయము రెండవది రాక్షసకులము నాశన
మగునని అతడు లేడియైపోయిన హేతువు-పోకున్నచో రావణుడు చంపును
ననుట. వలన నీ చేతిలోచచ్చుటకంటె రాముని చేతిలోచచ్చుట శ్రేయసమని
అతడు లేడియైపోయెను. ఇంతవరకు వాల్మీకమును బట్టియే సత్యనారాయణ
గారి కథను నడిపి మఱియొక మెట్టుపైకి పోయెను

పంచవటిలో రావణ మారీచులు రథముడిగ్గిరి మారీచుడు పంచవటిని
చూచెను. చూచి ఇట్లన్నాడట -

అయిదు మఱ్ఱిచెట్లు నైదుప్రాణంబులు
నడుమ పర్ణశాల నాథునిలయ

మన్నయట్లుతోచు నాత్మసాధకునకు
మృత్యువేళ నాగమించినట్లు.

పర్ణశాల చూచినంతనే వానిసాధనయంతయు వానికి గుర్తుకువచ్చినది ఆ సాధనవలంది మృత్యుకాలము సమీపించి పరమేశ్వర నిలయమైన హృదయమువలె పర్ణశాల దర్శనమిచ్చినది మరణకాలమున జీవుడు ప్రాణములనన్నిటిని మూటగట్టికొనును ఉత్క్రమణ ముఖముగానున్న ప్రాణములతోంటి జీవుడుత్క్రమించును. మఱియాత్మ సాధకుని స్థితివేరు. అతనికుత్క్రమణములేదు కావున ప్రాణములను హృదయములోనికే యుపడాకర్షించి లీనము చేకొనును హృదయాంతర్వర్తియైన పరమేశ్వరునిలో తానులీనమగును ఈ పర్ణశాల తన హృదయమువలె ఆమఱ్ఱిచెట్లు తనప్రాణములవలె వానికి దర్శనమిచ్చినవి అనగారావణుడు చేసిన యపకారముయొక్క స్వరూపమువానికిప్పుడు బాగుగా బోధపట్టినది. వాడు తన్ను తన యాత్మనే వంచింపవలెనన్న స్థితి తెచ్చిపెట్టినాడు. తన యాత్మకే తానపకారము చేసికొనవలసివచ్చినది

అనందానామతేలోకాః అంధేన తమసావృతాః
తాగ్ంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి యేకే చాత్మహనోజనాః

అని ఉపనిషద్వాక్యము తనదైన్యము వలన తానాత్మహననమునకు తల్పవలసివచ్చెను వానిదైన్యము నిజమునకు వానిజీవన పరిస్థితులకు నిస్సహాయ స్థితికి సంబంధించినదికాదు ఇదివాని జీవునివేదన. దాని నిజస్వరూపము వానికి పర్ణశాల చూచినప్పుడు తెలిసినది. మరల నతడనును—

ఐనను నిక్కముంటెలియ నడ్డెద మద్వ్యథమొక్కడెంచియే
నా నలినాయతాక్షి జనకాత్మజ నిక్కముగా హరింతువా
పూనిహరించితేని రఘుపుంగవుడార్తి భరింపలేడురా
జ్యానికి రాజ్యమట్లయి కులాంగన యీాగతిదూరమై చనన్.
పదుమూడేడులవెట్లునుర్ణగడచె నప్పా! యొక్క యేడాది కా
నిదిగా గన్నులు మూసికొన్న పదుకొండే నూనముల్

య్యదయోధ్యాగమనాంతరంబెసగు వారాపైన నిందుండవ
చ్చెదరా వారెవరోను నీవెవరో దాక్షిణ్యైకవారాన్నిధీ.

ఆదిరామునియందు వానికున్న మైత్రనిభావము. రాముడు వానికి పరమప్రే మాస్పదుడు వానికాప్త భూతుడన్నమాట. ఇట్టిరామునికపకారము చేయ వలసివచ్చినదనివాని యంతర్వేదన. వానిజీవలక్షణమునందీ వేదన నతికి సత్యా నారాయణగారు వానిని తళతళ లాడించినారు రావణుడు ఇంచుకకుడికంటి కండలు ముకుళింప దక్షిణగల్లభాగంబు వికృతంబుగా నవ్వియన్నాడు -

"పరమభక్తుడుండ పరమేశ్వరుండుగా
లేకయేమి నిన్నులేడిఁజంప" నని వెటకారము చేసినాడు.

మారీచుని కొడలుమందు కొనిపోయినది వానిపథకమును విమర్శించి నాడు ఈ పథకము విమర్శించుటలో అది సాగదనుటకంటె సాగునన్న భయమే హేతువనుట సముచితము సాగనిచో విమర్శింపనేల? అదిసాగకుం డనే పోవునుగాన విమర్శింప నక్కరలేదు సాగకుండుట తనకిష్టమే. సాగ కున్నను తానువ్యర్థముగాపోయి ప్రాణసంశయము పొందవలసి వచ్చునన్న భీతికారణమని చెప్పవచ్చును కానిపైని యుదాహరించిన సందర్భమునుబట్టి అపథకము సాగునన్న భీతియే యిచ్చట సంగ్రాహ్యమని చెప్పనగును ఈ పథక మును విమర్శించుటకు కారణము వాని జీవునివేదన. రావణుడిది కనిపెట్టి వాని హృద్గతమైన యీమైత్రని భావనకు దెబ్బకొట్టును

'నాపగయెత్తికోలునకు నాటినయట్టి విచారమేటికిన్
నీపగ యెత్తికోలును గణించుము ముందఱ వైరయోగి'

అన్నాడు

పూర్వము మారీచుడు తనపగ జ్ఞప్తితెచ్చితిపి దావిదీర్పనగు దారిని జూపితివన్నాడు దీనినాధారముగా తీసికొనియన్నట్లు నటించి వానిహృద యపులోతులకు తగులునట్లు పొడిచినాడు.

ఇంతకంటె దార్ఢ్యనములేదు ఇంతవరకును మారీచుడు నిర్బంధింప బడినను లేడియైపోవుట కొప్పికొన్నిను తనదైన్యమునకు చింతించినవ

తానెట్లో ఈ దుర్వ్యవసాయము తప్పింపవలె ననియే చూచినాడు, ఇప్పుడు వీనిమాటలతో విపరీతమైన కోపము వచ్చినది. వచ్చి యేమన్నాడో చూడుడు-

"రామాధీనమిలోకమెయ్యెన తచ్చాప వినిర్గతాశు భుజంగా
న్నంబుదై ర్వ్యాసువుల్"
"రామనారాచాగ్ని లంకాదుర్గ సౌధాగ్రములనుదహించును"

"నీ చావుశివుడు తప్పింపలేడు సీతయన్న ధూమకేతువును లంకామధ్యమందుంచుకో", "భూమిజాత గొంచు పోవగా నీ కెంత చేయవలయు నంత చేతు చూడు"మన్నాడు. అనిముసమందే రావణునికన్నులు మిరుమిట్లు గొలుపగా లేడి యైనాడు. తనశిల్పనైపుణ్యమంతయు చూపినాడు రావణుడీతుదిదెబ్బ కొట్టనిచో మారీచుడిట్టి నిశ్చయమునకువచ్చెడి వాడు కాదు తనశిల్పనైపుణ్యము నంతయు వనమాయా పటుతనంతయు చూపెడివాడు కాదు. వాడిదెబ్బతినుట తోడనే రావణునిపైన పగబట్టెనన్నమాట ఈపగకు కారణము వానిజీవుని వేదనయన్నమాట. ఇట్లుజీవునివేదనను సత్యనారాయణగారు కథాంగముగా కూడ మలచినాడు ఇదియాశ్చర్యకరమైన కథాకథన శిల్పము.

సీత నపహరించుటలో రావణుని హృదయము మారీచునకు నిజముగా నవగతము కాలేదు. వాని కర్థమైనది రావణుడుద్ధతుడు, కపటి, క్రూరుడు మూర్ఖుడునని. రావణుడుపైకింతియే కానిలోపలనున్న రావణుడు వేరు లోపలనున్న రావణు డుపాసకుడు పైని కాముకుడు వాని యీ కాముకత్వమంతయు నుపాసనా లక్షణ మందన్వయించును వాడు బహుశః వామాచారుడు కావచ్చును జటాయుఖండమునందు సీత సన్న్యాసి వేషమున నున్న రావణుని రెండు సీసపద్యములలో వర్ణించును ఈ రెండు సీసపద్యముల రచన వాని యుతిలోక గుణములను మనమనసులకు కొట్టి వాని యౌన్నత్యము ముందు వినతులను చేయును సీతతోడి సంభాషణమునందు వాని రీవి వానిదర్పము వ్యక్తమగును ఈ పద్యములన్నియు మదించిన కొమ్ముటేనుగు నడకలునడచును

'ఏ సన్న్యాసియు పెండ్లియాడు', 'ఇరువదిబాహులన్ పయికి నెత్తితి, ఓహో నీసౌందర్యము మొదలైన పదభీములన్నియు వానియుపాసనామార్గ

సఖుతో సంవదించును. అంతదాక నేల? అకంపనుడు సీతాసౌందర్యమును రెండుపద్యములలో వానికి వర్ణించిచెప్పును 'అమ్మధురావలోకనములద్భుత మయ్యెను' "నిగమమహార్థముల్ జగము నిండెను". శూర్పణఖ "తాతమ్మ గారు సరస్వతీ దేవిగారి సౌందర్యమెరుగుదున, ఆలోచన కొలందిగాని యామె సౌందర్యము పొడగట్టదు పరమ ప్రపితామహి భవానిసౌందర్య మెఱుగుదును సదేక ధ్యాన నిష్ఠగాని యామె సౌందర్యము సౌదర్యమని సింపదు సంగీతమువలె నాపాత మధురమైన సీత సౌందర్యమే వేరని వర్ణించును. ఈ వర్ణనములు విన్నపుడే రావణునకు సీత యందుపాటు నా బుద్ధి పుట్టినదేమో కాని యతడు సీతనుగూర్చి యెక్కడమాటాడినను ఎప్పుడు మాటాడినను నదిశారీరకమైన సౌందర్యమును గూర్చి వర్ణించి నట్లుండదు అతడు జటాయువుతోసను అంతవాడింత వాడని యతని గూర్చి-

"చెప్పగా జొచ్చితివిగద సీతగూర్చి
అదిర చెప్పవె అంతదింతది యటంచు
నీవెఱుంగవు కాబోలు నీడజంబ"

రావణుడెఱిగిన సౌందర్యమది దేహాగతమే యైనచో జటాయు వెఱుగక పోవుటేమున్నది? కావున నది దేహసౌందర్యముగాదు రావణుని ఈ భక్తి యంతర్వాహిని ఇది హృదయ సంబంధి మనసు పైపొరలో కామము బహిర్వాహిని దానికి లోతులేకపోయినను వాని సహకయందు దానికధి కారమెక్కువ ఈ యంతర్వాహిని ఎన్ని నిలువులలోతో అయినను ఇది వాని భావమును పరోక్షముగా ప్రభావితముచేయును దానియందొక నాగర కత తెచ్చును అశ్లీల శంకరానీయదు ఏవగింపు కలుగనీయదు వాని యంతరాంతరములలో వాని నుపాసకునిగనే పొడకట్టించును ఇది రావణు నికి తెలియునా తెలియదా యన్నచో తెలియదనియేమనము భావింపవలెను అకంపనుడు వర్ణించినపుడు రావణునకు "ఏకవస్తు వికారంబులైన భయ మోహంబులు క్రమ్మి," ఈ భయ మోహంబులు గ్రమ్ముట వాని ప్రారబ్ధము ఇవి క్రమ్మినవిగాని వానిహృదయములోనున్న యార్తిని తీసివేయలేవు ఆ ఇవిభయమోహంబుల బరువు క్రింద వాని యార్తిసని చేయుచున్నది. కావున వాని జీవుడు సంస్కృతుడు వాడుపైకి యుద్ధతుడు లోపల వినతుడు సీతను

వర్ణించినపుడు రావణునకు "ఏకవస్తు వికారంబులైన భయ మోహంబులు క్రమ్మి". ఈభయమోహములు క్రమ్ముట వాని ప్రారబ్ధము. ఇవిక్రమ్మినవి గాని వానిహృదయములో నున్న యార్తిని తీసివేయలేవు. ఆ భయమోహముల బరువుక్రింద వానియార్తి పనిచేయుచున్నది కావున వానిజీవుడు సంస్కృతుడు వాడుపైకి యుద్ధతుడు లోపల వినతుడు. సీతను లంకకు గొనివచ్చి ఆమెకు రాక్షస స్త్రీలను కాపుపెట్టి ఈమె యెవరో మీకు తెలియునా "వెండికొండ యెత్తిన సమయంబునన్ గినుక తెరిన ఎఱ్ఱని గెంపు కన్నులన్ దనరిన దేవివచ్చె" యని చెప్పినాడు

"నిజముగఁజూడు రామితరుణీ! శివునిం గికురించి నాడఁగం
రజ నవరక్తవారి విలురత్నల మూర్ధములే యొసంగి యం
బుజ సదృశంబు నీచరణ మోహన పీఠమునందు నాదు స
ర్వజని ఫలంబు నర్పణము పట్టితి ముట్టితి శ్రీరహస్యమున్"

అనును అతనికి రామలక్ష్మణులన్న నెట్టిభావమో చూడుడు అతడె ప్పుడు పోలిక చెప్పినను రామునికి శివునితోనే పోలిక చెప్పును — "వాడును వాని తమ్ముడును, వాడు శివుండును నంది తమ్ముడున్"

"పోడిమి గల్గువారు రణమూర్ధమునందు పినాక భృత్తులు"
"సొరిదిన్ తేలికగాగ గుర్తిడగ వచ్చున్ పెద్దవాడంబుజో
దర రేఖా మధుచిత్తనాపఘనుడా తమ్ముం డుషఃకాలసుం
దర బాలారుణకాంతి దేహుడు భుజాంతః ప్రాంశుకోదండులున్
గిరిజానాథ సమానధూర్జటులు దోఃకేళీ విచిత్రాకృతుల్."
"వీరలు విరోధులనుచును వెక్కసంపు
భావమును నిలబెట్టుకోవలయుగాక
మధుర సౌమ్యాకృతులచేత మన మనస్సు
నాహరింతురు క్రౌర్య పర్యాప్తమతులు."

సీతారామలక్ష్మణుల మధుర సౌమ్యాకృతులు వాని మనస్సునెంత నాహరించినవో! వాని జీవుని వేదన యెట్టిదో!

రావణుని ఈ యుపాసక లక్షణమును గుఱించి వాని హృద్గతమైన యార్తిని గురించి యధ్యాత్మరామాయణాది గ్రంథములు వ్యాకరించినవి రామాయణమందు కూడ ఇట్టి యూహ చేయుటకవకాశమున్నది కాని

రేఖాప్రాయముగా నున్నది; లోతుగా నున్నది సత్యనారాయణగారు రావణుని ముఖమున శ్రీదేవీ సౌందర్యభావనము చేసి తన కవితాశక్తిని చరితార్థము చేసికొనెను ఈ రావణుని సీతా సౌందర్యభావనమంతయు భాషాశక్తికి, ఊహాశక్తికి, రచనాశక్తికి ఉదాహార్యము

ప్రధానకథను విడిచి కొన్ని యుపాఖ్యానములు ఇందున్నవి. విరాధుని కథ, వాతాపికథ, గరుత్మంతునికథ, శబరికథ, వింధ్యాచలదమనకథ మొదలైనవి.

అరణ్యకాండ మొదటనే విరాధునికథ యున్నది వాల్మీకము నందీ కథను బట్టి—రాముడు, సీత, లక్ష్మణుడు నడచుచుందురు వారు విరాధుని చూతురు విరాధుడు సీతను పట్టుకొనును ఇది యెట్లు సంభవించినది? రామలక్ష్మణుల సమక్షమున వాడు సీతనెట్లు పట్టుకొన్నాడని ప్రశ్న ఎందుకు పట్టుకొన్నాడని ప్రశ్న. విరాధుడు రామలక్ష్మణుల నెత్తుకు పోగుదు నన్నాడు వారెవరో యెరిగి తెలిసికొన్న తరువాత మిమ్ము చంపను గాని యీమెను వదలి పొమ్మన్నాడు ఇట్లెందుకన్నాడు? వారి పోడి యుద్ధమున విరాధుడు ప్రయోగించిన శూలమును రాముడు బాణములతో విఱిచెను రామలక్ష్మణులిద్దరు ఖడ్గములు తీసి వానిని కొట్టుచుండిరి వాడు రామ లక్ష్మణుల తన భుజములపై పెట్టుకొని పారపోవుటకు మొదలిడెను. ఇదేమి యుద్ధము? అతడిట్లెందుకు జేసెను ? ఈ ప్రశ్నలకన్నింటికి వాల్మీకము నందు సమాధానములు కలవు కాని, ఈ ప్రశ్నలతోపాటు సమాధానములు కూడ ఎన్ని పర్యాయములు జదివి నను మనకు తోచవు వాల్మీకి రామాయణము నీటికొలది తామర. ఆలోచన మీదగాని ప్రశ్న పుట్టదు ప్రశ్న పుట్టినగాని సమాధానము దొరకదు సత్యనారాయణగారీ కథ యందు వాల్మీకి హృదయమును శిల్పమయముగా వ్యాఖ్యానించెను

రాముడు "ఓరి ! నీవు నాలుగు కాలాల పాటు బ్రతుకదలచిన సీతను వదలి పొమ్మనును ! అక్కడ సత్యనారాయణగారు వ్రాయును– "అనిన విరాధుడు నవ్వి మీరునన్ను జంపెద మంటిరి గదా సీత వదలిన నేటికి జంపెద" రన్నాడట. ఈ మాట యీ కథనంతయు వెల్గించునట్టిది వాల్మీకి హృదయమును వ్యాఖ్యానించునట్టిది విరాధుని హృద్గతమైన జీవుని వేదన లోతులను ధ్వనింపజేయునట్టిది చివరకు వాడనును -

"మున్నె యెందరు రాక్షసుల్ మడసి రంభోజాక్ష నీ చేతిలో
నెన్నన్ భావినిజత్తు రేమయినగాని స్వామి! నిన్నాగిలిం
పన్నేనయితిని"
అంపంగాఁబినతల్లి స్వామిని వనీయాత్రాగతిన్ వచ్చి నిన్
జంపున్ నీ సహజంపురూపము గడించన్ జాలుదంచున్ బ్రసా
దింపన్ నీకయివేచి యుంటిఁబ్రభువా దివ్యద్భుజాశ్రీధను
శ్శంపానీరద మూర్తి! నిన్ను గురుతింపంజాల కెట్లయ్యెడిన్"
"నీ మార్గణం బపూతము
నామేనున బడకమున్న నాథా! వైదే
హీమహిత తనూస్పర్శ
వ్యామిశ్రము గాగఁబూతపఱచితి తండ్రీ"
"అవునో కాదో యనియెడి
లవమనుమానంబు రామలక్ష్మణులము నాన్
ధవ! చెప్పవంత దీరిన
దవల ప్రభూ యెంతతగ్గి యాడితిఁగంటే"

ఈ పద్యము లన్నియు వాడల్లెందుకు ప్రవర్తించెనో వ్యాఖ్యానించు చున్నవి వాని హృదయపు లోతులను బట్టియిచ్చు చున్నవి. అంత క్రూర రాక్షసుని యందింత చివురాకు మెత్తదనమతికి యీ కథా రహస్యమును తేట పఱచినారు సత్యనారాయణగారు. కథా శిల్ప దృష్టితో జూచినచో పూర్వముదాహరించిన వచనము జాలును. ఇచ్చట నీ పద్యములు వ్రాయుట యనావశ్యక మనిపించును. మరి యాయన యెందుకు వ్రాసి నట్లు? ఇది యొక విధముగా తన కథన శిల్పమును తానే వ్యాఖ్యానించుట యన వచ్చును కాని యాయన వ్రాసినది జీవుని వేదన ధ్వనింప జేయు టకు వట్టికథను శిల్పమయముగా జెప్పుటలో నాయనకు తృప్తి లేదు. ఆ కథను గాఢముగా భావించి యంతర్లీనముగా నున్న జీవుని వేదనలో

తన్మయత్వము నంది తాదృశమైన వేదనను మన హృదయము లందుద్బోధింప జేయుటకు వ్రాసెను.

వాతాపి యిల్వలుల కథయందు అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని నుపయోగించి కథను శిల్పమయముగా తీర్చిదిద్దెను. వింధ్యాచల దమన కథ జెప్పినతీరు కథా రామణీయకముతో బాటు కథ జెప్పిన వక్త యొక్క యాత్మమనోధర్మముల వైవిధ్యమును గూడ విస్పష్టముగ వ్యాఖ్యానించుచున్నది. వింధ్యము మేరు పర్వతముపై స్పర్థవలన నాకసమంత పెరిగినది. మేరు పర్వతమేమి గొప్పయని? ఆకస 'మంత పెరిగినంత మాత్రమున యీ స్పర్థ యెట్లు తీరును ?

"ఋతమార్గంబట మేరువుందిరుగుబో యేనంతగా గాకపో
యితినా నేననదేమియో తెలియు గానిమ్మంచు వింధ్యమ్ము ను
న్నతమై కాళ్ళులు దువ్వికొమ్ము ద్రుచు దున్నంబోలె సూర్యాండదే
వతపై పోటికి నిల్చె మిన్నవియగా బట్టెన్ విచిత్రమ్ముగన్"

సూర్యుడు మేరువునకు ప్రదక్షిణించి పోవును తనకేల ప్రదక్షిణింపడని మేరువుపై దానికి గల స్పర్థ సూర్యునిపై కోపముగా మారినది. సూర్యుడు మేరువునకు ప్రదక్షిణించుటకు కారణము అది యుత్తర దిశనుండుట వింధ్యము దక్షిణదిశయందున్నది, సూర్యుడు దీని చుట్టుదిరిగి రావలెనన్న అట్లు వచ్చుట ప్రదక్షిణము గాదు అప్రదక్షిణ మగును ఆ సంగతియే వింధ్యము గ్రహింపలేదు, తన స్పర్థయే తనకు తప్ప- కనుకే 'దున్నంబోలె' నని యుపమానము ఇట్లు వింధ్యము పెరిగినది. సూర్యుని రథము ఇరుకున గీచుకొని గుఱ్ఱములు పెడగాగ దిరిగినవట, అనగా వెనుకప్రక్కకే దిరిగినవి కాని, సూర్యునకు దానిపై కోపము రాలేదు వచ్చినచో "స్వామి క్రుద్ధ నేత్రాంగణమునందు శాతిబురదయై స్రవించియుండవలెను" అట్లు స్రవింపకుండుట చిత్రమే! పైగా దానికి 'సూర్యహిరణ్మయోరుదీప్తాంగ విచిత్రకాంతి నివహమ్ములు క్రమ్మిక

బంగిరు కొండతోడ నొకపాటిగ' సాటువ వచ్చెనట. ఏమి యాశ్చర్య కరమైన రచనము. "ఇది దున్నపోతు. దీనికి స్పర్ధనాపైన గాదు. బంగరుకొండపై"నని సూర్యుడు కోపగింపలేదు. తన బంగారు రథము యొక్క కాంతి క్రమ్మించి దానికి కూడ బంగారు రంగు తెచ్చినాడు మఱియు నతనికి దానిపైన ప్రీతి గలిగినదట. ఎందుకని?

"రథసంఘట్టన జాత సంభ్రమ గిరిస్రంసత్ ప్రసూనావళీ
పృథులంబౌ నభిషేక భావము" చేతనట!

ఆయన రథము దానికి తగిలినప్పుడు యాగిరి కదలాడి దాని పైన బూచినపూలు సూర్యునిపైన జలజలరాలి పుష్పాభిషేకము జేసినవి. అందుచేత సూర్యుడు దానిని మన్నించినాడట. అప్పుడది "తదంగజని ధారా సంగ గాంగేయసేవధియై"నది. మఱి యిట్లు సంక్రాంతమైన బంగారు కాంతితో "పసిండిగిరి గొప్ప" యని సాగించినది. సూర్యుడిచ్చ లేక యాగి పోయెనాయె

"అప్పుడు బధ్నాంశుమాలికా వ్యాప్తిచెడిన
నంధ తమస లోకమ్ముల యందు జీవు
డిడియుచున్నట్టు లుండిన హేమభూమి
ధరము కన్నను మిడుగురుపురువు నయము"

అది బంగారపు కొండయే-కాని సూర్యరశ్మిలేనప్పుడు బంగార మైనను నెట్లు ప్రకాశించును? తాను ప్రకాశించుచున్నది అది ప్రకా శించుట లేదు. తన కింకేమి కావలయును? రెండు విధముల సంతృప్తి. సూర్యుడచ్చట నాగిపోయిన నేమిజరుగునో దానికెందుకు? అది స్వభావము చేత దున్నపోతాయె మేరువు దేవతలకు నిలయము దేవతలు బ్రహ్మ తోగూడి యగస్త్యునాశ్రయించినారు- 'మేరునాశ్రితుని' గై కొమ్మన్నారట! అగస్త్యుడు వెళ్ళినాడు వెళ్ళుసరికి వింధ్యమెట్టున్నదో! "కొమ్మన్నలా! పెలుచన్ మింటలగించియున్న ధరణీ భృత్స్వామియై "యున్నదట అనగా తాను కొండలన్నింటికి ప్రభువనుకొనుచున్నది. అగస్త్యుడు దానిని జూచి-

"ఓ యోయి ! మింటిలోన తలయూటిన యో భూమి భృత్త!
నా యాడుచున్న మాటలు వినంబడునా! తలయేమొ
యా యెక్కడో పెట్టినావు నస్మదీయాలాపసరణి
నీయళ్మ్ర సరణిఁబై కెక్కి నీచెవిన్ నిండించుఁగాక" యన్నాడట

ఈ మాటలు దాని గర్వము నంతయు దించునట్లున్నవి. అది 'ధరణి భృత్స్వామి ననుకొనుచుండగ' 'యో భూమిభృత్త' యోకొండా! యని పిలిచినాడు. నామాటలు వినునట్లు లేవు. తలకొంచెము వంచుమని ధ్వని "అనిన పలుకు సవ్వడి త్రాచెగఁబ్రాకినట్లై" నదట ఆయన మాటలలోనున్న సవ్వడి యిచ్చట త్రాచు పాముతో పోల్చబడినది. ఎందు చేత? పై పద్యము సందలి ధ్వని యంతయు కాకులక్షణమును బట్టి వచ్చును. కంఠ ధ్వనిని బట్టి యీధ్వని సిద్ధించును కావున యాసవ్వడి యాకంఠ ధ్వని త్రాచుపాము వలె నున్నదన్నాడు ఈ త్రాచెగబ్రాకుట క్రిందనెక్కడనో నిలిచిన యగస్త్యునిమాట యంతదూరము పైకిపోవలయును. పైకి పోవుట యొకటి దానియందున్న మండింపజేయు లక్షణము మరియొకటి. వింధ్యపర్వత మొడలు మండి మాత్రమేమి చేయును. చాపచుట్టగ నమస్కారము చేసినదట అప్పుడు ఆయగస్త్యుడా గబ్బిగిరితోడ "అబ్బీ! మునిలోక భక్తుడవై వర్ధిలుమీ!" యని యన్నాడట మాకు దక్షిణాదిఁ బని పట్టినది. మమ్ముమ్రపోనిచ్చి తిరిగివచ్చు వరకిట్లే యుండెదవు. "మమ్మె ఱుగుదెఱిగిన పని యని యిట్లుజెప్పుట" యన్నాడట. ఎందుకని? 'అబ్బో! యగస్త్యుడాతడు సెబ్బరమానిసియట ఆయగస్త్యుడన్నపేరే వింధ్యాచలమును శిక్షించుట వలన వచ్చినది. ఆయన సెబ్బరతనము వింధ్యాచల మెఱుంగు సన్నమాట. "మమ్మెఱుగు" దనుటలో నున్నయర్థమిద్ ఎఱిగిన పనియనుటలో సామాన్యముగా పరిచయము గలవాడనని చనువు కలదని యర్థము. కథ చెప్పుట యయిపోయినది. మఱి యింతకు వింధ్యపర్వతమున కేమి లాభించినది? అనగా-

"పర్వతాగ్రమ్ముననను హొన్ను పావుకోళ్ళ
గుర్తులవి మీరు దారిగాఁగొండదాఁటి
వచ్చితిరి గద కనియుండ వచ్చు మీరు
అదియె మిగిలిన బంగార మద్రిపతికి"

అగస్త్యుని బంగారు పావుకోళ్ళ గుర్తులు యా పర్వతాగ్రము నందు పడినవి ఆ గుర్తులే దానికి మిగిలిన బంగారములు. బంగారు కొండతో పోటీపడి దానికంటె నధికమైన స్వర్ణమును తెచ్చికొన వలయునని గదా దానియూహ. కాని పాపము కష్టపడి స్వర్ణకాంతిని మాత్రము పొందగలిగినది గాని యది యెన్నాళ్ళుండును? అని యర్థము. కావున నీకథలో ప్రధాన రహస్యము వింధ్య పర్వతము యొక్క మౌఢ్యము. దానిని తొలుతగా ప్రతిపాదించి పసిండి కాంతియందుగల దాని లాలసత్వమును వ్యంగ్యము చేసి కథయందు రామణీయకము తెచ్చినాడు కవి. "అదియె మిగిలిన బంగార మద్రిపతికి" ననుటలో కథా రహస్యమంతయు ధ్వనించుచున్నది.

గిరుత్మంతుని కథ సత్యనారాయణ గారి కథాకథన శిల్పమున కొరపిడి రాయి "గరుడికి లౌకికంబెల్ల తెలిసి వైరాగ్యోదయంబై" యన్న యొక్క మాటతో కథాకథన శిల్పమునే గాక గరుడుని యొక్క పరమౌదాత్యమును మహాపురుష లక్షణమును గూడ ధ్వనింపజేసినాడు. ఈ కథ చెప్పుటలో తనకున్న లోకజ్ఞత యంతయు చూపినాడు. ఈ కథ సంస్కృతము మాట యట్లుంచి తెనుగునందు నన్నయ చెప్పెను తిక్కన చెప్పెను. ఈయన సంగ్రహముగా జెప్పెనను యుగ్రితాంబూల మీయనదే. ఆయన వారికి శిష్యుడు. నేనును శిష్యుడనే ఈమాట వారి నగౌరవపరచుటకు కాదు-నేను వ్రాయునది వారు వ్రాయనిచో మనకేమి తెలియును వారి ఋణము మనము తీర్చికొనలేము. "మునిఋణము తీర్పనీ కావ్యమును రచింతు" నన్నాడు సత్యనారాయణగారు. "నన్నయయు తిక్కనయు నన్నావేశించిరి" యున్నాడు "వారి తెన్నున మెరుగులు తీర్చెద" నన్నాడు. ఆ మెరుగులు తీర్చుట యేమియో యీకథ యందు మనకు గన్పించును. ఎన్నని వివరింపను? కబంధుని కథ యున్నది వాని కట్టిశాప మెందులకు వచ్చినది? రామలక్ష్మణుల జూచుట వలన శాపవిమోచన మెట్లైనది? ఇది మరల అహల్యా కథయంతటిది. వ్రాసినచో చాల వ్రాయవలయును. ఈ ప్రశ్నలతో చదివినగాని యా కథలోని సౌందర్యము తెలియదు. తెలిసికొనగోరు వారట్లు చదువుదురు గాక! ఆ కబంధుని జీవుని వేదన యందు మనకు తాదాత్మ్యము గలుగునట్లు ఈ కథను రచించినాడాయన. శబరి కథ పరమార్తి మయము. మధురభక్తి విషయక

మైన రహస్యములు, ఉపాసనా విషయక రహస్యములు ఈ కథ యందా యన నిక్షేపించెను. అన్ని కథలతీరు వేరు శబరి కథ తీరు వేరు. మొదలు పెట్టుచునే ధ్వనింపజేసెను శబరి యాశ్రమమును సమీపించినంతనే "నవానిల తరంగము పంపాతరంగిణీ తట హంసీనవ గరుదాహతిపుష్టమొకటి వీచినదట. ఇది శబరి కథకు మొదలు. అనగా నాగాలితీరే వేరు. అదిచాలాక్రొత్తగా నున్నదట ఎందుచేత? పంపాతరంగిణి నుండి వచ్చుట వలన గాదు. దాని యొడ్డుననున్న నాడు హంసల ఱెక్కల దెబ్బలచే పుష్టమైనదట. హంసీ యన్న స్త్రీలింగము గమనార్హము. అనగా సిద్ధురాలైన శబరి యచ్చట నున్నదని తాత్పర్యము. వెంటనే మన్మధుడు తులసి పేరులు, విభూతిధరించి "బాణంబుచివర తుమ్మి పూవు సంధించి విడిచినాడట" విడిచిన యా బాణమెచ్చట పడినది? రాముడనును –

"తెలి తుమ్మి పూవు బాణము
వలెనయి నాయాత్మలోనఁబడినట్లయ్యెన్
వలి మేని ప్రసన్ననగు ముడు
తల శబరిని చూచుకోర్కి తారాడుమదిన్."

మన్మధుడు వేయు బాణములు మనసులో పడవలెను ఇప్పుడీబాణము యాత్మలో బడినదట. ఎందుచేత? అది తెలితుమ్మి పూవు బాణము గాబట్టి. ఈ బాణమును వదలిన మన్మథుని వేష మెట్లుండవలెను? అతడు విభూతి తులసి పేరులు ధరించినాడట. రెండు నొకదానికొకటి కుదురునవి గావు తులసి పేరులు వైష్ణవులు ధరింతురు విభూతి శైవులు ధరింతురు మన్మథుడీ రెండునూ ధరించెనట ఇది యేమి రచన? ఈ సత్యనారాయణగారు ఇట్లు వ్రాయునేమి? తుమ్మిపూవు బాణము చివర సంధించుటేమి? అది రాముని యాత్మలో బడుటయేమి? రామునకు వాడిన ముడుతలు వడిన శరీరము గల ముసలి శబరినిచూచు కోర్కె పుట్టినదట ఆ శబరి వచ్చినది. ఎట్లువచ్చి నది? మెట్ట పళ్ళికలో పూలుపండ్లు విడివిడిగా పేర్చి శిరసుపై నిడుకొని మెల్లగా "వచ్చినది ఆ వచ్చిన శబరి" తుట్టతుదదాక నెండిన చెట్టుకొమ్మ శేఖరమ్మున యందు పుష్పించినట్లు"న్నదట! శబరి కనులలో స్వామి తన ప్రతిబింబమును జూచి సీతా విరహమును విడిచినాడట. కంటనీరార శబరి

కనులు తెరుకొనిరయె". శబరి కన్నులలో స్వామి తన ప్రతిబింబము నెట్లు చూచినాడన్న మాటకిది సమాధానము ఆమె కన్నులు నీరుగ్రమ్మినవట. అందుచేత తానందు ప్రతిబింబించినాడు. బాగుగనే యున్నది. మఱి సీతా విరహామును విడుచుట యేమి? శబరి యట్లే నిలబడి "అయోధ్యా వీధు లన్నిన్ను నావలె చూచువారున్నారా" యన్నది. ప్రాణేశుడు వ్వెత్తు నవ్వుల "యక్కడ నీవంటి వారు గలరా పూపళ్ళికదింపుకో"మ్మన్నాడట. శబరి యీ యెఱుగుట యేమి? రాముని యా సమాధానమేమి? రాముడ నక ప్రాణేశుడనుట యేమి? పూలతట్టదించి శబరి యన్నదట-

"పూలివి వెలుగులు నివ్వితేనె లేవి యెచట ననగి" అని. స్వామి పూలు జూచి మునిగ్రేళ్ళతో తీసికొని తానే చరణములపైన జల్లుకొన్నాడట శబరి "అయ్యోస్వామి" యని దోసిళ్ళతో పూలు పాదములపైన జల్లినదట. తలపైనగాదు. "కనులందుల్లోల కల్లోలమై ముయ్యేఱుం జఱు రెండు వాగులుగ" రుచ్యములైన పండ్లను నీ కోసమే తెచ్చితినయ్యా యని ప్రదర్శించినదట కన్నుల యందు జడివాన యెందులకు? ఆమెకు రాముని యాకారము జూచి వనములూ, సముద్రాలూ చూచినట్లున్నది అందువల్ల పూవులు జల్ల మఱచి పోయినదట రాముడు- నట్టడివిలో నిలువబెట్టి యివి తినుమందువు కాళ్ళు కడిగికొవలయును. కనులు తుడుచు కొనువలయు స్నానము చేయగాను వలయును కాదు ఇట్లే తినుమన్నచో కాదందునా? నీకమర్యాద జేయుట యెందులకన్నాడట అప్పుడామె "ధర్మస్పృష్పదృకప్తక్మ" యైనదట అయి ఈ దేశంబున చెట్టుచెట్టు గృహమే యీ నాకు", "నీవు నిత్య పవిత్రమూర్తివి నీకు స్నానములా" యన్నది

"చేతు లునికికిఁబూలు తెచ్చితిని స్వామి
చెట్లుకలవని పండ్లు తెచ్చితిని స్వామి
సతనువగుటను నేను వచ్చితిని స్వామి
చిత్తముండుట నూహ జేసితిని గాని" యన్నది

ఈ పద్యము శబరి కథకు ప్రాణము పట్టు తరువాత

"నే పూలు తేలేదు నేఁ బండ్లు తేలేదు

లీలా మనోజ రాలేదు నేను
క్రొత్తగా నీవు మా కొండిక చోటికి
రాలేదు బుద్ధిధారాప్రసన్న
పరిచారికాస్వభావకు నాకు మరియాద
చేయనక్కరలేదు చిత్తజన్మ
అల యగస్త్యాది మహర్షుల వనముల
ఫలములీ రుచి కావు ప్రాణనాథ
నాదు ప్రాణములను నీకు మీదుకట్టి
నాను నీవయియుట వచ్చినావు స్వామి
మ్రొక్కు చెల్లింతు స్వీకరింపుము ప్రియాంగ
నా మహోయల్లకానల ధూమదేహ." యన్నదట.

శబరి యిట్టి పిలుపులు పిలిచినది సరే. ఆమె యీ ఫలములను రాముడంగీకరించినాడట. అంగీకరించిన "నస్మదానీతములన్ సంగ్రహింపవే ప్రాణనాథ" యన్నది శబరి నీవు తిని జూచి రుచ్యములని చెప్పనిచో నేనెట్లు తినగలనన్నాడటస్వామి. "స్వామి!" "ప్రతివృక్షమందున ప్రథమమునందు నేనురుచిచూచియే తెచ్చినా" నన్నది శబరి రాముడు మందహాసముతో సౌమిత్రి వంకజూచినాడట. ఎందుకో? తరువాత రాముడు ఒక్కొక్క ఫలమే యొక్కొక్క పరిచర్యకు ఫలముజేసి అన్నాడట. శబరి యీ పరిచర్యలు మతంగమౌనికి జేసినవి. మరి, చివరి ఫలము దేనికి ఫలము జేసినాడో యెఱుగుదురా? "పతిగా నిను గోరినన్నే వరించి నవ ప్రతీకాబ్ది వేలమై నయన విస్తృత తామరసముల జొచ్చిన దానికట". ఈ మాటలు వినుచుండగ "బంధుర శబరీ నగ నేత్రాంభోజమ్ముల నతను విధాతృలు ఫలించిరాయన నుండెన్" ఈ మాట యీ కథ యందలి సర్వరహస్యము. దీనిని మనసులో పెట్టుకొని యాయన యీ కథ యిట్లు వ్రాసెను, దీనిని మనసులో పెట్టుకొని మీరు చదువుడు అపూర్వపు ప్రశ్నలన్నింటికిని సమాధానములు లభించును ఆ సమాధానములు వేరుగా నేను చెప్పుట యెందులకు? మీ యంతట మీరు తెలుసుకొనుటలో నున్న స్వాదుత్వము చెరపినట్లగును ప్రశ్నలు చెప్పితిని కథా రహస్యము చెప్పితిని. ఇంతకంటె వివరించకూడదు....

కథ చదువువాడు గ్రుడ్డెద్దు చేనిలో పడ్డట్లు ఊఱకచదువుచు బోరాదు ప్రశ్న పుట్టించు కొనవలయును. సమాధానము కొఱకు వెదుక వలయును. ఆ సమాధానములా కథలో దొరకును. అట్లు దొరకునట్లు వ్రాయుటయే, కాదు కాదు, అప్పుడుగాని దొరకకుండునట్లు వ్రాయటయే కథ చెప్పుటలోని గడుసుదనము కథకు ప్రాణపు పట్లేవియో తెలిసికొని వానినెచ్చట నెచ్చట నిక్షేపించవలెనో యచ్చట నచ్చట నిక్షేపించుట శిల్పము. ఈ విద్యయందు వాల్మీకినన్నయలు బ్రహ్మలు, సత్యనారాయణగారు వారి శిష్యత్వము పండిన వారు

ఇప్పటికి ఈ కాండము నందలి కథా కథన శిల్పమును వ్యాఖ్యానించట మైనది ఈ చెప్పుట యందే త్రాటితో పాటు దబ్బనముగా నా కథా పురుషులను గుఱించి వారి జీవలక్షణములను గురించి వాఖ్యానించి నట్లైనది. మఱి చెప్పని వారున్నారు. ప్రధానులైన సీతారామ లక్ష్మణుల గురించి చెప్పనేలేదు. వీరిని గుఱించి ప్రత్యేకముగా వ్రాయవలసినదే అయినను ఇచ్చట యేకొంచెమో వ్రాయనిచో నీ వ్యాసమునకు పరిపూర్తి యుండదు. రాముడు పరమేశ్వరుడనుట మనమెరుగుదుము. పరమేశ్వరుడానందమయుడనియు మనమెఱుగుదుము. అనగా మనకు యోగులవలె పరమేశ్వరావగతి యున్నదని నా యభిప్రాయముగాదు. మనది యవగతి పర్యంతమైన జ్ఞానము గాదు. అయినను ఈశ్వరుని గుఱించి యిట్టి జ్ఞానము పెద్దలనుండి వినుటవల్లనో గ్రంథములు చదువుట వల్లనో మనకున్నది. అట్టి జ్ఞానమునే యీ రామాయణ రచనము నందు జూపినచో సత్యనారాయణగారి విశేషమేమున్నది? ఆయన యవగతి పర్యంతమైన జ్ఞానమును జూపినచో విశేషమగును. మఱి యాయన యోగియా! తపస్వియా! యని నన్నడుగ వచ్చును ఆ సంగతి నాకు తెలియదు; ఆయన యోగియు తపస్వియు నని నేను పూతవడను. కాని యాయన "కవితారూప తపస్సు జేసెద"నని యీ కాండము నందును మరియొకచోటను "కవి మహాయోగి, తపసుచే గ్రాగి గ్రాగి" యనియు చెప్పికొనుట వలన యాయనకుగల జ్ఞానమవగతి పర్యంతమైనదనియే నా మతము. ఇంత మాత్రమున సత్యనారాయణగారిని నేను బ్రహ్మవేత్తయని చెప్పినట్లు భావింపరాదు ఈశ్వరజ్ఞానమునందు బహ్వాంతరము లుండును. ఎవరి తపస్సునుబట్టి, యోగమునుబట్టి, వారి వారికాభూమికా భేదములంతు

ప్రవేశము గలుగుచుండును సత్యనారాయణగారి యోగము,తపస్సు కవితా రూపమైనవి గాబట్టి యాయనకు గలిగిన పరమేశ్వరావగతి తదనుకూలమైన యనుభూతి, అనగా రసరూపమైనది జీవుని వేదనాత్మకమైనది శ్రీరాముని చిత్రణమునందు వాల్మీకి మార్గమునే సత్యనారాయణ గారనుసరించెను వాల్మీకములో లేని కొన్ని లక్షణములు గూడ సత్యనారాయణగారు చిత్రించిన రాముని యందు గన్పించును. సత్యనారాయణీయమునందు రాముడు పరిహాసశీలి జీవుని వేదనగలవాడు ఈ రెండవ లక్షణము వాల్మీకములో నున్నదే కాని యిది యాయన యందతివాల్మీకముగా నున్నది. విరాధుని చంపి "ఈ చంపుటయో కసాయిపని మేలన్నట్లుగా నున్న"దనును ఖరుని చంపిన తరువాత రాముడు తదల్పగిరి ప్రస్తరంబున హస్తగత కపోలుండై " కూర్చున్నాడట "ఏ దనుజున్ వధించినను నిట్టి విషాదమునొందు నాత్మ మర్యాదుడు స్వామి" యని లక్ష్మణుడెంచెనట సీతాపహరణము తరువాత రాముని దుఃఖశీలము- "అపి గ్రావారోదిత్యపిదళతి వజ్రస్యహృదయమ్" యనుటచేత ప్రసిద్ధమైనదే. కాన దానినంతయు నుదాహరించి వ్యాఖ్యానించుట వలన విశేషములేదు. కాని యీ ఘట్టమునందును వికృత్త పక్షుడైన జటాయు సందర్శనము నందును రాముని గాఢశీలిత్వము, దుఃఖశాలిత్వము వ్యక్తమగును. ఈయన యీ కాండమునందు రాముడు నడచుచున్న రత్నదీపమువలె పోయినచోటెల్ల వెల్గించుచు పోవుచుండును మహర్షులందఱు నతడు పరమేశ్వరుడని లోననెఱిగి యున్నను పైకి ధర్మమూర్తియైన రాజకుమారుని జూచినట్లు ప్రవర్తింతురు. రాముడు వారియెడ వినయము నెఱపును రామునకు తాను పరమేశ్వరుడనని తెలియక పోవుటలో ఋషులకు తెలిసికూడా తెలియనట్లు ప్రవర్తించుటలో నున్న యందమంతయు నాప్యాయతయంతయు త్రవ్విచూపినాడు సత్యనారాయణగారు మరి రాముని పరిహాసశీలిత్వము సీతతోడి సంభాషణము నందు రమణీయమై గన్పించును. దానిని కథాంగముగగూడ సత్యనారాయణగారు తీర్చిదిద్దిరి విరాధుని కథ యందది మనకు కన్పించును, సీత మఱుగుతీగను త్రొక్కి త్రోవతప్పితిమనగా రాముడు "మరులు క్రొన్నంగాదకే ఘోరకాంతారమ్మున్ పతితోడవచ్చుట" యనును సీత ధర్మంపు బుద్ధ్యా రానైనది భర్తపై మరులు లేదనును. రాముడు కోపమభినయించి ముందునడచును సీత వెనుక పడును. వారికంటె ముందు

పోయిన లక్ష్మణునకిదియేమియు తెలియదు వెనుకబడ్డ సీతను విరాధుడు పట్టుకొని యఱచును. ఇట్లు వాల్మీకిని వ్యాఖ్యానించుటకు కథాంగముగ పరిహాస ముపయోగించి తన శిల్పినైపుణ్యమును కవి ప్రదర్శించినాడు సీత నడచుచు వాతాపి కథ చెప్పబూనును రాముడిప్పుడు వినజాలనను జానకి మీరు వినకున్న సౌమిత్రి వినునని కథ మొదలుపెట్టును ఆకథ వృద్ధగార్గేయి నకు చెప్పినట్లు చెప్పును. ఆ చెప్పుటలో "ఓ రఘూత్తముని భార్యా రత్నమా! జనకుగన్న కుమారి!" యన్న సంబోధనను గూడ విడవకుండ జెప్పును చెప్పి గార్గేయి చెప్పిన కథబాగుగా లేదా యనును స్వామి నాకా బాగేమి తెలియదు గాని తెలిసినవి రెండు సంగతులు- మొదటిది నీవు రాముని భార్యవని, రెండవది జనకుడుగన్న కుమారివని యుల్లసమాడును అల్లే రాముడు తానిల్లు కట్టుకొనుట కనుకూలమైన చోటు చెప్పుమని యడిగి పూర్వము సీత యడిగినట్లు ఆమె వాక్యములలోనే యడుగును సీత చురచుర చూచును రాముడు ఏమియు తెలియనట్లూరకుండును శూర్పణఖా వృత్తాంతమునందుకూడ రాముని పరిహాస శీలము ఘట్టమునకు తళుకు దెచ్చినదిం రాముని షోడశగుణ పరిపూర్ణునిగా వాల్మీకి చిత్రించెను రామునియందు పరమేశ్వరత్వమును లోతుగా నిక్షేపించెను రాముడు మానవుడయ్యు పరమేశ్వరుడు ఇది ఋషుల దృష్టి అగడు పరమేశ్వరుడయ్యు మానవుడు ఇది మనదృష్టి రాముడు ఋషుల తపస్సును కాపాడుట కొఱకవతరించిన పరమేశ్వరుడు మానవ జీవితమునందు పరమేశ్వరత్వమెట్లు సాధింపవలెనో చూపిన పరిపూర్ణ మానవుడు రెండును కలిసి శ్రీరాముడు "రామోవిగ్రహవాన్ ధర్మ" ఈ మాటలన్నది మారీచుడు అట్టి ధర్మమూర్తియైన రాముని యథాతథముగా చిత్రించుటయే గొప్ప ఆ మూర్తియందు రమించుటయే యువగతి పర్యంతమైనజ్ఞానము. సాహిత్య తపస్సుచే సాధింపదగినట్టిది. ఋషులదృష్టిలో రాముడు, సీత దృష్టిలో రాముడు, లక్ష్మణుని దృష్టిలో రాముడు, జటాయువు దృష్టిలో రాముడు, విరాధుడు, కబంధుడు, రావణుడు, మారీచుడు, శూర్పణఖ మున్నగు రాక్షసుల దృష్టిలో రాముడు- ఈయన్ని దృష్టులకు మధ్యనిల్చి రంగురంగుల యద్దములలో రమణీయ ప్రతిబింబములు కిమ్మీరితము చేయుచున్న మణిదీపము రాముడు. ఈ యరణ్యమునంతయుధగద్ధగాయితము చేయుచు మనమున్నల కారాత్రి పట్టుచుండును

శరభంగుని యాశ్రమమున నా మహర్షి, బ్రహ్మలోక గమన దిదృక్షువులై యచటకు వచ్చిన మహర్షులు సదస్సుదీర్చి తమసిలుగులు శ్రీరామచంద్రునకు జెప్పి శరణువేడుదురు శ్రీరాముడు వారికి రాక్షస సంహారము చేయుదునని వాగ్దానమిచ్చెను.తరువాత సీతారామ లక్ష్మణులు సుతీక్ష్ణునాశ్రమమునకుబోయి యారాత్రినటనుండి మరునాడాయన యనుజ్ఞ తీసుకొనిపోవుచు త్రోవలో సీత, శ్రీరామ చంద్రునితో తాపసుల కాయుధ సంగ్రహణము కూడదనియు,రాక్షసులతో వైరము మానుమనియు జెప్పును. శ్రీరాముడు ఋషులకు తానిచ్చిన వాగ్దానము మాట ప్రస్తావించి—

"వలసిన నిను వదలదెనో
వలసిన సౌమిత్రిగూడ వదలెదనో మై
థిలి! తనచేయు ప్రతిజ్ఞ
స్ఖలనము ప్రాణంబుతోడ గానీకుండ" నగును. తరువాత

నంత జానకి పతిచేతిలోని ఖడ్గము తాను తీసుకొని నడచుచుంబోగా—

"మునులక్ష్మణుండు జానకి
వెనుకను మఱి యామె వెనుక వీరుఁడు రాముం
డును గాఁగ పోవుచున్ రా
ముని కనులామె కచభారముననే యుండెన్"

అని సత్యనారాయణ గారు వ్రాసెను. పైని వచనము వాల్మీకము నందు లేదు వాల్మీకము నందు రాముడు ముందు, వెనుక లక్ష్మణుడు మధ్య సీత నడచినట్లున్నది ఈ వరుస మార్చి ముందు లక్ష్మణుడు వెనుక రాముడు మధ్య సీత నడచుచున్నట్లు సత్యనారాయణ గారు వ్రాసెను "సీతాయాః చరితం మహత్" అని ఇది వాల్మీకి మాట. రామాయణ మనగా రామ చరిత మని సీతా చరిత మని కూడ నర్థము. సీతారాముల చరిత్ర యనియు నర్థము రామాయణము సీతారాముల చరిత్రయని చెప్పినచో తీరిపోవును గదా! మఱి రాముని చరిత్ర సీత చరిత్రయని వేరు వేరుగా చెప్పుట యెందులకని ప్రశ్న? ప్రాధాన్యము చేసినట్లు చెప్పుట పొసగింప వచ్చును. అయినచో ప్రాధాన్యమెవ్వరికి నను ప్రశ్న యుదయించును రామున కన్నచో మొదటి యర్థమునే చెప్పుము. సీత కన్నచో

గను, పశ్చాత్తాపినిగను, దుఃఖమూర్తిగను చిత్రించినారు సత్యనారాయణ గారు

అపహరణ ఘట్టము నందు సీతావిలాపము సత్యనారాయణ గారు బాలకాండములో నన్నట్లు "మదంతరంబు నందొదిగిన కోటిజన్మల మహోన్నత దుఃఖము త్రవ్వివేసావు" ఇట్టిది జీవుని వేదనకు పరాకాష్ఠ "కేవలం కావ్యశబ్ద నిష్పీడనేనైవ తచ్చర్వణాద్ దృశ్యతే" అన్నాడు అభినవ గుప్త పాదుడు ఈ ఘట్టమంతయు జీవుని వేదన యసంలక్ష్యక్రమ ధ్వని యై పునఃపునః పఠన యోగ్యమై సహృదయ హృదయాధిక్యమును కలిగించునది ఇందలి రచనాశిల్పము విచిత్రమైనది. ఇందామన నిన ఛందఃపాటవము సంతసము జూపెను ఒక పద్యమునకు నొక పద్యమునకు మధ్య వచనముల్వ్రాసి తరంగ తరంగములుగ జీవుని వేదనను ధ్వనింప జేయును సీతను రావణాసురు నాజ్ఞచే రాక్షసస్త్రీలు యశోకవనిని చేర్చిరి అచటి యశోకవన వర్ణన మొక పద్యములో చేయబడినది —

> "తరుణస్నిగ్ధపయోద గర్భతనుతన్ దాల్కోకిలల్ నామ సుం
> దర పూర్వాక్షరలోప సంస్ఫురణ జేతం జిల్కలున్ దా మొదల్
> సరి వ్యత్యస్తముగా మరాళములు పించవ్యక్త నేత్రాంశుసం
> భరమై కేకులు నయ్యశోకమున రామత్వంబె దీపింపగా"

అశోకవన మంతయు సీతకు రామమయమై గనిపించినదని యీ పద్యమెంత హృదయ సంవాదముగా నున్నదో చూడుడు ఇంతవరకును యపహృతయైన సీత యంతరమందే రాముడున్నాడు ఇప్పుడు వనమంతయు రామమయమై యామె భౌతిక నేత్రములకు గూడ దర్శనమిచ్చు చున్నాడు ఆమె విరహిణి బహిరంతరములయందు రాముడు ఇంతకంటె వేదన యేముండును? ఇది పరాకోటి. పద్యరచనలో నున్న శిల్పమేమనగా చిలుకలు, కోకిలములు, మయూరములు, మరాళములు విరహోద్దీపకములు ఉద్దీపకసామగ్రి యగుటచేతనే ఇచ్చట విశేషము హానియందు రామత్వము దీపించుట సత్యనారాయణగారి భావనాప్రౌఢికి, రచనాప్రౌఢికి మరియొక్క యుదాహరణ మక్కరలేదు. ఇంతియేగాక ఈ పద్యము హృదయపు

లోతులను పెకలించునట్టి వ్యంజకతా లక్షణముగలది. దీని తరువాత రెండు పద్యములు వట్టి సంధ్యావర్ణనము ఈసంధ్యావర్ణనము లంకారాజ్యవినాశనమును, రాక్షసకుల నాశనమును సూచించునట్టివి అది యకాలసంధ్యారాగము. అశోకవనములో పుట్టినది అనగా సీత యచట నగ్నివలె నున్నదన్నమాట ఎంతని వ్రాయను? ఎన్నియని వ్రాయను? కాని యొకటి చెప్పెదను ఈ రెండు పద్యము లిచట వ్రాయుట, వ్రాసి సీత యందగ్నిత్వము ధ్వనింపజేయుట "నభూతో నభవిష్యతి"

మఱి లక్ష్మణుడు మిగిలినాడు స్వభావమునుబట్టి లక్ష్మణు డుద్రేకి కాని యీకాండము నందతడు నిగ్రహవంతుడు, సంయమనశీలిగా మనకు. గన్పించును విరాధ కబంధవధ ఖండములందు లక్ష్మణుడన్నకు ధైర్యము. చెప్పును మాయలేడి వృత్తాంతమున నతనివిమర్శనమగని నిశితబుద్ధికి, నతని వివేకమునకు నుదాహరణములు సీత నానాడి నపుడతని సంయమన నిగ్రహములు వ్యక్తమైనవి రాముడన్న నతనికి భ్రాతృభక్తియా? సేవాభావమా? రాముడేయనును- "ఇదిజన్మాంతరమైన ప్రేమ యగుగానీ యొక్క గర్భంబునందుదయం బొందుటమాత్ర యిటులగునొక్కో" యని సౌమిత్రి పర్ణశాలసౌందర్యమునుజూచి శ్రీరాముడన్నమాటలివి రాముడిట్లనుకొనుచుండగా "శ్రీరామమేఘుంబున సీత లోచన వర్షాసరస్సుం జూచినదట". ఇంతలో నుత్తరాయణము వచ్చిన దనుటకు "మురువున శేషభోగి తలఋూంచిన ధారుణి బంతివోలికన్ దిరిగె" ననికవి వ్రాయును. ఇది యేమి వర్ణనము. ఇది వట్టివర్ణనమా? ఇట్లువర్ణించి "లక్ష్మణుని మొగమున మాత్రము లజ్జతోపగన్." అనగా నారాముని యూహచేత లక్ష్మణునకు తానుశేషుడనని గుర్తువచ్చిన దన్నమాట ఈరాముని యూహ యాంతర కారణము ఉత్తరాయణము రాక బాహిరకారణము మరిలక్ష్మణునిమోమున లజ్జతోచుట కాంతరకారణమిదియైన బాహిర కారణమేది? సీతారాములిద్దరు సౌమిత్రిని, పర్ణశాలా సౌందర్యమును పర్యాయముగాజూచుట. అయ్యో! ఈయరణ్యకాండ రచన, యసలీ యరణ్యకాండమే యననేల సీరామాయణరచనమంతయు యాయనయిట్లే చేసినాడు అన్నియు నాశ్చర్యములే! ఎన్నని చెప్పను? హేమంతము వచ్చినది. ఋతువర్ణనము నందాయన యందెవేసిన చేయియని సాహిత్య వేత్తలందఱకు తెలిసినదే కాని యీ ఋతువు

నిచ్చట లక్ష్మణుడు వర్ణించును ఇది వర్ణనమునకు వర్ణనముకాగా నతనికి రాముడనగాయున్న భక్తిభావమునకు వ్యంజకముకాగా దీనినావరించి ఒక యెదో యతిలోక లక్షణమున్నది అది మనభావనను పట్టుకొని జీవసంపుటి లోనికి లాగివేయును లక్ష్మణుడు మొదలు పెట్టుచునే-

"సకలధాత్రీశునకు సితచ్ఛత్రమిద్ది
నీకుబట్టిన యట్లు పండినది హిమము
సకల జగదీశునకు సితచామరంబు
నీకు వీచెడు నట్లు పూనినది హిమము"

సితచ్ఛత్రము రాజలాంఛనము సితచామర మీశ్వరలాంఛనము రాముడు సకలధాత్రీశుడు సకల జగదీశుడునట ఇవి మనకు తెలియును. లక్ష్మణునకు సకలధాత్రీశుడని తెలియును. కాని సకల జగదీశుడని యెట్లు తెలియును? ఇపుడా రామునకు రాజ్యములేదు కావున లక్ష్మణునకు తెలిసిన నీ ధాత్రీశత్వము, పైకి తెలియక యంతరాంతములలో తెలిసిన నాజగదీశత్వము రెండును లక్ష్మణుని భక్తికి వ్యంజకములై రాముని ప్రస్తుతస్థితితోడి వ్యత్యాసమును దీపింపజేయుచు రాముని పరమేశ్వరునిగా నెఱింగిన మనకు ధర్మరక్షణార్థమవలంబించి యడవులబట్టినరాముని యౌదాత్త్యమతి హిమభూధరోన్నత ధవళశృంగమై దీపించి మనహృదయములను విదారితము జేయును. అది యీ పద్యములోని సొగసు. అచ్ఛమైన జీవుని వేదన కల వాడు లక్ష్మణుడు ఈ వర్ణనమంతయు దానితో వ్యాప్తమై యున్నది.

మఱి లక్ష్మణుని సేవాస్వభావ మెట్టిదో యీయొక్క సీసపద్యము పట్టి యిచ్చును. పంపాతీర వర్ణనమునందలి పద్యమిది

సీ॥ పంచదారకు మేన బావగారైనయా
నీరు దోసిలుల దొన్నియలనిచ్చి
మంచు గడ్డలవోని మత్స్యాళి బల్లెపు
టలుగుల బడసి కాల్పుల నొసంగి
నేయి యెోడ్చిన యట్లు నెగడు పంపావిహం
గమ పక్వమాంసము లొసంగి
తరి నగ్ని కార్యావసరముల మంత్రక్రి
యాయుక్తితాను తోడై భజించి-

# రమ్యభావరససామగ్రిసమగ్రం-కిష్కింధ

—శ్రీవడలి మందేశ్వర రావు

"ప్రతిభా వ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి". ప్రతిభ అంటే పతుచాని కారణం అవసరమైనంతగా ప్రకాశితమయ్యే వస్తువును ప్రకాశిత మొనరించ గల్గిన భావనాబలంతో కూడిన మేధా విశేషం అనుకుందాం. వ్యుత్పత్తి అంటే అట్టి ప్రతిభకు బాసటగా నిల్చే పాండిత్యం అని అనుకోవచ్చును కవికి రెండూ అవసరమే. వ్యుత్పన్నుడైన కవి తన పాండిత్యం వల్ల సమకాలీనుల మెప్పును పొందుతాడు. అతని కావ్యంలో ఛందోబద్ధమైన పాండిత్యం కనబడ వచ్చును, కాని కవివ్యక్తిత్వం కనబడదు వర్ణనలు గతానుగతికంగా ఉంటాయి. ఈ వర్ణన యిలా ఎందుకు చేసావంటే, వెంటనే మనకు ఒకానొక పూర్వ కవిని చూపి, ఇతడిలా చేసాడు కనుక అంటాడు ఈ పాత్రచిత్రణ ఇలా ఎందు కున్నదంటే, నాకు ఆధారం ఈ వెనుకటి కవి అంటాడు. అలాగే ప్రయోగాలకు అప్పకవిని, అలంకార నిర్వహణకు చంద్రాలోకాన్ని మనల్ని చూచుకోమంటాడు.

కాని కావ్యం నిలవడానికి ఈ పాండిత్యం-వ్యుత్పత్తి- చాలదు దీనితో బాటు ప్రతిభ కావాలి వస్తువు నొక్క మాటలో కాంతిమంతంగా చేయగల్గే శక్తి, తుత్తునాగం వంటి సామాన్య వస్తువును కూడా బంగారంగా మార్చగల్గే రసవాద విద్య. చెప్పిన కథ పాతదైనా సరే చెప్పే పద్ధతి అతి నూతనంగా కనబడేటట్లు చేయగల్గడం, పాత్రల గుండెల లోతులను శోధించడం, వాట్లకు వ్యక్తిత్వాన్ని కల్గించడం, సాహసోపేతమైన వినూత్న శైలిని అలవరచు కోవడం-ఇవన్నీ ప్రతిభవల్లనే సాధ్యమవుతాయి కానీ ఇవేవీ వెనుకటి పుస్తకాలలో ఉన్న వాట్లను పోలి ఉండవు. అసలు నిజానికి వెనుకటి కావ్యాలు ఎంతో బాగా వ్రాయబడ్డా, వాని వల్ల సంతృప్తి కల్గక

---

ది 28-8-77న హైద్రాబాదు, మెహిదీపట్నంలో చేసిన ఉపన్యాసం.

పోవడం చేతనే, ప్రతిభావంతుడైన కవి వినూత్న రమ్య భావరాశి సామగ్రిని కూర్చుకొని, క్రొత్త కావ్యాన్ని వ్రాయడానికి సంకల్పిస్తాడు అందు చేతనే ప్రతిభా వ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి అని ఆలంకారికుల నిష్కర్ష.

అయితే కావ్యం వ్రాసేవానికే కాకుండా, కావ్యాన్ని చదివేవానికి —ముఖ్యంగా విమర్శకునికి—కూడా ప్రతిభా వ్యుత్పత్తులు కావాలి ఇక్కడ వ్యుత్పత్తి అంటే కవికి ఉండదగ్గ వ్యుత్పత్తితో పోల్చవచ్చు శ్రోత అధికారి అవడానికి కొంత పాండిత్యం అవసరమే ఎన్ని శాస్త్రాలను చదువుతే కావ్యం అంతబాగా అర్థమవుతుందని అనలేము. కాని, అర్థమయ్యే అవకాశం తప్పకుండా ఉంది అయితే ఈ పాండిత్యంతో పాటు శ్రోతకు —ముఖ్యంగా విమర్శకునికి—ప్రతిభ ఉండాలి. ఇక్కడ ఈ ప్రతిభను మనం భావుకత్వం అనుకోవచ్చు అక్కడ ప్రతిభ గరీయసిఅవుతే, ఇక్కడ శ్రోతకు, చదువరికి, విమర్శకునికి, భావుకత్వం అత్యవసరమవుతుంది కల్పవృక్షాన్ని అర్థంచేసు కొందుకు అంతటి వ్యుత్పత్తి అవసరమవుతుంది. అంతకు మించిన భావుకత్వం అవసరమవుతుంది

x x x x x

రామాయణ కల్పవృక్షంలోని బాలకాండ రమ్యమైన కాండ ఇందులో ఎన్నో అందమైన కథలున్నాయి అయోధ్యకాండ గుండెను పిండివేసే కాండ అరణ్యకాండలో సీతాపహరణ కథ ఉంది, లోకోత్తరమైన శబరి కథాఉంది కాని కిష్కింధ దగ్గరకు వచ్చేసరికి చటుక్కున కథ చతికిల పడిపోయింది. ఇందులోని కథ ఏమిటి? అంటే వెంటనే స్ఫురించేది సుగ్రీవ పట్టాభిషేకం దీనిని గురించి ఒక పెద్దకాండ నెలా నిర్వహించడం? అందులో ఐదు 'మ విభక్తాలయిన ఖండము లెలా ఏర్పడతాయి? అన్న సందేహాలు కల్గుతాయి తిరిగి సుందరకాండ దగ్గరకు వచ్చేసరికి కథకు మంచి వడి ఏర్పడుతుంది

అయితే ఆలోచించగా చివరి మూడు కాండలలోను కథలోని సంఘటనలను బట్టి కాక, కాలపరిమితిని పట్టిచూస్తే, కిష్కింధా కాండలోని కథ సుమారు ఐదారు నెలలు పరచుకొని ఉంది.ఇంకా స్పష్టంగా చెప్పాల అంటే వసంతఋతువు నుంచి, శరత్తు వరకు పరచుకొని ఉంది. అంటే

ఇందులో ఋతు వర్ణనలకు మంచి అవకాశ మున్నదన్న మాట. ఋతు వర్ణనలలో విశ్వనాథకు మంచి పేరు ఉంది ఆయన అభిమాన కవులలో ఒకడు శ్రీకృష్ణదేవరాయలు ఈయన విశ్వనాథకు అభిమానకవి అవడానికి ఒక కారణం ఈయన ఋతు వర్ణనలన్న అనుమానం కల్గడం సహజం

ఇక విశ్వనాథ మంచి ఊహాశాలి. మనం సాధారణంగా ఊహించ గల్గిన పరిధిని దాటి ఊహించగల్గుతేనే కాని ఆయనకు తృప్తిలేదు. ఉదాహారణకు నవ్వు ఉన్నదనుకొండి నవ్వు ఎలా ఉన్నదంటాము? కలకల నవ్వాడు, గలగల నవ్వాడు, పిన్ననవ్వు నగి అంటాము, వెన్నెల విరిసి నట్లున్నదంటాము, ఇంకా కావస్తే మల్లెలు పూచినట్లుఉన్నదనగలం. అక్కడకు చాలునని చప్పబడి ఊరుకుంటాము

రాముని నవ్వు ఇలా ఉందంటాడు విశ్వనాథ-

**"సన్నని గులక రాల్క్రింద జరిగెడు సైకత స్థలుల**
**చిన్నారి సెలయేటి సన్న జీరాడు చిరునీటి పైని**
**సన్న సన్నని యలల్ కదలు ఛాయగా సాగు నీసెలవు**
**లన్నిటు లొలికెడు నవ్వులన్ వెన్నెలల్ నాకు రక్ష!"**

**—గజపుష్పి:870**

ఇట్టి ఊహ కల్గడమే కష్టం. కల్గినతర్వాత దానికి ఇంత గడుసుదనంగా రూపకల్పన చేయడం మరీకష్టం. తిక్కనను చదివి ఎన్నిరకాల నవ్వులున్నాయో లెక్కవేసుకున్న మాట నిజమే కాని, నవ్వు కింత రూపకల్పన చేయడం ఎక్కడా కనబడదు.

హనుమంతుడు మహేంద్రగిరి మీద నుంచి కుప్పించి సముద్రాన్ని లంఘించడానికి విక్రమించాడు. అప్పుడా కొండ పరిస్థితి ఇలా ఉన్నదట :

"కెవ్వన గీ పెట్టె క్షితిధరం బంతఁ బం
చాస్యంబు మదకుంభిఁజఱచి నట్లు
ఉరుఝురీ ధారలై యొడ్చెను గిరిరాజు
తడిగుడ్డ చేతులఁబిడిచి నట్లు

నేడ్చుచుండిన సంజకు నెత్తి గాని
వేసి యెఱనీళ్ళలను దీసి పోసి రనఁగ
సురలు పశ్చిమ దిగ్భిత్తి సుందరముగఁ
బఱచు కొన్నట్టి యొత్తి జేగురులు తోఁచె"

—అన్వేషణ : 186

వస్తువును వర్ణించడానికి తీసుకొన్న ఉపమాన సామాగ్రిలో వైవిధ్య ముంది, సాఫల్యం ఉంది ఒక్కొక్కటే ఒక గొప్ప చిత్రం అది కూడా తొందరపడి రెండు రేకలతో గీసినట్టు కనబడదు తీరికగా తీర్చి దిద్దిన చిత్రాలలాగే కనబడతాయి

విశ్వనాథ వర్ణనలను గూర్చి చూసుకుంటే ఒక్కొక్క ఖండము ఒక పెద్ద చిత్రశాలలా కనబడుతుంది.

మన ఋతువులను గూర్చి ఇటీవల ఒక మాట వినబడుతోంది. పాశ్చాత్యుల కైతే Spring, Summer, Autumn, Winter అని నాల్గు విస్పష్టమైన ఋతువు లున్నాయనీ, మనకు మాత్రం ఒకే ఒక్క ఋతువు ఉన్నదనీ వీరంటారు ఆఋతువు గ్రీష్మం అది సంవత్సరంలో ఆరు నెలలు లేతగా ఉంటుందనీ, మిగత ఆరునెలలు ముదురుగా ఉంటుందనీ వీరిభావన ఇది నిజానికి ఋతువులను ప్రకృతిలో వచ్చే మార్పులను బట్టి కాక ఉష్ణమాపకాన్ని (Thermometer ను) బట్టి నిర్ణయించడమే అవుతుంది

కాని వాస్తవిక పరిస్థితులలో మనకు విస్పష్టంగా ఆరు ఋతువులు కనబడుతూనే ఉంటాయి, ముఖ్యంగా నదుల దగ్గర ఉండే వాళ్ళకు, అడవులకు సమీపంలో ఉండే వారికి ఋతువులలోని మార్పులు కొట్టవచ్చినట్టు కనబడతాయి - వసంతఋతువు చెట్లు చిగర్చడంతో ప్రారంభ మవుతుంది; గ్రీష్మంలో ఎండలు ముదురు తాయి. నదుల దగ్గర ఉండే వాళ్ళకు నదు లెలా చిక్కి పోయి ఉంటాయో తెలుస్తూనే ఉంటుంది వర్షఋతువు రాగానే ఒక్క సారిగా పెద్ద మార్పు కనబడుతుంది నదులకు క్రొత్తనీరు

వస్తుంది, గట్లొరుసుకొని నదులు ప్రవహిస్తాయి, పొంగుతాయి. శరత్తులో, పండు వెన్నెలల్లో మెరిసి పోయే తెల్లుపూలు తమ అందాన్ని తేలిన నదీ జలాల్లో చూచుకుంటూ మురిసిపోతాయి హేమంతం మంచు తెరలతో ఇంకో రూపంలో సాక్షాత్కరిస్తుంది శిశిరంలో గాలిఅంతా రాలే ఆకులతో సందడిగా ఉంటుంది ఇలా ఒక ఋతువు నుంచి మరో ఋతువుకు వచ్చే విస్పష్ట మైన మార్పు ఉష్ణ మాపకంతో కొలవ దగ్గది కాదు

మరొక్క మాట: నేడు నాగరికత, సాంకేతిక విజ్ఞానం పెరుగుతున్న పాశ్చాత్య దేశాలలో, ముఖ్యంగా మహానగరాలలో బ్రతికే వాళ్ళకు ప్రకృతితో సంబంధం బొత్తిగా తెగిపోయింది. సూర్యచంద్రు లున్నారన్న నమ్మకంతో మనుష్యులు బ్రతుకుతున్నారు. ఋతువులు మారుతున్నా, మార్పులను చూడగల్గే తీరిక లేదు మనుష్యులకు వాళ్ళను నడిపేవి గడియారాలు, బస్సులు, రైళ్ళు, విమానాలు, ఆఫీసులు. ఆమధ్య నొక సారి న్యూయార్కులోలా ఉంది- విద్యుచ్ఛక్తి సరఫరా ఆగిపోవడంతో జీవితమంతా స్తంభించిపోయినట్లయిందట! ఎలక్ట్రిక్ ట్రేన్స్ లేవు, లిఫ్ట్స్ లేవు, దీపాలు లేవు. గ్రుడ్డివాళ్ళు, కళ్ళు ఉన్నవాళ్ళకు దారిచూపవలసి వచ్చిందట! మనమంత దుస్థితిలో ఇంకా లేము కాని, మనకూ వెన్నెలతోటి సంబంధం క్రమంగా తగ్గిపోతూంది చెట్లు కొట్టివేయడంతో ప్రకృతిలో మార్పులు మనకు కనబడడం మానివేస్తున్నాయి. ఊరిలో విద్యుద్దీపాలన్నీ ఆరిపోయినప్పుడు మాత్రం వెన్నెలఉన్నట్లు, ఆకాశంలో నక్షత్రాలు మిలమిల మెరుస్తున్నట్లు మనకు కనబడతాయి. సాంకేతిక విజ్ఞానం పెరిగే రోజులలో ఇది తప్పదు. దీనికి వాపోయి ప్రయోజనం లేదు.

ఈ కారణం చేతనే విశ్వనాథ ఋతువర్ణనలన్నీ మనకు ప్రాణప్రదమైన మవుతున్నాయి. ముందుముందు ఋతువులను ఇంతచక్కగా, నిశితంగా పరిశీలించగల్గిన కవి మనకు రాకపోవచ్చును. ఈ మారుతున్న నాగరికతలో విజృంభిస్తున్న సాంకేతిక విజ్ఞానంలో అట్టి పరిశీలనకే అవకాశం లేకపోవచ్చు. అదృష్టవశాత్తు ఈ సంధియుగంలో విశ్వనాథ ఒకడున్నాడు

విశ్వనాథ ఋతువర్ణనలు కొన్ని మరీ వాస్తవికంగా ఉంటాయి వానకాలంలో

"వాన జోరునఁ గురియుచోఁ బక్షులెల్ల
నెచటి వచటివి తమ గూండ్ల నెసక మెసఁగ
గూడు లేనిది కాఁబోలుఁ గొమ్మ కొమ్మ
గాఁగ నఱచెడు నొక్క యేకాకి కాకి."

—నియమపాలన: 131

పిట్టకన్న ఈ వాస్తవికతకు రూపకల్పన చేయడంలోనే విశ్వనాథ గొప్ప పనితనం చూపుతాడు

"వర్షేందిరయుఁ గేశ పాశమ్ము నందలి
మెఱుపుఁ బూవులు చూపె మేదినికిని
ధారుణీ సతియు నందము మెచ్చినట్లు చి
క్కని కుక్క గొడుగులు గాఁగ నవ్వె!"

—నియమపాలన: 103,

కవి తటస్థుడుగా ఉండిచేసిన వర్ణనలు కల్పవృక్షంలో ఉన్నా పాత్రలే వర్ణనలు చేయడం ఎక్కువగా కనబడడం ఒక విశేషం రామ లక్ష్మణులు ప్రస్రవణ గిరిమీద ఉన్నారు వర్షర్తువు వచ్చింది. రామచంద్రుని కిది అధ్యయన కాలమని జ్ఞాపకం వచ్చి అంటున్నాడు—

"అధ్యయన కాల మియ్యది యద్రియును గు
హా ముఖంబులఁ జేయు వేదాధ్యయనము
రహి నుదాత్తానుదాత్తస్వరంబు లొప్ప
వాన ధారలన్ జందెముల్ వేసుకొంచు!"

—నియమపాలన: 142

పాత్రలు వర్ణనలలో పాల్గొనడమే కాక, వర్ణన, కథ ఒకదానితో నొకటి పెనవేసుకొని పోవడం విశ్వనాథ వర్ణనలలోని ప్రత్యేకత.

క్రొత్తగా రాజయాడు సుగ్రీవుడు భార్య తిరిగి లభించింది వర్ష ర్తువు భోగ కాలం రాముడు ప్రస్రవణగిరి గుహల్లో ఉన్నాడు. రాముని కష్టము రామునిదే; సుగ్రీవుని భోగం సుగ్రీవుని భోగమే! వర్షాకాలాన్ని కవి వర్ణిస్తున్నాడు

"ఎంతటి మబ్బులు క్రమ్మినఁ
గొంత యెచటొ మిన్ను తెలియచుకొనియే యుండున్
వింత వెలుఁగైన కిష్కిం
ధాంతఃపురి దీపకాంతులైనను జిమ్మున్"
—నియమపాలన: 139

ఇది వర్ష ర్తువు వర్ణనా? కథను చెపుతున్నాడా? అంటే సమాధానం రెండింటినీ చేస్తున్నాడని మబ్బు లెన్నైనా కమ్మనీ, కిష్కింధలో దీప కాంతులు మాత్రం కనబడుతూనే ఉంటాయి. అక్కడ ఆటకూ, పాటకూ, సురాపానానికి ఎక్కడా ఎడం లేదు దానికి రాత్రి లేదు, పవలు లేదు అక్కడెప్పుడూ దీపకాంతులు చిమ్ముతూనే ఉంటాయట! శరత్తు వచ్చినా సుగ్రీవునికి మెలకువ రాలేదు కామవాగురంలోనే చిక్కుకొని ఉన్నాడు, కామ దేవాకృతిని పోలి ఉన్నాడు. ఆ శరత్తులో అలా కనబడతాడన్న దానికి ప్రాతిపదిక ఇక్కడి ఈవర్ణన:

సుగ్రీవుడెంత ప్రమత్తుడై ఉన్నాడో, లక్ష్మణుడంత అప్రమత్తునిగా ఉన్నాడు. మనకెలా తెలుసు నంటే- తర్వాతి పద్యాన్ని చూడండి

"అంత శబ్దరహిత మర్ధరాత్రంబుల
రెండు సవ్వడులు చరించు చుండు
నుర్వి యందు మేఘు నుఱుముల మ్రోఁతయు
మింట రాము ననుజు వింటిమ్రోఁత."
—నియమపాలన: 140

ఇందులోనూ వర్షర్తువు వర్ణనా, కథా రెండూ ఉన్నాయి అంతే కాకుండా పై పద్యంలోని సుగ్రీవుని ప్రమత్తతను లక్ష్మణుని వింటి మ్రోత మూరీకృతం చేస్తోంది.

వానకాలం నేరేడు పండ్ల కాలం.
"వస్సి సగము నేల రాలిన నేరేడు
పండు కానిపించెఁ బాంసురాశి
మదిరచేత నూత్న మాంజిష్ఠ కాంతుల
కనుల తోడి శబర కన్యవోలె!" —నియమపాలన: 121

అంత అందంగా ఉండే నేరేడు పండ్లను ఎంతో భక్తితో నీళ్లను కడిగి, సేవించుమని రామునికి అందిచ్చాడు లక్ష్మణుడు రామచంద్రుడు వాట్లను ఆరగించేటప్పటి ఆయన మనస్సు ఎలా ఉన్నదో కాని, లక్ష్మణునికి పాతకథ తెన్నో త్రవ్వినట్లయింది.

"స్వామి ప్రియము మీఱ జంబూఫలంబులు
నారగించి నవ్వినంతఁ జూడ
ధరణితనయతోడఁ దాంబూల సేవనం
బాచరించినట్టు లయ్యె మొగము."
—నియమపాలన: 123

రాముడు నవ్వుతున్నాడు. కాని, లక్ష్మణుని కళ్లలో నీళ్లుతిరిగి ఉండాలి కాని కవి ఆ మాట చెప్పడు లక్ష్మణుడు కన్నీళ్లను స్వామికి చూపడు

అంటే ఋతువర్ణనలు సీతారాముల కథతో ముడివడి ఉన్నాయన్న మాట సీతారాముల ప్రణయకథ అరణ్యకాండలోనూ కనబడుతుంది. అయితే ఇందులో అద్భుతమైన విషయాలేమీ కనబడవు. ప్రేమనుగురించి ఊహాగానాలు చేసుకొనేవారికి, ఊహాలోకాల్లో విహరించేవారికి, సీతా

రాముల ప్రేమఅంటే ఇంతేనా అనేటట్లు నిర్వహింపబడింది. సాధారణంగా ఆలుమగలమధ్య వచ్చే కజ్జాలు వస్తూనేఉంటాయి కోపగించుకొని ఒకరితో నొకరు మాట్లాడుకోకపోవడం ఉంటుంది ఒకసారి సీత అంటుంది : "నేనొక చక్కని కథను విన్నాను-చెప్పనా?" అని, "నేనిప్పుడు వినలే" నంటాడు రాముడు సీత ఊరుకుంటుందా? "పోనీలెండి, మీరు వినకపోతే లక్ష్మణుడు వింటాడు అతనితో చెపుతాను!" అని, కథనంతా చెప్పి చివరకు రాముణ్ణి అడుగుతుంది · "ఏం, కథ బాగులేదా?" అని సీతారాముల ప్రణయకథలన్నీ ఈవిధంగా "సాధుశృంగార లీలాప్రసన్న కథలే!"

సీతాదేవి హనుమంతునితో సుందరకాండలో అంటుంది .

"ఓయీ ! యీ యుంగర మనేక మధుర కథాధిదేవత.
ఒకనాడు స్వామి నిదురపోవుచుండగా, నే నాయనకుఁ
దెలియకుండ నీ యుంగరము తీసి, నా వ్రేలికిఁ దొడిగి
కొంటిని. స్వామి తరువాత వ్రేలికుంగరము
లేమిఁజూచికొని యే నదిలో జారిపోయినదో
యనుకొనఁగా నే నప్పుడు తిరిగియిచ్చి నవ్వితి.
అది యొక్క పెద్ద శృంగారలీలగా సమాయకతా
మధునరో మూర్తులయిన యప్పటి మాయున్న
యాశ్రమస్థ వృద్ధ తపస్వులు లాడుకొనిరి."
—సుందరకాండ : ఉపఃఖండము-పుట 192

సీతారాముల ప్రణయమింత ముగ్ధమనోహరంగా ఉంటుంది అయినా వారిద్దరూ విడదీయరాని జంటలయ్యారు ఏమంటే సీతాదేవి అన్నట్లు

"మాయిద్దరి ప్రేమకథా
వ్యాయతి సెలయేళ్లు తెలుగు నప్రతిమెలుంగున్
నా యిప్పటి దుఃఖకథా
వ్యాయతి యీ వార్ధి యెలుఁగు నాకసమెలుఁగున్"
—సుందరకాండ : ఉపఃఖండము

సీత కష్టాలిలా ఉండగా, రాముడు వియోగాన్ని ఎలా అనుభవించాడో కిష్కింధలో కనబడుతుంది గ్రీష్మంలో నదులూ, రాముడు ఇలా ఉన్నారట

"పైన సలసలఁ గ్రాఁగి లోపలను శిశిర
నిభృతముగ నుండె శైవాలినీభరంబు
లోన సలసలఁ గ్రాఁగుచుఁ బైన శిశిర
చారువుగ నుండె శ్రీ రామచంద్రమూర్తి!"

—నియమపాలన : 100

ఇంతటి విరహాన్ని అనుభవించేవానికి తినడానికొక్కటీ రుచించదు లక్ష్మణు డెలా బతిమిలాడుతున్నాడో చూడండి ·

"నీవు వశిష్ఠ శిష్యుఁడవు నీ వఖిలజ్ఞుఁడ వాత్మవేత్తవున్
నీవు చరాచరాఖిలము నిల్పితి కార్ముకలస్తకంబునన్
నీవును మూర్తిమంతుఁడవు నిర్మల వైదిక ధర్మరాజికిన్
నీవు మహాత్మచంద్రుడవు నేటికి భోజన మారగింపవే!"

—నియమపాలన : 82

కాగా, సీతారాముల ప్రణయము, ఎడబాటుకూడ సాధారణమైనవి కావు అడవులు, కొండలు, నదీనదాలు, లేళ్ళు, కుందేళ్ళు, పశువులు, పక్షులు, నరులు, వానరులు-లోకం అంతా వారి సుఖదుఃఖాలను పంచుకుంటారు. వారి కల్యాణమే లోకకల్యాణం - వారి ప్రణయం లోకానికి పండుగ, వారి ఎడబాటు లోకానికి ప్రళయం.

x x x x x

కవి వర్ణనా నిపుణుడే అవవలసిఉన్నా, ఒకొక్కప్పుడు వర్ణనా నిపుణుడైన కవి కథాకథనం దగ్గరకు వచ్చేసరికి తేలిపోతాడు అసలు

కావ్యనిర్మాణంలోని సొగసు, శిల్పం అంతా కథను చెప్పడంలోనే ఉంటుంది కథను ప్రారంభించడం, ముగించడం, కథలోకి పాత్రలను ప్రవేశపెట్టడం, వానిని ఉపసంహారించడం- ఇదొక పెద్ద విద్య విశ్వనాథ కథకచక్రవర్తి కథ ఎంత చిన్నదైనా, దానికి ప్రాణం పోయగలడు; చెప్పే పద్ధతిలో తన విశిష్టతను నిలుపుకోగలడు. ఈ కథను చెప్పే నేర్పరితనం అన్నికథల లోనూ ఒకేవిధంగా కనబడదు ఒక్కొక్క కథలో ఒక్కొక్క ప్రత్యేకత కనబడుతుంది.

కిష్కింధకాండలో దుందుభికథ ఉంది. ఇది వట్టి ప్రాసంగికంగా - మాటల్లో - వచ్చిన కథ అయినా తీర్చిదిద్దిన పద్ధతి అద్భుతంగా ఉంది ఈ కథలోని పాత్రలలో మనుష్యులెవ్వరూ లేరు సముద్రుడు ఒకపాత్ర, చలనాన్నెరగని హిమవంతుడు మరొకపాత్ర అరే, దుందుభి-దున్నపోతు-మరొకపాత్ర వాలి ఒకడున్నాడు. ఆయనభార్య తార ఒకర్తె ఉంది వీరుకాక ఇంకా ప్రేతకులున్నారు వారంతా వానరులు.

ఈ కథను ఎలా చెప్పాలి? ఎలా చెప్పినా ఏముంది ఇందులో అని పిస్తుంది కాని దీని ప్రసక్తిరావడమే చిత్రంగా ఉంది కిష్కింధ ప్రారంభంలో వెన్నెలప్రసక్తి తరచుగా వస్తూంటుంది ఈ కథలోనూ వస్తుంది ప్రాతః కాలంలో శ్రీరామచంద్రుడు సౌమిత్రితోనూ, సుగ్రీవునితోనూ, విహరిస్తూండగా, ఒకచోట కనబడిందట-

"చెడి పనికి రాకపోయిన శీత కిరణు
స్థూల కిరణంబులను ప్రాంత దూలములను
గుట్టగాఁ బోసిరో యనఁగొండ వోని
యొక మహాస్థి పంజర సమీ పోర్వియందు"

—నూపుర: 217

ప్రారంభంలోనే శ్రోత లౌకిక పరిధికి దూరంగా నిలబడవలసి వస్తోంది చంద్రకిరణాలను మన మెరుగుదుము కాని, అవి దూలాలుగా ఉండడం

కాని, పనికిరాక పోవడం కాని, వానిని గుట్టగా పోయడం కాని, మన ఆలోచనా పరిధికి, అనుభవానికి దవ్వైనవి. ఇది లోకాతీతమైన కాల్పనిక పరిధి ఇక్కడి వరకు కవితో శ్రోత పయనించ గల్గితే, తర్వాతి కథను నమ్మడం సాధ్యమవుతుంది. కావ్యంలో— ముఖ్యంగా కాల్పనిక కావ్యంలో——ఉండ వలసింది గడ్డకట్టిన మన విశ్వాసాలను దూరంగా ఉంచ గల్గడం ఈ పద్యం దీనికి ప్రాతిపదిక నేర్పరచింది తర్వాతి కథకు మనం మానసికంగా సన్నద్ధులమై ఉన్నాము.

అది దుందుభి అస్థిపంజరం. ఇంత అందమైన "ఋశ్యమూకగిరికానన లక్ష్మి శరీరమందునం బురిపిడి కాయలా" కంటికి వెగటు పుడుతోందని, రామచంద్రుడు "కాలి బొట్టన వ్రేల నా కళేబరంబు లీలగా నెత్తి" పది ఆమడల దూరం విసరగా, ఆదుందుభి ప్రసక్తి వచ్చి, వాని కథచెపుతాడు సుగ్రీవుడు

వాడొక వేయి ఏన్గుల బలం కలవాడు కాస్త బలవంతుడెవరైనా కనబడితే చాలు, కొమ్ములు చిమ్ముతూ, గిట్టలు దున్నుతూ, కయ్యానికి కాలు దువ్వుతాడు. వాళ్ళనీ వీళ్ళనీ కవ్విస్తే ప్రయోజనం ఏముంది? అందరికంటె బలంగల వానిలా కనబడ్డాడు సముద్రుడు. "రావయ్యా, యుద్ధానికి!" అన్నాడు.

"కదలి విజృంభించి యసుర కాల్దువ్వి కహ కహ నవ్వి,
యది యేమిరా! సముద్రా! ధరాంతంబు నావరించితివి
బెదర నేటికి నల్లుడుండె విష్ణువన్ పేరు పెట్టికొని
కొదువయే సాయమ్ము తెచ్చికొమ్ము నా కొమ్మునం జెడక!"
——నూపుర: 227

పాపం, సముద్రు డంత ఎత్తు కెరటాలనుం ఒడ్డునే విరిగించుకొన్నాడు, అయినా దుందుభి ఊరు కుంటాడా ? "జడిసెద వేటికి నాతోం దొడరుము కయ్యాని కంచు దుందుభి మొరసెన్" ఇంక ఈ పొగరు బోతుతో మన కెందుకులే అనుకున్నాడు సముద్రుడు

"రాక్షసరాజ! మరేమినిన్ను నేనన్నదిలేదు!" అని మెల్లిగా నీళ్ళు నములుతూ, "నే నెప్పుడూ ఇక్కడ నుంచి కదల లేదు కాని, చెప్పుకో గా విన్నాను- నీకు దీటైనవాడు హిమవంతుడయ్యా!" అని ఆయన మీదకు రక్కసి దున్నను తోలాడు: దుందుభి ఆయన మీదకు దూకే సరికి, ఆయన అంటాడు.

......"అతని
కెవరు చెప్పిరో తెలియ దే నెపుడు యుద్ధ
మాడి యెఱుఁగన యాడెడు వాఁడఁగాను!"

"నీకంత యుద్ధమే చేయాలని ఉంటే, అదిగో అక్కడ వాలిఉన్నాడు. వానిని కవ్వించు" మన్నాడు, వెళ్ళమన్నాడు కాని,

"నినొక్కటి యర్థించెద
నిన్నాతడు కొమ్ములూని నింగిని విసరున్
నన్నుం జెప్పకు కోపము
న న్నా మీఁదికిని విసరినన్ విసరు జుమీ!"

నూపుర : 246

ఇది నిజానికి విన్నపం కాదు, హెచ్చరిక. అయితే దుందుభికలా అర్థమైతే, ఆతడు దున్న ఎలాఅవుతాడు ?

అది పున్నమ రాత్రి "అమావాస్య దాడి వెడలినట్లు కిష్కింధాపురి గవను ద్వారము కొమ్ములతోఁ దాడించి చేసిన మహాధ్వని" వాలికి వినబడింది.

వాలి ఉన్న పరిస్థితి ఎట్టిది? అతని పెదవికి తార మధుపాత్ర నందిస్తోంది. ఆ మహాధ్వనికి ఆ కనకపాత్ర జారి కాళ్లపై ఒలికింది మళ్లా ఫెడేల్ మన్న శబ్దం వినిపించింది వాలి గవనికి లంఘించాడు. "ఎవ్వడురా!" అన్నాడు ఇంతలో చుట్టూ వానరులందరూ మూగారు. అది వెన్నెలరాత్రి; కాగడాలతో వానరులందరూ వచ్చారు.

"వంద కాగడాల వెలుతురుచే వెన్నెల లెట్టులైన" వంటాడు విశ్వనాథ

దుందుభి తానక్కడకు ఎందుకు వచ్చాడో చెప్పాడు మంచుకొండకు వాలి పెట్టిన భయానికి రక్కసి దున్నకు నవ్వువచ్చిందట. "దుందుభి యర్ధ క్లిన్న ఘాసం బంగిలి నుండి దంత దేశమ్మునకుఁ గ్రుమ్మొకొను పశువువోలె" నవ్వాడట! వాలిని రెచ్చకొట్టడానికి హిమవంతుడొక చిన్న సలహానిచ్చాడు వాలి త్రాగుడు ప్రసక్తి తెస్తేసరి, వానికి వెట్టపుట్టి యుద్ధాన్ని ఇస్తాడన్నాడు. దీన్ని దుందుభి పూర్తిగా ఉపయోగించు కోవాలను కొన్నాడు

"త్రావిన వానికిన్ స్మృతి పథంబున యందునఁ గోఁతులాడు నా
త్రావుట కోఁతియైన యెడఁ ద్రావిన వానికిఁ దేలుకుట్టిన
ట్లౌ వెడబుద్ధియై యతఁడు నెంచడు తల్లిని దోడు, జూడలే
దా! విబుధుల్ సురాపులయినంతట దైత్యుల వెళ్ళబుచ్చుటల్!"
–నూపుర : 260

ఈ కథను రామునితో చెపుతూన్నది సుగ్రీవుడు కథను చెప్పేవాడు చెపుతూన్నట్లు సాగిపోడు మధ్య తన గోడు వెళ్ళబుచ్చుకుంటాడు

"వాఁడెటువంటి వాఁడయిన వాఁడని నట్టిది నిక్కువంబు! వాఁ
డాడిన యట్లు వాలియును నక్కట! సోదరు వెళ్ళఁబుచ్చె!"

అంటాడు. కథను చెపుతూన్నంత సేపూ అన్న అంటేనూ, ఆతని శౌర్య మంటేనూ, సుగ్రీవునిలో ఒక విధమైన గర్వరేఖ కనబడక పోదు ఇంకో ప్రక్క అన్న అంటే భయం, వెళ్ళగొట్టాడన్న కోపమూ కూడా ఉన్నాయి అంతకన్న ముఖ్యమైన దేమంటే తన అన్నగారేమో త్రాగుబోతు–దుందుభి అన్నమాట నిజమే నట! అన్న త్రాగుబోతయినట్లూ, తాను బుద్ధిమంతుడై నట్లూ మాటాడు తున్నాడు సుగ్రీవుడు.

కాని రాజ్యానికి రాగానే సుగ్రీవుని స్థితి ఎలా ఉంది? రామునికిచ్చిన మాట మరచాడు: సంధ్యలు తిరుగుతున్నాయి, పక్షాలు తిరుగుతున్నాయి,

మాసాలు గడుస్తున్నాయి. ఋతువులు మారుతున్నాయి దిక్కులకేమో తెల్వి వచ్చింది, సుగ్రీవునికి మాత్రం రాలేదు-

"గేహాంత స్థిత డోలికా గతుఁడు సుగ్రీవుండు తారారుమా
బాహాలగ్న శరీరయష్టి మదిరా బంధూక నేత్రుండు ని
ర్వ్యాహ శ్రేణిక జారుచుండగ శిరస్స్నాగించుచున్ నర్తకీ
సేహా గీతిక లాలకించుచును బొల్చెన్ గామ దేవాకృతిన్!"

నియమ: 163.

అట్టి భ్రాతగుబోతు, కామదేవాకృతి, అన్నగారిని తప్పు పడుతున్నాడు

"వాఁడెటు వంటి వాఁడయిన వాఁడని నట్టిది నిక్కువంబు వాఁ
డాడిన యట్లు వాలియును నక్కట! సోదరు వెళ్ళఁబుచ్చె?"

మనిషి హృదయంలో లోతులంటే ఇలా ఉంటాయి ఒకపొరలో అన్న అంటే అభిమానం-అక్రింద భయం- ఇంకా క్రింది భాగంలో వాని భ్రాతగుడు కేం గాని, అది పెద్ద తప్పుకాక పోవచ్చు కాని, తన్ను వెళ్ళఁబుచ్చడం మాత్రం ఆతనిలోని పెద్ద దోషం!

వాలికి రాదగినంత కోపం రానే వచ్చింది అయినా ఈ మూర్ఖునితో ఎందుకులే, అనుకున్నాడు

"కొంచె మాలోచనము చేసికొమ్మి నీదు
తెలివి స్పష్టమ్ముగా నీకె తెలియఁ గలదు
ఎచట ఘోరాంబు రాశి నీ వెచట, నెచట
హిమగిరీంద్రంబు నాప నీ వెచట చూడు!"

"వట్టి వెఱిపప్ప క్రిందం
గట్టిరి నిన్నంచుఁ దార కై కైకొని పో
నట్టె మగుడ దుందుభియును
గిట్టలతో మన్ను చిమ్మి కీశేశు పయిన్"

—పూపుర : 264-265.

"అరే చేత కాదేని యట్లాడి పోరా
బిరానన్ సతీసంగ భీరూ!"

—నూపుర : 266.

అంటే ఊరు కుంటాడా వాలి! అనికూడా ఊరుకున్నాడా దుందుభి! "కొమ్ముచేఁ బొడిఁచె జండుఁడు రక్కసి దున్న!"

పోరు ఘోరమే అయింది. కాని, సుగ్రీవుడు తన అన్నగారు శ్రమ మెరుగడన్నాడు. చివరకు:

"వాలి వాలం బసుర వెనుగాళ్లఁ దగిలించి లాగి కోలు కొక్కరగాఁ బడనొత్తి ప్రక్కటెముకల మోఁకాటి తాఁపున విఱుగ బొడిచిన నసుర మూరెఁడు నాలుక వెలికి జారఁ బట్టెడు నెత్తురు క్రక్కికొని చచ్చిన, వాని కళేబరంబున కటునిటు దూఁకి, నిలఁబడి, పకాలున నవ్వి, వాని యిరు కొమ్ములూని యీ యామడ దూరంబునకు విసరివైచె?"

అదీ ఈ అస్థిపంజరం కథ అంటాడు సుగ్రీవుడు.

ఈ కథలో ప్రారంభం, ఉపసంహరణ, పాత్రలను ప్రవేశ పెట్టడం, వాటికి రూప కల్పన చేయడం, ప్రధానంగా రాబోయే కథకు అవసరమైన తార ఒక్కమాట కూడా అనక పోయినా, ఆమెకు రూప కల్పన చేయ డంలో కవి చూపిననేర్పు, శ్రద్ధ- గమనింప దగ్గవి. ఇందులోని పాత్రలకు జంతు లక్షణం ఉంటుంది, మానవ లక్షణమూ ఉంది ఉపమానాలు వాడ డంలో రమణీయోదాత్తత కనబడుతుంది. సునిశితమైన పరిశీలన, హాస్య స్పర్శ, ఛందస్సును వాడడంలోని ఔచిత్యం-కొట్టవచ్చినట్టు కనబడుతాయి కథాశరీరం చిన్నదైనా, కథన శిల్పం గొప్పది. కవి ప్రతిభ అంతా ఒక్క సారి గుబాళిస్తుంది.

x x x x

కథను చెప్పడం కష్టమే. దానికి ఒకానొక రకమైన శిల్పచాతుర్యం అవసరమవుతుంది. ఏ శోకమో ఇమిడి ఉన్న రసవత్తర ఘట్టాన్ని చిత్రించడం

అంత తేలికైన పనికాదు. భారత కథలో స్త్రీ పర్వం ఉన్నది యుద్ధంలో అంధుని కొడుకుల యందొక్కరునీ మిగల్చ లేదు భీముడు ధృతరాష్ట్రునికి దుఃఖం ఎంతకైనా తగ్గదు. తల్లి గాంధారి దుఃఖం ఊహకు కూడా అందదు ద్రౌపది కూడ అట్టి దుఃఖాన్నే అనుభవించింది ఒక్క కొడుకు కూడా ఆమెకూ మిగుల లేదు శోకంలో అందరూ కలుసుకున్నారు- ద్రౌపది, పాండవులు, ధృతరాష్ట్రి గాంధారులు- వీరందరినీ శోకం ఏకం చేసింది.

కిష్కింధా కాండములో ఇట్టి ఘట్టం ఒక్కటి ఉంది గజపుష్పి ఖండంలో. వాలి సంహరింపబడ్డాడు. వానర రాజ్యమంతా దిక్కులేనిదై పోయింది. వాళ్లదొక రకమైన శోకం అంగదుడు చిన్నవాడు తండ్రి దిక్కు పోయింది. తార-వాలిభార్య-అనాథ. వీళ్ల శోకాలు ఉత్తరోత్తరా బలీయాలు. వీళ్లందరికీ దూరం మరొకడున్నాడు: అతడు సుగ్రీవుడు, వాలి తమ్ముడు. అన్నగారిని చంపించిన వాడు. అన్న రాముని బాణానికి గురి అయ్యేవరకూ అతనికి నిద్రపట్టలేదు. ఆ కాస్త పనీ జరిగాక, ఆతనికి శోకం వల్ల అసలే నిద్ర పోయింది. "నాకున్ రాజ్యము పాడు వద్దు ప్రభువా!" అని గొల్లు మంటాడు.

ఇప్పుడు కవి చేయవలసిన పని వీరి వీరి శోక స్వభావాలను చూపడం ఒక్కటే కాదు. ముందు అంగదుడు యువరాజు కావాలి. సుగ్రీవుడు రాజు కావాలి. వానర రాజ్యంలో శాంతి నెలకొనాలి శోకం వెల్లువలై పారాలి. కాని చివరకు వానర లోకాని కంతటికీ విశ్రాంతి, శాంతిరావాలి. దీనిని సాధించడంలో విశ్వనాథ అద్భుతమైన శిల్పాన్ని ప్రదర్శించాడు.

విశ్వనాథ ఒక శోకపు తెరతో ప్రారంభిస్తాడు. దానిని విజృంభింప నిస్తాడు. అది ఒక పాయగా ప్రవహిస్తుంది కొంతదూరం సాగిపోతుంది. దాని కొక మలుపు వస్తుంది, లేక పోతే దానిలో ఇంకొక పాయ కలుస్తుంది. ఈ క్రొత్తపాయ మరికొంత దూరం ప్రయాణంచేస్తుంది. ఇంకొక మలుపు వస్తుంది, లేక పోతే ఇంకోపాయ కలుస్తుంది. ఇలా ఒడ్లను ఒరుసుకొని పారే శోక కూలంకష జలప్రళయంలా వానరలోకాన్ని ముంచివేస్తుందా?

అన్నంత భయాన్ని కల్గిస్తుంది. కాని శ్రీరామ చంద్రుని ప్రేయః కంఠము అందరకూ ఊరట కల్గిస్తుంది ఆకాశం నుంచి వినబడ్డ "నా నిండు కోరిక పండినది. నీదు నారాచ ముక్తి!" అన్న వాలి మాటలలో శోకం తిరోహితమై, శాంతి ప్రతిష్ఠింప బడుతుంది

ఇదీ విశ్వనాథ పథకం ఈ పథకం ఎలా నిర్వహింపబడిందో శాస్త్ర పరిశీలన చేద్దాం

రాముడు దూసిన బాణానికి వాలి నేల కొరిగి పోయాడు. కిష్కింధ అంతా గగ్గోలుగా ఉంది పెద్ద హెచ్చరికలు చేయబడ్డాయి.

"క్రొత్తడముల్ త్యజించకుడు కోట కవాటములన్ బిగించు డు
ద్వృత్తిని గోట మీఁది కరుదెంచున యేనియు మీరలెల్ల నా
యత్తపడుండు దుర్గపు రహస్య బిలంబుల శైలకాన నా
వృత్తిపలాయమాను లగుడీ! లగుడాహతులైన యట్లుగన్."

—గజపుష్టి : 219.

ఎవ్వరినీ బయటకు రావద్దంటున్నారు. అయినా తారకి హెచ్చరిక లేవీ వినిపించడం లేదు. వారించే వారిని తొలగి వచ్చింది తార వాలిదగ్గరకు గజరాజు గతించగా భారంగా అడుగులు వేసే కరేణుకలా ఉన్నదామె గమనం.

"ప్రియ సహచర వియోగాగ్ని భీత చలిత
శీర్ణ హృత్కోక కామినీచ్ఛిన్న రవయు
ప్రాణనాయక మృత శరీర పరిసర వి
చార కపోతికాధూతపక్షయును దార!"

గజపుష్టి : 228.

ఇదీ గుండెలను పిండే ఆమె తొలి వేదన. ఆమెకు శోకం కనబడుతోంది, కనబడడం లేదు. దుఃఖ పడుతోంది, పడడం లేదు. తానెవరో తనకు తెలుసు, తెలియదు- అదీ ఆమెస్థితి.

ఆ స్థితిలోనే "రామ సుగ్రీవాదుల నందఱను దాఁటివాలి పడి యున్న చోటికిఁ బోయి యతని మీఁదఁ బడి, యింత సేపేడ్చి—ఇది ఒక దుఃఖపు తెర. వెనుక నామెకు నోరు పెగలని దుఃఖం. ఇప్పుడు గొల్లుమనే సరికి, స్పృహ వచ్చింది, ప్రజల్లో పడింది. నోరు పెగిలింది.

"రాముండన్న యముండు కాఁచికొనె భర్తా పోకు
మయ్యా! మహా
ఘామంబైనది ధర్మయుద్ధమున కీ సంగ్రామ మా పూర్వసం
గ్రామంబుల్ బలెఁ గాదటంచుఁ బలుకంగా నీవు
విన్నావు కా
దీ మాద్రిం జనుదెంచి కొంపకును నీవీ నిప్పు ముట్టింపగన్."

"నెత్తిన నోరువెట్టికొని నే నటు పోరఁగ నాదు మాటలన్
జిత్తమునందునన్ గణనచేయవు కాలవశాత్మబుద్ధివై
యిత్తరి నేమి కావలయు నేనును నీకొడు కిట్టి సాహసా
యత్తము జీవితాని కెపుడైన నిదిట్టిది యుండె నంచనన్"

—గజపుష్పి :231, 232

ఇంకో వచనం వస్తుంది వచనం వచ్చిందంటే, దుఃఖంలో ఇంకో మలుపు వచ్చిందన్నమాట లేక మరోపాయ వచ్చి కలిసిందన్నమాట!

ఇప్పుడు "వివేక దుఃఖంబు పొందుచున్న తార కన్నంగదుని మీఁదఁ బడి, యెలుంగెత్తి, చేతులు చాచి, కొడుకుఁ గౌగిలించుకొ"న్నదట! ఇక తారకు భయంలేదు! తొలి స్థితిలోని తారకు లోకం అంతా అంధకారం -ఆమెకు అవలంబనం లేనేలేదు. ఆమె చిరుగాలికి తూలిపోయేది; ఒక్క అల చాలు ఆమెను ముంచి వేయడానికి. ఇప్పుడు భయంలేదు కొడుకును చూసి బతుకుతుందేమోనన్న ఆశ మనకు కల్గుతుంది ఆమె గుండె రాయి అయిపోలేదు - "ఇట్లు వగులబడియె!"

ఈ దుఃఖం మరికొంత దూరం సాగింది తారశోకాన్ని చీల్చుకొని కొన్ని మాటలు వస్తున్నాయి. "తారా నిరూఢ నిగూఢ దుఃఖోల్బణ

జనిత వాక్య సంజాతమ్మునకు రామ సుగ్రీవులు వెఱగొందుచుండ, హనుమంతుడు" ఆమెను ఓదార్చడానికి ముందుకు వచ్చాడు అనగా ఇప్పటికి ఓదార్చడానికి అనువైన స్థాయికి ఆమె నిలద్రొక్కుకో గల్గిందన్నమాట' "అమ్మా ! నీవింత పండితురాలవేమిటి? ఈ దుఃఖ మేమిటి?". అంటాడు "ఈ అంగదుణ్ణి చూసుకో!" అంటాడు కాని తారకు అంత దుఃఖంలోనూ, అంత గరువమూ ఉండి .

"ఒక వంద యంగదులు మా
మక దుఃఖము పాపలేరు మహానియమతీ !"

అంటూ,

"తార చేతులు వాలిపైనుంచి, తొడలపై బడియున్న, వాలి చేసన్న సుగ్రీవునిఁ జేర బిలిచి యిట్లనియె !"

ఈ వచనంలో మరోమలుపు వచ్చింది. వాలిలోని అన్న ఆతని మాటల్లో తొంగిచూస్తాడు చెప్పదగ్గ మాటలన్నీ సుగ్రీవునితో చెప్పి, వాలి "తన మెడలోని బంగారుదండ తీసి, సుగ్రీవున కందీయ, నతఁడు బెఱుకు కన్నులతో దానిని స్వీకరింప, వాలి అంగదునితో నిట్లనియె :

"అతనికి న్నాకుఁ బొరుపు లేనట్టి నాళ్ళ
నీవు పిననాన్న పిననాన్న నెఱి నతండు
నెపుడు నబ్బాయి యబ్బాయి యీవిధమున
నుండి రిప్పుడా రీతినే యుండుడింక !"

—గజపుష్పి : 287.

అని, "చాలసేపు మాటాడితిని, మాట వచ్చుటలేదని యాయాసం పడి, యేదో చెప్పఁబోయి, చెప్పలేక, కన్నీళ్ళతో నంగదుని చేయితీసి, సుగ్రీవుని చేత నిడినంత, సుగ్రీవుండు భళ్లునఁ బగిలి, వాలి కాళ్లపైబడి రోదించి, లేచి, యంగదునిఁ గౌగిలించుకొని యేడ్చుచుండ, శ్రీరామచంద్రునికి, "అన్నదమ్ముల వ్యవహారమందు జోక్యమింత క[illegible]చుకొన్న

తానెవరో తనకె తెలియదాయె"నట! అంటే ఇప్పటికి దుఃఖంలో సుగ్రీవాంగదులు కలిసిపోయారు ఇద్దరి దుఃఖమూ ఒకేపాయయై పారుతోంది. అనుమానాలూ, వైరాలూ సమసిపోయాయి

మరి మిగతా వానరుల మాట ఏమిటంటే, మళ్ళీ వచనం : "అంత శ్రీరామచంద్రుండు సలక్ష్మణుండు దవ్వుచని విశ్రమించి యుండఁ గపిలోకమ్ము గుంపులుగుంపులై" వచ్చారు.

వాళ్ళదుఃఖం వాళ్ళది. ఇది ఇంకొక దుఃఖపు పాయ.
మళ్ళీ ఇంకో వచనం : మరోమలుపు.
"కపిలోకంబెల్లఁ బ్రొద్దువోయిన కొలంది
నొక్కొక్కఁడు నిదుర కొగ్గ, నంగదుఁడును సుంత
కునుకఁ దారా సుగ్రీవు లిద్దరే తెల్లవార లల్లే యుండిరి."
—గజపుష్పి : 317.

వదినెగారు ఏమన్నా అంటుందేమోనని అనుకుంటాడు సుగ్రీవుడు. నాల్గు మాటలన్నా పడడానికే సిద్ధంగా ఉన్నాడు కాని, ఆమె ఏమీ అనదు. తనకు మాటాడడానికి భయం. తార తన దుఃఖంలో తాను ఉంది. "తనలోనె తా సముద్రాలు త్రవ్వి పెళ్ళపెళ్ళలు గాగఁ ద్రిప్పికొనుచుండె!"

తెల్లవారింది. కాని తార దుఃఖం మాత్రం తగ్గలేదు.
"ఇది యేదో యొక మృత్యు తాపముగ సామీ ! వచ్చు
లో నుండి త
ప్పదు నిన్నుఁ బడి వచ్చుచుంటిని వియత్పర్యాప్త
మార్గంబునన్"
"అని గ్రుడ్లు తేలవేయు చున్నంతలో, నంగదుం, 'డమ్మా'
యని యఱచి కౌగిలించు కోఁగాఁ, దార నుడి గుండంబు
నుండి పైకి తేలి, తెప్పిరి, కొడుకు మెడ మీఁద వ్రాలి

యేడ్చి, యేడ్చి, మఱలఁ దన్నుఁదా సంబాళించు
కొని, చీర చెఱంగునఁ గన్నులు తుడిచి కొని, కుమిలి
పోవు కొడుకు నాదుకొని, తండ్రీ! లేదు,
లేదు! నేను బ్రతికి యే యున్నానుగా! యని
యోదార్చి యంగదుండును దేరు కొనఁగా—"

అయినా తార దుఃఖం చల్లారదు. ఈ చివరి పొంగుకు సుగ్రీవుడు నిలు వెల్ల చలించి పోయాడు. "నాకున్ రాజ్యము పాడు వద్దు ప్రభువా! నా మిత్రమా! రామ!" అని మొర పెట్టుకున్నాడు.

తుదకు తార కోపము, దుఃఖము, సోత్ప్రాసము, శ్రీరామచంద్రుని ప్రేయః కంఠము పలుగా తరోహిత మైపోయాయి. కాని ఈ దుఃఖం చివరి వరకూ ఉండి, ఉండ, పొంగుతూనే ఉంటుంది. ఈ దుఃఖ వారాశిని తరు వగా, తరువగా. పుట్టిన అప్సరః కదంబ వియద్వీథీ సంగీతకంలా ఇలా విన బడిందట!

"ఆనంద వీధి విహార! అఖిల లోకైక ధానుష్క!
పూని వారించెను దార పోవద్దు పోరికం చతివ!
నేనె వచ్చితి నయ్య! మోహా నీ హార నీరేజ బంధు!
నా నిండు కోరిక పండినది సీదు నారాచ ముక్తి!"

—గజపుష్పి : 406

దీనితో ఈ ఖండం ఒక శాంతి పరివేషంతో ముగిసింది శ్రోతకు పాత్రలకు గుండెలు కుదుట పడ్డాయి ఇదొక అద్భుతమైన రసవత్తర ఖండము-లోకోత్తర మైన నిర్వహణ!

కిష్కింధా కాండలో కథ చిన్న దైనా, విశ్వనాథ రమ్యభావ రస సామగ్రి నెలాకూర్చుకున్నాడో అనుశీలన చేశాము విశ్వనాథ పాత్ర చిత్రణ ఎలా ఉందో ఒకసారి పరిశీలిద్దాం.

ఇటీవల సాహిత్యంలో పాత్రలు కేవలము మూసలో పోసినట్లు ఉండక జీవంతో కలకలలాడు తున్నట్లు ఉండాలని రచయితలు బాగా గ్రహించారు. మనస్తత్వ పరిశోధనలు తీవ్రంగా సాగడంతో మనస్తత్వపు లోతులను స్పృశించడానికి రచయితలు ప్రయత్నాలు చేస్తున్నారు.

అయినా ఇంత ప్రయత్నంచేసే రచయిత అందరికీ మనిషిఅంటే నమ్మకంలేదు మనిషిదొంగ దగాకోర్; మనిషి ఎందుకు పెద్దమనిషిలా ప్రవర్తిస్తాడంటే, రోడ్డు మొగలో, సందు మలుపులో పోలీసు వాడున్నాడు కనుక. శిక్షపడుతుంది కనుకనే మానవుడు నేరంచెయ్యాడు పిరికి వాడవడం చేతహత్యలు చెయ్యడు. చేతకాక పోవడంవల్ల దోపిడీచెయ్యాడు. లేక పోతేనా? ఇది ఒకరకమైన ఆలోచనా విధానం

విశ్వనాథలోని ప్రధమలక్షణం మానవుని మీద ఆయనకుగల అచంచల విశ్వాసం. ఈవిశ్వాసం రెండురకాలుగా ఉంటుంది ఒకటి మానవుని మంచితనంలో విశ్వనాథకు గొప్పనమ్మకం ఉంది. అందుచేతనే ఆయన పాత్రలలో చెడ్డవాళ్ళు కనబడరు. చెడ్డవాళ్ళుగా ఎవరనీ ఆయన దిద్ది తీర్చ లేదు.

మనిషి ఇలా ఎందుకు ఉండడం సాధ్యమంటే ప్రతీవానికీ ఏదో ఒక ఆవేదన, ఒక తహతహ, ఒక driving force ఉంటుంది అది వానిని ఉన్నత ఆశయాలకోసం పరువులు తీయిస్తుంది. దేనికోసమో అన్వేషణ చేయిస్తుంది. మనిషి దేనికో ఆవేదన పడతాడు. ఆ ఆవేదనలోనే మానవత్వం ఉంటుంది; ఇదే మనిషిని మంచివాణ్ణి చేస్తుంది.

అయితే మానవులందరూ ఒకేమాదిరిగా ఉంటారా? ఒకే అంతస్తులో కనబడతారా? అంటే కనబడరు. కొందరు తమ లక్ష్యాన్ని గుర్తెరిగి అటువైపు అచంచల విశ్వాసంతో పయనిస్తారు. భరతుడట్టి వాడు; గుహుడు అట్టివాడు; హనుమంతుడూ అలాంటివాడే. కొందరి కాదృష్టి మరుగున పడి పోతుంది సుగ్రీవుడు అటువంటివాడు. అట్టివారికి హనుమంతునివంటి వాని మేల్కొలుపు అవసర మవుతుంది. లక్ష్మణునివంటి వాని హెచ్చరిక అవసర మవుతుంది.

అంతవరకూ మోహంలో మునిగిపోయి ఉన్నాడు సుగ్రీవుడు. లక్ష్మణుడు వచ్చాడు. జ్యాగ్రమోగించాడు కిష్కింధ వాడలి పోయింది.

"పరమ శివుని కోపవహ్నిఁబుష్పశరుండు
భస్మమైన వార్త వచ్చినప్పు
డింద్రు నంతి పురము నెట్లయ్యెనో యట్టు
లయ్యె వానరేశు నంతిపురము." —నియమ: 369

సుగ్రీవుడు చెడ్డవాడు కాడు వెంటనే మెలకువ తెచ్చుకున్నాడు. తన రాచరికానికి గుర్తుగా అన్న ఇచ్చిన మెడలోని కాంచన హారాన్ని త్రెంచి పారవేశాడు.

"క్షితి నాథుండను గాను రాఘువుని దాసేరుండ నే ధారుణీ
సుతకన్వించినదాఁక ధారుణిసుతన్ శూరుండు రాముండు తె
చ్చితి నన్నంతటిదాఁక భోగము విసర్జింపంబడెన్!"

—నియమ ; 404

కల్పవృక్షంలో ప్రతీపాత్ర ఎందుకో అందుకు బ్రతుకుతాడు బ్రతుకు అర్థంలేనిది కాదు విశ్వనాథ ఆశయం మానవుని జీవితం అర్థవంత మవాలని. అర్థం వంతమవుతుందనే ఈఆశావాది భావన.

విశ్వనాథ పాత్ర చిత్రణలో ఇంకో లక్షణం ఏమంటే పాత్రల ప్రవర్తనా విధానం అర్ధంలేని విధంగా కట్టలు త్రెంచుకుపోదు ఆప్రవర్తనా విధానం పాత్రలక్షణాన్ని అనుసరించి ఉంటుంది ఉదాహరణకు రాముడు సుగ్రీవునితోనే ఎందుకు చెలిమి చేయాలి? వాలితో ఎందుకు పనికి రాదు? అంటే సుగ్రీవునిలో రామునికి హితుడయ్యే లక్షణాలు ఉన్నాయి కనుక వాలి సుగ్రీవులిద్దరిలో ఒక చమత్కారమైన పోలికఉంది, తేడాకూడాఉంది. ఇద్దరికీ గల సామాన్య లక్షణం భోగశీలు రవడం కాని వాలిలోని లక్షణాలన్నీ వానిని ఒక సేనాధి పతిగా చేయిస్తాయి ఒక చమూపతి లక్షణా లా తనిలో ఉన్నాయి సుగ్రీవునిలో రాజున కుండవలసిన లక్షణాలు ఉన్నాయి

వాలి దర్పంలో సైనాధిపతి కనబడతాడు సుగ్రీవుని హుందాతనంలో రాజు కనబడతాడు. కాగా, రాముడు రాజుకనుక, రాజ్యాన్ని పోగొట్టుకున్నా, రాజ లక్షణాలు కలవానితోనే చెలిమిచేసాడు వాని సాయాన్నే అర్థించాడు

"అది యట్లు జరిగిన దనఁగ నదియెప్పు డట్టులే జరుగు!" నంటాడు రాముడు

ఇంకో చిత్రం: వాలి సుగ్రీవుల కున్న తేడా కర్ణార్జునుల కున్న తేడా వంటిది కర్ణుడు కేవలం పౌరుషాన్ని నమ్ముతాడు అదే అతని tragedy అర్జునుడు పౌరషానికి దైవబలం, సాయం కావాలంటాడు పురుషకారాన్ని ఆశ్రయించిన వాలితో చెల్మి కంటె, దైవమును కూడా విశ్వసించే సుగ్రీవునికీ, రామునికీ చెల్మి ఏర్పడడం సహజం

అంతేకాదు వాలి వధను చూడండి. అది ఊరికే జరగలేదు. వాలికి తెలుసు: రాముడొకడున్నాడనీ, అతడు ఉగ్రతేజుడనీ, అత డేచెట్టుచాటు నుంచైనా తనను చంప వచ్చనీ! అట్టి కబురు అంగదుని ద్వారా వాలికి అందనే అందింది. రెండోసారి సుగ్రీవుడు యుద్ధానికి వాలిని పిలిచినప్పుడు తార మరీ మరీ చెప్పింది, రాముడు కోదండోగ్రుడనీ, వెళ్ళవద్దనీ- సంధి చేసుకోమనీ!

"నీ వే యుద్ధము చేయఁ బోయినను గానీ నేను భీతిల్ల; సు
గ్రీవుల్ వందలు వచ్చినన్ భయపడన్; శ్రీరాముఁ డచ్చోట నే
దో వృక్షంబును జాటు చేసికొని దూయున్ బాణ మేవేళనో,
ఆ వేళన్నిను గాచుకోఁ గలుగు నూహం జేయ లేనయ్యెదన్!"
—గజపుష్పి : 77

ఇంత హెచ్చరిక తారనుంచి వచ్చినా ప్రయోజనం లేక పోయింది జరగవలసింది జరగనే జరిగింది.

"అది యట్లు జరిగిన దనఁగ నది యెప్పు డట్టులే జరుగు
మదికి నూహింపఁగా వేయి మార్గముల్ మసలునే గాని
యది కర్మనిర్ణీతమైన దా యొక్క యర్థమే పోవు
నది మంచిదా చెడ్డదా యటంచను నది యొండె ప్రశ్న"
—నూపుర : 209

కర్మ అనగానే 'అదిగో శుష్క వేదాంతం!' అని పెదవి విరవ నక్కరలేదు. వ్యక్తి జీవలక్షణాన్ని అనుసరించే వాని ప్రవర్తనా విధానం ఉంటుంది. ఇంకా అందరికీ అర్థమయేటట్లు చెప్పాలంటే "Character is fate" అనుకోవచ్చు. దీనికి వాలే పెద్ద తార్కాణం రావణుడు కూడా అట్టివాడే! నిజానికి జటాయువూ అలాంటివాడే!

అయితే పాశ్చాత్య సాహిత్యంలోని విషాదాంత కావ్యాలలో కూడా జీవలక్షణం మీదనే ప్రవర్తనా విధానం ఆధారపడి ఉన్నా, కథ చివరకు వచ్చేసరికి, కావ్యాంతం అయేసరికి, పాశ్చాత్య విమర్శకుల దృష్టినుంచి చూచినా, "జీవితం ఎంత వ్యర్థమయి పోయింది!" "ఎంత ఘోరమైన పని జరిగింది!" అని అనిపిస్తుంది ఎవరెన్ని చెప్పినా, ఇందులో కొంత నిరాశ, నిస్పృహా ఉండక పోవు

విశ్వనాథ సాహిత్యంలో కూడా జీవ లక్షణాన్ని అనుసరించే ప్రవర్తనా విధానం ఉన్నప్పటికీ, జీవితం వ్యర్థమనిపించదు జటాయువు, సంపాతి, హనుమంతుడు, గుహుడు— అందరూ జీవితాన్ని సార్థకంగా చేసుకున్న వాళ్లే! వాలి కూడా అంతే.

"పూని వారించెను దార పోవద్దు పోరి కం చతివ
నేనె వచ్చితి నయ్యొ మోహ నీ హార నీరేజ బంధు!
నానిండు కోరిక పండినది నీదు నారాచ ముక్తి."
—గజపుష్పి : 406

ఇట్టివాని జీవితం వ్యర్థమన లేము వాలి బ్రతుకుకూడా చివరకు సార్థకమే, అర్థవంతమైనదే అయింది అటువంటి కథను చదివి నప్పుడు మనకు

నిరాశ, నిస్పృహా కల్గవు ఇదీ కథను చెప్పడంలో మన పద్ధతి. "అవిచ్ఛిన్న సాంప్రదా యార్థినై" "సర్వ ధర్మ మూల బీజంబుగ" రామాయణాన్ని వ్రాస్తానని విశ్వనాథ అన్నదానికి అర్థం ఇదే అనుకోవాలి

కాగా, విశ్వనాథకు మనిషి అంటే నమ్మకం ఉంది మనిషి ప్రవర్తనా విధానం వాని జీవలక్షణాన్ని అనుసరించి ఉంటుంది. జీవితంలో ఏమాత్రం లక్ష్యమున్నా -ఏదో ఒక దాని కోసం వేదన అనేది ఉంటే-జీవితం నిరర్థకం అవదు విశ్వనాథ నిరాశావాది కాదు. అంతే కాదు మానవుడు సూక్ష్మ మతి. నిస్సంశయ ఖండంలో ఒక చోట.

"ఏ నొక పెద్ద పర్వతము నెవ్వఁడు నెత్తగలేఁడు నన్నునాన్
దానవుఁడెంచు నొక్కఁడు; యథార్థమ! వానిని వందమందియున్
బూని కదల్చలే; రొకడు బుద్ధిబలంబున లేపు సుల్వుగా!
మానవజాతి సూక్ష్మమతి, మాధవుఁ డిచ్చుటనే జనించెడున్?"
—నిస్సంశయ: 134

విశ్వనాథకు మానవుని మీద ఇంత ప్రత్యయ మున్నది. అంతే కాదు. నేటి మానవుని గురించి, సూక్ష్మమతి అయిన మానవుడు సాధించిన అద్భుత శక్తి సామర్థ్యా లంటే- కొందరికి ఏవగింపు కల్గవచ్చు కాని- విశ్వనాథకు ఏవగింపు లేక పోగా, దానికి తానే కవిగా అద్భుతపడతాడు. అన్వేషణ ఖండంలోని ఈపద్యం నేటిమానవునికి అన్వయిస్తుందో లేదో మీరేచూచుకోండి_

"నా జవమున్ బలంబును మనస్సున కందవు! సర్వభూమి భృ
ద్రా జులఁ బెల్లగించి విసరంగన జాలుదు, దిక్చయంబులన్
భ్రాజిత వార్ధి వాశ్చయ భరంబును జిమ్ముదు ధారుణీస్థలిన్
నా జనియింపఁ జేయు గళ నాదము చేత దిశల్ చలింపగన్!"
—అన్వేషణ: 439

అయితే ఆయన దృష్టిలో ఇంతటి మానవుడూ ఎలా ఉండాలని కోరు కుంటాడు? అంటే, దానికి కూడా "కిష్కింధ"లోనే సమాధానం ఉంది

మనిషికి "గాంభీర్యంబు, గాంభీర్యంబంత పౌరుషంబు, పౌరుషంబంత విజ్ఞానంబు, విజ్ఞానంబంత మెత్తని గుండెయ" కావాలంటాడు విశ్వనాథ. అదే మానవునికి విశ్వనాథ ఉపదేశం, ఆదేశం అదే లోక కల్యాణానికి మార్గం.

ఈ మాట అన్వేషణ ఖండంలో వచ్చింది. అక్కడ, ముఖ్యంగా ఉత్తర భాగంలో, కనబడే వాళ్లు నల్గురు- ఒకడు సంపాతి, ఒకడు జాంబవంతుడు; మిగిలిన వారు హనుమంతుడు, అంగదుడు

ఈ నలుగురూ నాలుగు విధాలుగా దిద్దితీర్చబడ్డారు

సంపాతి ఇప్పటి వాడా? ఎప్పటి వాడో! "ఇందిర తోడి విష్ణుదేవు కల్యాణము" నెఱుగును ఇంతకుపూర్వం మానవునికి ఉండదగ్గ లక్షణా లనుకున్నామే, అవి అన్నీ ఈయనలో కనబడతాయి కాని చూడగల్గాలి. పైపైకి చూడగా కనబడేది వార్ధక్యాన్ని అనుభవిస్తూన్న జీవి తిండికి క్షణం వేళ అతిక్రమిస్తే ఇంటిల్లి పాదినీ తిట్టి పోస్తాడు "నా చావే మీరు కోరుకుంటున్నారు! అదీ సిద్ధిస్తుంది లెండి!" అని యాములు, ధూములు చేస్తాడు కానీ, తనకు ఆహారాన్ని సమకూర్చడంలో జరిగిన జాగుకు కారణం తెలియగానే, మళ్ళీ మరొకందుకు వళ్లు తెలియనంత కోపం వస్తుంది సీతమ్మనలా ఎత్తుకు పోతూ ఉంటే, రావణాసురుణ్ణి అటకాయించ లేదని, కొడుకు మీద వచ్చిన ఆయన కోపానికి హద్దులు లేవు, అంతకు పూర్వం ఆలస్యానికి యాములు ధూములు చేసిన వాడల్లా ఒక్కసారిగా :

"అన్నము పూఁట లేకున్నఁ జత్తున యేమి?
దైతేయు వెంబడిఁ దఱిమి యేల
గుండె నెత్తురు చూడకుండ వచ్చితి నీవు?
తెచ్చితివిని నప్రతిష్ఠ నాకు
నాగర్భమునఁ బుట్టి నావా! నిజంబుగ
వైనతేయునిదైన వంశమెల్ల
నీ మూలమున నపనింద పాలైనది!
యని లక్ష తిట్టితి నయ్యో! కొడుకు"

—అన్వేషణ : 348

నని అంటాడు క్షణం క్రితం భుక్తికి వేళ అతిక్రమించడాన్ని బొత్తిగా ఓర్వలేనని అన్నవాడల్లా, ఇప్పుడు ఒక పూట తిండి లేక పోతే చస్తాననుకున్నావా? అంటున్నాడు అదీ నిజమే, ఇదీ నిజమే- వయసు మళ్ళిన వాళ్ళలో అది అలా ఉండగా, సంపాతిలో అపురూప లక్షణాలను కూడా చూడగలడు కల్పవృక్షకర్త ఆ లక్షణాలే వెనుక అనుకున్న గాంభీర్య, పౌరుష, విజ్ఞానాది లక్షణాలు; వాని అన్నింటికీ వన్నె తెచ్చేది, ఆతని మెత్తని గుండియ!

సంపాతికథలో మరో చిత్రం ఉంది అతడు నేటికి-అంటే కథా కాలం నాటికి-శిథిలమైనస్థితిలో, వార్ధక్యంలో ఉన్నాడు జరాభారం రుజాభారంకంటే దయనీయ స్థితి అట్టి స్థితిలోనుంచి సంపాతికి రెక్కలు పుట్టుకొనివచ్చాయి. మళ్ళీ జవము కల్గడంతో యవ్వనంలోకి అడుగు పెట్టినట్టుగా, అతనికి మరోవిధంగా వొళ్ళు తెలియలేదు ఆతని ఉత్సాహానికి అవధులు లేవు, అంత ఉత్సాహంలోనూ ఆతడు మొగలుపెట్టుకున్న పని ప్రస్రవణగిరిమీద రామదర్శనం!

అంటే మానవు డెన్నటికైనా జరను జయించినా, గర్వి కారాదు. అహంకారం పనికిరాదు అతడు సంపాతిలా పురుషోత్తముని దర్శనం కోసం తహతహపడాలి లోకాలను జయించడంలో మానవుడు తృప్తిపడి ప్రయోజనం లేదు లోకేశుని గవేషణలో మానవుని జీవితం చరితార్థం కావాలి

జాంబవంతు డింకొక రకమైన వృద్ధు ఈతడు తానెంత వృద్ధుణ్నని చెప్పుకున్నా, సంపాతి అంత వృద్ధు కాడు. సంపాతికథను ఒక్క బిగిలో, ఒక్క వరుసలో చెప్పలేదు. ముక్కలుముక్కలుగా అక్కడక్కడ చెప్పినవన్నీ మనం అతికించుకొని కథను చూసుకోవాలి అతని బుద్ధి నిలకడగా ఒకేచోట నిలబడదు అటునిటు దూకుతుంది ఆయన మనకు చెప్పేది కథ అయినా, అందచేసేది వార్త అయినా, అంతే!

జాంబవంతు డలా కాదు అతని ముదిమివల్ల జవం కాస్త తగ్గింది కాని, బుద్ధిబలం తగ్గలేదు కథ చెపితే తాపీగా, ఆ ఉత్సాహంతో చెవుతాడు. చెప్పేటప్పుడు తావన్మాత్రంగా పెంచి, తన వయసును మరచి,

యువకుల కుత్సాహాన్ని కల్గించేలా చెపుతాడు. అంగదునివంటి యువకుడు ఆపదలో నున్నప్పుడు, "నీ కెందుకు లే నేను నీ కీ పనిని సాధించి పెడతా" అని వాత్సల్యంతో ఆదుకుంటాడు.

ఇక హనుమంతుని లక్షణమే వేరు. ఆతని కోసం రామాయణంలో ఒక కాండే ఉంది అంచేత ఆతని విరాట్ స్వరూపం రెండు మాటల్లో ఇమిడి పోదు అయితే "అన్వేషణ"లో ఆతని లక్షణాల్లో గమనించవలసిన ఒకటి, రెండు ఉన్నాయి. అతడు లౌకిక పరిధుల్లో ఉన్నప్పుడు **maturity** ఉన్న వ్యక్తి. తొందర పడడం ఆతని లక్షణంలో లేదు. ఎంత పండితుడో అంత వివేకి. అతని కెంత వివేక మున్నదో అంత పరిహాస శీలం కూడా ఉంది వస్తువును సున్నితమైన త్రాసులో వేసి తూచినంత సులువుగా ఈతడు వ్యక్తుల స్వభావాల్ని అంచనా వేయగల్గుతాడు. అందుకే అంత మంత్రి అయ్యాడు అంగదుణ్ని ఈతడు అర్థంచేసికొన్నట్లు మరెవ్వరూ అర్థం చేసికోలేదు అంగదుడంటే ఈయనకున్న వాత్సల్యం తక్కువదేమీ కాదు అయినా తాతజాంబవంతునిలా ఆవాత్సల్యాన్ని ఒలికిపోయడు. అవసరమైతే బిగిసి కూర్చుని, అంగదునికి కావలసిన పాఠాన్ని నేర్పడాని కీతడు సందే హించడు. అయినా అత డలా బిగిసి ఉన్నాడని అంగదునికి తప్ప మరెవ్వ రికీ తెలియనంత నేర్పరితనంగా దూరదూరంగా ఉంటాడు. యువకుడు అంగదుడు "యువరాజు పదంపు దండితనమున" ఏదో వాదించినా ప్రాయోపవేశం చేస్తానని బెదరించినా, హనుమ ముసిముసి నవ్వులు నవ్వు, కుంటాడు కాని కలవర పడడు. ఆతని సంస్కారం గొప్పది; అంత వానరు డయినా, నిజాని కెంతో నాగరీకుడు

"అన్వేషణ" ఖండంలో అంగదుణ్ని విశ్వనాథ ఎంతో ముద్దుగా, ముచ్చటగా, పరిహాసశీలతతో తీర్చాడు "కిష్కింధాకాండ"లో అంగదుడు తొందర తొందరగా పెరుగుతాడు. "గజపుష్పి"ఖండంలో మొదట శిశువు, తల్లి చాటు బిడ్డ. "నియమపాలన"లో యువరాజు, "సమీకరణ"లో దక్షి ణానికి వెళ్ళే కపులకు నాయకుడు "అన్వేషణ"లోకి వచ్చేసరికి ఒక్కసారి విశ్వనాథ అంగదుణ్ని వివిధ కోణాలనుంచి చూపెట్టాడు మానవుని హృద యం ఎంత **complex**గా ఉంటుందో ఒలిచి చూపినట్టుగా చూపాడు విశ్వ నాథ. అంగదుని పెంపకంలో గారాబం ఉంది. నీతిమంతుణ్ని చేయటం

ఉంది హనుమ మందలింపుతో ఆతని గారాబు లక్షణం పైకి వచ్చింది "యువరాజు పదంపు దండితనమున''

"నీవు లక్ష చెప్పు నిజముగా సుగ్రీవు
నందు శౌచభావ మాన్యశంస్య
మధికమైన యట్టి యార్జవంబును లేవు
నీవు పొగడవచ్చు నీకుఁ గూర్చి"

—అన్వేషణ : 151

అని మొండివాదన నారంభించాడు. తప్పుచేసిన బిడ్డమీద తల్లి కోప పడితే, అలిగి అన్నమే వద్దన్న పసివాని లక్షణం ఇంకా అంగదునిలో మాసి పోలేదు; ఇది అతనిలో ఒక లక్షణం.

మరొకటి · తండ్రి వాలిని పినతండ్రి చంపించాడు; తన్ను యువ రాజును చేసాడు. ఆమీద తన నెత్తిమీద ఒక పెద్ద కార్యభారాన్ని పెట్టాడు. ఈ సీతమ్మను వెదకడం వ్యర్థ ప్రయత్నంలా కనబడుతోంది మనసున నిస్పృహా నిరాశలు పొటమరించాయి భూమిజ జాడను తెలిసికొనక, ఆమెను చూడక తిరిగి వెనుకకు వస్తే సుగ్రీవుడు ఉరి తీయిస్తానన్నాడు. తానేమో ఎంత ప్రయత్నించినా, ప్రతి అంగుళం మేరా వెదకి చూచినా, ఆమె జాడ కనబడడం లేదు. అవీ, ఇవీ అన్నీ అతని మనసులో కళ పెళలాడాయి. లోనున్న దొక్కటి, బయటకు పొక్కింది మరొకటి :

"అప్పుడు నను యువరాజును
దప్పక సేయమియు నది యధర్మం; బిపుడో !
కుప్పించి నన్నుఁజంపుఁ
డొప్పెడు ధర్మంబు నీతియును మర్మంబై !"

—అన్వేషణ : 109

"అలా అనుకో కూడదయ్యా!" అని హనుమంతుడనగా:

"ఇటు కొడుకను సుగ్రీవున
కటు కొడుకగు రామభద్రుఁడా కైకకుఁ దా
నటువికిఁబంచిన దాయమ!
యిట యనుపురి కంపు నన్ను నీయన యంతే!"

—అన్వేషణ: 157

అంచేత ఇక్కడ ప్రాయోపవేశం చేయడమే మంచిదంటాడు. అని అందరి దగ్గిరా సెలవు తీసుకొంటాడు శ్రీరఘురామునకు నానమస్కృతులను చెప్పుమన్నాడు. వానరేశ్వరుడు సుగ్రీవునకు, తల్లితారకు, పిచ్చితల్లి రుమకు చెప్పవలసిన నమస్కారాలన్నీ చెప్పి, ప్రాయోపవేశానికి కూర్చున్నాడు. ఈ సెలవు తీసికోవడంలో ఒకవంక కుర్రతనపు పౌరుషం, గారాబం కనబడుతున్నందుకు నవ్వువచ్చినా, అతని మాటల్లోని "వినిగూఢ వ్యంగవ్ వాక్యవిభ" వానికి ఆంజనేయుడు అబ్బురపడ్డాడు మారుతికి ఈతని మనస్సు తెలిసినా, తక్కిన వానరులకు అతని మనసులోని లోతుతెలియదు. అంచేత అంగదుని చుట్టూచేరి వాలిని పొగడడం, సుగ్రీవుని తెగడడం ఆరంభించారు.

"ఆయన యెక్కడ, మఱి మఱి
యీాయన యెక్కడ? భుజా మహౌశ్వరుఁడతఁడున్!
పోయిన దై పోయెను! కా
నీ యిల మనదే యటంచు నెంచిన దితఁడున్!"

—అన్వేషణ; 175

అని ఇంకా ఏమో, ఏమో, వారనుకొంటూంటే, ఆ రెండుమాటలను మరొకరైతే నమ్మేఉండేవాడు. అంగదునికి ఆమాటలే వినబడడంలేదు ఆయనచూపు అంతా ఆంజనేయునిమీదే!

"నాయనా! చిన్నవాడవు! ఇదిన్యాయంకాదు! ఇలారా! అంటే ఆయనవెంట నే నుండనా? ఈమారుతి కింత బిగింపుదేనికి? ఇక మాటాడడు కాబోలు! నాకేం నేనూ మాటాడను!" అని బిగించుకొని కూర్చున్నాడు అంగదుడు. ఎంతవరకూ మాటాడక ఊరుకొన్నాడంటే సంపాతి కనబడే

వరకే! ఈకోతులన్నీ మ్రింగడానికి బాగాదొరికాయి అని సంపాతి అను కొంటూంటే, అంగదునికి ఆంజనేయునితో మాటాడడానికి మంచి అవకాశం దొరికింది కాని వానితో నేరుగా మాటాడడుకదా! అంచేత హనుమతట్టు చూచి-

"కనుమయ్యా! కను మేగుదెంచి యెదుటన్ గాలుండు
కూర్చుండెఁబేర్చిన పక్షీంద్ర మహోగ్ర రూపధరుడై"

అని అంటాడు. ఈభాగంలో కనబడే సున్నితమైన హాస్యస్పర్శ గమనింపదగ్గది. వెనుకా, ఇక్కడాకూడా, అంగనిదుకి నవ్వువచ్చేదేమీలేదు. తోటివానరులకు నవ్వువచ్చేదేమీలేదు ఆసన్నివేశంలో అతని స్వభావం అలా ఆవిష్కరింప బడడంలో రమణీయమైన హాస్యస్పర్శకు మంచి humourకు అవకాశం కల్గింది. ఇందులో జీవితంఉంది, కావ్యంఉంది!

అంగిదునిలో ఇంకా లోతుగాచూస్తే, ఆయనకు పినతండ్రి మీద కోపంఉన్నా, అంతకన్న ఎక్కువ అభిమానంఉంది. స్వభావంచేత అంగదుడు మంచివాడు బాహ్యమైన నిరాశా నిస్పృహా లాతనిని ఆవరించ నప్పుడు అతని అంతఃకరణ మెంత ఉత్తమమైనదో, ధర్మాభిముఖమైనదో తెలుస్తుంది సంపాతి, జటాయువు అన్నదమ్ములు అన్న రెక్కలను కాల్చుకొని,తమ్ముని ఎలా కాపాడాడో విన్నవానరులు, వాళ్ళప్రేమ ఎంతదొడ్డదో అని అను కుంటూంటే, తండ్రిఅయిన వాలి తమ్మునిపట్ల చేసిన అవినీతికి అంగదుడు మనసులో ఏవగించుకున్నాడు ఈస్థితిలో ఇది సుగ్రీవునిపట్ల అభిమానంగా పరిణ మించిందంటాడు విశ్వనాథ

అంగదుడు సంపాతిని చూసాడు. మృత్యువు అలాఎదురుగా కూర్చునే సరికి, వెనుక అనుకున్న అతని వ్యంగ్యవాక్యవిభవం అంతా అక్కరకు వచ్చింది. దానికి మూల కందంగా ఉన్న తెలివి అక్కరకు వచ్చింది. ఇంతటి మతిమంతుడు కనుకనే, తారఈతణ్ణి "నీతిమతి విభవు" నిగా చేయగల్గింది. సంపాతి వినేటట్లుగా ఈతడు మాటాడిన మాటలనువిన్న హనుమంతుడు- "శ్రీరామచంద్రున కితడు వట్టిబంటేకాదు! రాజకార్యనిపు ణుండయిన రాయబారియుఁగూడనగు!" ననుకొన్నాడు.

గమనించ వలసింది- కవి ఎంత శిల్పసమృద్ధంగా అంగదుని దిద్దుతూ ఉన్నాడో, దిద్దుతూ దశలుదశలుగా వానివ్యక్తిత్వంఎంత పెరుగుతూన్నట్లు చూపుతున్నాడో! ఉన్నది. "అన్వేషణ" ఖండం చివరివరకూ అంగదుడు పెరుగుతూనే ఉన్నాడు అతనికి నేతృత్వం వ్యర్థంగా లభించలేదు సముద్రపు ఒడ్డున వానరులందరూ దిగ్భ్రాంతులై ఉండగా, ఇలా కాదు, ఈసముద్రాన్ని లంఘించ జాలిన వానిలక్షణాలు (మూడుపద్యాలలో) ఇలా ఉంటాయని అంగదుడు చెప్పాడు అవన్నీ సరిగ్గా హనుమంతునికివర్తిస్తాయి అంటే అంగదునికి హనుమంతుడే ఈపనిని చేయగలడని తెలుసునన్నమాట. అంతటి వాణ్ణి నోటితో తాను నియమించ కుండానే, వానిచేత ఆపనిని చేయించాడు. నేతకు రెండు లక్షణాలు ఉండాలి ఎవ్వరేపనికి అర్హులో వారి నాపనికి నిర్ణయించడం ఒకటి; తానుచెప్పనక్కర లేకనే వారిచేత ఆపనిని చేయించడం మరొకటి ఈరెండులక్షణాలు అంగదునిలోఉన్నాయి. అందుకే అతడు నేతలకు నేతఅయాడు. అతడెంతగ పెరిగాడంటే "శరవణభవాది యోధ సైన్యాగ్రయాయియైన పురుహూతునింబోలె నొప్పారి" యున్నాడట వాలిపుత్రుడు!

విశ్వనాథ పాత్రలు కేవలం ఒకమూసలో ఇమడవు పమంటే వాళ్ళు నిజంగా జీవించే మనుష్యుల్లాంటి వాళ్ళు మనిషి మూసలో ఇమడడు. ఒక్కొక్క లక్షణానికి ప్రతీకగా ఒకమనిషిని సృష్టించుకోవడం గొప్పే కావచ్చు కాని వివిధ దృక్కోణాల నుంచీ చూడగా, విభిన్న పరిస్థితులలో మానవుని ప్రవర్తనా విధానంలోని వైవిధ్యం అనంతమైనదిగా ఉంటుంది. ఆయా పరిస్థితులలో ఆవిష్కరింపబడే వాని శీలంలోని పైపొరల్లో ఒక్కొక్కప్పుడు పొత్తుకుదరని లక్షణాలు కూడా ఉంటాయి క్షణక్షణానికి వినూత్న లక్షణాలతో ఆవిర్భవిస్తూన్న మానవుని చూడడానికి - వాని శీలాన్ని అర్థం చేసుకొనేందుకు - నిశితాతినిశితమైన చూపు, సూక్ష్మాతి సూక్ష్మమైన వివేచన అవసర మవుతాయి. అట్టి చూపుతో, అట్టి వివేచనతో పాత్రలను దిద్ది తీర్చడానికి కావలసింది అసాధారణమైన ప్రతిభ: కోమల

చమత్కృతత్వధ్వ నిర్మాణ సంపత్తి. దీనితోపాటు మానవ హృదయావిష్కరణ, అందులోని లోతుల్ని త్రవ్వి చూపడం కూడా జరుగుతే, కావ్యం "కోమల చమత్కృతత్వధ్వ నిర్మాణసంపన్నమై రమ్య భావ రససామగ్రీ సమగ్ర మవుతుంది కిష్కింధ అట్టి వినూత్న రమ్యభావరస సామగ్రీ సమగ్రమైంది

# దుందుభి కథ

—శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ

విశ్వనాథవారి ప్రధాన కథతీర్పుకూ చిన్నకథల తీరుపుకూ ఎంతో వ్యత్యాసం ఉంటుంది. అక్కడ కవి ప్రతిభ పెరుచుకోవడానికి హద్దులు లేవు ఇక్కడ ప్రతిభ అంతా కుదించి చెప్పడంలో ఉంటుంది అక్కడ ఉన్నట్లు ఇక్కడ వివరణాల కవకాశం ఉండదు కథ చెంగు చెంగున దూకి వినేవాళ్ళ నాకర్షించాలి. దూసి విడిచిన బాణంలా హృదయానికి తాకాలి. చెప్ప దలచిన లక్ష్యానికి పోషకంగానే చెప్పిన అంశాలన్నీ ఉండాలి ఈకిష్కింధలో ఉన్నచిన్న కథల్లో ఎక్కువ భాగం ఈ మొదటి ఖండంలోనే ఉన్నాయి అందులో మొదటిది దుందుభిది. దేనికదే అగ్రేసర మయినా ఇందులో ఒక విశేషమున్నది. వాడు చచ్చాడన్న జాలి ఏకొంచెమూ కలగదు సరికదా ఇంత మూర్ఖులుంటారా అని ఆశ్చర్యం కలుగుతుంది వింటున్నంతసేపూ పగలబడినవ్వుకుంటాము సముద్రుడు, హిమవంతుడు, వాలి, దుందుభి అందరూ అన్నివిధాలా తీర్చిన బొమ్మల్లా ఎట్టయెదుట నిలుస్తారు అల్పాక్షరముల ననల్పార్థ రచనకది పరమోదాహరణంగా ఉంటుంది. వివరిస్తే దాన్ని గురించే ప్రత్యేక వ్యాసం వ్రాయదగినంత విశేషమున్నది అయినా సంక్షేపంగా అందలి శిల్పాన్ని గమనిద్దాము

ఈచిన్న కథ సరిగ్గా అరవై పద్యగద్యాల్లో నిబద్ధమైంది వృత్తాలు తక్కువ. గీతకంద పద్యాలూ వచనాలూ ఎక్కువ ఉన్నవృత్తాలయినా ఎక్కువ భాగం సంభాషణ శైలిలోవే వీడొకరాక్షసుండు అని ఉపక్రమించి వాడి బలాధిక్యాన్ని వర్ణించి ఒంట్లో బలముండి వాడు స్వభావ దుష్టుడయితే నిష్కారణంగానే వాడిమీదికీ వీడిమీదికీ ఎగిరెగిరి దూకుతాడంటూ దుష్టుల స్వభావాన్ని చెప్పి. వాడు సముద్రాన్ని యుద్ధాని కాహ్వానించిన విషయం ప్రస్తావిస్తారు. సముద్రుడు వాణ్ని చూస్తూనే "మహిషదనుజ క్రూరనేత్ర వహ్నిగోళ ద్వితయమెంచి యుండియున్న యటుల నుప్పబడియె." ఇది

నిజానికి సముద్రుడు తక్కువవాడు కావడంకాదు, దుందుభి దృష్టికి సముద్రుడట్లా కనిపించడం' దాంతో మహిష దనుజుడు కాల్దువ్వి "భూమంతా చుట్టచుట్టుకు పెరిగి ఉండీకూడా అంత భయపడి పోతున్నావు? సాయం కావాలంటే ఆఅల్లుడిని తెచ్చుకోరాదూ నాకొమ్మున నాశనంకాకుండా? అంత చేతగాని వాడవు పడిఉండక అంతెత్తు ఎగురుతావెందుకూ?" అంటూ ఈసడింపుగా కవ్వించాడు. సముద్రుడు నిజంగానే భయపడి పోతున్నట్లు కెరటాన్ని ఒడ్డున విరుచుకుని వెనక్కుమళ్ళాడు నాతోయుద్ధం చెయ్యి చెయ్యి అంటున్న దుందుభితో సముద్రుడు వెటకారంగా "నీసంగతి తెలిసి నిన్నేమీ అనని నామీదికెందుకిరావడం? నీఅంతటి వాణ్ని సృష్టించిన బ్రహ్మ నీతో యుద్ధం చెయ్యగల వాణ్ని సృష్టించే ఉంటాడు. నేనెప్పుడూ చూడ లేదుగాని అంతా చెప్పుకుంటూ ఉండగా విన్నాను ఆ హిమవంతుడు చాలా బలశాలిట! నీకోపిక ఉంటే ఆయనమీదికి వెళ్ళు" అన్నాడు యుద్ధకండూతి ఎక్కువైన దుందుభి ఆమాటవింటూనే పరుగందుకున్నాడు. వెళుతున్న వాణ్ని దారితెలుసునా అనిఅడిగాడు సముద్రుడు. ఉత్తరమేగదా అంటూ పరుగెత్తాడు దుందుభి

వాడెంత మూర్ఖుడో గమనించండి సముద్రుడు తన్ను ఏడిపిస్తున్నాడని ఏకోశానా గ్రహించడు. నిజంగా అతను తన్నుచూచి భయపడ్డాడనే అనుకుంటాడు వాణ్ని ఏడిపించాలని కాకపోతే ఆదున్నపోతును లోపలకు లాగివేసి ముంచెయ్య డానికి అరనిమిషమైనా పట్టదు. అట్టి సమర్థుణ్నిగూర్చి పీడేం చేతకాని వాడనుకుని ఆదున్నపోతు ఎగిరిపడడమూ దానికి నిజంగానే తాను భయపడుతున్నట్లు సముద్రుడు నటించడమూ అడుగడుగునా హాస్యాన్ని కలిగిస్తూ ఇద్దరివ్యక్తిత్వాలనూ విస్పష్టం చేస్తాయి.

హిమవంతుణ్ని చేరిన దుందుభి ప్రతభింతధాత్రిని కాళ్ళతో చిమ్మి కొమ్ములతో బండలు పడగొట్టసాగాడు. ఆపర్వత రాజుకు కాళ్ళల్లోముళ్లు గుచ్చుకున్నట్లైనది వీ డాయన కండలు చెక్కేస్తున్నాననుకుంటున్నాడు ఆయన దేవతామూర్తి అయి వీడివంకచూచి" ఇటుచూడు నువ్వెవరు! ఏమిటాచేసేది?" అన్నాడు. "నేనా? దుందుభిని ఆసముద్రుడు నాధాటికి తట్టుకోలేక నీ పేరు చెప్పాడు నువ్వేమో మహాబలశాలివట. నాతో యుద్ధం

చెయ్యి" అన్నాడు వీడు సముద్రునికంటె ఎక్కువగా హిమవంతుడు దుందుభిని హీనుణ్ణిగా నిశ్చయించేసుకొని వాణ్ని మరీమరీ పడిపించే దృష్టితో "ఆసముద్రుడు నాపేరు చెప్పాడా? అతని కెవరు చెప్పారో నాకు తెలియదు నా కసలు యుద్ధమే తెలియదాయె నేనెవరితోనూ యుద్ధమే చెయ్యలేదు. నాస్వభావమే అటువంటిది, ఋషులూ, అతిథులూ నాగొడవనాది. ఇది ఒక గోడు" అన్నాడు. ఈమాటలు వింటూనే దుందుభి పకపకా నవ్వాడు. "కొండంత ఒళ్ళూ అందులోనలుసంతమనసా? ఎంతో ఆశపడివస్తే ఇంతేనా? పోనీ నాతో యుద్ధమాడగలవాణ్ని ఎరిగుంటేచెప్పు" అని అడిగాడు

"ఎరుగుదువా అంటావా? ఎరుగుదుననే అనుకుంటాను. ఇదివరకయితే అందరితోనూ యుద్ధాలు చేసేవాడు. ఇప్పుడనవసరం అనుకున్నాడు కాబోలు ఎప్పుడూ తప్పతాగి ఆడవాళ్ళతో కాలక్షేపం చేస్తూఉంటాడు. అయినా నువ్వువెళ్ళి వాడికి వెఱ్ఱపుట్టేటట్లు మాట్లాడు. వాడితాగుడును తిట్టిపొయ్యి ఆపదనెత్తికి తెచ్చుకున్నట్లేఅవుతుంది అంతానీఅదృష్టం. వెళ్ళిప్రయత్నించు" అన్నాడు హిమవంతుడు.

"అబ్బో! అంతవాడా వాడు సరే అయితే వెళ్తానుగాని వాడిపేరు చెప్పావుకావే" మన్నాడు దుందుభి.

హిమవంతుడు నవ్వి రహస్యంచెప్తున్నట్లు మెల్లిగా "వాలి, కిష్కింధ పురినేలే వానరుండు" అన్నాడు

ఆదున్నపోతు రాకాసి ఎంత మూర్ఖుడో తెలుస్తోందిగదా! పేరుగూడా చెప్పకుండానే వెళ్ళిదూకుతాననేటంత మూర్ఖుడు వాడు; అంతరణకందూతి గలవాడు అందుకనే హిమవంతుడు మొదట చెప్పక వాడంతటవాడు ఆ క్షణంలో తెలివిగలిగి అడిగాక మరీచెప్పాడు నవ్వుతూనూ. అంతటితో ఊరుకున్నాడా? లేదు. దుందుభి దక్షిణాభి ముఖంగా బయలుదేరి వెళ్తూంటే వెనక్కు పిలిచి "నాసంగతి నీకెవరు చెప్పారని ఆరాని అడిగితే నాపేరు మాత్రం చెప్పకేం! తాబ్బాబు వాడు నిన్నుకోపంతో నామీదికే విసిరినా విసరగలడు" అని బతిమాలుకున్నట్లు నటించాడు.

ఇంత అవధిమీరి ఏడిపిస్తున్నా ఆ దున్న కేమీ తెలియలేదు. వాడు వెళ్ళి సరాసరి కిష్కింధలో వాలి ఉన్నచోట వాలాడు వాడు చేసిన ఆర్భాటానికి తార అందిస్తున్న శీధుపాత్ర జారి కాళ్ళపై ఒలికింది కొత్త లేడి వాలి నెత్తి కెక్కింది. వాడు తలుపు రాయి బాదుతూనే ఉన్నాడు.

వాలి గవనికి లంఘించి ద్వారమైన
ఱాయి తొలఁగించి యెవ్వఁడురా యటంచుఁ
జూచె నిర్వ్యాత దక్షిణాశుతమువోని
కా సరపుఁ మ్రబర్హిశ్శిఖా కేసరంబు. నూపుర:250

దక్షిణదిక్కు ఆవులిస్తున్నట్లున్న నల్లని దున్నను అగ్నిజ్వాలలవంటి జుట్టున్న దానిని చూచాడు. వాలితోపాటు తక్కిన తారా సుగ్రీవాదు లందరూ బయటకు వచ్చారు కాగడాల వెలుగుల్లో. ఆ వెలుగులో ఎఱ్ఱబడ్డ వెన్నెల వెలుగుల్లో పరమ భయంకరంగా ఉన్న దుంధుభి "నీవేమో మహా బలవంతుడవట నేను సముద్రాన్ని నాతో యుద్ధం చెయ్యమంటే విఱిగిన కెరటాలతో పాదాక్రాంతుడైనట్లయి హిమవంతుని పేరు చెప్పాడు వాడి కాలు చీమూ నెత్తురూ ఉన్నట్లే లేవు ఆరు నెలలు సాము చేసి మూలనున్న ముసలమ్మ నెదిర్చాడన్నట్లు వీడితోనా యుద్ధమని నే ననుకుంటూ ఉండగా వాడు నీ పేరు చెప్పాడు నీవు బలే వీరుడివిలా ఉన్నావే వాడికి బలే బెదురు పెట్టావు తన పేరు చెప్పవద్దన్నాడు నన్ను వాడిమీదికి విసిరి పారేస్తావేమో అని ఎంత భయపడ్డా డనుకున్నావు? ఇదివరకు బల స్పర్థ మాత్రమే ఉండేది· నిన్నూ నీ వాగుడునూ చూచాక నాకు ద్వేషం పుట్టి నిన్ను చంపెయ్యాలనిపిస్తోంది.

త్రావినవానికిన్ స్మృతిపథంబునయందునఁ గోతులాడు నా
త్రాపుట కోతియైన యెడఁ ద్రావినవానికి తేలుకుట్టి న
ట్లే వెడబుద్ధియై యతడు నెంచడు తల్లిని దోడుఁ జూడతే
దా? విబుధుల్ సురాపులయినంతట దైత్యులవెళ్ళబుచ్చుటల్?

అన్నాడు దుందుభి హిమవంతుడు చెప్పిన ఉపాయంతో వాలిని రెచ్చగొట్టాలని

ఈ దుందుభి దున్నపోతాయె. ఆ హిమవంతు డెందుకు చెప్పాడో వీడికేం తెలుసు ఆయన అనుకున్నంత కోపమూ వాలికి వచ్చింది తీవ్రమైన అసహ్యమూ వేసింది

“ఓరీ దున్నా! త్రాగినవాళ్ళే ఝుమ్మనేటట్లు ఎగిరిపడే దానవుడవు నీవా నాకు ధర్మం చెప్పేది ఓరీ మూర్ఖుడా! వాళ్ళిద్దరూ నిన్ను పట్టి వెట్టి పప్పును చేసి పంపించారు వాళ్ళెక్కడ నీ వెక్కడ “పోపో” అంటూ తాను చెయ్యెత్తి పుచ్చుకొని లోపలికి వెళ్ళిపోయాడు వాలి

ఇంత స్పష్టంగా చెప్పినా ఆ దున్నకు తెలివి రాలేదు వస్తే వాడు దున్న ఎందుకవుతాడు ?

అరే చేతకాదేని యట్లాడిపోరా
బిరానన్ సతీసంగభీరూ! చనంగన్
గిరీంద్రాంబురాసుల్ ప్రకృష్టాత్ములైనన్
మరిం బోయి తేల్తున్ జమత్కారమెల్లన్॥ నూపుర·266

అంటూ వాలిని నిలబెట్టాడు. ఈ విశేష వృత్తమిక్కడి ప్రసంగానికెలా సరిపోయిందో గమనించండి. అంతమాట సహిస్తాడా వాలి? ‘ఇక్కడనుంచి వెళ్తేగదా వాళ్ళను నువ్వు చూచేది’ అంటూ బయటకు వచ్చేశాడు. పది నిమిషాలు పట్టిందో లేదో దుందుభి శవంకావడానికి; వాడి రెండు కొమ్ములూ పట్టుకుని ఆ కళేబరాన్ని దూరంగా గిరవాటు వేశాడు వాలి. అది అమడ దూరం వచ్చి వచ్చి మతంగాశ్రమం దగ్గరగా ఇక్కడ పడింది. అందువల్లనే ఆయన వాలికీ తదనుచరులకూ శాపం పెట్టడమూ సుగ్రీవుడా పర్వతం మీద వాలి భయం లేకుండా ఉండగలగడమూ తటస్థించింది ఈ కథనంతటినీ సుగ్రీవుడు రామునకు నివేదించుకున్నాడు. ఈ కథ చెప్పడంలో రాముని సామర్థ్యము విషయంలో సుగ్రీవునకు ఇంకా నమ్మకం కుదరలేదనేది వాలి

బల ప్రశంసలో వ్యంగ్య మవుతూన్న దేగాని వాల్మీకంలోవలె వాచ్యం కావ డం లేదు. సముద్ర హిమవంతుల స్వభావాలు చెప్పే మాటల్లోనే వారి ధైర్యస్థైర్యాలూ గాంభీర్యమూ ప్రస్ఫుటం చేస్తూ వారిచేత దుందుభిని ఈడింపజేసిన విధానం పరమాశ్చర్యకరమైనది. మహా సమర్థులై వీడి నేడిపించేందుకే బలహీనత నటిస్తున్నారని పాఠకులకు ప్రత్యక్షరంలోనూ స్ఫుటమవుతూ ఉంటుంది. దుందుభి అదంతా నిజమనుకుంటూ ఉంటే వాడి మూర్ఖత కాశ్చర్యం కలుగుతుంది. ఫలితం హాస్యమై చివరికి వాడు చచ్చా డంటే జరగవలసిందే జరిగిందనిపిస్తుంది.

# సుందరకాండములోని బహువిధసౌందర్యము

—శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

శ్రీమద్రామాయణమున బాల అయోధ్య అరణ్య కిష్కింధ యుద్ధ కాండలకు గల నామములకు కథా సమయమునకు లేదా కథా స్థలమునకు సంబంధ మున్నది. సుందరకాండమున కట్లు కాదు. ఈ విపర్యయమునకు రామాయణ వ్యాఖ్యాతలు బహుకారణములను చెప్పిరి

శ్రీ సీతాదేవి జగన్మాత ఆమె పరదేవత ఆమె మహా సౌందర్య శేవధి ఆమెను గురించి మారుతి చేసిన అన్వేషణము కలదిగాన సుందర కాండమని పుంసాం మోహనరూపుడై మహా సుందరుడైన శ్రీరామ చంద్రునియొక్క కార్యము నిర్వహింపబడిన కథాఘట్టము కలదిగాన సుందరకాండమని. శ్రీరామకార్యము సుందరముగా నిర్వహింపబడినందు వలననని. ఈ కాండమునందున్న కథకు నాయకుడు హనుమంతుడనియు, ఆయన మతిమత్సుందరుడనియు, అందుచేత సుందరకాండమని 'Handsome is that handsome does' అనునట్లు సుందర కార్యాచరణము కలదికావున సుందరకాండమని. సుందర కథాగమనము కలది కావున సుందరకాండమని. ఇట్లె సహస్రమైన కారణములు (సుందరే సుందరీ లంకా సుందరే సుందరీ కథా సుందరే సుందరీసీతా, సుందరే కిం న సుందరం)

శ్రీమద్రామాయణ కల్పవృక్ష నిర్మాత కవిసమ్రాట్టు తా నొక కారణము చెప్పెను.

"ఇదిగో! సుందరకాండమోయి యథవా!......
...నా గుండియ రామధూర్జటులతో రాపిళ్ళుగాఁబెట్టి న
ట్టిది కైకోవె!"... ఇది ఆయిన చెప్పిన కారణము.

ఈ సుందరకాండమునందు 'రామధూర్జటులతో రాపిళ్ళు' ఎక్కడ నున్నవి? సుందరకాండమునందు సకల కథాగమనము మారుతిపై నున్నది. ఆయనతో కథ నడచినది ఆ మారుతి ఎవ్వడు? రామాయణ మహా మాలారత్నము. రామాయణ కథయందున్న బహువీరుల మాలికలో ఆయన రత్నమువంటివాడట రామాయణ మను మహా మాలామంత్రము నందు ఆయన ముఖ్య బీజమువంటివాడట ఇది వాల్మీకుల అభిప్రాయము మారుతిని గురించి కవిసమ్రాట్టుల అభిప్రాయము స్పష్టముగా నిట్లున్నది—

"శైవాంశంబని చెప్పనా? దశశిరస్సంత్రాస చండాకృతిన్!
శ్రీవాయూద్భవుడందునా? అనిలు శాసించెన్ మహాయోగియై
'పోవో కేసరి కోతికూన' అననా? ముక్తేంద్రియభ్రాంతు న
న్నావేశించిన రామచంద్ర పదపద్మాధీన చేతస్కునిన్"

ఈ పద్యము విరోధాభాస అలంకారమునకు రమణీయోదాహరణ మగుట యట్లుంచి హనుమంతుని స్తుతించు తెలుగు పద్యములందు మకుటాయమానముగ నున్నది.

శైవాంశంబైన కపిలోక ధూర్జటి రామచంద్ర పదపద్మాధీన చేతస్కుడు రామధూర్జటుల తత్త్వము లోకపాత్రయందు సంఘటితములైన వ్యక్తి ఆ హనుమ కవిసమ్రాట్టును ఆవేశింపగా ఆయన గుండియ రామధూర్జటులతో రాపిళ్ళు పెట్టినది ఆ రాపిళ్ళతో హనుమయొక్క కార్యశూరత్వము ముడిపడియున్నది అది యీ సుందరకాండమట

ఆ గుండియ రాపిళ్ళుగా పెట్టినదేమియో గమనించుట సుందరకాండ పారాయణము.

పరదేవత అయిన సీతాదేవి అమ్మవారిని హనుమ అన్వేషించుటకు బయలుదేరినాడు ఆమె వేదగర్భ వేదమాత. మహామాయ శ్రీమద్రామాయణము ఆమెయొక్క చరితమేనని (సీతాయాః చరితం మహత్) వాల్మీకి మహర్షి బాలకాండమున కంఠోక్తిగా చెప్పెను. పరదేవతయైన శ్రీదేవి చరిత్రము కావుననే గాయత్రి మహామంత్రమును వేయిశ్లోకముల కొక అక్షరము చొప్పున కావ్యమునందు నిక్షిప్తము చేయుట.

శ్రీదేవియొక్క అన్వేషణమును హనుమ ఉత్తర దిశనుండి దక్షిణముగా ప్రారంభించినాడు ఇది దక్షిణాచారము. రావణునకు కూడ సీతా మహాదేవి పరమేశ్వరి యని తెలియును. ఆమె తనకు స్వాధీన యైనచో తాను జగదీశ్వరుడగును. అప్పుడు విష్ణువుయొక్క నాయకత్వ ముండదు అది విష్ణువును జయించుట అందుకని రావణుని ప్రయత్నము. రావణుడు బలవంతముగా శ్రీదేవిని ఉత్తరమునకు వెళ్ళి బలవంతముగా తెచ్చి దక్షిణమున బంధించెను. ఇది వామాచారము. మూలాధారము క్రింద నుంచినాడన్న మాట.

హనుమకు నిజముగా శ్రీదేవి అన్వేషణము ఉపనయనమునాడు ప్రారంభమైనది ఉపనయనము పూర్వాహ్ణమున జరుగును. అందుచేత ఆ నాటి ప్రాతఃకాల సంధ్యావందనము లేదు. వటువునకు ప్రథమ సంధ్యావందనము సాయంసంధ్యావందనము కల్పవృక్షములోని సుందరకాండము ప్రారంభమైనది సాయం సూర్యోపస్థానము (మంత్ర?)తో.

"వెలుఁగు మఱొక్కచే రఖిల విద్యలకున్ బరమార్థభూతమై
వెలుఁగులు తన్ను మించి మఱి విశ్వమునందున వేఱుచోట లే
వలఘుఁడు శిష్యవత్సలుఁడు నంబుధిశోషణ దాహమూర్తి వె
ల్గుల నిధికిన్ గురూత్తమునకున్ జగదక్షునకున్ నమస్కృతుల్"

ఇట్లు సాయం సూర్యోపస్థాన మంత్రార్థముతో కథా ప్రారంభమును చేసి చేయబోవుచున్న అన్వేషణము ఉపాసనమని - దక్షిణాచారమని (అనగా వైదికమని), సీతాదేవి పరదేవత యని ధ్వనిమత్త

'సంధ్య' యనగా 'సంధౌ భవా సంధ్యా' - సంధియందగునది సంధ్య సంధి యనగా పగలు రాత్రి కలిసియున్న కాలము ఆ సమయమున ఉపాసింపబడు దేవతయు ఉపాసనారూపమగు కార్యమును సంధ్య యని చెప్పుదురు. ("ఉపాస్తే సంధి వేళాయాం నిశాయాం దివసస్యవా। తామేవ సంధ్యాం తస్మాత్తు ప్రవదన్తి మనీషిణః"॥ అని వ్యాసస్మృతి)

ఈ అన్వేషణను హనుమ గురుదేవతా నమస్కారముతో ప్రారంభించెను. వెలుగుల ఱేడు ఆయనకు ప్రత్యక్ష గురువు "శ్రీ గురుభ్యోనమః"

అని ప్రారంభించినాడన్నమాట. తాను చేయబోవునది శ్రీదేవికైన అన్వేషణము ఆమె లంకయందె చెచ్చటనున్నదో చెప్పగలవాడెవ్వడు ? అంతయు చూచినవాడు జగచ్చక్షువు ఇట్లు సూర్యుని సంబోధించుట అన్వేషణ ఫలవంతమగుటకు ఇది పరమౌచితీయుక్తమైన పదప్రయోగము ఇది పండిన కవితాశిల్పము ఈ సకలమును సంభావించి సుందరకాండమున మొదటి ఖండమును పూర్వరాత్రఖండమని పిలుచుట ఈ కాండలోని కథయంతయు జరిగిన దొక్కరోజున. దాని నాధారముగ తీసికొని పూర్వరాత్ర పరరాత్ర ఉప దివా సంధ్యా ఖండములుగ ఈ కాండమును విభజించుట జరిగినది. సంధ్యాకాలమునుండి సంధ్యాకాలము వరకు జరిగిన వృత్తాంతమును శ్రీ కవిసమ్రాట్టు ఒక ఉపాసనా రూపముగా చిత్రించెను.

సుందరకాండలో కవిసమ్రాట్టు పొందిసటువంటి తాదాత్మ్యము తాత్పర్యము అతిలోకములుగా నున్నవి. ఇతర కాండములం దీ స్థాయికి రాలేదు. కవిసమ్రాట్టు యొక్క మనస్సౌందర్యము సుందరకాండమందు బహుధా గోచరించుచున్నది. ఇట్టి మనస్సౌందర్యము బాలకాండయందు మాత్రమే కన్పించు చున్నది.

ఏ సందర్భమునం దెట్టి శయ్య సమకూర్చవలెనో, ఎట్టి శైలిని ప్రయోగింపవలెనో తెలుగు కవులలో కవిసమ్రాట్టునకు తెలిసినట్టుల మరొకరికి తెలియదు. ఏ భావమునకు ఏ ఛందస్సును గ్రహించినచో తదుచిత శయ్య సమకూడునో ఆయనకే తెలియును. నానావిధరసభావములకు నానావిధ పదశయ్యలు, నానావిధ ఛందోవిధానములు కల్పవృక్షమునందు-సుందరకాండమునందు-కన్పించుచున్నవి

అక్షరసమాకలనము, పదబంధము, సమాస ఘటనము. సంబోధనము-వంటి వన్నియు శిల్పమునకు వస్తువులే రసభావానుగుణమైన ఛందము కూడ నట్టిదే ఔచిత్య భేదములందు ఛందస్సును కూడ క్షేమేంద్రుడు చేర్చుకొనెను.

నిర్మాణమార్మికులైన కాళిదాస భవభూత్యాది సంస్కృత మహాకవులును, నన్నయ తిక్కనాది తెలుగు మహాకవులును వృత్తౌచిత్యమును

పోషించి ఛందస్సౌందర్యమును వృద్ధిచేసిరి రసభావానుగుణమైన భాషవలె తదనుగుణమైన ఛందోగమనముకూడ నున్నప్పుడు సౌందర్య విలసితమై ఔచిత్యము శిల్పసౌకుమార్యమును సంతరించుకొనును భిన్న భిన్న సందర్భములందు భిన్న భిన్న ఛందస్సులను కవిసమ్రాట్టు రసచర్వణమునకు దోహదము చేసెను విశిష్ట సన్నివేశములందు విశేష ఛందో ప్రయోగము వలన ఆయన సౌందర్యసంవేదన సంసిద్ధిని సమకూర్చెను బహుముఖములైన శ్రీ విశ్వనాథ కవిసమ్రాట్టుల రచనాశిల్పమునందు ఛందోగతమైన దొకటి.

## సుందరకాండమునందు కొన్ని విశిష్టఛందః ప్రయోగములు :

శ్రుతికాఠిన్యములేని వార్తాకథనమునకు, ఆవేశములేని సరళభక్తి నివేదనమునకు మధ్యాక్కరను ఉపయోగించుట పరిపాటి రెండింద్ర గణములు- ఒక సూర్యగణము, మరల రెండింద్ర గణములు - ఒక సూర్య గణము. మొత్త మారుగణములు ప్రాస కలదు నన్నయ భట్టారకుల రచనలో అయిదవ గణము మొదటి యక్షరము యతి ఎఱ్ఱాప్రెగ్గడ మొదలగు వారి రచనలలో నాలుగివ గణము మొదటి యక్షరమే యతి. సుందర కాండములోని నాలుగు మధ్యాక్కరలందును కవిసమ్రాట్టులు రెండు పద్ధతులలోను యతి వాడిరి. క్రమ మైనను నియమ పాలనము చేసిరి.

సముద్ర లంఘమునకు ముందు హనుమ సముద్రుని స్తుతించినది మధ్యాక్కరలో-

"మఱియు ఋగ్వేదులయందు మర్యాద మలచుకొన్నట్టి
వరుణదేవునియొక్క మహిత ప్రథమ రూపంబైన దొరకు
ధరణి దేవత నెద్దు కన్నతండ్రి నాఁ దన కౌఁగిటం బో
నరఁ దాల్చునట్టి యా జలధి నాథుని నా నతుల్ పొందు"

హనుమ మహేంద్రగిరినుండి సముద్రము దాటుచున్నప్పుడు, సిద్ధులు చూచి చెప్పునప్పుడును మధ్యాక్కర ఉపయోగింపబడినది.

"ఇతఁడు మహానుభావుఁడు కపీశ్వరుఁ డీ వార్ధి దాటి
క్షితిసుతాపతి రామచంద్ర సేవావిశిష్టకార్యార్థి
మతిమద్విభుం డతిలోకమహిముండు మహనీయమూర్తి
క్షితిధరంబున నుండి గగనసీమ వేంచేయుచున్నాడు"

సుందరకాండమునందు మరి రెండు మధ్యాక్కరలున్నవి రాముడు లక్ష్మణునితో 'సీతారామ' ప్రేమను గురించి చెప్పునప్పు డొకటి, విభీషణుని శరణాగతఘట్టమున మరొకటి. ఈ నాలుగు మధ్యాక్కరలును సాధు సుందరములుగా నున్నవి.

మత్తకోకిల వృత్తము గేయసౌందర్యము కలది. మూడుమాత్రల కొకసారి నాలుగుమాత్రల కొకసారి విరుపు కలిగిన మిశ్రగతి నడకతో సాగును. రసజజభరగణములు పదునొకండవ యక్షరము యతి. ప్రాస నియమ మున్నది. ఈ పద్యము ప్రశంసాభావమును వ్యక్తముచేయుటలో ప్రయోగించుట సమంజసము. లంకలో ప్రవేశించిన ఆంజనేయుడు రాత్రి సమయమున సీతాన్వేషణము చేయుచు రసవిహీన ప్రకృతులకు నిద్రా మాంద్యంబు సంఘటించునదియు రసారామవిహరణ శీలురకు నధిక జాగ్ర దవస్థా సంధాయకంబునునగు కంఠస్వరంబును గూడ జోడించి వృక్ష శాఖాంతర్లీనుండై సవ్వడి యేదో దూరమునుండి మరుత్తరంగములపైఁ బయనించుచున్నట్లుగా మత్తకోకిల వృత్తములలో (రెండు) రఘువంశ పురుషుల ప్రశస్తిని పాడెను. 'ఆంజనేయుండు కోకిలా కంఠంబున రాఘవ వృత్తంబు ద్విరావృత్తంబుగాఁ బాడిన'—అని (మత్త) కోకిల కంఠమున హనుమ పాడినట్లే కవి చెప్పెను ఆమెపై ప్రభావమును గుర్తించుటకై కొంతయాగి మరల హనుమ మత్తకోకిలమునే కోకిలకంఠమున నెత్తుకొనెను

"సత్యవాక్పరిపాలనంబున సాధులక్షణము కూర్చినా
సత్యకల్పుఁడు సాధువార్జనశాలి పంక్తిరథుండు తా
నిత్యవస్తుహృదంతరాళుఁడు సీరజాతవిలోచనా
పత్యుఁదూర్జితపుణ్యుఁడాఢ్యుఁడు ప్రౌఢ ధర్మమయుండునై"

ఈ మూడు మత్తకోకిలములును కోకిలాధ్వని మత్తములైనవి.

మహేంద్రగిరినుండి శ్రీరాముడు క్రిందకు సముద్రమును చూడగా నది అహిశ్రేణీ బహుకుటిల గమనములైన తరంగమాలికలతో నున్నది. సాటోపకుటిలత్వము, తొట్రుపాటువలన కలయద్రొక్కుకొనుట-ఇట్టి స్థితులను పద్యమునందలి విరుపులతో పట్టియీయవలెను. అట్టిది భుజంగవిజృంభణమువలెనే సాటోపకుటిలగమనయుక్తమైన వృత్తము భుజంగవిజృంభితము 'మమత నసన రసవ' గణములతో తొమ్మిది, పందొమ్మిది (రెండుసార్లు) అక్షరముల యతులతో నున్నదిది.

"పాతాళాయాతాహిశ్రేణీ
బహుకుటిలగమన విభావనాద్భుతమాలికా
సీతాన్వీత ప్రౌఢాశ్లేషా
నితరజలచరనిచయ నీలవర్ణసితచ్ఛవిన్
స్రోతోవ్రాత వ్యాకీర్ణాంబు
తురిదళిత సితకిసల సోమవల్కతరూజ్జ్వలున్
ద్రేతాధూత క్రీడాధూమా
తిపథచలితసురగణదివ్యభూషసముజ్జ్వలున్"

అష్టమూర్తియన్నది మరొక వృత్తము దీని పాదమునందు మనగగ-నతగగ-నభగగ అను (గణ) ఛందః ప్రస్తారముతో మూడువిరుపులుకలవు సముద్రకెరటము ఎత్తుగా పైకిలేచినట్లు, చుట్టచుట్టుకొని పడినట్లు - చిట్లిపోయి పొర్లిపోయినట్లు - ఈ మూడు విరుపులును తోపించును. ఈ పద్యమును సముద్రవర్ణనమునకే సుందరకాండమందు వినియోగము.

"నాకస్పృగ్వీచిభుతి నేగున్ నతమహాసారమాగున్
నగమహాకృతి జోగున్
బాకారిప్రముఖ సౌరప్రణతి గంభీరరేఖా
ప్రవిమలాద్భుత తేజః

ప్రాకారాంతరనిగూఢ ప్రచలనాభోగధర్మ
ప్రసరణాంచిత మూర్తిన్
లోకాలోకకుధరాంభోలులిత పర్యాయమూర్తిన్
లురనమంథరమూర్తిన్"

వరాహావృత్తము చిత్రమైన గమనముకలది. మగణము ఆరునగణములు సగణము గగము కలిగిన పాదమునకు పది పదునారవ అక్షరములు యతులు. ఇదిత్ర్యస్ర గతిలో నడచుచు తొట్రుపాటును వెల్లడించుచు- తుది మొదళ్ళకదలికతో-మధ్యభాగము తి(త్ర)ప్పయత్నము చేయుచున్నట్లుతోచును ఒక అరణ్య ఘోణిచలించునట్లే యుండును. దీనిని సుందరకాండమున సముద్రవర్ణనమునకే వాడుకొనిరి.

దిక్సీమాంతమిత ధిమిత ధిమిత ధిమక
ధిమక పటుతరమృదంగోద్యత్
ప్రక్సంరావముల నటన చతురశఫర
శకునినిచయకృత సాహాయ్యన్
ప్రాక్సృష్టిన్వెలుచు జలజభవకృతనుతి
భరిత సవన ఘటనానేహః
స్రుక్సందీపిత మహితచరు నిహితనుత
రుచిరమహిమ సుమహాధ్యాయున్.

సముద్రవర్ణనము చేయునప్పటి ఛందఃప్రయోగము చిత్రమైనది. అపారమైనపారావారమును వర్ణించుటకు వాడుకొనిన వృత్తములన్నియు దీర్ఘములైన పాదములుకలవి ప్రతిపాదమునకు రెండుచొప్పున యతిస్థానములుకలవి. ఈవర్ణనములో చివర స్రగ్ధరావృత్తము 'మరభనయయయ' అను గణములతో ఎనిమిదవ అక్షరము,పదునైదవ అక్షరము యతిస్థానములతోనున్నదీ వృత్తము. ఈస్రగ్ధరావృత్తమువరకు తీసికొన్న వృత్తములలో లఘువులు పాదమధ్య భాగమందుండి కొంత తంద్రాళుతను సూచించుచున్నది స్రగ్ధరావృత్తము యొక్క గమనము మహౌద్ధత్యమును ప్రస్ఫుటీకరించును. సముద్రుడు మహామండలీభూతరావుడైన యుద్ధతుడు అందుచేత నే

స్రగ్ధరావృత్తము ఉచితరమణీయముగానున్నది. పైగా దీనియందు దుష్కర ప్రాసము.

సంత్రస్త ప్రాణిలోక జ్వలితజలమహో
చండు మైనాకభూభృత్
సంత్రాణోపేత కార్యాచ్ఛదనవదనవి
చ్ఛాయ గంభీరభావున్
సంత్రైవిద్యప్రశస్తశ్రుతిరహిత సమ
జ్యామహోద్యోత్పసామర్
జ్మంత్రాయాత ప్రకీర్ణోన్మధురరవ మహో
మండలీభూతరావున్.

శ్రీరామచంద్రుడు సముద్రుని మార్గ మడిగినాడు. ప్రార్థించినాడు. వార్ధిరాజు పలుకలేదు. శ్రీరాము డప్పుడు కోదండమును పూని అస్త్రాటిని సంధించి శరములు విడిచెను. ఆ బాణములతో సముద్రుడు కలగుండు పడెను. కల్లోలితుడయ్యెను. అసహాయుడై నిశ్చేతనుడయ్యెను. త్రొక్కుళ్లు పడి అసహాయమైన అవసానముతో పరిణమించెను. ఈ యవస్థను వర్ణించుటకై వాడిన ఛందస్సు శాలూరము. మొదట రెండు గురువులతో నిరువదియారు లఘువులుండి చివరకొక గురువున్న పద్యపాదమిది. (తగణము ఎనిమిది నగణములు లగము). సముద్రుని అవస్థను పద్యగమనము పట్టి యిచ్చుచున్నది.

అంతన్ రఘుపరివృఢ ధనురుదితశర
నికర సరదనల పటుతర శిఖా
ప్రాంతంబగుచు జలధి బహుల కుహర
నివసదసుర మకరతతి తతతనూ
సంతానములు తెకతెకలయి తహతహ
లయి తికమకపడి వడిగుడుసులై
యంతర్జలముల నసుచయము లురలి
సగము వెలకిలఁబడి చలన మురలెన్.

సముద్రుడు అంతర వేదనముతో కొంత నిలువ త్రొక్కుకొని సమాంతర స్థితి పొందును. దీనిని వేదనతోడి సమాంతరస్థితిని అభివ్యంజన చేయుటకు చతురశ్రగతి కలిగి సమర్థవంతమైన 'దుర్మిల' వృత్తము సాధనమైనది. ఎనిమిది సగణములు వరుసగానున్న పాదము దీనికి.

ధరణీతనయా హృదయేశ్వర
బాణనితాంత మహాగ్ని శిఖావళిచే
వరుణాలయ భాగ్యవహు జంతుత
తి ప్రళయాగతియైనగతిం బొలిచెన్
ధరణిం గన నాశ్రయ మందినచోఁ దగ
నాపదయైనఁ దదాశ్రితులం
బొరయంగను మానకయుండునో
దుర్భరము ల్సెలుగుల్ బహులాకృతులై.

ఆతరువాత సముద్రుని స్థితి కొంత నిశ్శాంతియు ననుస్యూతియు కలది. ఇట్టి స్థితి శ్రుతిగోచరమగునట్లు చతురస్రగతిలో మొదట గురువుతో రెండులఘువులున్న భగణము ఎనిమిది లుండిన కిరీటమను వృత్తము వాడుకొనబడినది.

వారిధి యెచ్చటి లోఁతులు లోఁతులు
వారకచొచ్చెడి యమ్ములచేతను
నేరని మాదిరి లోపలలోపల
నిప్పులుపోసెడి యమ్ములచేతను
తూరినచోటులఁ జిక్కని నెత్తురు
తూములు కట్టెడు నమ్ములచేతను
తీరిక నూరక నూపిరి లేవఁగఁ
దీసుకపోయెడు నమ్ములచేతను.

తరువాత సముద్రుని స్థితి మరియు చిత్రము. క్లిష్టత కలిగినది క్లేశమైనది. కాని ఆ స్థితి కొంత సడలింపు అగుటవలన కొంత సౌఖ్యము కలిగి

నది సాంత్వనము కలిగినది. వరుసగా గురువులు (ఎనిమిది), తరువాత వరుసగా లఘువులు (పన్నెండు) చివరకు రెండు గురువులు కలిగిన చతురస్రగతి కలిగిన హంసి వృత్తము ప్రయుక్తమై సముద్రుని స్థితి శ్రుతిగోచరము చేయుచున్నది.

శాతార్చిర్ధూర్వాంధుర్యంబుల్
జలనిధి జలములు సలసలఁ గ్రాఁగన్
జాతాశస్థ ప్రాణిశ్రేణుల్
వలపల భరమయి యసువులు వేఁగన్
యాతాయాతాయాసక్లిష్టా
సువులయి యలమటఁబడి వడి యాదో
వ్రాతం బెల్లన్ వార్వాసంబుల్
వదలి దివమునకుఁజన నెగురంగన్.

సుందరకాండములోని మరియొక ప్రత్యేక వృత్తము నరేంద్ర వృత్తము 'భరనసజజయ' గణములు. పదునాలుగవ యక్షరము యతి ఈ పద్యముపాదమున పూర్వభాగము ఉత్పలమాలా చరణమువలె సాగి తరువాత చతురస్రగతిలోనికి దిగును కొంత కలత నొందిన స్థితిని దాని నుండి క్రమముగా పెరిగి అతిశయస్థితిని చేరుట (గగము) ఉత్తరభాగము నిరూపించును క్రమ క్రమౌన్నత్యము స్ఫుటముగా కన్పించును ఈ వృత్తము వాడుకొనిని స్థితిలో సముద్రము 'పట్టుకొని దించుటకునైన పట్టు లేక క్షీర భాండమ్ము వోలె వార్ధి' చిందులాడినది. కుతకుత లాడినది.

జాలములై తరంగశిఖ
రములను సన్నని రేఖగ ధూమ
జ్వాలలు లేచి యల్లుకొని
నభమున వల్లులు వృక్షములయ్యెన్
నీలతమాల కాననము
నిలువున నింగికి లేచెడునట్టుల్
హాలహలమ్ము క్రొత్తది
జలనిధి యం దుదయించిన యట్టుల్.

ఇట్లు దృక్ప్రదర్శితముగా సూచింపబడిన ఛందస్సౌందర్యము సుందరకాండమునందు అతిశయముగానున్నది. సందర్భోచిత ఛందోగ్రహణము కవిసమ్రాట్టుల కావ్యశైలిలో నొక ముఖ్యాంశము. సందర్భోచితముగ రసానుగుణముగ ఛందస్సును తీర్చుకున్న మహాకవి ఆయన సీసపద్యమాయన చేతిలో నెన్నియో సొబగులు దిద్దుకొన్నది. బహువిధ శిల్ప మర్మస్థానముగా రసభావోచిత గమనశీలగా రామకథా సంవిధాన మందాయన సీసపద్యము బహురమణీయముగా నొదిగినది.

సీ॥ మావి చివుళ్ళు సంవలనమ్ము గావించి
శీతలీకృతమైన శీధురసము- ఇది సంసారపక్షము.

సీ॥ ఒకమహాసిత భుజంగకము చుట్టలుచుట్ట
లుగను నిర్మోకంబు తిగిచినట్లు-
—ఇదియొక గడుసు పోకడ.

సముద్రమును దాటి హనుమ లంకను సమీపించుచుండగా ఆకసమునుంచి ఆయన క్రిందకు చూడగా ముందు కన్పించినది భూమిని చేరి ఉన్న సముద్రభాగము దానికి అనూపదేశమని పేరు తరువాత కన్పించునది ఆ ప్రదేశము నంటిపెట్టుకున్న సస్యసంపద ఆ తరువాత ఆ సస్యశ్యామలమైన భూప్రదేశమును అప్లావితము చేయుచున్న సముద్రుని భార్యలు- నదులు కన్పించును ఆ సముద్రపత్నుల ముఖములను హనుమ అవలోకించెనని వాల్మీకి మనకు చెప్పెను.

"సాగరం సాగరానూపాన్
సాగరానూపజాన్ ద్రుమాన్
సాగరస్యచ పత్నినాం
ముఖాన్యవలోకయత్"

ఈ వాల్మీకి శ్లోకమును దృష్టియందుంచుకొని కవిసమ్రాట్టులు చేసినరచన-

అపతితోగ్రమూర్తి జనమందుకొనంగను బోయి సాగరా
నూపమనోజ్ఞ దేశములయందు సుపుష్పిత కానవావళుల్

చూపులకందు నంతటన చూచుచు తృప్తిఘటిల్లఁజిత్తసం
దీపితదైత్య పట్టణు డుదీర్ణజవంబును బూనకేగుచున్.

వాల్మీకమైన ఆధారమున్నా-ఆకారమంతా విశ్వనాథీయమే.

కల్పవృక్ష సుందరకాండగత రామణీయకమును సహస్రధావివరించి చెప్పవచ్చును. పద్యముల యెత్తుగడ, పదములకూర్పు, తెలుగు పలుకు బడులు, పద్యముల నడకలలోని విరుపులు, సమాసరచనము, సంభాషణా చాతుర్యము, ఊహాలలోని సౌకుమార్యము, పాత్రపోషణము, కథాకథన కౌశలము, లోకజ్ఞత, ఔచిత్యకల్పనము, వివేకము, వ్యాఖ్యాన వైదుష్యము మొదలుగా నెంతయిన చెప్పవచ్చును ఈ యన్నిటినిమించి యీ యన్నిటి యందు అంతర్లీనముగా నున్న దొక యేకోన్ముఖనత కలదు

ఆ ఏకోన్ముఖనత రామాయణ కావ్యమునందతట ఆయన ప్రజ్వలితము చేసినాడు ఆయన రామాయణము వ్రాయుటకు తండ్రి యాజ్ఞతోపాటు అంతరంగమున జీవుని వేదనయొకటి రసము స్వసంవేదనసిద్ధము అందుచేత కల్పవృక్షములోని రచన జీవుని వేదనతో ప్రజ్వలితమైనది. రామకథలోని పాత్రముల నన్నింటి ముఖమున ఆయన రామభావన చేసినాడు కల్ప వృక్షమునందు మొదటినుండి చివరదాక శ్రీరామచంద్ర తేజస్సంక్రాంతి విజృంభించినది

సుందరకాండమునందు కవిసమ్రాట్టుల జీవసంపుటిలోని నిరంతర మథనము సీతాదేవి ముఖమున అభివ్యక్తమైనది

ఉషఃకాలమున సీతాదేవి అశోకవృక్షమూన హనుమంతుని చూచినది కలలో కోతిని చూచితిననుకొన్నది కాదు రామభద్రుడు లంకకు రావలెనని తనకున్న కోర్కె కల్పించుకొన్న రూప మనుకొన్నది. కలయైనను తనకు - అన్నిటికి సిద్ధమైయున్న తనకు- కీడు లేశమైన లేదనుకొన్నది. అపశకున భ్రాంతిచేత "శ్రీదయితుడు రాఘవునకు నేదయిన ఘటించునేమొ" యని విలవిల లాడినది అరణ్యమునందు తిరుగుట వలన శ్రీరామచంద్రుని పద ములు పగులగా తాను ఇంగుది నూనె పట్టించెడిది సంవాహనము చేసెడిది ఇప్పు డా పని లక్ష్మణునకు పట్టినది ఇప్పు డీ అపశకునమువలన స్వామి వారి పాదముల వాపులు మోపుచేయునేమో ?

స్వామి పాదములు లేత చిగురాకు వంటివి. భక్తుల యొక్క తీవ్ర భావనచే వేడి యెక్కగా తాను నూనెరాచి పైటచెంగుతో వీచెడిది నా గతి యిట్లులైనది ఇప్పుడు స్వామి పదాబ్జములకే దురవస్థ పట్టినదోకదా!

గంగానది జలములవలెచల్లనైన స్వామిపాదములకు మునుల తపములు కూడ కోతలు పెట్టినవి. అయ్యో స్వామి పాదములకు పరిచర్య చేయుటకు తన పయ్యెద యొక్కటియే సమర్థవంతమైనది తనగతి ఇట్లగుటవలన ఇప్పుడా పాదములు పరిచర్యాహీనము లైనవే!—ఇట్లు సీతాదేవి విలపించినది. వేదన పడినది

చ॥ అపగత సర్వసౌఖ్యుడయి యక్కట! కానలసంచరింపఁ గా
ఖృపగిలి బీట్లువిచ్చినను లోపల నిందుపనూనె పోయుదున్
గృపగలయట్టి లక్ష్మణున కీ పనిసైతము పట్టె నక్కటా
యపళకునంబు స్వామి చరణాగ్రపు వాపులు మోపు చేయునో.

చ॥ పతిచరణంబులే మృదుప్రవాళనిభంబులు సర్వభక్తసం
తతికృత తీవ్రచింతనపథంబున మిక్కిలి వేడియెక్క నం
చితగతి నూనె రాచుచును చేలము చెంగున నేను వీతు నా
గతి యిటులయ్యె స్వామిపదకంజము లే దురవస్థఁజిక్కెనో.

కం॥ అయ్యో! స్వామిపదంబులె
ముయ్యేటి కృపీటశీతములు ముని తపముల్
కయ్యలు కోసిన నాదగు
పయ్యెద యొక్కటియె పాదపరిచర్యకగున్.

సీతాదేవి మనస్సునందు కలిగిన యీ భావన పరమ సుకుమారమైనది. మనము దానిని గురించి ఆలోచించినచో కందిపోవు నట్లున్నది కల్పవృక్ష రామాయణమ నందిట్టిభావన మరియొక పాత్ర యందెచ్చటను లేదు. శ్రీ

రామచంద్రుడేక పత్నీవ్రతస్థుడు. సీతాదేవి చేసిన భావన ఆమె భార్యా చరణదాసిగా-పరమ భక్తురాలుగా జేసినదని తోచునా? కవి బ్రహ్మాట్టుల జీవ సంపుటిలోని సహజమైన జీవుని వేదనా పరిపాకము ఇట్లు సీతాదేవి వ్యాజమున కావ్యగత రామణీయకతను సంతరించుకొన్నది

ఆంజనేయుడు సముద్రము నుల్లంఘింపజాలిన తేజోనిశ్చితాభ్యాయ మొదలుగా విషయములు తరువాత జరిగినవి. ఆ సంభాషణలోని ఔచిత్యము పాత్ర చిత్రణము సూక్ష్మతరాభావాంశములు నేనిచ్చట స్పృశించుట లేదు

అభిజ్ఞానవంతమైన కాకాసుర వృత్తాంతమును హనుమంతునికి అమ్మవారు చెప్పినది. వాగ్విశారదుడు సాధూత్తంసుడునైన హనుమంతునికి కొన్ని మాటలు చెప్పినది. ఆమాటలు జననాథునికి చెప్పెడితీరులో నున్నదని నది. తాను కపిరాజుపై నాధారపడి యున్నాననన్నది ఆమాటలలో కొన్ని ఇట్లున్నవి

మెడలోఁదాళిని గట్టి వామపదమున్ మెట్టెన్ గరస్వీకృతిం
గడకం జేసె నటంచు నే చనవుచేఁ గంజాతు రాముస్ దడం
బడి యే పల్చని యాహ చేసితినొ యాపాపంబు నే నందెదన్
గడు నన్నున్ క్షమియింపవే రఘుపతీ! కల్యాణవారాన్నిధీ !

తనతండ్రుల్ బహుమేధయజ్వలది బ్రాంతా! బ్రహ్మవిజ్ఞానులెం
దును నాతండ్రులటంచు నాయెద నదేద్రోహంబు భావించియుం
టినొ యాపాపము వచ్చి యిప్పటికి నంటె న్నన్ను నీరీతిగా
గను నన్నున్ క్షమియింపవే రఘుపతీ! కల్యాణవారాన్నిధీ!

అడవికి వచ్చుచున్న యపుడైనను రక్కసులన్ వధించు న
ప్పుడయిన నీవు నాయెడల మోహము మిక్కిలిగాఁగఁజూపున
ప్పుడయిన నీకు నేవెలితి పుట్టెనొ నీదెస నాయెడంద నొ
త్తెడు నఘలేశమున్ రఘుపతీ! క్షమియింపవె! జానకీపతీ!

కైకయి రాజ్యమున్ భరతు కైవసముం బొనరింపఁగా మముం
దోకొని యెల్లవేలుపులతోఁగు గుహుండును దాఁటవేయగాఁ
గైకొన కెన్న నామనసు కాంచెనో భాగవతాపచారమ
ర్ధీకృత వృత్తియై రఘుపతీ! క్షమియింపవె జానకీపతీ!

ఏకతమున్న యప్డుపతియే తమిఁ జేత మదీయపాదముల్
చేకొని స్వీయపాదములఁ జేర్చఁగ నూరకయుంటి దుష్టకా
మాకృతిచేత నేను నదియంతయు బ్రేమయటంచు నెంచి సా
ధ్వీకృతి మాలితిన్ రఘుపతీ! క్షమియింపవె జానకీపతీ!

ఓనాస్వామి! హృదంతరాంతరమునందున్నావు నాథుండవై
యేనోఘాసతతిన్ సుదర్శనపు బర్హిన్ నీవు ముట్టింతువ
జ్ఞానంబంతయు భక్తినందకమునన్ సైరింతు నీయందు నా
ప్రాణంబుల్ నిలబెట్టితిన్ రఘుపతీ! పాలింపవే! శ్రీపతీ!

జ్ఞానాకారులు నీవు నీయనుజుడున్ సైరించి నాకోస మ
జ్ఞానులుల్గానయి మాయలేడి వెనుకం జన్నారు ప్రేమంబునన్
దానా చెల్లెలిభర్త వట్టిమరియాదం జేసి యాతప్పు నా
తోనే పోవలెనా ప్రభూః రఘుపతీ! తోడాదువా? మత్పతీ!

రామచంద్రుడు తనకు తాళిగట్టి తన్ను స్వీకరించిన భర్త యని సామాన్యమైనఊహాచేయుట పలుచని యూహాయట! అది పాపము పొందిన దట రఘువంశీయులు బహుయజ్ఞ కర్తలగు కర్మిష్ఠులని, తన తండ్రులు బ్రహ్మజ్ఞానులగుటచే నంత కన్న పైచేయి వారని భావించుట ద్రోహమట కైకయి రాజ్యమును భరతుని కైవసము చేసినదను కొనుట భాగవతుల యెడ అపచారమట ఏకాంతమునందు భర్త తనపాదములను స్వీకరింపగా నూరకొనుట దౌష్ట్యమట మహాపతివ్రతయైన సీతాదేవికి భర్త ఆరాధ్య దైవము అందుచేత వట్టిప్రేమ విషయముకాదు. ఆయన గురువులను లఘు

వుగా చూచుట పతివ్రతా లక్షణమునకు తగినదికాదు. ఆయనయందు కేవల పురుషబుద్ధి కూడ అట్టిదే. ఆమె ఇంతకు పైనకూడ భావన చేసినది

శ్రీరామచంద్రుడామె హృదయదహరాకాశస్థితుడై నిజజ్యోతి సుదర్శనాగ్నిచే పాపములను దహించి భక్తిసందర్శ ఖడ్గముచే అజ్ఞానమును ఖండించును ఇది యంతయు నవిస్రమాట్టు సీతాపాత్ర ముఖముగా వెల్లడించిన స్వసంవేదనము

శ్రీరామచంద్ర పాదాంబుజ పరాగరామణీయకమును తొలుత తెలిసికొన్నది సీతాదేవి. నిజముగా కాదున శ్రీచరణరేణుసంస్పర్శ తొలుత నామెకు లభించినది ఆ తొలినాటి నుండి శ్రీరామచంద్ర పాదరేణు వామెకు జీవనసర్వస్వమై ప్రబలినది అపాదరేణువు లేక తానిప్పుడిట్లు వడలిపోయినది అది మరల లభించినప్పుడే మరల వికాసము. ఆ సుకుమార భావనాలాలిత్యము. ఉత్తాలమైన వేదనలను స్పందించు రచనను గమనింపుడు

కోమలములైన పతి యడుగులకు నా న
మస్కృతులు చెప్పుమయ్యా మన్మస్తకమున
నెవని కాల్దుమ్ము భూషణాయితముగాఁగ
మసలు నాతనికిని మన్నమస్కృతులివి.

పాపటఁ జెంగల్వ పూపరాగమ్ముగాఁ
గన్నులయందునఁగజ్జలముగ
మోమునలొద్దుగ పూవులదుమ్ముగాఁ
బెదవిపై మంకెనల్ పుప్పొడియుగ
మెడలోన చందనమృదులేపనంబుగా
బొమ్మపైఁగుంకుమ దుమ్ముగాఁగ
జఘనంబునందు భాస్వరపత్రములుగాఁగఁ
జరణాన లాక్షారసంబుగాఁగ
నూరుగంబురగాఁగ జంఘోరులందు
స్వామిపాదాంబుజాత రజంబుపొల్చు

గడగి నామన్కి యాతని కాలిదుమ్ము
మన్నమస్కారములు చెప్పుమా కపీంద్ర!

ఎపుడు నేదియుఁగోర నే కోర నొకసారి
నాకోర్కి యెట్టించు నల్లచీర
మఱియుఁగ్రొక్కారు నెమళ్ళు జరిపోగు
లను నంచులోన నూలలుగఁగలది
మేమయోధ్యాపురి మేలుగా నున్నట్టి
దినములలో జరిగినది యిద్ది
సాగెను దానిపై సాయంతనంబున
ధరియించితిని గనుల్విరియుచుండ

అద్ది వర్షర్తువును స్వామి యరిగి పాద
చారి కాళ్ళెల్ల బురదగాఁజాలుగను
వచ్చి యాచీర యంతయు బాడిగాగఁ
దుడిచికొన్నాఁడు నాకనుల్ ముడుచుకొనఁగ.

అప్పటినుండి నాదు బ్రతుకంతయు నాతని కాలిదుమ్ముగాఁ
జొప్పడెనోయి దుల్పుకొనుచో మరి పట్టిన క్రొత్తదుమ్ముగా
నెప్పటికప్పుడీ తుదకు నేమయిపోయెను దుమ్ము లేనిచో
నెప్పుడు నిద్రపట్టదిది యీపదిమాసము లెట్టు లయ్యెనో!

ఈ వృత్తాంతము పరమకారుణ్యరస వ్యంజకముగా నున్న వాగర్థముల సామీచీన్యముగా నున్నది. ఈ చీర బురదయగుటన్న వృత్తాంతము మధుర భావయుక్తమైనది. ఉత్తాలమైన వేదనతో ఈ సంఘటనకు రమణీయతను సమకూర్చినది

హనుమంతుడామెతో "రాఘవుడేగుదెంచి సముద్యచ్చాపవల్లీసుమం బెల్లన్ పుష్పాడిజల్లు నీదు యొడలున్" — అని చెప్పినాడు.

సుందరకాండమునందు మరియొక మనోజ్ఞవిషయము సీతాస్వరూప పరిణామము ఆమె యోగీశ్వరి, నిర్మల, నీతివేత్త, బుద్ధికుశల, భక్తురాలు, దీన, బ్రహ్మజ్ఞాని. ఆమె యొక నూతనాగ్నిశిఖ. ఆమె అగ్నులకగ్ని. అగ్ని ఆమె యాజ్ఞంబడి ప్రవర్తిల్లును ఆమె చెప్పినది.

ఏ యగ్ని యజింపనియది
ధ్యేయ మ్మేయగ్ని లోక మెల్లెడెల రిర
ఛాయతి నే యగ్ని తిరుగు
నా యగ్నియు నిన్నుఁ గాచు నయ్యా కపీంద్రా!

ఆ యగ్నియై రక్షించెదు
నా యాజ్ఞంబడి ప్లవంగనాథా! బిడ్డా!
నే యగ్నిదాహకత్వము
నీ యెడలన్ లేకయుండు నిజముగ నెందున్.

తనకు సీతాదేవి అర్థమయినదనుకొన్న హనుమ తెల్లబోయినాడు ఆమె అర్థము కాలేదు అతడు వట్టి రామమేదినీపతి దూతగా మిగిలిపోయి నాడు.

కవిసమ్రాట్టు వేదన ఖండాంత పద్యములందు విద్యమానమై కథిత మైన కథాగమనమునకొక విచిత్రవ్యాఖ్యానము సమకూర్చినది.

సుందరకాండమున ఆంజనేయుడు రామకార్యము నిర్వహింపవలసి యున్నది ఆ రామకార్యము దేవతాకార్యము కూడ. రావణసంహారమున కది ముఖ్యసోపానము. కావున ఆంజనేయుడు విక్రముడై విజృంభించు చుండగా-

మరియు మహాద్భుతంబు హనుమంతుని విక్రమమున్ భుజాబలం
బురువినయంబు కార్యకరణోర్జితమార్దవమున్ శచీపురం
దర ఋషిచూచి దివ్యుడయి తన్మహనీయుని భావనాసమా
ధిరచిత దేవతాకృతమతిం దలపోసె హృదంతరంబునన్

శచీపురందరుడైన దేవేంద్రుడు ఆంజనేయుని ద్రష్టయై సంభావన చేసినాడట.

"మంగళరూప! ఆర్య! హరిమర్కట మర్కటపంచవక్త్ర ఖ
ట్వాంగమహాసిఖేటకుధరామృత కుంభసృణి ప్రదీపితో
త్తుంగకరాంబుజాత! నవతోయదమూర్తి త్రిపంచనేత్ర స
ర్వాంగద కంఠహార యసురావళి మర్దనబాహు! మారుతీ !

ఈ పద్యమంతయు చిత్రమైనది. ఆగమములందు కన్పించు ప్రతాపవీరాంజనేయ మహామంత్ర సంపుటీకరణమునకు సంగ్రహరూపమిది ఆ మహామంత్రమునకు శచీపురందరుడు మంత్రద్రష్టయైన ఋషి శ్రీరామచంద్ర భగవానుడే ఋషియైన మహామంత్ర కల్పముకూడ కలదు శచీపురందర మహర్షి సంభావనతో ఆగమరహస్య మొకదానిని కవిసమ్రాట్టులు గుంఫించినారు

సుందరకాండమున ఆయన పచ్చితేనియల కాలువలను ప్రవహింపజేసినారు. ఈ విశ్వనాథ దర్శనమున నవ్యప్రౌఢ మహార్థముల మహోద్యానము సుందరకాండము. రసాలపల్లవాళి మేవఁబోల్లసత్కుహూయ కోకిలాంగనా రవేందిరా సహోదరి శ్రీకవిసమ్రాట్టుల భారతియైన సుందరకాండము.

మొనసినట్టిది యిందు మొనసినట్లేయుండు
గూనతుమ్మెద రొదవోని యులివు
కురిసినట్టిది యిందు కురిసినట్లేయుండు
దరిలేత మంచు తుంపురుల జల్లు
సాగినట్టిది యిందు సాగినట్లే యుండు
గాజువారిన సన్నజాజి తావి
కాసినట్టిది యిందు కాసినట్లే యుండు
తెలిచిక్కనైన చందిరుని వెలుగు,

# కల్పవృక్షము :
# 'యుద్ధ' శిల్పావతారిక

—శ్రీ కోవెల సంపత్కుమారాచార్య

శ్రీమద్రామాయణ కల్పవృక్షం విశ్వనాథ సత్యనారాయణ గారి 'అనూన ప్రతిభార్ణవోదీర్ణ' మయిన మహాకావ్యం 'వాల్మీకి కృత సత్కథా 'సుధారసం' ఆస్వాదించి, 'జానకీదేవి మనోహరుండు రఘుదేవుని సాధుకథా ప్రపంచము'ను ఆయన కల్పవృక్షంగా విరియించినారు 'నాథకథ'ను తన సకలోహ వైభవసనాథం'గా వెలయించినారు నాథకథ అంటే రఘునాథ కథ కావచ్చు, నిజానికవును గూడా కాని, ఆ పదబంధం అంతమాత్రపు తాత్పర్యంతో ఆగిపోవటం లేదు కథలన్నింటికీ అది నాథమయితున్నది కథానాథమే నాథకథ—— నాథమౌని వలె అది కథానాథం కావటంలో హేతువు- అది సాధువు, సత్ కావటమే. మౌని వాల్మీకి భిక్షతో అనంతర కాలాన రామగాథను, అందలి వివిధ ఘట్టాలను కావ్యాలుగా ఎందరు రచించలేదు! మహాకవుల మనుకోలేదు! కాని, అది 'సత్వృత్త' మనీ, 'సత్కథ' అనీ తెలిసిందెంతమందికి? గుర్తించిందెంతమంది? ఆనాడు తిక్కన్నగారు, ఈనాడు సత్యనారాయణగారు అంతే వారు స్వరూప యాథార్థ్య విజ్ఞానంతో ప్రవర్తించినారన్నమాట సత్కథ అంటే —— సత్పదార్థ నియాపకమయిన కథ వాల్మీకి కృతమయింది వట్టి రామకథకాదు; అది సుధారసం, అమృతోదాత్తం. కాబట్టి అది సాధువు కథలోని సాధుత్వం, దానికి మూలమయిన సత్త్వం —— వీటిని సమగ్రంగా అవగాహన చేసుకోవటం మూలాన్నే జానకీదేవి మనోహరుండు రఘుదేవుని సాధుకథా ప్రపంచాన్ని సత్యనారాయణగారు నాథకథ అనటం మరొకటి అది నాథ కావటానికి కారణం అదికట్టుకథ కాకపోవటంకూడా "వ్రాసిన, రామచంద్రుకథ

ప్రాసితినంచనిపించుకో, వృథాయాసముగాక కట్టుకథ లైహికమా, పరమా..." అని తండ్రిగారి ఉపదేశం రామచంద్ర కథేతర కథలన్నీ, "కట్టుకథలు" అంటే, బంధించే కథలు-రామచంద్రునిది మాత్రమేకట్టుకథ కానిది. మరి? అది విప్పుకథ,బంధవిమోచకమయిన కథ. ఐహికంగా పరమోదారమయిన మానవ జీవనమార్గ నిర్ణాయకం పరవిషయికంగా సత్పదార్థ నిరూపకం. ఆతండ్రి శోభనాద్రి, ఆఉపదేశం శోభనమయింది- 'ఆనతి' కూడా అయింది 'జీవునివేదన' కిదితోడు. ఈ జీవుని వేదన అన్నది అటుసర్వ సాహిత్యశాస్త్ర తాత్పర్యాన్నీ, ఇటుజీవలోక మౌలికతత్త్వాన్నీ సమావరించుకొన్న మహాకవి, మహాశిల్పియొక్క నైజలక్షణం. ఆ రెండూఏకమై నాథకథ సకలోహ వైభవసనాథమై, శ్రీమద్రామాయణ కల్పవృక్షం అనూన ప్రతిభార్ణవోదీర్ణమయిన మహాకావ్యంగా అవతరించింది సత్యనారాయణగారి సర్వసాహిత్య ప్రక్రియా వైభవ పారంపర్యం సర్వథా ఈనాథకథకు- కట్టుకథ కాని దానికి-సమగ్ర కావ్యకల్పవృక్షత్వం సాధించటానికయిన ఉపాసన

రామాయణగాథ నీసంసారానికి-నిత్యప్రస్రవణ శీలమయినలోకానికి- అందించిన వాల్మీకిమహర్షి పరమమౌని. కల్పవృక్షావతారికలో వాల్మీకి స్మరణసాగిన పద్యత్రయిలోనూ ఆయన 'మౌని' గానే విశేషణింప బడినాడు. గాథనందించిన మహర్షి "మౌని" కాగా, గురువుగారి మౌనవ్యాఖ్యానంలో శిష్యులు ఛిన్నసంశయులు కావలసి ఉంటుంది. ఎల్లాంటి వారయితే, వంచేస్తేవారు ఛిన్నసంశయులయ్యేస్థితి కలుగుతుంది? మొదటకావలసింది వారు గాథప్రతిభులు. తద్ద్వారా ఆగాథను, దానిలోని రహస్యాలనూ, కథాకథనశిల్పానేకమార్గాలనూ పౌనఃపున్యంగా ఉపాసించి, ఆకావ్యవాక్కు సర్వశిల్ప భూమి అనితెలిసి, సర్వశాస్త్ర లక్ష్యమని ఎరిగి, సంప్రదాయాపగాహనతో మననంచేసి, అనంతమయిన వ్యుత్పన్నత- లోకజ్ఞత కలిమితో అనేకాంశాలను సమన్వయపూర్వకంగా ప్రసన్నం చేసుకోవలసి ఉంటుంది. అప్పుడే ఛిన్నసంశయత్వం కృష్ణశాస్త్రి అన్నట్లు "గాథప్రతిభు" లయిన సత్యనారాయణగారు ఆ విధంగా చేసినారు. వాల్మీకాన్ని ఒక విద్యగా అభ్యసించినారు, ఉపాసించినారు.

'——వలయు విద్యకై కాగ్ర్య మభ్యసనవేళ
జనును బహుముఖత్వము ప్రదర్శనము వేళ'

యుద్ధ నిస్సంశయ - 132

రామాయణ మహావిద్యా విషయకంగా ఆయన చేసిన అభ్యాసమా విధమయినది. రామాయణాన్ని కల్పవృక్షంగా విరియించిన వేళ ప్రదర్శించిన బహుముఖత్వం అనంతముఖమయింది. ఆయన 'కవితా తపస్సు' ఫలితంగా 'అమృతోక్ష్యంచిత' మయిన శ్రీ మద్రామాయణ కల్ప వృక్షం 'సర్వశిల్ప భూమి'గా తెలుగుజాతికి లభించింది.

రామాయణ కల్పవృక్షం యుద్ధకాండతోనే సమగ్రమయింది. కావలసిందిగూడా ఆవిధంగానే. వాల్మీకావతారికా సర్గల్లో——"రఘువర చరితం మునిప్రణీతం, దశశిరసశ్చ వధం నిశామయధ్వం" అనీ, "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్" (బాల. 2–43, 4–7) అనీ చెప్పబడింది. నిజానికిది రఘువర చరితమా? సీతామహాచ్చరితమా? నిజానికా 'చరిత'లు రెండు కావు——ఒకటే రెండుగా భాసించినా ఒకరు లేకుండా మరోటనిపించే చరితలేదు; కారణం సీతారాములు అభిన్నులు కావటమే ఇద్దరూ ఒకే వెలుగు

"ఇరువురము నొక్క వెలుగున
చెరి సగమును, దీని నెఱుఁగు శివు డొకరుండే,
పురుషుడ వీ వై తివి, నే
గరితనుగా నై తి............"

(యుద్ధ. ఉపసంహారణ. 176)

అగ్నిప్రవేశం చేయబోతూ కల్పవృక్ష సీత చెప్పిన చివరి రహస్యమిది కల్పవృక్షావతారికలో "కృత్స్నము రామ మహత్తు" శివు డెరుంగునని చెప్పిన అంశం ఇక్కడి అంశాన్ని స్పృశిస్తున్నది. ఈ విధంగా "పాలితాన్యోన్య లంఘన స్పర్థము" లయిన అంశాలు అనేకం కాగా శివు డెరింగిన ఆ కృత్స్నత——సమగ్రత ఇది అయితే ఒకేవెలుగు స్త్రీ-పుం రూపంగా

వివర్తమానం కావట మెందుకు? రావణ వధార్థం ఉదాహృత వాల్మీకి వాక్యాల్లో రఘువరచరిత మన్నప్పుడు, సీతామహాచ్చరిత మన్నప్పుడు కూడా వెనువెంటనే తప్పనిసరి అంశంగా, ఫలభూతంగా చెప్పబడింది దశశిరస్క-పౌలస్త్యవధ ఆ దశశిరస్కుడు, పౌలస్త్యుడు భిన్నులు కారు. రఘువరుడు, సీత కూడా కారు "రమ్" అన్న ధాతువునుంచి సుబంత పదం పుంలింగ రూపంలో నిష్పన్నమయితే "రామ" అని, స్త్రీ లింగ రూపంలో నిష్పన్నమయితే "రామా" అని ఒకే వెలుగు ద్విధాపరిణతమయినట్లు, ఒకే మూలధాతువు ఈ రూపద్వయిగా పరిణతమయింది ఒకటి పురుష రూపం, ఒకటి గరితరూపం అందుకనే తత్త్వతః అభేదం ఈ కారణంగానే వాల్మీకం రఘువరచరితంగానీ, సీతా మహాచ్చరితంగానీ కాక, "రామాయణ" మయింది తాత్త్వికాభేదాన్ని రామాయణం గర్భీకరించుకుంది. "కావ్యం రామాయణం కృత్స్నం" అంటే ఆ కృత్స్నత ఇది ఈ కృత్స్న మయిన రామాయణానికి ఫలం రాముడు సీతను పునర్లభించుకోవటం కాదు ఈ అంశం కల్పవృక్ష రావణునికి అర్థమయింది. అందుకనే—

> "సీతం గోంచును బోవ నీతడిట వచ్చెన్నాగ వ్యాజంబు, వి
> ఖ్యాతిన్ దానవవంశనాశనము కార్యంబి శివాద్వైతికిన్
> సీతం గైకొని పోవ వేవిధములం జేయంగ వచ్చున్, మహో
> ద్వైతేయోన్మథనంబు ముఖ్యము సముద్రాంభోవ్యధా
> కారికిన్"

(యుద్ధ. నిస్సం. 64) అనుకుంటాడు. అట్లాగే, సీతను వదిలి పుత్రులను పొందటంగూడా కాదు. ఇవన్నీ ఆనుషంగికమయినవి అసలు ఫలం దశశిరస్కుడు పౌలస్త్యుడు అయిన రావణునివధ దశశిరస్కత మానవ సృష్టిలోని ప్రకృతి వైపరీత్యానికి ప్రతీక, పౌలస్త్యత్వం మానవుని ఉదాత్త స్థాయికి సూచిక ఆస్థాయిలో ఈవైపరీత్యం సృష్టివ్యవస్థా భంజకం. ఆ భంజికమయినదాన్ని ఉన్మూలించటం సృష్టియొక్క సుస్థితికి అభీష్టం. ఈసుస్థితిని రక్షించుట ఆదిమమహస్సులోని వైష్ణవీయతాలక్షణం కాబట్టి రావణవధ రామాయణఫలం. ఈవిధంగా యుద్ధకాండతోనే రామాయణసమగ్రత.

ఇదిట్లాఉండగా, వాల్మీకం కరుణరసప్రధాన కావ్యమని నిరూపించ టానికి ఆనందవర్ధనాదులయిన సాహిత్య శాస్త్రవేత్తలు పూర్వులుకొందరు తార్కికంగా ఎంతప్రయత్నించినా, ఆ అంశాన్నే శుకానువాదంగా పలువు రంటున్నా రామాయణం మాత్రం దానికి ఆనుకూల్యం చూపటంలేదు. పూర్వులనేకులు దాన్ని శాంతరస ప్రధానంగానే భావించినారు. ఈ అంశాన్ని కుంతకుడు, ఆనందవర్ధనుని తరువాతి మహాలంకారికుడు, "రామాయణ మహాభారతయోశ్చ శాంతరసాంగిత్వం పూర్వసూరిభిరేవ నిరూపితం" (వక్రోక్తిజీవితం, చతుర్థోన్మేషం) అని నిర్ద్వంద్వంగా ప్రకటించినాడు. రామాయణోపాసకులయిన సత్యనారాయణగారి గాఢమయిన ఆలోచన కూడా ఈనిర్ణయానికే వచ్చింది శాంతరసాంగిత్వమనేది సత్కథాత్వ నిరూపకం సత్పదార్థానుభవానుకూలం. అందువల్లనే రామాయణ కల్పవృక్షం ఇష్టిఖండంతో ఆరంభమయి ఉపసంహారణ ఖండంతో పూర్తయింది. ఇష్టి యజ్ఞం క్రియా కలాపవిస్తృతిని సూచించగా, తదుపశమనం ఉపసంహారణ కాండంతో నిరూపిత మయింది. కావ్యంలో ఆద్యంతమూ ఈ శమ లక్షణం పునఃపున రనుసంధీయమానమై అనుభవదశ నందుకుంటుంది. "ఆత్మ నిత్యమ్మకాలాద్యవచ్ఛిన్న..." మిత్యాదిగా కథారంభంకాగా యుద్ధకాండాంతంలో రాముని బ్రహ్మవస్తువుగా దర్శించటంతో కల్ప వృక్షం సమగ్రమయింది. ఇంకా ముందువెనుకలుగాచూస్తే విశ్వేశ్వరమయిన వెలుగుతో ఆరంభమయి మంగళమహాశ్రీతో సమాప్తమయిందీ మహా కావ్యం. ఇదంతా రసనిర్వహణ శిల్పానికి సంబంధించిన వ్యవహారం. కాగా, రామాయణ కల్పవృక్ష రచనాప్రణాళిక ననుసరించి దానికి సమగ్రత యుద్ధకాండతోనే,

బాలకాండాదినుంచి యుద్ధకాండాంతం వరకూ "పాలితానోన్యా లంఘన స్పర్థములును, చాలితానోన్యా సౌందర్య సరసములును—"(బాల. అవతారిక. 25) అయిన అనేకాంశాలతో, అనంతలక్షణాలతో రామాయణ కల్పవృక్షం సర్వశిల్పభూమి. ఒక్కొక్క అంశం మరొక్కొక్క అంశాన్ని మించిపోవటంలో పోటీ పడుతుంది ఒక్కొక్క అంశం మరొక్కొక్క అంశాన్ని కదిలించి తత్ సౌందర్యాన్ని సరసం చేస్తుంది. ఇట్లాంటి శిల్పాంశాలు అనేకం.

"ఒక మహాశిల్పి యగుటకు నొక్క వేయి
లక్షణములుండు, నే రెండు లక్షణములొ
యమరియుండిన, వాడు తనంత శిల్పి
సృష్టిలో లే డటంచు గర్వించు చుండు"
(యుద్ధ. నిస్సం. 122)

అయితే, ఇది అల్పప్రతిభుల లక్షణం భామహు డన్నట్లు, నిజానికి కవిప్రతిభలోనుంచి కావ్యం ఆవిర్భవిస్తుంది కావ్యంతో అవినాభావంగల శిల్పమూ ఐకకాలికంగా దానితో ఆవిష్కృతమవుతుంది. ప్రతిభలో లక్ష అంతరాలు, కావ్యాన్ని శిల్పీకరించడంలోనూ అన్నన్ని అంతరాలు అల్ప ప్రతిభ ఏ ఒకటి రెండు శిల్పరీతులకో మాత్రమే పరిమితం కాని, అద్భుత మయిన భావనాశక్తి, అనల్పమయిన వ్యుత్పన్నతా, ఆశ్చర్యకరమైన రచనాశక్తి, పటిష్ఠమైన నిర్మాణ మార్మికతా, అనంతమయిన లోకజ్ఞతా, అకలుషితమయిన ఆర్ద్రతా—ఇవన్నీ అవినాభావంగా ఏకీభవించిన గాఢ మయిన మహాప్రతిభ—నన్నెచోడ డన్నట్లు "అనూన ప్రతిభార్ణవం"—నుంచి కావ్యశిల్పం అనంత ముఖాలుగా, ఆదిత్య కిరణాలుగా జీవంతమై వికసిస్తుంది, విస్తరిస్తుంది ఇతరత్ర అలభ్యమై, ఇంతటి అభివ్యాపనశీల మయిన కావ్యశిల్పవైభవం అనితరసాధ్యంగా ఇన్నేళ్ళకు రామాయణ కల్పవృక్షంలో దర్శనమిస్తుంది. కాగా, రామాయణకల్పవృక్షం "ఏక మొత్తం"గా దర్శనీయం. అయితే ఒక కాండను పరిచ్ఛిన్నంగా గ్రహించి, అందలి శిల్పరేఖలను సూచనామాత్రంగా దర్శించడానికి ఇక్కడ చేసే యత్నం తదఖండతాదర్శనప్రవణతకు పర్యుత్సుకతా హేతువుగామాత్రమే. అందుకనిదే ఇది యుద్ధకాండ శిల్పావతారిక.

యుద్ధకాండ అయిదుఖండాలుగా విభజింపబడింది. ప్రతికాండను అయిదేసి ఖండాలుగా విభజించటమనేది రామాయణ కల్పవృక్ష రచనా ప్రణాళికకు సంబంధించిన అంశం ఆ కాండలోని కథాభాగాన్ని అయిదు ఖండాలుగా విభజించి, ఆయా ఖండాలలోని విషయానికి పరమార్థభూత మయిన అంశాన్నిబట్టి వాటిని సంకేతించటం నిర్మాణశిల్పంలోని ఒక ప్రధాన

రేఖ. అయితే, ఒక కాండను అయిదు ఖండాలుగానే విభజించట మెందుకు ? అసలు రామాయణమే ఆరు ఖండాలుగా రూపొందట మెందుకు ? విచారించితే, ఇవన్నీ ప్రతీకాత్మకమయిన అంశాలు. ఆజ్ఞాదిషట్చక్రాలసంఖ్యకు ఈ కాండ సంఖ్య ప్రతీక. ఈ షట్చక్ర ప్రతీకగానే షట్చక్ర సీతారామ సాలగ్రామం ఉంది ఈ కాండసంఖ్యాప్రతీకాత్మకతను గుర్తించి, ఒక్కొక్క కాండను అన్నమయాది పంచకోశాలకు ప్రతీకగా అయిదేసి ఖండాలలో విభజించటం జరిగింది ఇదంతా ఉపాసనామార్గంలో యౌగిక ప్రతీకాత్మకంగా సాగిన నిర్మాణమార్మికత రామాయణం యోగ మంత్రాది శాస్త్రాలకు ఖని. రామాయణమే ఒక మహామాలామంత్ర మని భారతీయ సంప్రదాయం ఈ సాంప్రదాయికత రామాయణ కల్పవృక్షంలో సమభివ్యాప్తమైంది. అందువల్ల కాండ లారు, ఖండా లయిదు ఇట్లా కాకపోతే ఈ విభజనకు సామంజస్యం కుదురదు ఈ విభజన యాదృచ్ఛికం కావచ్చు ననటం అవిచారిత రమణీయం మాత్రమే. విజ్ఞ శిల్పి ప్రయోజన విరహితంగా, అర్థరహితంగా ఏదీ చేయడు సప్రయోజకతకు నిలిస్తేనే అది శిల్పం కావ్యంలో శిల్పమంటే ఏమిటో, దాని మౌలికలక్షణ మేమిటో ఇప్పటివరకు నిర్ద్వంద్వంగా నిర్వచించింది సత్యనారాయణగారే. '— శిల్పముయొక్క ప్రధానలక్షణము ప్రయోజన సహితత్వము, అధికార్థ సంగ్రహణము, పాఠకుని గాఢభావనాశీలుని చేయునది—' (శాకుంతలము యొక్క అభిజ్ఞానత పు 10) కాగా ప్రయోజనవంతం కావటమనేది శిల్పానికి ప్రాథమిక మయిన అంశం ప్రయోజన విరహితమయింది మరేదయినా కావచ్చునేమోకాని, శిల్పం మాత్రం కాదు. కవి తాను గాఢంగా భావించి, అనుశీలనం చేసి, పొందిన అనుభవవిశేషాన్ని, తద్విశేషస్ఫోరకంగా ప్రయోజనవంతమూ, అధికార్థ సంగ్రహణశీలమూ అయిన రచన ద్వారా సహృదయునిలో కలిగేవిధంగా అతనితో అనుశీలింపజేసి, తద్వారా అతనిని ఉత్సాహాలలో విహరింపజేయడానికి కవిపరమయిన వ్యాపార విశేషం కావ్యశిల్పం ఈ శిల్పలక్షణం కావ్యగత సర్వాంశాలకూ వర్తిస్తుంది. అందుకనే ప్రత్యంశాన్నీ విడివిడిగా—పద్యశిల్పం, ఛందశ్శిల్పం అలంకారశిల్పం, గ్రథన శిల్పం, నిర్మాణ శిల్పం. రస శిల్పం— ఇత్యాదిగా

శిల్పపదానుసంధానంతో వ్యవహరించటం అయితే ఇవన్నీ శిల్పంయొక్క పరిచ్ఛిన్న స్వరూపాలు. వీటి అన్నింటి సంగ్రథనంలోని ఏకీకృతసౌందర్యమే సమగ్రమయిన కావ్యశిల్పం కాగా కావ్యంలో ఖండవిభజన మొదలుకొని కావ్యనిర్మాణశిల్పం అభివ్యాప్తమై ఉంటుంది

ప్రతికాండనూ ఖండాలుగా విభజించటంలో ఏ కాండ కాకాండకు ఒక్కొక్క విషయం పీఠికగా ఉంటుంది ఉదాహరణకు సుందరకాండలో ఖండవిభజనకు కాలం పీఠిక. యుద్ధకాండంలో రావణుని మనస్సంక్షోభం పీఠిక ఈ పీఠికవలననే, యుద్ధకాండలో మొదటిది "సంశయ" ఖండం రావణునికి రాముని విషయంలో కలిగిందీ సంశయం. కలుగటానికి కారణం రావణునిలోని తామసికాహంకారపు ప్రవృత్తి లోకాన్ని అనంతవిధాలుగా ప్రతారించే అజ్ఞానమూలమయిన అహంకార విలసనం రావణునిలో వికసించింది అది తామసికంగా పర్యవసించింది ఇది రావణునిలోని మూల ప్రవృత్తి బాలకాండలో ఇంద్రాదులు శ్రీమన్నారాయణునికి చెప్పుకొన్న గోడులో అభివ్యక్తమయిన ఈ అంశం, అరణ్యకాండలో అతడు—రావణుడు ప్రవేశించినప్పటినుండి యుద్ధకాండలో నిధనపర్యంతం తీసుకున్న చిత్రవిచిత్రమయిన, విషాదవలయితమయిన మలుపులను రామాయణ కల్పవృక్షం కథనశిల్పానేకమార్గాలలో అభివ్యంజిస్తుంది.

అయితే, రావణుడు సామాన్యుడేమీ కాడు. 'వీర శ్రేణి కిరీట నీలమణి దేవీ దక్షిణామ్నాయ విద్యారాజీవభవుండు...ఖడ్గ రావణ మహామంత్రాధి దైవంబు...' (యుద్ధ. నిస్సం. 296) 'పది కంఠములు పదిపదిసార్లు శివునకు వెగటుగా నారగింపించిన' వీర మహాభక్తుడు. 'సకలత్రయీశబ్ద సంఖ్యా పరిజ్ఞాన దీపమ్ము లోకాన తెచ్చి'న మహాపండితుడు. (యుద్ధ. ని 85) సహస్రసమల్ తపస్సున బ్రహ్మను మెప్పించిన మహాతపస్వి. 'బాహాసంపాదిత నాకలోక జయ కీర్త్యగ్రీయుడు'. దేవ్యుపాసకుడు కాని, ఇంతటి మహావైభవానికి తోకచుక్కగా పొడిచింది తమోగుణం 'ఇతడు గాని మోహ కూలంకష వృ। త్తిని మాని సాధు ధర్మా । ధ్వనీనుడయి యున్న నెంతవాడయి యుండున్' (సుందర. దివా. 284) అని రావణుని

చూచి ఆంజనేయు డనుకున్నాడు- 'తామసికంబు భక్తి ఫలితంబగు దుష్టము సత్పదార్థ రే । శామలమార్గభిన్నమయి యైహిక సంఘటించు'ట మాత్రమే చేయుననీ, 'పరమ సత్త్వ గుణాఢ్యుడు ప్రభువు రాఘు । వుండు నీ తమః ప్రకృతి సంభూత మహిమ । లచట నిసుమంత పనిచేయవు...' (అరణ్య జటాయు 387,8) అనీ రావణు డపహరింపగా లంకకు వచ్చిన సీత అతని కీ అంశం మొదట్లోనే స్పష్టం చేస్తుంది. '—అహంకార కై । తవ మార్గం బిది భక్తియా నొకో, సముద్యత్కామదుర్వృత్తియా' (386) అని అతని భక్త్యహంకార స్వరూపాన్ని బయట పెడుతుంది. సీత మాత్రమే కాదు, 'నీ కాయుస్సున స్వస్తియా శివునకున్ నీరేజపత్త్రాక్షుడౌ । నా కాకుత్స్థునకున్ విభేదమును జేయంబోకు...' (సుందర దివా 293) అని ఆంజనేయుడు ఉద్బోధిస్తాడు అయితే, రావణుని తామసికాహంకారం ఈ యాథార్థ్యాన్ని గుర్తించకుండా అడ్డుపడింది రాముడు కేవలం మహా పరాక్రము డనుకున్నాడు, అంతే అందుకే, '—ధనుష్కాండోర్జితాంభోదమ । ర్యాదా భీకరమూర్తి క్రమ్మనొ సముద్రాల్నాలుగాకాశముల్ । కాదంభోనిధి యీది వచ్చు, మఱి లంకం గూడ జొచ్చున్, మనీషా దారిద్ర్యపయోధి వాడొకడె యీ ఙ్మా( జాపి, లే రెవ్వరున్' (అరణ్య మారీచ 155) అని తన నుద్బోధించిన మారీచుని వెక్కిరిస్తాడు కాని, నిజంగా రాముడు సముద్రం దాటినాడు కపిసేనతో లంకా కోట్ట బహిః ప్రదేశంలో విడిసినాడు వెక్కిరింతే నిజమయింది రావణుని మనోభూమిలో సంశయబీజం పడింది. శివుడు హంసగా సీతారామచంద్రుల నడుమ దౌత్యం నెరపటం (యుద్ధ. సంశయ.)తో అది మొలకెత్తుతుంది. ఇంద్రజిత్ప్రయుక్త సర్పబంధాలను రాముడు దులుచుకోవటంతో కొనలు వారింది. ఎవ డీ రాముడు ? శివుడికీ వీడికీ ఏమి సంబంధం ?

నాకంబెన్ మునుపైన భక్తుఁడటె యీ నాళీకబంధ్వన్వయుం
డా కొన్నాడు శివుండు దంపతుల మధ్యన్ వార్త లందింపఁగా
ఙ్మా క న్యాపతి యింతదాఁకను బహిశ్శత్రుండె యీనాటి, కిం
దాకన్ వచ్చినయంతఁ గన్పడియె నంతశ్శత్రుతాస్థానమై.

(యుద్ధ, సంశయ. 102)

అనుకొంటాడు. ఇదొక విచిత్రమైన మనస్తత్త్వం. తనకంటే శివుడికి మరొక ముందరి భక్తుడు ఉండకూడదా! ఉంటే, వాడికి శివుడు సహాయపడితే, ఆ భక్తుడు తనకు అంతశ్శత్రువా? అతడి భార్య నెత్తుకువచ్చి తానతన్ని బహిశ్శత్రువును మాత్రమే చేసుకుంటే, వాడు తనకన్న శివునకు మునుపైన భక్తుడై తనతో అంతశ్శత్రుత్వం క్రొత్తగా నెలకొల్పినాడు. ఇది తామసికాహంకార ప్రేరితమయిన వక్రత్వం. తాను శత్రుత్వాన్ని కావాలని పెంచుకుంటున్నాడు. ఈ పెంచుకోవటంలో రాముడు శ్రీమన్నారాయణుడా? కేవలం తనను వధించటానికే వన్నిన పన్నాగమా ఇదంతా? వాడి లెక్కేమిటి! '—ఆ రాముడొక దేవతాంశమ్మటందురే, నసలుకు దికులే దంశకున్నె—' (అరణ్య. జటాయు 66) అనుకొన్న తనకీ నాటికీ సంశయం కలిగింది. ఇప్పటివరకు కలుగందిప్పుడు కలిగింది. ఈ కలిగిన సంశయాన్ని నివర్తింపజేసుకోవటంలో రావణుని మనస్సంక్షోభం, దాని నివృత్తికై అతనియత్నపరంపర యుద్ధకాండకు కల్పవృక్షంలో ఆధారశిల. దానిపై ఖండవిభజన, అందుచనే మొదటిది 'సంశయ' ఖండం. సంశయ నివృత్తికి రావణుడు కుంభకర్ణునీ, ఇంద్రజిత్తునూ బలిపెట్టినాడు. ఇంద్రజిత్తును యుద్ధానికి పంపుతూ, 'నిను బంపింపఁగ వద్దటంచుఁగలదున్, నీ వేగి యా సంశయంబును దీర్పఁగలవన్న యాశ గలదున్...' (యుద్ధ. ఇంద్రజిత్ 122) అంటాడు. కుంభకర్ణుని పంపటానికి ముందు—'ఒక్క యా ప్రశ్న యట్టులే యున్న, దితడు। నన్వధించుటకాయటన్నది, యదింత। సంశయ గ్రస్తమైన, దాసంశయంబు। వీడు సమసిన నా విర్భవింపఁబోద' (యుద్ధ. కుంభ. 166) అనుకుంటాడు. అయితే, ఎప్పటికప్పుడా సంశయం తీరుతూనే ఉంటుంది కాని, తీరినట్టుగా రావణు డంగీకరించటానికి నిరాకరిస్తుంటాడు. తన ఆలోచనా వక్రత్వంతో అన్నిటి కన్ని కారణాలు కల్పించుకొంటుంటాడు. తన కంగీకరించటం ఇష్టంలేని తత్త్వాన్ని— అది సత్యమయినప్పటికీ కాదని నిర్ధారించుకొని సమాధానపడటానికి అనుకూలంగా కారణాలను కల్పించుకుంటూ తత్త్వాన్ని నిరాకరించటానికి సాగే ఒకానొక ఆలోచనా వక్రత్వాన్ని వరించే వికృతమయిన మనస్తత్త్వం రావణుని తామసికాహంకార ప్రవృత్తి మూలకంగా కనిపిస్తుంది. అయితే, కుంభ

కర్ణుని మరణంతో ఈ ఆలోచనారీతి బీటలు వారుతుంది. ఇంద్రజిన్మరణంతో శైథిల్యం పొందుతుంది. సంశయం మాపు పట్టి, సత్త్వం మసక మసకగా రూపగపడుతుంది. చివరకు తానుగా ఖడ్గరావణ మహామంత్రాధిదైవతంగా విజృంభిస్తాడు. ఆ విజృంభణను రాముడు పట్టుకుంటాడు. అప్పుడు రావణుని సంశయం పూర్తిగా తీరిపోతుంది.

> "...............................సూ్యతభావనా
> తతముగ దేవియే యితడు తానగు, నన్ను వధింప బ్రహ్మ సం
> గతమగు దీప్తికాం దొలిపికారమునందలి తేజమౌచు, న
> మ్యతుడును దాను దేవియుం ద్రిశూలియునందరు నైనచోటునన్"
>
> (యుద్ధ నిస్సం 384)

అనుకుంటాడు రామప్రయుక్త బ్రహ్మాస్త్రంతో వధింపబడతాడు. సంశయం తీరటం—నిస్సంశయం కావటం—అంటే, తామసికాహంకారం నశించటం—రావణుడు లేకపోవటం—ఇవన్నీ ఏకకాలికాలు కాగా, రావణవధ జరిగిన ఖండం "నిస్సంశయ" ఖండమయింది. వ్యంగ్యమర్యాదాసహంగా ఈ ఖండాలు సంకేతితమయినయి. ఈ రెండు ఖండాల నడిమిపి కుంభకర్ణ-ఇంద్రజిత్ ఖండాలు కావలసిన కార్యం నిర్వృత్తం కావటంతో ఉపసంహృతి జరిగింది. కాగా, చివరిది—అయిదవది "ఉపసంహారణ" ఖండం.

ఒకవిధంగా చూస్తే, రామచంద్రుడిని రావణవధార్థం ఒక అస్త్రంగా—అంటే, రామాస్త్రాన్ని అయోధ్యనుంచి ప్రయోగించింది కైకేయి. అట్లా ప్రయుక్తమయిన రామాస్త్రం కార్యనిర్వాహణానంతరం తిరిగి అయోధ్యకు ఉపసంహృతమయింది. కాగా, అయోధ్యకు శ్రీరాముడు తిరిగివచ్చిన చివరి ఖండం "ఉపసంహారణ". ఈ విధంగా రామగాథ అంతా కైకేయీ సముపజ్ఞం. ఈ అంశాన్ని భరతుడే గుర్తించినాడు. భరద్వాజాశ్రమంలో ఉండి రామచంద్రుడు నందిగ్రామంలో ఉన్న భరతుడి వద్దకు తన రాకను చెల్పుమనగా వచ్చిన ఆంజనేయుడు చెప్పినదంతా విని—"భరతుడు లోచన

స్ఫురిత బాష్పనవాంబుకణాభిరాముడై । పరమ కపీ!—" అని ఆంజ నేయుని సంబోధించి—

"కైకేయీ సముపజ్ఞ మియ్యది జగత్కల్యాణ గాథా ప్రవా
హాకారంబయి పొల్చు రామకథ, యాహా! నీవు నీవంచు, ని
ర్భీకుల్ వారలు వారలంచును నిరూపింపంబడెన్ ధాత్రికిన్—"

(యుద్ధ. ఉప 343)

అంటాడు అప్పటికిగాని కైకేయీ ప్రవృత్తిలోని ఆంతర్యం భరతుడికి అవగతం కాలేదు. పైపైన చూస్తే ఎవరెవరో కారణంగా అనిపించవచ్చు గాని, తత్త్వతః రామగాథ కైకేయీ సముపజ్ఞం. రావణ వధానంతరం అగ్నిలో ప్రవేశించబోతూ సీత అనేకాంశాలను సువ్యక్తంచేస్తూ—

"————కైక కోరక మహాప్రభు ! నీ వని రాక లేదు, నీ
యాడది సీత కోరక మహాసురసంహరణంబు లేద, యా
యాడది లేక లేద జగమంచు, నిదంతయు నేన చేసితిన్"

(యుద్ధ. ఉప. 154)

అంటుంది. "సీతాయాశ్చరితం మహత్" అని అనకుండా ఉండలేకపోవటం ఇందువల్లనే. రాముడు శుద్ధ తత్త్వస్వరూపం. ఆయన క్రియాప్రవృత్తిని స్పందింపచేసింది కైకేయి. ఆ స్పందనను ఫలవంతం చేసింది సీత అందుకే తిరిగి అయోధ్యకు వచ్చినాక కలుసుకొన్నప్పుడు—

"కైకేయి సీతఁ గౌఁగిటికిఁ గైకొని-'ఓసి యనుంగ ! నీవుగాఁ
గైకొని యీవనీచయనికామనివాసభరంబిదెల్ల నున్
లోకము నన్ను తిట్టుట తలోదరి ! మార్చితి, కైక పంపెనే
గాక దశాననాదివధ కల్గునె యన్న ప్రసంశలోనికిన్"

(యుద్ధ. ఉప. 373)

అంటుంది కార్య సాఫల్యం విషయికంగా అంతర్మథనం పొందిన లక్షణం కైక మాటల్లోనూ, నిశ్చయాత్మకత సీతమాటల్లోనూ వ్యక్తమై వారి వ్యక్తిత్వాలను సువ్యక్తం చేస్తుంది కాగా ఈచరితమంతా కైకేయీ సముపజ్ఞమనటం కల్పవృక్షోపజ్ఞం. రామాయణం 'సీతాయాశ్చరితం మహత్' అన్నదానికి "కైకేయీ సముపజ్ఞ" మనటం తోడుమాట బాలకాండ నుండి తన అస్త్రాన్ని సుసంపన్నం చేసి, అయోధ్యకాండలోనుండి ప్రయోగించి, నిష్క్రమించి, అరణ్యకాండలో కనిపించి, మళ్ళీ యుద్ధకాండలో తన ప్రయోగసాఫల్యంతో ప్రవేశించేదాకా, ఈమధ్యకాలంలో కైకేయీ ప్రసంగం అనుస్యూతిస్తూనే సాగటం పాత్రప్రకాశన శిల్పరేఖ ప్రధానంగా యుద్ధసందర్భంలో కైకేయీ ప్రసంగం విజ్ఞశిల్పం సనచేతి వింటిని ఖరుడు ఖండిస్తే, శ్రీరాముడు అగస్త్యదత్తేంద్రచాపంబుపూని-'ఓయీ! వానికిన్ వానికిన్! నీవుం గార్ముక దక్షుడౌదు, నగిషీల్నేర్తివు చేయన్, ధనుర్! జ్యావల్లీకృత చిత్రకర్షణ నినీషన్ గైకయీదేవి వి। ద్యావిష్కారము నీవెఱుంగవుసుమీ—" (అరణ్య. పంచవటి 431) అని ఎరింగించి సగ్గోలు పరుస్తాడు, వధిస్తాడు రావణుడు సౌరాస్త్రం ప్రయోగిస్తే, దాన్నుంచి ప్రభవించిన సూక్ష్మసూక్ష్మ చక్రాలను రామచంద్రుడు '-కైకేయి నేర్పిన కార్ముక శ్లక్ష్ణ విద్యాప్రభావంబున వమ్ముచేసె' (యు ని 220) దానితో "బమ్మెరవోయి రావణుడు బ్రహ్మయుఁ జేయగ జాల డీపనిన్... చేత చక్రమ్ము గలాడు చేయవలెగాని—" (221) అనుకుంటాడు "అప్పుడు రామచంద్రుగన, నాయన చేతిధనుస్సు చక్రమై। యొప్పెను, శీఘ్రశీఘ్రముల నుగ్రశరంబుల నేయువేడిలో। ద్రిప్పుచు ద్రిప్పుచున్ విలు ధరింపగ, నద్దియె నాల్గు బాహులై। కొప్పును శంఖమై విరిసికోల్వహియించె గనుల్ భ్రమింపఁగన్" (222) అంటే కైకేయీ విద్యావిష్కారం ద్వారా శ్రీమన్నారాయణావతార స్ఫూర్తి వ్యక్తమయిందని తాత్పర్యం. తనకై రథం తెచ్చిన మాతలికి "-కైకయి చెప్పినట్టి గతులుంగా, జెప్పి రాముండు తోలించెం బండిని" (యు ని. 288) కైకేయీ సముపజ్ఞమన్న దానికి బెసగుదల లేకుండా ఆద్యంత మీవిధమైన నిర్వహణపటిష్ఠమయిన నిర్మాణమార్మికత గల శిల్పరీతి కాగా, రామాయణ కల్పవృక్షంలో కైకేయీ ప్రయోగం

ఇంత శిల్పమహిత మయింది. సువ్యవస్థితమయింది వాల్మీకేతర సర్వరామ గాథా కావ్యాల్లో ప్రమృష్టమయిన కైకేయీతత్త్వం రామాయణ కల్ప వృక్షశాఖలపై సుపుష్పితమయింది సామోదమయింది వాల్మీకాన్ని ఉపాసించిన లోకజ్ఞతగల సత్యనారాయణగారు వివిధపాత్రలను తీర్చిన తీర్పులోని శిల్పవైభవం నాన్యతోదర్శనీయం. ఏపాత్రకాపాత్ర స్వరూపం తత్తద్బీజవలక్షణ వ్యాఖ్యానాత్మకంగా జీవంతమై కల్పవృక్షంలో దర్శన మిస్తుంది. యుద్ధకాండలో రావణుని తీరు ఒక మహావిషాదాంత గాథా నాయకత్వం వహించినట్లు కన్పిస్తుంది ఉజ్వలమైన వ్యక్తిత్వం కలిగికూడా స్వకృతమయిన పొరపాటు హేతువుగా క్రమంగా వినాశోన్ముఖుంకావటం, అదీ తెలిసి తెలిసి ఈవిధమైన తీర్పు విచిత్రమైంది. కాగా, కైకేయిచే రామాస్త్రం ఉపసంహృతమయి, శమితాసుర్యం కావటం మూలాన యుద్ధకాండకే కాక, రామాయణానికే సమాపకమయింది "ఉపసంహారణ" ఖండం.

రూపకాలలో నాందీ పద్యాదులందు రూపకగత ప్రధానాంశాన్ని ఏదోవిధంగా స్ఫురింపజేయట మనేది నాటకీయ శిల్పమర్యాద. ఇది శ్రవ్య కావ్యాలకు కూడా అనువర్తిస్తుంది కాని, పాటించవలసిన శిల్పదృష్టి గల వారే ఇద్దరు ముగ్గురో! రామాయణ కల్పవృక్ష కావ్యాది పద్యంలో ఈ శిల్ప మర్యాద పాటింపబడింది అయితే, అంతటితో మాత్రమే అది ఆగి పోలేదు యుద్ధకాండలో ప్రతిఖండాద్యపద్యమూ నాందీ పద్యంమాదిరి గానే నిర్వహింపబడింది. ఖండగత ప్రధానాంశం స్ఫురింప జేయబడింది. మొదటిదైన సంశయఖండంలో శివుడు హంసాకారుడై సీతారామచంద్రుల మధ్య దౌత్యంనెరపటం ప్రధానాంశం రావణునిలో సంశయాన్ని ఉద్బుద్ధం చేసిం దిదే. కాగా, ఈ హంస విషయ స్ఫోరకంగా సంశయఖండాదిలో —"శ్రీకనక కాంతివక్షా! ప్రాకట రాజత శుభాంగ! బ్రహ్మ పదార్థ వ్యాకృతభూతతనూ! హంసాకారా! పరమహంస!..." అని పరమే శ్వరుడు సంబోధింపబడినాడు. కుంభకర్ణుని వ్యక్తిత్వం యుద్ధకాండలోనే పరిస్ఫుటమయింది. అతనిలో సూక్ష్మమైన తత్త్వ విచార లక్షణం ఉంది. ఆలోచనా నైశిత్యం ఉంది మంత్రులతో, రావణునితో, ఇతరులతో అతడు

మాట్లాడినతీరు ఈ అంశాన్ని పట్టిస్తుంది అతని తీరున కాశ్చర్యపడిన రావణుడు—"...నీ కను లెదుటన పెరిగి నీ శాతనిం గూర్చి తెలియ । రాక్షయేమియు లేద, యొక్క రాచకార్యము పుట్టినంత । నీకు వానికి నెంత దవ్వు, నీది వానిది యూహ వేఱ' (యు కుం 276) అనుకుంటాడు. అయితే, కుంభకర్ణుని ఆకారం పర్వతాభమయింది. ప్రతిచోటా అతడి వర్ణన ఆవిధంగానే ఉంటుంది (ఉదాహరణకు, యు కుం 278) కాగా- "శ్రీపరమ సూక్ష్మ తత్త్వాదీపిత శైలాంతర ప్రతిష్ఠితవిభవా!-" అని కుంభకర్ణఖండాది పద్యంలో శివ సంబోధన ఇంద్రజిత్తు అగ్న్యుపాసకుడు ఇంద్రజిత్ ఖండంలో మరొకసారి లంకాదహనం జరుగుతుంది. ఈఅంశాలకు సూచనంగా ఆ ఖండాదిని-"శ్రీవైశ్వానరరూపా! ధీవిలసదుపర్బుధ సమధికరూపా!-" అని పరమేశ్వర సంబోధన ఇంద్రజిదగ్ని యత్నం ఫలించ లేదనీ "-ఉపర్బుధ సమధిక-" అనటంలో సూచన నిస్సంశయ ఖండంలో రావణుడు తన ఖడ్గరావణమహా మంత్రాధిదైవత స్వరూపంతో విజృంభించటం, దాని అసాఫల్యం, మంత్రాద్యతీత మయిన శ్రీమన్నారాయణ స్వరూపాభివ్యక్తి ప్రధానాంశం. కాగా, "శ్రీమంత్రాది ప్రాప్యా!—నానా మంత్రానభిగమ్య ప్రామాణ్యా మహాంబురాశి! ప్రభు! —" అని పరమేశ్వర స్వరూపాభివ్యంజిక సంబోధనలతో నిస్సంశయ ఖండాదిపద్యం సుసంపన్నమయింది శ్రీవిద్యోపాసన గూడా పరమేశ్వర ప్రాప్త్యుపాయమని సూచన. ఉపసంహరణ ఖండం శాంతస్వరూపాభివ్యంజకమయింది. "-ఐరం మదీయ విమలసరోమూర్తి! దశితాశ్రితజనతార్తి! దీపిత సర్వధర్మకృతి!-" అని ఉపసంహరణ ఖండాద్యపద్యంలోని సంబోధనలు. ఈఅయిదవ ఖండంలోని ఆద్యపద్యంలో సంబోధనలు అయిదే ఉండటం ఒక చిన్ని పద్యభావ సంకలన శిల్పరేఖ ఈవిధమయిన సూచనాశిల్పం అన్యత్ర కష్టలభ్యం

"పాలితానోన్యన్య లంఘన స్పర్థం" గా, "చాలితానోన్యన్య సౌందర్య సరసం"గా కావ్యంలో వివిధాంశాలను సంగతపరచటం కావ్యగ్రథన శిల్పంలోని భాగం. రావణవధానంతరం సీతను పిలిపించిన రాముడు ఆమెను చాలా చాలా మాటలన్నాడుగాని, అగ్నిప్రవేశం చేయుమని అనలేదు.

కాని, సీత అగ్నిప్రవేశమే చేసింది రాముని మాటలకు ఖిన్నురాలయిన సీత ప్రాణపరిత్యాగంచేయదలిస్తే, అగ్నిప్రవేశంద్వారానే చేయనక్కరలేదు మరేవిధంగానైనా చేయవచ్చు ఎందుకు? దానికంగతిఇది- ఇంద్రజిత్తు రామాదులను నాగపాశబద్ధులను చేసిన తరువాత రావణుడు సీతవద్దకు పోయి రామాదులు మరణించినట్లే చెప్పుతాడు సీత విశ్వసించదు త్రిజట యుద్ధరంగానికి పుష్పకంలో వెళ్ళి-రావణుడు సీతావిశ్వాసాని కాశ్చర్య పడుతూ "అతనియందీమెకుగల ప్రత్యయంబు లోతునకు సముద్రములు చాలవు, ఎత్తునకు పర్వతములు చాలవు, వేగమునకు నదులు చాలవు, ఇంత ప్రశ్రయము విశ్లథీకరింప శివుడొక్కడే దయచూడవలెనని" (యు సం 349) వెళ్ళిపోగా-తిరిగి వచ్చిన త్రిజట రామాదుల స్వస్థతచెప్పగా సీత-

"ఇది యొక మ్రొక్కు మ్రొక్కెదన, యెవ్వరు నెప్పుడు గాని మ్రొక్కన
ట్టిది యిది, నేను సామి పొగలెక్కము పెందుముదారు సాక్షిరై
పొదలగ బెండ్లియాడితిమి, మోహనరూపుడు రాఘవుండు నా
పద యిది దాటినం ద్రిదశవంద్యున కాహుతియాదు నగ్నికిన్."

"నాకీయూహ కలిగించిన రావణుని గురువుగా స్వీకరించి యాతనికి నమస్కరించెద-"

(యు. సం. 357,8)

అని మ్రొక్కుకుంటుంది. ఈమెకీ ఊహకలిగించింది రావణుడు రాముడు మరణించినట్లే చెప్పుతూ రావణుడు-"సుదతీ! ఇంక నతండె నీకు బతియంచుం గూరుచుంటేని, దానది యుండెంగద వానివంటి పతిచే నగ్ని ప్రవేశంబు తప్పదు-" [341] అంటాడు "వానినంటి పతిచే-" అంటే, ఆ పతి మరణిస్తే సహగమనరూపంగా అనేకాక, బ్రతికి ఉన్నా ఆపతి [మాటలు] కారణంగా అగ్నిప్రవేశం తప్పదని స్ఫూర్తి ఈఅగ్ని ప్రవేశ ప్రస్తావన సీత కుపశ్రుతి అయింది పతి మాటలు కారణంగానే సీత అగ్ని ప్రవేశంచేసింది రాముఎదుట లక్ష్మణునిచే చితి పేర్పించి, ఆ చితాగ్నిలో

ప్రవేశించింది, ప్రొక్కు తీర్చుకుంది ఈసందర్భంలోనే మరొక చిన్న చమత్కారం విభీషణుడు రాముని ముందుకు తోడ్కొనిరాగా, సీత-

'మత్తగజ మంథర గమనంబున భీతవోలె, విరాగిణివలె, దిరస్కారభావయుతవలె, భర్త్రనురక్తవలె నడుచుచు బ్రవేశించి'నది.

[యు ఉప 119]

రాముని మాటలకు సమాధానం చెప్పిన సీత-

'నిర్భీకవలె, స్వాధీన పతికవలె, బురస్కారభావయుతవలె, మత్తగజమంథరసుందరగమనంబున నగ్నికడకు నడచి యగ్నిం బ్రవేశించి'నది. (179) ఉభయ దశలయందలి భేదాన్ని సీతాప్రవృత్తిలో సంగతింప జేయటానికి మాటలు మార్చి కూర్చటం ఒక రచనా శిల్పరేఖ లంకనుంచి అయోధ్యకు వస్తూ పంచవటిలో ఆగినప్పుడు సీత తాముదినాలకు నివసించిన పర్ణశాలలోకి వెళ్లివస్తుంది. అప్పుడు-

'లోనికి జన్న పృథ్విజ విలోకన లోకజయ ప్రగల్భప్ర
జ్ఞానిధి, సింహయాన, వికసన్నవలోచనపుండరీక,ర
క్షోనివసంబు నందగడు సొచ్చిన శీర్ణతమూప్రబంధసం
ధ్యానవవహ్నికావిరచితాకృతి, యాకృతిమత్ప్రతిజ్ఞయున్'

ఆవిధంగా లోనికి వెళ్ళి-

'వెలికివచ్చు జానకియుఁ జిన్నవయస్సుది, మందయాన,మం
జులతర మూర్తియై యడవిఁ జొచ్చిన యంతిపురంబు కన్య, దే
హలలిత సౌకుమార్యపరమావధి, రాఘవబాహులగ్న య
ల్లలనయి వీచుగాలిఁ గదలాడెడు క్రొంజివురాకుబోడియున్'

[యు. ఉప. 270, 1.]

పంచవటిలోని ఆశ్రమంనుంచి రావణగాథ ప్రకటంగా ప్రారంభం అంతకు ముందరి సీతారీతికి, తరువాతి దానికి, తిరిగి స్వస్థతకు వచ్చిన రీతికి ప్రతీకగా ఇవి చాలితాన్యోన్యలంఘనసౌందర్య సర్గములు ఇక్కడ సీత "ఆకృతిమత్ ప్రతిజ్ఞ" అని మొదటి పద్యంలో రూపించబడింది ఆంజనేయుడు లంకలో మొదటి సారిగా దర్శించినప్పుడు సీత రావణుడు రాగా "కూరుచున్న విధమంతయు స్వామి ప్రతిజ్ఞ మూర్తియై" [సుందర పర రాత్ర. 140] కనిపించింది. ఈవిధమయిన సంవాదాలన్నీ పాలితాన్యోన్య లంఘన స్పర్ధములు. కుంభకర్ణుడు హితం చెప్పితే, కోపం వచ్చిన రావణుడు-

'నిద్దురమత్తు తా వదల లేదది నీవును పోయి నిద్రపో!
మొద్దువిధంబునన్ నిదురపోవుచునుండగ వాడువచ్చి, యా
మొద్దును కాళ్ళుచేతులును, ముక్కలుముక్కలుగాగ వ్రేల్చెదున్'

(యు కుంభ 253)

అంటాడు రామచంద్రుడు కుంభకర్ణుని చేతులూ, కాళ్ళూ ఖండించి, ఆతరువాత శిరచ్ఛేదం చేస్తాడు ఇంత సూక్ష్మరీతిలో వివిధాంశాలు పరస్పరం లంఘనస్పర్ధంగా ఉంటయి.

రామాయణకల్పవృక్షంలోని ఛందశ్శిల్పాన్ని పరిశీలించుకుంటూ పోతే, అదొక పెద్ద గ్రంథం. కేవలం యుద్ధకాండ విషయం పరిశీలించుకున్నా తక్కువేమీ కాదు. పద్యాలను సామాన్య-విశేష భేదంతో స్థూలంగా రెండు వర్గాలుచేయ వచ్చు. ఏదోఒక విశేషాంశస్ఫూర్తి లేకుండా విశేష పద్యం ఉపయోగించటం జరుగదు ఛందశ్శిల్ప విషయంలో ఇదొక సామాన్య సూత్రం నడకనుబట్టి, లేదా పేరునుబట్టి, లేదా స్వరూపాన్ని బట్టి, స్వభావాన్ని బట్టి, రచనా రీతినిబట్టి ఏదోఒక విశేషాన్ని విశేషపద్యం స్ఫురింప జేస్తుంది ఈమార్గంలో కల్పవృక్షంలోని ఛందశ్శిల్పాన్ని పరిశీలించవలసి ఉంటుంది ఉదాహరణకు కుంభకర్ణుని నిద్రమేల్కొలిపే ఘట్టంలో

ప్రయోగించబడిన విశేషవృత్తాలను పరిశీలించవచ్చు రావణునితో శ్రీ రామచంద్రుడు మొట్టమొదటి సారిగా మాటాడిన మాటలు పద్మనాభమన్న విశేషవృత్తంలో ప్రసరించినవి. (యు. కుం భ. 133,4)

పద్మనాభం వైష్ణవీయ లక్షణాన్ని స్ఫురింప జేస్తుంది విశేష పద్య ప్రయోగంలోనే కాదు, సామాన్య పద్య ప్రయోగంలోనూ విజ్ఞశిల్పి ఉద్బుద్ధం చేసే శిల్పరీతి ఆశ్చర్యకరంగా ఉంటుంది ఉదాహరణ కొక సీస పద్యం-

పితృవాక్య పాలనావ్రత నిష్ఠుడవు నీవు
పితృవాక్యపాలనావ్రతుడ నేను
ఏకపత్నీవ్రతాహీనభావుడ వీవు
నేకపత్నీవ్రతాహీను డేను,
వివిధాస్త్ర శస్త్రాది వేత్తృతాఖని వీవు
వివిధాస్త్రశస్త్రాది వేత్త నేను,
అల్పులతో యుద్ధమాడ వింతయు నీవు
నల్పులతో యుద్ధమాడ నేను,
క్షోణిభృత్ప్రమాణుడ నేను, గోణి వెడీవు,
బడలిలక్ష్మిని బాసినవాడ వీవు,
బడలి లక్ష్మిని బాయనివాడ నేను
పోల్కియున్నది మనకును బోల్కి లేదు.

(యుద్ధ. ఇంద్ర. 50)

అతికాయుడు శ్రీరామచంద్రునితో బీరాలాడుతూ తనకూ, అతనికీ పోలికల ఉనికిని, లేమినిచెబుతున్న రీతి ఇది ఉపయుక్తమయింది సీసపద్యం. సీత విషయ మట్లాఉండగా, సీసపద్యంలోని ప్రతిపాదమూ రెండు ఖండాలు. రెండూ గణసంఖ్యలో సమానమే [నాలుగే] అయినా, గణాల స్వరూపాన్ని

బట్టి మొదటి ఖండం పెద్దది, రెండవది చిన్నది. మరొకటి మొదటి ఖండంలో గణాలన్నీ ఒకే (ఇంద్రగణ) జాతివి కాగా, రెండవదానిలో రెండు [ఇంద్ర+సూర్యగణ] జాతులవి అంటే, మొదటి దానిలో సమత్వం. రెండవదానిలో విషమత్వం-ఎగుడు దిగుడు ఉన్నదన్నమాట ఈ అంశాలన్నీ దృష్టిలో ఉంచుకొని ఆపద్యాన్ని చూడవలసి ఉంటుంది. అతికాయుడు, అతికాయుడేగాని, రాముని గూర్చి పెద్దదయిన మొదటి ఖండంలోనూ, తనను గూర్చి రెండవదయిన చిన్న ఖండంలోనూ చెప్పుకుంటాడు ఉత్తర ఖండం ప్రమాణంగానే చిన్నదికాబట్టి, పూర్వఖండంలోకన్నా రెండుమూడక్షరాలూ, వాటిని బట్టిరూపొందిన పదమూ ఉత్తరఖండంలో తగ్గుతుంది ఆతగ్గటంలో రామునికన్నా అతికాయుని తక్కువదనం స్ఫురిస్తుంది తామిద్దరూ పితృవాక్యపాలనావ్రతంకలవారే కాని, రామునిలో ఆవ్రతమందు "నిష్ఠ" అధికం తనలో "నిష్ఠ" లేదు ఏకపత్నీ వ్రతాహీనత్వం ఇరువురిలో ఉన్నా, దాని గూర్చిన భావన తనయందు లేదు. రామునిలో అది అధికం ఇద్దరికీ అస్త్రశస్త్రాది వేత్తృత ఉందికాని, రాముడు దానిఖని, తాను కాదు అది అతని తక్కువదనం రాముడల్పులతో-"ఇంతయు" యుద్ధమాడడు ఆ ఏమాత్రమూ అల్పులతో యుద్ధమాడని నిశ్చయం తనలో లేదు మనమిద్దరం పోలిక కలవారమని చెప్పటం అతికాయుడి ఉద్దేశ్యం కాని అతని కజ్ఞాతంగానే ఆపోలికల్లోనూ పోలికలేనితనం, రాముని ఆధిక్యం, తన తక్కువదనం అభివ్యక్తమయింది తనకు తెలియకనే జరిగిన ఈ అభివ్యక్తి అతికాయునికి స్ఫురించి ఉంటుంది తానేమంటున్నాడు! వెంటనే గీతంలో మారింది తాను ముందుకు వచ్చి మొదటి పాదంలో రాముని చివరకు నెట్టినాడు "క్షోణిభృత్ ప్రమాణుడ" నని పెద్దమాటలతో తనను, గొణదె"డని తేలిక మాటలతో రాముని చెప్పుకొన్నాడు ఏకగణాధిక్యం సంపాదించినాడు. ఎంతసంపాదించినా, అది పై ఆకారంలో మాత్రమే బడసి లక్ష్మిని బాసిన వాడు రాముడనీ, తానుకాడనీ అన్నాడు. రాముడు బడయలేదు యుద్ధంలో రాముని పురోగమనం- ప్రగతి ఆ అంశాన్ని స్పష్టం చేయగా, అతికాయుడు గమనించలేకపోతున్నాడు. రాముడు లక్ష్మిని బాసినవాడు

కూడా కాదు. పొందుతున్నవాడు మూడగా పోలికలిద్దరికి లేనేలేవు ఉన్న వనుకోవటం వాడి అహంకార మూలకమయిన అజ్ఞానానికి చిహ్నం. ఇంతా చేస్తే అతికాయుడితో రాముడు యుద్ధం చేయడు వాడలుపుడు వాడిమరణం లక్ష్మణుని చేతిలో వ్రాసిపెట్టి ఉంది అది చమత్కారం. సామాన్యమనిపించే సీ పద్యాన్ని, ఆసందర్భంలో పూర్వోత్తరాంశాంవాద కంగా, మనస్తత్వసూచకంగా శిల్పమహితం చేయటం విజ్ఞశిల్పి లక్షణం కాగా, ఛందశ్శిల్పాన్ని పరిశీలించేప్పుడు విశేషపద్యాల విషయకంగానే కాక, సామాన్య పద్యాల విషయాన్ని పరిశీలించుకో వలసి ఉంటుంది. ఆవిధంగా రామాయణ కల్పవృక్షంలో కన్పించే విపులమైన ఛందోవైవిధ్యం కానీ, శిల్పసార్థక్యం గానీ అన్యత్ర సుదుర్లభం ఇంతటి ఛందశ్శిల్ప పరిణాహం గల కావ్యం సాహిత్యప్రపంచంలో మరొకటి కన్పించదు.

మూలదైత్యబల సంహారం తరువాత మహోతీవ్రుడై యుద్ధానికి వచ్చిన రావణుడు శ్రీరామచంద్రుని వద్దకు రథం తోలించుకు వస్తాడు ఎట్లా-

'తూలినిరాఘూటంబుగ। దోలించెం బండి రామతోయదము దెసన్
గాలివలెం బటుఝంఝా। ఖీలంబుగ రావణుండు భీషణమతియై'

[యు. ని. 190]

రామతోయదాన్ని చెల్లాచెదరు చేసే ఝంఝులా వస్తాడు. తోయద పదంలో సౌకుమార్యం, ఝంఝాపదంలో కాఠిన్యం ఉంది అట్లా వచ్చి శ్రీరామ చంద్రుని చూస్తాడు. ఈరావణకృత శ్రీరామచంద్రదర్శనం అయిదు సీస పద్యాల్లో చిత్రితమయింది శ్రీరామచంద్ర సౌందర్యాన్ని రావణుడనుభ వించిన రీతి ఈచిత్రణ మొట్టమొదటనే- "శ్రావణాంభోధరచ్ఛాయా మనోజ్ఞాసితస్వాదునీలసుందరశరీరుడు" గా శ్రీరామచంద్రుని రావణుడు దర్శించినాడు. తోయదాన్ని చెదరగొడదామని వచ్చిన ఝంఝ అంభోధర మనోజ్ఞాసితస్వాదుశరీరసౌందర్యానికి ముగ్ధమయి పోయింది. ఈ మొదటి నాలుగునిపద్యాల్లో మధురరచన రావణుని సౌందర్యభావన ంఎతగా పర

వశించిందో తెలియజేస్తుంది. మాధుర్యమన్నది కేవలం మధుర మనిపించే పదాల కూర్పువల్లకాదు, మధురభావనానుకూల పదసంయోజనంవల్ల కలుగుతుంది సత్యనారాయణగారి మధురరచన ఈవిధంగా ఉదాత్తమయినది. మొదటి పద్యంలో "పుంసాం మోహనరూప" చిత్రణా మాధుర్యం రెండవ దానిలో "పీనాంసయుగ దృశ్యమానతూణీరేషు నతగరుడ్ భ్రమర సేవిత ముఖాబ్జు-" 'ఇత్యాదిగా శ్రీరామ మహానుభావతా వర్ణనా మాధుర్యం మూడవ పద్యంలో తన్మహానుభావత ద్వారా స్మృతికి వచ్చిన-"శైవశరాసలస్తికనాస్తి సంత్రుట నాత్తకీర్తి ప్రథమావతారు" ఇత్యాదిగా పరాక్రమానుభవమాధుర్యం నాల్గవ దానిలో- "నఖశిఖాపర్యంత ముఖరిత బంభరీకమనీయ వనమాలికామనోజ్ఞు-" ఇత్యాదిగా శ్రీమన్నారాయణత్వ సంస్ఫోరక వర్ణనా మాధుర్యం వెల్లివిరుస్తుంది. ఇంతదాక వచ్చేటప్పటికి యుద్ధానికి వచ్చిన రావణునికి తానేమయి పోతున్నాడో తెలియలేదు ఆ పారవశ్యాన్ని బలవంతంగా త్రోసివేసుకొని, శ్రీమన్నారాయణత్వ భావసను ఆలోచనావక్రత్వంలో పిశ్లథం చేసుకున్న దృగ్గీతి అయిదవ-చివరి పద్యంలో వ్యక్తం చేయబడింది. ఆ విశ్లథత్వం కొరకెన్ని కాంణాలు కల్పించుకొన్నాడు!-

గిడసబారినకైక గడుసుదనమ్మున
బంపగా నడవులబట్టువాని,
జడదారిమూక వెన్నొడిచి యెక్కింపగా
నంతంత వింటివాడైన వాని,
ముల్లోకముల యందమ్ముం జూరగొన్నట్టి
చాన రక్షించుకోలేనివాని,

కోతిమూకలను వెన్కొని లంకపైనెందు
నెఱుగని సేతగా నెత్తువాని,
నేదియెట్లయిన బోవునదేమితనకు
నన్నరీతి బైరాగిగా నున్నవాని

ప్రతిదిని తనకును ననుకూలపడెడువాని
రామచంద్రుని గాంచెను రావణుండు.

[యు. ని 195]

రాముని తక్కువదనాన్ని నిరూపించుకొంటున్న రీతి ఇది కాని అతని భావనలోని లోతుల్లో మనస్సు యొక్క ఉపరితలాన్ని అంటని శ్రీ రామచంద్రుని ఔదాత్త్యం ఈరీతిలో స్ఫురిస్తూ ఉండటం చమత్కారం రామాయణ కల్పవృక్షంలోని పాత్రలన్నీ వ్యక్తావ్యక్త మనఃస్థితి మంతంగా చిత్రింపబడటం పాత్రనిర్మాణ శిల్పం కావటమే కాక, రామాయణ కల్పవృక్షా నికి విశిష్టమయిన అంశం. శ్రీరామచంద్ర బహిరంతర సౌందర్యానుభవానికి సంబంధించిన మొదటి నాలుగు పద్యాలలో మాధుర్యం ఉంది-"హాయి" ఉంది ఈచివరి పద్యంలో సామాన్యంగా అసమాసికమై సాగినరచన ఆలో చనలోని విరిగిపోయినతనాన్ని సూచిస్తుంది. మొదటి నాలుగు పద్యాల రచనా విధానాన్ని హఠాత్తుగా ఈఅయిదవ పద్యంలో మార్చటం రావ ణుడు హఠాత్తుగా తలతడుముకొని పారవశ్యాన్ని విదలించుకొన్న మనః స్థితికి వ్యంజకం. ఇదంతా రచనాశిల్ప విషయం

రామాయణంలో యుద్ధప్రస్తావన లేనిదేదైనా ఉన్నదంటే, అది అయోధ్యాకాండమని చెప్పవచ్చు. మిగతా అన్నికాండల్లోయుద్ధవర్ణన ఏదో విధంగా, ఎంతో కొంతగా ఉండనే ఉన్నది కాని, యుద్ధపరాకాష్ఠ చివరి కాండలోనే అందుకనే అది యుద్ధకాండమైంది. ఇందులో ఎందరో రాక్షస కపివీరులు-చిన్నా పెద్ద తరహాలకు చెందినవారు- మహానుభావులైన కుంభ కర్ణేంద్రజిద్రావణులు సుగ్రీవాంగద మారుతులు, రామలక్ష్మణులు-వీరం దరి యుద్ధరీతులు ఏకత్ర ప్రదర్శిత మైనయి. ఐతే ఏఒకరి యుద్ధవిధానం మరొకరిదానివలె ఉండదు. ఒకసారి యుద్ధానికి, మరోసారి దానికి భేదం ఉంటుంది ఆయావారివీరాలు, ఆయావ్యక్తుల యుద్ధాలు తత్తత్ ప్రత్యేక జీవలక్షణమహితంగా ఉండటంవల్ల ఎప్పటికప్పటికా యుద్ధరీతి నూత్న నూత్నంగా భాసిస్తుంటుంది. ఇప్పటిదాక యుద్ధవర్ణనశిల్పంలో తిక్కనగారిది పెద్దపీట ఆయన మార్గమే మార్గమై కూచుంది ఇన్నాళ్ళకు శ్రీమద్రామా

యణ కల్పవృక్షం మరో పెద్దపీటపై అధివసించింది. ఆయుద్ధ వర్ణనా శిల్ప ప్రసారమార్గాన్ని క్రొత్తమలుపు తిప్పింది. అతికాయుడిపై లక్ష్మణుడు బ్రహ్మాస్త్రం ప్రయోగిస్తే-అంతనొక పెద్ద కొండమీద విశాలాంభోధరము క్రమ్మి యుది విచ్చగా కొండ మాయమైనట్లు-" వాడు నశిస్తాడు వధను చెప్పటంలో ఇదిఒకానొక విచిత్రమైన విధానం లక్ష్మణుని బ్రహ్మాస్త్ర ప్రయోగ కౌశలం చూచి"- సర్వాస్త్రంబులు ప్రయోక్తృ భావపరిణతం బులు-" (యు. ఇం. 90)

అనుకుంటా డాంజనేయుడు అస్త్రాలకున్నసహజమైన శక్తి ప్రయోగం లోని కౌశల్యంవల్ల చిత్రవిచిత్రంగా ఉద్దీప్తమవుతుంది యుద్ధవర్ణన ఎందరు చేయరు. కాని చేసినవాడు విజ్ఞశిల్పిఅయితే, తత్ప్రయోక్తృ భావపరిణతమై ఉజ్వల శిల్పమహితంగా పర్యవసిస్తుంది. రాఘవుడు సవైంద్రాస్త్రంతో కుంభకర్ణుని "శిరంబు ఖండించిన,"అదియును రావణు జాంబూనద సౌధము గోపురంబునం బడియెను-". అప్పుడు మహాదుఃఖనదికొక్క యెుడ్డునజేరి యేకాంతంబున" విషయ విచారణచేః కొంటూ రావణుడు, కృత్త శిరస్సు గోపురం మీద పడవేయటం వంటి కిటుకు రామునికి-"పిన్నతల్లి కైకేయి ధనుఃకళావిభవ కృత్రిమతా పరివేత్రినేర్పు-" (యు కుం 410)

అనుకొంటాడు రావణునికికూడ కైకేయి అంటే అంత. యుద్ధ కాలంలో రావణుడు మండోదరీగృహంలో విశ్రాంతిగా నిద్రపోదామని వెళ్లాడు. కాని—

అతడుం గొంచెము నిద్రపోవుటకునై యాశించెనా! యవ్యవ
స్థితచిత్తున్ సుఖనిద్రపొందునటె? వచ్చిరాని కన్మూతలై
యతుడున్ నిద్దుర పోయినట్లుగను పోనట్లవుచు నుండున్ సమ
ర్పితధీవృత్తి జలించె నాహవమహావృత్తంబె ధారాగతిన్.

(యు కుం. 9)

ఈస్థితిలో ధారాగతిగా మృతపీరుల ద్వారా యుద్ధవర్ణన చేయించటం కథనశిల్పంలోని భాగం.

యుద్ధసందర్భ వర్ణనోత్సాహంలో మునిగిపోయి కేవలంగా దాని వెంటబడి పోవటం కావ్యశిల్పి లక్షణం కాదు ప్రదర్శనవేళ బహుముఖత్వం అవసరం అనేకాంశాలను సమనింపులో ఉంచుకోవట ఆవశ్యకం ఏయుద్ధ వర్ణన గూడా కావ్యానికి అంగి అయిన శాంత రసవిచ్ఛేదకంగా, దాన్ని మించిపోయేట్టుగా ఉండక పోవటంతో, కల్పవృక్షంలో యుద్ధవర్ణనా శిల్పం నిజమయిన శిల్పం అయింది యుద్ధవర్ణన రీతిలోనూ, యుద్ధాలెడ మయిన సందర్భాలలోనూ ఈశమభావానుకూలమయిన అంశాలను ఉదుజ్జీవకంగా, పునఃపునరనుసంధీయమానంగా సందర్శింపబడటం కల్పవృక్ష యుద్ధకాండలో సర్వత్రా అనుభూయమానమయితూ ఉంటుంది రకరకాలయిన రీతులలో శమాన్ని మించకుండా యుద్ధతీవ్రత ఉచితంగా సంయమితం చేయటం జరుగుతుంది ఉదాహరణకు రామరావణ యుద్ధంలో-

రామచంద్రుని శరీర మను కుడ్యమున దై
త్యపతి జేగురువరదాలు కొట్టె,
రామచంద్రుని శరీరమను మిన్నునను ర
క్షఃకులేశుడు వానకాళ్ల దింపె,
రాకాసి రామపర్వతసానువుల నెత్తు
రేగు వాగుల బ్రవహింపజేసె,
అసురుడు రామగిర్యగ్ర సీతావియో
గవ్యథా స్నానోదకములు నింపె,
రావణుడు ప్రచండసంగ్రామశీలి
తనమహాశక్తి రూపంబు దాల్చినట్లు
నుర్విజాపతి నిల్వనీకుండ జేసె-

ఇంతవరకూ రావణుని విజృంభణరీతి రామచంద్రుని నిలువనీయకుండ చేయగల్గినది. కాని–

–రామచంద్రుడు నిలిచెను రథమునందు!

(యు. నిస్సం 822)

అనటంతో విజృంభణ ఒక్కసారిగా సంయమిత మయింది దాదాపు పద్యమంతా వ్యాపించిన అంశం ఒక్కచివరి పాదంతో నీరుగారి పోయింది ఇందులో మరొక అంశం· రావణ పర్యాయపదాలయిన దైత్యపతి మొదలగు వాటి స్వరూపం, అతని క్రియాకలాపరీతి క్రమశః అతని మహాశక్తి యొక్క అలసిపోతున్న లక్షణాన్ని, శ్రీరామచంద్రునిగా నిరూపించిన శబ్దాదులు క్రమశః పెరుగుతున్న స్థిరత్వ-ఔదాత్త్యాలను స్ఫురింపజేస్తాయి. స్నానోదకాలు నింపటమనేది "అభిషేక" లక్షణాన్ని సూచిస్తుంది. ఇంత వ్యంజకంగా యుద్ధసందర్భంలోని విజృంభణను సంయమించుట విజ్ఞశిల్పరీతి. మరొకట్టి రావణుడు పరమతీవ్రావేశంతో యుద్ధభూమికి వచ్చి వానరసేనను ఛిన్నాభిన్నం చేస్తాడు. ఆసందర్భంలో ఆతీవ్రతలో-"ప్రళయఝంఝామరుత్పాతంబువోలిక రాక్షసు రథము దూరాలు తోలె। యమదంష్ట్రికా హంక్రియాక్రియవలె దైత్యు నారాచసమితి ప్రాణములుదీసె—"

(యు ని 98)

"తీవ్రమతులైన వీరుల్లా కపులెల్ల నివ్వెఱ" పోయినారు, ఇంత తీవ్రత వర్ణితమయిన వెనువెంటనే–

రక్షశ్శరాంతకార్యముగ జెవుల్ తెగి
పడిన సంగీతమ్ము పాడెనొకడు
అసురేశ్వరుని వాలుటమ్ముమ్మెరువులను ఛే
దించ మద్దెలను వాయించె నొకడు,
అసురశరాళి సర్వాంగమ్ములను రట్టు
సేయగా నాట్యమ్ము సేసె నొకడు

అరచేతులను దైత్యవరుడు మండింపగా
విలవిల తాళంబు వేసెనొకడు

రామ భూపాలరాగపర్యాప్తగళులు
వేలకొలదిగ బాడిరి వెనుక హంగు
రావణుడు శరాంతకార్యముగ రామ
భజన చేయించె వానరవ్రజము చేత.

(యు. నిస్స. 99)

రావణుని శరాంత కార్యములు, వానర ప్రతిస్పందనలు వర్ణితమయినయి. రావణుని బాణంతో చెవుల్ తెగిపడగా, ఆవానరుడు తత్క్షణంలో చెవివద్ద చేయిపెట్టుకొని గీపెట్టినాడు కొందరు గాయకులకు చెవివద్ద చేయి పెట్టుకొని రాగాలాపన చేయటం అలవాటు. అదిక్కడ సూచితమయింది, ఇట్లాగే మిగిలిన వానరచేష్టలన్నీ ఈచేష్టలలోని హాస్యలక్షణం యుద్ధతీవ్రతను సంయమించింది, తేలికపరచింది వానరులతో రామభజన చేయించట మన్నదానిలో రావణుని కసిఉంది, ఆకసి విజృంభణవలని క్రియల ద్వారా సాగిన వానరచేష్టలలో హాస్యముంది, ఈరెంటి విచిత్రమయిన సమ్మేళనంలో శిల్పముంది.

ఇంద్రజిత్ ప్రయుక్త నాగసాశాలు దులిసిన తరువాత సూర్యోదయ వేళలో శ్రీరామచంద్రుడు అస్త్రెత్రాడు మ్రోయించితే కపివీరుల్లోనేకాదు, ప్రకృతిలోనే, ఆవాతావరణంలోనే ఒకానొకవిధమయిన సముల్లాస ముల్లసితమయింది అప్పటి ఉదితసూర్యకిరణ ప్రసారవిలాసాన్ని-

నలిన కాంతాసమానత గండభాగాన
జిటిక వేసెనొ, నవ్వు చెలఁగిపోసె,
ముద్దమందారమ్ము బుగ్గపై నొక్కెనో
కమలిపోయిన యట్లు కందిపోయె,

లలిపారిజాతమ్ము గిలిగింత వెట్టెనో
తూగాడు కొమ్మనే తూలిపోయె,

రాదంచు మోటు పరాచికమాడెనో
నుగుద కల్వయు మోము ముడుచుకొనియె,
రుద్రజట ముక్తకంచుకారూఢయయ్యె
చంద్రకాంతము చిఱునవ్వు సంతరించె
నొక్కడొకడు స్వభావమ్ము పిక్కటిల్ల
అబ్జబంధుని జానిసలైన పూలు.

[యు. సం౹. 386]

పూలస్వభావరీతుల కతికించి వర్ణించిన రీతి యుద్ధరంగములో, దుఃఖవాతావరణంలోని సాంద్రతను తగ్గించి మనస్సును సమ్ముగ్ధపరుస్తుంది. సూర్యోదయవాతావరణాభివర్ణన లెన్ని లేవు! సందర్భానుమతమయిన సౌకుమార్య మాధుర్య భావనాసంవలిత మయిన శిల్పిభవద్వర్ణన లెన్ని? రావణుని సంతోషంలోని ఉత్థాన పతనాలూ, ఆలోచనారీతీ, దుఃఖానుభవమూ, తదుద్గతమయిన కోపసంవ్యాప్తీ, తత్ జృంభణమూ, కుంచనమూ ఈ మొదలైన వన్నీ ప్రస్తారించబడిన విధానం యుద్ధకాండలోని యుద్ధ పరిణామాన్ని కావ్యశిల్ప పరిణామంగా పర్యవసింపజేసినది. సంభాషణలలో, మాటపై మాటలు పెంచటంలో, ప్రత్యేకంగా విశేషాంశస్ఫోరకంగా పదాలను ప్రయోగించటం, వాక్యనిర్మాణంలోని వైచిత్రి ద్వారా వ్యక్తుల తత్వాలను స్ఫురింప జేయటం మొదలయినవన్నీ ఈ కావ్యశిల్పాన్ని సుసంపన్నం చేస్తూండటం గమనించవలసినరీతిని సహృదయుని శిల్పదృష్టి కవసరం.

యుద్ధకాండలోని మొదటి నాలుగు ఖండాల రీతికీ ఉపసంహారణ ఖండరీతికీ క్రమపరిణామ ప్రాప్తమైన భేదం కనిపిస్తుంది. మొదటి నాలుగు ఖండాల నిర్మాణానికి రావణమనస్సంక్షోభం ఆధారశిల అన్న విషయం గమనింపదగింది. ఆసంక్షోభం శమించి నప్పటినుండి ఉపసంహారణ ప్రారంభం ఇక్కడినుండి సర్వత్రా అనుద్విగ్నతా ప్రసారమాధుర్యం ఈఖండంలో ఏ ఒక్క విశేష వృత్తంగానీ, పద్యంగానీ లేకపోవటం దీనికనుకూలమైన రీతి విశేషపద్యాలను ఊరకే ప్రయోగిస్తూ పోవటం నిజానికి శిల్పంకాదు. సందర్భౌచిత్యాన్ని నిర్వహించటం శిల్పం. వస్తుగతంగా ఈఖండంలో సీతాగ్ని

ప్రవేశఘట్టం ఉద్వేగకారి అంతకు ముందు మండోదరీపర్యంతమయిన రావణాంతఃపుర స్త్రీలశోకం ఆశోకం పరిణతమండోదరీ భావనామార్గంలో ఉపశమనాభిముఖంగానే ప్రసరిస్తుంది. అందుకే శ్రీరామచంద్రుడు ఈశోకానుభవంలో "తారామండోదరుల ప్రకృతి భేదంబు నెంచి యచ్చెరు" వందినాడు [యు ఉప. 62]

కిష్కింధలో వాలివధానంతరం తారాదుఃఖరీతితో దీని పోల్చి చూస్తే దుఃఖానుభవంలోని రాజస సాత్త్వికలక్షణం వ్యక్తమవుతుంది సీతాగ్ని ప్రవేశంలోని ఉద్వేగితను తదనుప్రాప్తమయిన శ్రీరామచంద్ర మాధి దశాంగిత ధైవీభావనావలితత్త్వం ఉపశమమార్గంలోకి మలుచు కొంటుంది అక్కడినుండి అయోధ్యకు తిరిగి వచ్చేటప్పుడు సీతతో రామచంద్రు వనే కాంశములను ముచ్చటించటం, దృశ్యాలను వర్ణించటం, పూర్వవిషయాలను స్మరించటం, ఆమెను చిత్రవిచిత్రంగా, మనఃప్రసాదపరమంగా సంబోధించటం - ఈ మొదలయిన అనేకరీతులలో పరమసాత్త్వికంగా, మార్దవభావనావలితంగా, ఆనందవీచీవిహారంగా ఖండమంతా సాగుతుంది. సీత చెప్పిన విషయంవిని ఉద్విగ్నురాలయిన అనసూయాదేవి తననుతానే సంయమించుకొని తన అనుగ్రహరూపంగా సీతాదేవికి రెండు ఫలాలనిస్తుంది ఆ రెండు సీతాదేవి రామచంద్రుని కిచ్చి అనసూయాదేవిని సాగనంపి తిరిగి వస్తుంది రామునివద్దకు ఇది కుశలవుల విషయాన్ని ఎంతసుకుమారంగా సూచిస్తుంది! సీత వెళ్ళినా, శ్రీరాముని యందనపాయిని సూచనా శిల్పమనేది ఇంత సుకుమారంగా పరమసూక్ష్మంగా ఉంటుంది అయోధ్యకాండలో మ్రొక్కు కొన్న మ్రొక్కులన్నీ తీర్చుకుంటూ, అందరినీ కలుపుకొని సీతారామచంద్రులు అయోధ్యకు వస్తారు. భరత- మాండవి- ఊర్మిళల యోగాలు ఫలిస్తాయి. సర్వమూ శాంతమనోజ్ఞమవుతుంది సర్వసంసర్గాలూ నివృత్తమయి ఆనందసామ్రాజ్యపట్టాభిషేకం జరుగుతుంది.

శ్రీవశిష్ఠాదులెల్ల విచ్చిన విలోచ
నముల పరిచితధ్యానసంతతి వహింప

నలినహితునాటి సింహాసనంబునందు
శ్రీరఘుస్వామి పట్టాభిషిక్తుడయ్యె.

[యు. ఉప 401]

శ్రీమన్నారాయణుడు సూర్యమండల మధ్యవిభాసి అనిస్ఫూర్తి.

ప్రాచీనాధునిక సాహిత్య ప్రక్రియావైవిధ్యంతో, శిల్పానేక మార్గాల పరిచయంతో శ్రీమద్రామాయణకల్పవృక్షాన్ని సమీపించితే, అందు సర్వత్రా అభివ్యాప్తమయిన శిల్పకాంతిప్రసారం కావ్యానందానుభవానికి చేదోడువాదోడుగా ఉపకరిస్తుంది. ఏవో కొన్ని శబ్దార్థాలంకారాలకో, పదప్రయోగాలకో మోహపడి, తాత్కాలిక వైచిత్రికి తృప్తిపడటం కన్నా తలస్పర్శిగా అనుశీలించటం గాఢానుశీలురకు అధికానందసంధాయకమవుతుంది. కావ్యానికి శిల్పప్రయోజనం ఆవిధమైంది.

ప్రయోజనవంతమై, అధికార్థసంగ్రహణశీలమై సహృదయుడిని భావనోత్పథాలలో విహరింపజేసి ఆనందానుభవవహితత్వం కలిగించే శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని అంతర్వాహినియైన శిల్పసరస్వతి కిది కేవలం ఒక అవతారిక.

# రామాయణ కల్పవృక్షము

—డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం

మఱల నిదేల రామాయణం బన్నచో
నీ ప్రపంచక మెల్ల నెల్లవేళ
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్లు
తనరుచి బ్రతుకులు తనవి గాన
చేసిన సంసారమే చేయుచున్నది
తనదైన యనుభూతి తనది గాన
తలఁచిన రామునే తలఁచెద నేనును
నా భక్తిరచనలు నావి గాన
కవి ప్రతిభలోన నుండును గావ్యగత శ
తాంశముల యందుఁ దొంబదియైన పాళ్లు
ప్రాగ్వీపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి.

వాల్మీకి రామాయణం వ్రాసిన తరువాత మఱల రామాయణాన్ని ఎందుకు వ్రాయాలి?- అన్న ప్రశ్న ఇప్పటిది కాదు. శతాబ్దాల తరబడి సహస్రాధిక రామాయణాలను రచించిన కవుల కందరికీ వర్తించే ప్రశ్న యిది. భారతీయసాహిత్యాలలో బహుప్రక్రియల్లో బహుళంగా వెలసిన రామకథ యేయే ప్రయోజనాలను సాధించడానికి ప్రవర్తిల్లిందో ఆయా కావ్యకర్తలు వారివారి కృతుల్లో వివరించుకొంటూనే వస్తున్నారు.

చెప్పిన కథనే మరల చెప్పదలచు కొన్నప్పుడు కవికి గాని, లోకానికిగాని, చెప్పుకోదగిన విశేష మేదో ఉండాలి. అప్పుడే అది సార్థక మౌతుంది ప్రక్రియ కోసం, నూత్నకల్పనల కోసం, స్వీయమతసమన్వయం కోసం, తత్త్వవ్యాఖ్యానం కోసం, దేశీయసాహిత్యవికాసంకోసం, చివరకు పుణ్యం కోసం-ఇలా ఎన్నో ప్రయోజనాల నుద్దేశించి ఆయా యుగాలలో రామకథను కవికోకిలలు గానం చేస్తూవచ్చారు, సామాజికు లాదరిస్తూ వచ్చారు

ఆధునికాంధ్రకవియైన విశ్వనాథ సత్యనారాయణ గారు శ్రీమద్రా మాయణ కల్పవృక్షమును రచించారు. మఱల నిదేల రామాయణము? అన్న ప్రశ్న ఆయనకు గూడ ఎదురౌతుంది దైవ ప్రార్థనం ముగియగానే దీనికి సమాధానం చెప్పారాయన సమాధానంలో ఉన్న సారాన్ని గుర్తిం చిన సహృదయులూ ఉన్నారు, సంప్రదాయ ఋచాందసమని చప్పరించిన వారూ ఉన్నారు, సమకాలీనులలో.

ఆధునికులలో "మఱల రామాయణ మెందుకు" అని ప్రశ్నించే వారు పలురకముల వారుగా నున్నారు రాముడు దేవుడని నమ్మే విశ్వా సాన్ని త్రోసి రాజంటారు నాస్తికులు. రామాయణ మితిహాసము, చారిత్రక సత్యమనే భావాన్ని కాదంటారు హేతువాదులు రామకథలో మార్క్సిస్టు దృక్పథం లోపించిందంటారు సామ్యవాదులు వేదార్థబృంహితమయిన కావ్యం కాబట్టి రామాయణాన్ని కాదంటారు వేదవిరోధులు. చాతుర్వర్ణ్య వ్యవస్థనూ, బ్రాహ్మణప్రాధాన్యాన్ని బలపరుస్తుంది కాబట్టి ఆధునికకాలానికి అతకదంటారు వర్ణరహితసమాజాన్ని వాంఛించేవారు. ఆర్యుడయిన రామునికి ద్రావిడుడైన రావణునికంటె ఆధిక్యం చెప్పబడింది కాబట్టి దక్షిణాదివారికి రామాయణ ముపాదేయం కాదంటారు ద్రావిడ జాత్యభిమానులు రామాయణంలో సాంఘికస్పృహ కానరాదంటారు సామాజికవాదులు సామాన్య మానవ సమస్యలు రామాయణంలో అంతగా లేవంటారు మానవతావాదులు ఆదర్శమానవవాదం ఆరాధ నకు పనికివచ్చునంతగా ఆచరణకు యోగ్యం కాదంటారు లౌకికవాదులు. రామాయణంలోని పరమార్థాన్ని గుర్తించలేరు ఇహపరాల్లో ఇహాన్నే గుర్తించే భౌతికవాదులు. వీరి వాదాలన్నీ విశ్వనాథ కెంత వర్తిస్తాయో

వాల్మీకికి గూడా అంతే వర్తిస్తాయి అయితే విశ్వనాథను కూడా సూటిగా ప్రశ్నించే సమకాలీను లున్నారు. వారిలో మొదట పేర్కొన దగిన వారు అభ్యుదయవాదులు సంప్రదాయవిచ్ఛేదమే అభ్యుదయానికి మూల సూత్రమని నమ్మేవారు. అదే యీయుగధర్మమని విశ్వసించేవారు. అభ్యుదయ వాదం సమాజంలో బహుముఖంగా వ్యాపించిఉంది ఆలోచనకూ, ఆచరణకూ సంబంధించింది ఒకశాఖ, రచనకూ భాషకూ సంబంధించినది మరొక శాఖ ఆలోచన సంస్కృతికీ, ఆచరణ నడవడికకూ ముడిపడి ఉంటాయి పాశ్చాత్యసంస్కృతి విశేషాలనూ, ఆధునిక హేతువాదదృక్పథాన్ని మేళవించుకొని భారతీయసంస్కృతిలో ఆలోచన విధానంలో మార్పురావాలని అభిలషిస్తున్నారు ఆధునికులు మూఢవిశ్వాసాలకూ, అర్థంలేని ఆచారాలకూ స్వస్తిచెప్పి ఆధునిక నాగరికతకు ఆలవాలమైన సమసమాజస్థాపనకు నాంది నాలపించాలంటారుకొందరు. వర్గసంఘర్షణను బలపరిచే ప్రాచీనవ్యవస్థను సమూలంగా మట్టంచేసి ఆర్థిక సమానత్వం ప్రాతిపదికగా సమసమాజ వ్యవస్థను సరిక్రొత్తగా రూపొందించాలని ప్రయోగాలు చేస్తున్నారు కొందరు దానిని సాయుధవిప్లవం ద్వారా సాధించవచ్చునని కొందరు, శాంతివిప్లవం ద్వారా సాధించవచ్చునని కొందరు భావిస్తున్నారు. అభ్యుదయంతో పాటు అంతర్వాహినిగా ప్రవహించే మానవత్వపు విలువలను గూడా పరిరక్షించాలంటున్నారుకొందరు ఏనూత్న ప్రయోగమయినా దేశసంప్రదాయంలో నుంచే ప్రభవిల్లి వికసించినప్పుడే మూలబలం చేకూరు తుందని విశ్వసిస్తున్నారు కొందరు భారతీయసంస్కృతి సర్వయుగధర్మాలను మేళవించుకొని విశ్వమానవ కోటికి శ్రేయోమార్గాన్ని ప్రసాదించగలదనీ, ఆయా యుగధర్మాల కను గుణంగా దానిని తీర్చిదిద్దుకోవడమే అభ్యుదయమనీ భావిస్తున్నారుకొందరు అభ్యుదయాన్ని అందరూ కోరుతున్నా ఏమార్గంలో దానిని సాధించాలన్న ఆలోచనలో విభిన్నసిద్ధాంతాల కోలాహలం నేడు వినబడుతున్నది.

సమకాలికులలో కొందరు విశ్వనాథ అభ్యుదయవాది కాదనీ, ఫ్యూడల్ వ్యవస్థను బలపరిచేవాడనీ. సంప్రదాయవాది యనీ భావిస్తు

న్నారు. విశ్వనాథ రామాయణానికి కాలదోషం పట్టిందనే వారు వీరు విశ్వనాథ తన దృక్పథాన్ని యిలా వివరించారు — **"If people say that I have no sympathy for modernism I can only pity them. I am not *enemy of sceince and technology*,the train, the phone, the plane, the T. V., the spacecraft. These are all irreplaceable. If you go through my writings carefully and dispassionately you are sure to attribute to me unqualified admiration for the sort of government that the Russians have in their country. My ideal briefly stated is Socialism plus God plus Religion. I may be defender of lost causes But I think, it is better to cling firmly to something that is better, to cling firmly to some thing that is within our reach than chase desperately that shall never be ours."** ఆయన దృష్టిలో పక్షి ఎంత దూరం యెగిరినా చివరకు చేరేది తనగూడే అని. అలాకాక పోతే మన పయనం లక్ష్యం లేని సాధన మౌతుందని, నేల విడిచిన సాము అవుతుందని. విశ్వనాథ అభ్యుదయవిరోధి కాడు అభ్యుదయసౌధానికి కూడా పునాదులుండాలనీ, అవి మన నేల మీదనే కట్టాలనీ అనేవాడు బురుజులు కట్టే యత్నం అభ్యుదయవాదులు చేస్తుంటే పునాదులు గట్టిచేసే యత్నం ఆయన చేశాడు. పైకెక్కేవాడు కోటకొమ్మలు చూసి కేక వేస్తుంటే పునాదులు కదిలితే పుట్టగతులుండ వని విశ్వనాథ ప్రబోధించాడు. అందువల్ల అభ్యుదయభవనానికి గోడలెంత ముఖ్యమో పునాదులూ అంతే ముఖ్యం. ఈ దృష్టితో చూస్తే 'మఱలనిదేల రామాయణ' మన్న ప్రశ్నల రాద్ధాంతముండదు.

తెలుగు సాహిత్యచరిత్రలో 1933-34 సం॥ల కాలం చాల ఉజ్జ్వల మయినదని చెప్పాలి. ఒకవైపు శ్రీశ్రీ మహాప్రస్థాన రచన ప్రారంభించాడు. మరియొక వైపు విశ్వనాథ రామాయణకల్పవృక్ష రచనం మొదలు పెట్టాడు. ఇద్దరూ సంఘధర్మానికి బొమ్మా బొరుసుగా ఉన్న చైతన్యాలను స్వీకరించారు ఒకరు వర్గరహితమైనసమాజాన్ని ఆర్థికమైన అసమానత్వాలను తొలగించి సమసమాజాన్ని నిర్మించాలని ప్రబోధించారు ఆర్థికాభ్యుదయాన్ని సాధించినా జాతి జీవనం ఆధ్యాత్మిక ధర్మ చైతన్యంతో

ముందుకు నడచినప్పుడే మానవవికాసం సంపూర్ణ మౌతుందనీ, అది భార తీయ సంస్కృతి సముద్ధరణం వల్ల సాధింప బడుతుందనీ మరొకరు ప్రబో ధించారు ఒకరు ఆర్థికధర్మానికి ప్రాధాన్యమిస్తే మరొకరు హార్దికధర్మా నికి ప్రాణం పోశారు ఒకరు రిచ్చ గెలుపుమని జాతి వెన్నుతట్టితే మరొ కరు ముందు ఇంట గెలవాలని హితవు చెప్పారు మహాప్రస్థానంతో మానవసమస్యలన్నీ పరిష్కారం కావు ఆర్థికాభ్యున్నతిని సాధించిన సమా జాలు ఆత్మశాంతికై ఆలమటించడం ప్రపంచంలో చూస్తున్నాం అభ్యు దయానికి అవధి ఆత్మశాంతి అభ్యుదయం ఉత్తాలమయిన తరంగం, సంప్ర దాయం గంభీరమయినసముద్రం తరంగహేలను శ్రీరంగం శ్రీనివాసరావు గారు ప్రదర్శిస్తే, సముద్రఘోషను విశ్వనాథ సత్యనారాయణ గారు ప్రపంచించినారు సంఘర్షణం మూలంగా విప్లవం బీజంగా సాధింపబడే సమత రేపేమౌతుందో తెలియంది వర్గరహితసమాజం ఆదర్శ సమా జం. అది భౌతికంగా సాధింప బడినా మఱల క్రొత్తవర్గాలు పుట్టవనీ సంఘర్షణం రాదనీ చెప్పలేం మనిషిలో స్వార్థం ఉన్నంతవరకూ సంఘ ర్షణ తప్పదు. ఈ రోజున్న వర్గాలు రేపు మారురూపాలలో అవతరింప వచ్చు. అప్పుడు నూతనవ్యవస్థ పాతవ్యవస్థను పాతిపెడుతూ చరిత్ర గతిని ముందుకు సాగదీయవలసి వస్తుంది. ఇది ప్రకృతిధర్మమని అంగీక రించినా మనిషి బ్రతుకుకు పరమార్థ మన్నది లేకుండా పోతుంది. బ్రతు కులో అర్థమొకటే పరమార్థ మయితే పరపీడనం తప్పదు. పరపీడన రాహిత్యం ప్రభుత్వశాసనం వల్ల రాదు. ప్రజల మనఃపరిణామం వల్ల వస్తుంది. ఈ పరిణామం ధర్మదృష్టి సాధిస్తుంది. ధర్మం చేత అర్థకామాలను శాసించగలిగితే సమసమాజం శాంతియుతంగా సాధింపవచ్చు. అందుకే మహాత్మాగాంధీగారంటారు-**"Socialism is as pure as crystal. There-fore requirers crystal like means to achieve it. Impure means result in an impure end."** ధర్మానికి పరమార్థశక్తి లేకపోతే దానికి అర్థకామాలు వశం కావు మనిషి తనను తాను జయించలేడు. తనను జయించుకోలేనివాడు లోకాన్ని ఉద్ధరించలేడు. ఆర్థికాభ్యున్నతిని సాధిం చినా తనలో తాను మేలుకోక పోతే మనిషి తన అభ్యుదయానికి అర్థం తెలి

యక ఆవేదనపడతాడు నేటి విశ్వసమాజంలో అభివృద్ధి చెందిన సమాజాల్లో అటువంటి ఆర్తి వినబడుతోంది అన్నీ ఉండి కూడా ఆధునిక మానవుని ఆర్తికి అర్థం ఏమిటి? 'నిజంగానే నిఖిలలోకం నిండుహార్దం వహిస్తుందా?' అన్న ప్రశ్నకు సమాధానం యేది? అర్థం హార్దాన్ని కలిగించవచ్చు; దానికి నిండుదనం కలిగించేది ధర్మమూలమయిన పురుషార్థం

'ఎందును నేనుగాని వగు నింద్రియ సంతతి యందు నేను మే
ల్కందును నిద్ర పోవుదును గాలువ పల్లపు తూములట్లుగా
బిందువు గూడ నోడ్చెడిని బెట్టుగ నన్నివి యోగిరాజ! నా
యందున నేను మేలుకొను టన్నది యున్నె? అనుగ్రహింపవే'.

అన్న శ్రీరాముని ప్రశ్నను కథనుండి విడదీసి చూస్తే అది ఆధునిక విశ్వమానవుని ఆర్తికి ప్రతిధ్వని. ఈ ఆర్తి ఇప్పటిదే కాదు; అనాది నుండే వస్తున్నది. ప్రతియుగంలోనూ పరిస్థితులు మారినా మానవుని ఆత్మధర్మం అవిచ్ఛిన్నంగా ఆతనిలో స్పందిస్తూనేఉంది ఆ స్పందన విశ్వజనీన మయినది, శాశ్వతమైనది దాన్ని సంప్రదాయమని త్రోసి వేస్తే మనం ఆత్మను విస్మరించినట్లే. ఆత్మ ఆవరణాలను మార్చవచ్చుగానీ, తాను మారదు. ఆవరణం నశింప వచ్చును గాని ఆత్మ నశింపదు. అలాగే విశ్వజనీన మయిన స్పందనం కూడాను దానిలో నిన్నటిమెప్పు గుప్పున గుబాళించవచ్చు; నేటిలోని నిప్పు భగ్గున మండవచ్చు; రేపటిలోని ఒప్పు రెక్కలు విప్పుకొన వచ్చు. ఇందులోని నేటిధర్మం అభ్యుదయమయితే రేపటి ధర్మానికి సంప్రదాయం నిన్నలో నుండి పుట్టిన నేడు రేపటిలో లీనం కావటం సృష్టి ధర్మం అలాగే విప్లవం విశ్వజనీన మయిన చైతన్యంలో విలీనం కావడం ప్రకృతి ధర్మం. ఈ ప్రకృతి ధర్మంలో నిత్యంగా నిలిచే చైతన్యం శాశ్వతధర్మం దాన్ని విశ్వనాథ రామాయణంద్వారా ఆధునికలోకానికి అందించారు. దీన్ని గమనింపక కొందరు విమర్శకులు విశ్వనాథ సమాజాన్ని వెయ్యేళ్ళ వెనక్కు తీసుకొని పోతున్నాడంటారు. నిజమేమిటంటే, వెయ్యేళ్ళ ముందు చూపును సమాజాని కందిస్తున్నాడు విశ్వనాథ! అందువల్లనే సర్వ

ధర్మమూల బీజంబుగ నవిచ్ఛిన్న సంప్రదాయార్థినై రామాయణ కల్ప వృక్షాన్ని రచిస్తున్నానని విశ్వనాథ పేర్కొన్నాడు

ఇక అభ్యుదయవాదులు కొందరు విశ్వనాథ రచనలో మెచ్చుకోని కొన్ని అంశాలున్నవి ఒకటి- ఆయన వచన కవిత్వం వ్రాయక పోవడం పట్టిందల్లా బంగారం చేయగల సామర్థ్యమున్నా వచన కవిత్వ ప్రక్రియను స్వీకరించక పోవడానికి ఆయనకు ఛందస్సు మీదున్న పరమాధికారమే ప్రథమకారణం పద్యం వ్రాయటం సంప్రదాయ మన్నారు కొన్ని రోజులు, చివరకు గేయం వ్రాయడం కూడా నేడు ఛాందస మంటున్నారు కొందరు పద్యాన్ని కాదని గేయం, దాన్ని కాదని వచన ప్రక్రియ చేపట్టిన కవుల్లో శ్రీ శ్రీ తరానికి చెందినవారు కొందరు అన్నిట్లో శక్తి ఉండే ఆధునిక ప్రయోగాలు చేపట్టారు. ఇప్పటి తరంలో ఆశక్తి ఉందంటే ఆశ్చర్యపడవలసినవిషయం అట్లని పద్యం నిషిద్ధమా? అభ్యుదయ కవితలోని ఆవేశాన్ని పద్యం మొయ్యలేదని వారిభావం. విశ్వనాథ ప్రవృత్తిలో, ప్రయోగంలో ఆవేశంకంటె అంతర్ముఖీనత, పరుగుకంటె పయనం, చమత్కారంకంటె ధ్వని ప్రాధాన్యం వహిస్తాయి. అందువల్ల ఆయన పద్యవిద్యలో పరమోన్నత శిల్ప శిఖరాల నందుకున్నారు అపూర్వ ఛందస్సులు సార్థకంగా కల్పవృక్షంలో ప్రయోగించారు. తెలుగు దేశంలో మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారు అపూర్వరాగాలకు ప్రాణం పోస్తున్నట్లుగా విశ్వనాథవారు అపూర్వ ఛందస్సులకు జీవచైతన్యాన్ని సంతరించారు వచనానికి దగ్గరగా నున్న మధ్యాక్కర ఆయన రచనలో నవనీతమయి వివిధ రసభావాలకు వాహికగా అవతరించింది కవి తీసుకున్న వస్తువులో కాని, ఛందస్సులో కాని కవి ప్రతిభ ఎంత భాసించిందన్నది ప్రమాణం ప్రతిభ ఉంటే ప్రక్రియాప్రయోగాలు ప్రకాశిస్తాయి. విశ్వనాథ రసవాది. ధ్వనిసిద్ధాంతానుయాయి అనుభూతి కేంద్రంగా కవితావిష్కృతి చేసేశిల్పి ఆయన రచనలో ఏ ఛందమయినా రసాభిముఖంగా వ్యంజకత్వాన్ని భజిస్తుంది రససూత్రం, ధ్వనివాదం వచనకవిత్వానికి విరోధాలా? కావు. అనుభూతి నారాధించే ఆధునికులు విశ్వజనీన మయిన కావ్యలక్షణంగా దేన్ని గ్రహిస్తారు? అన్ని ప్రక్రియలకూ పరమార్థం రసమే. దాన్ని వదిలితే

సాహిత్యానికి జీవమే లేదు, కావ్యాత్మను-లేదా-రసానుభూతి కేంద్రంగా రచన చేసే విశ్వనాథ పద్యం వ్రాసినంత మాత్రాన అధునికుడు కాడా? పద్యం ఆయన కవితకు తొడుగు-అనుభూతి ఆత్మ వచనకవితా ప్రక్రియ కూడా అనుభూతికి ఆవరణం మాత్రమే ఆకృతియే ఆత్మ అని భావిస్తే, అదే ఆధునికత అని అంటే వారికొక నమస్కారం

విశ్వనాథ వ్యావహారిక భాషావాది కాదని భాషావాదులలో కొందరి విమర్శ వ్యావహారికభాషలో నున్న పలుకు బడులకు, రసాను కూల వాక్య విన్యాసాలకు విశ్వనాథ కల్పవృక్షంలో విరివిగా చోటు కల్పించాడు ఆయన కావ్యభాషకున్న శక్తిని, వ్యావహారికభాషకున్న శక్తిని గుర్తించినవారు. మహాకావ్య రచనకు అనువైన కావ్యభాషను ఆయన నిర్మించుకున్నారు. భాష భావవాహిక, భావం అనుభూతికి ఉప కరణం అనుభూతి నందించే భాషను కావ్యానుగుణంగా మలుచుకున్న మనీషి ఆయన భాషాసిద్ధాంతాలు భావుకుల కావ్యాస్వాదనకు అవ రోధాలు కావడం లేదు అందుచేత ఆయన ఏ భాషలో రచన చేసినా పఠితలకు రసానుభూతి కలుగుతున్నది కావ్యంలో భాష వాడటం కాదు ప్రధానం-దాని పలుకుబడికి ఉన్నశక్తిని సర్వతోముఖంగా ప్రదర్శించడం. నన్నయ నుండి నేటి దాకా తెలుగు భాష పోయిన పోకడలను జీర్ణించుకొని, తన జీవితకాలంలో కానవచ్చిన భాషాశక్తిని పుంజించుకొని, కల్పవృక్షంలో తన భాషాశక్తినంతా విశ్వరూపంగా ప్రదర్శించినాడు విశ్వనాథ ఇది చిన్న పనిగా భావిస్తే ఆయన కృషిని చిన్న చూపుతో చూచినట్లే అవుతుంది. నన్నయ తిక్కనల తరువాత ఆంధ్రభాషాశక్తిని గుర్తించి మహాకావ్యరచనలో పొందుపరచిన ప్రతిభామూర్తి, భాషాతపస్వి విశ్వనాథ!

విశ్వనాథ రచించిన రామాయణకల్పవృక్షం ఆధునికకాలంలో నవ్యసాహిత్య ప్రయోగసిద్ధాంతాలలో వారు ప్రతిపాదించిన కులపాలికా ప్రణయతత్త్వానికి కావించిన మహాకావ్యరచన. 1934 నాటికి భావకవిత్వ

యుగంలో రాయప్రోలు వారి అమలిన శృంగారతత్వం, కృష్ణశాస్త్రిగారి ఆదర్శసౌందర్యాన్వేషణం, చలంగారి స్త్రీవ్యక్తిత్వ విప్లవచైతన్యం, త్రిపురనేని రామస్వామి చౌదరిగారు సంప్రదాయంపై తీసుకొని వస్తున్న వివేచనాత్మక మయిన విమర్శ-మొదలయినవి నూత్నభావచైతన్యానికి తెలుగు సాహిత్యంలో మార్గాల నావిష్కరించాయి స్వాతంత్ర్యోద్యమం, ప్రబోధకవిత్వం, హరిజనోద్యమం, బ్రహ్మసమాజాది మతవ్యాప్తి-ఇవన్నీ జాతిలో నూత్నజాగృతిని కల్పించాయి. ఆధునిక నాగరికత పాశ్చాత్య సంస్కారసంవిలసితమై భారతీయమయిన సంస్కృతి సమస్యలను పునః పరిశీలనం కావిస్తున్నది. కాలానుగుణంగా విలువలు మారుతూ వస్తున్నవి ఎన్ని మార్పులు వచ్చినా వాటికి ప్రాతిపదికగా నిలువగలిగింది భారతీయ గార్హస్థ్య జీవితం. స్త్రీ పురుషుల సంబంధంలో పరమార్థదృష్టి క్రమంగా లోపించడం, ధర్మం అర్థసాధనంగా మారటం, కామం సర్వప్రవృత్తులకు మూలం కావటం వంటి మార్పులు ఆ వ్యవస్థను అర్థరహితంగా మార్చే ప్రమాదం వాటిల్లింది విశ్వనాథ ఆధునికనాగరికత, నవ్యభావవిప్లవం భారతీయగార్హస్థ్య జీవనవ్యవస్థను భగ్నంచేయరాదనే విశ్వాసం కల వారు సర్వధర్మాలకు బీజరూపమైన ధర్మమది. సీతారాముల ప్రణయం అద్వైత ప్రేమకు చిహ్నం. భారతీయ జీవిత పరమార్థాన్ని జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలో కూడా శాసిస్తున్న తత్త్వమది దాన్ని నవ్య కవితా ప్రక్రియల్లో విశ్వనాథ కులపాలికాప్రణయతత్వంగా ప్రతిపాదించారు దాన్ని మహాకావ్య ప్రక్రియలో రూపొందించడానికి రామాయణం కన్న మరో వస్తువు లేదు ఆధునికులు తమకాలాని కనుగుణమైన మహాకావ్య నిర్మాణం కోసం కలలు గంటున్నారు దేశభక్తి భావానికీ, స్వాతంత్ర్య సమరభావానికీ మహాకావ్యప్రక్రియలో ప్రయోగాలు వెలిశాయి. విశ్వనాథ అద్వైతప్రణయానికి అనర్ఘకావ్యాన్ని సంతరించారు. ఈ మహాకావ్యాలు సమకాలీనసమస్యలకెంత పరిష్కార మార్గాలో, సార్వకాలీన ప్రయోజనాలకూ-అంతప్రామాణిక వ్యాఖ్యానాలు జాతి భౌతిక మానసిక బౌద్ధిక వికాసానికి అభ్యుదయమార్గాలను ఆధునికప్రక్రియలు ఆవిష్కరిస్తుంటే జాతి నైతిక ధార్మిక వైజ్ఞానిక వికాసాలకు ఆధునికంగా విశ్వనాథ

తమ రచనల నందిస్తున్నారు. ఒకటి వర్ణచిత్రవిన్యాసం, మరొకటి భిత్తికా కల్పనం భావకవిత్వయుగంలో రాయప్రోలు, కృష్ణశాస్త్రి, చలం, త్రిపుర నేని మొదలయిన వారు సమకాలీన సమాజ పరిణామంలో తలయెత్తిన కొన్ని ప్రణయసమస్యలకు రూపకల్పనం చేశారు వాటికి కవితా తత్వ వ్యాఖ్యానం చేశారు. ఆ సమస్యలకు శాశ్వతపరిష్కారం మాత్రం వారు చూపించలేకపోయారు. విశ్వనాథ మౌలికంగా పరిష్కారమార్గాన్ని ప్రపంచించారు ఆ విధంగా రామాయణకల్పవృక్షం ఆధునికకాలాని కను గుణంగా వెలసిన మహాకావ్యం

తెలుగులో భాస్కర రంగనాథ రామాయణాదులుకూడా సమకాలీన జాతిధర్మప్రబోధార్థం వెలసినవే. 13వ శతాబ్దంలో మహమ్మదీయ దండ యాత్రలకు గురియైన తెలుగు గడ్డమీద ధర్మవీరాన్ని ప్రబోధించడానికే అవి వెలిశాయి. అలాగే విశ్వనాథ కల్పవృక్షం సమకాలీన మానవ ధర్మ ప్రబోధానికే పుట్టింది ఆధునిక కవితా సిద్ధాంత రాద్ధాంతాలకు ప్రామాణిక ఫలితాంశప్రతిపాదకంగా వెలిసింది:

రామాయణం ఒక మహాకావ్యంగానే కాదు, ఒక మహామంత్రంగా-తాత్విక దర్శనంగా భారతీయులచేత భావింపబడి రూపొందింప బడింది వాల్మీకి తరువాతి రామాయణాలన్నీ మూలానికి కళాత్మకంగా, తాత్వి కంగా వ్యాఖ్యానం చేస్తూ వచ్చాయి. అధ్యాత్మరామాయణాదులూ, రామాయణరూపకాదులూ-అటువంటివే. అది లౌకిక ధర్మానికెంతప్రాధాన్య మిస్తుందో ఆధ్యాత్మికభావన కంత ఆలంబనాన్ని కల్పిస్తుంది. విశ్వనాథ ఈసంప్రదాయ ధారనుకూడా సమన్వయించారు, కల్పవృక్షంలో. పరం పరాగతంగా వస్తున్న రామకథాస్వరూపతత్వాలను సమన్వయం చేసి రసానుగుణంగా కవితావ్యాఖ్యానరూపంగా రామాయణాన్ని సంతరిం చారు విశ్వనాథ. కావ్య కళాతత్వ దృష్టితో చూస్తే ఆంధ్రభాషలో వెలు వడిన రామాయణాలన్నింటిలోనూ అగ్రతాంబూలం అందుకునే మహా కావ్యం రామాయణకల్పవృక్షం.

మఱల రామాయణాన్ని రచించడానికి ఉపపత్తులు చెపుతూ విశ్వనాథవారు తినుమన్న అన్నమే రుచిభేదంతో తిన్నట్లుగా, చేసిన సంసా

రమే నవ్యానుభూతి కోసం చేసినట్లుగా తానూ రామాయణాన్ని రచించి నట్లు చెప్పారు అన్నం కథా వస్తువైతే దానిని సమకాలీనసమాజాని కందిం చడంలో ప్రపంచించే తాత్వికదృష్టి రుచి తరతరాలుగా వస్తున్న గార్హస్థ్య ధర్మ ప్రవృత్తి సంసారమైతే అందులో ఆధునిక జీవిత వ్యవస్థలో దర్శిస్తున్న ప్రణయతత్వం నవ్యానుభూతివిశేషం "తలచిన రామునే తలచెద నేనును నాభక్తిరచనలు నావిగాన" అన్న ఉపపత్తి మరోవిశేషాన్ని చెబుతున్నది నాగరికత ఎంత పెరుగుతున్నా, ఆధునికత ఎంత అవతరిస్తున్నా ఈజాతిలో భక్తి చావటంలేదు అది ఆలంబనభేదంతో జీవితాన్ని ఆవరి స్తూనే ఉంది. భక్తి దైవాన్ని ఆశ్రయించవచ్చు, పెద్దలనాశ్రయించవచ్చు, సిద్ధాంతాల నాశ్రయించవచ్చు, మానవుణ్ని ఆశ్రయించవచ్చు, సమాజాన్ని ఆశ్రయించవచ్చు, దేన్ని ఆశ్రయించినా దాన్ని దైవసమానంగా చూచుకొనే ప్రవృత్తి ఈదేశంలో సంస్కారరూపంగా ఉంది. వ్యక్తిప్రవృత్తినాశ్రయించి భక్తి శ్రద్ధగానో, ఆసక్తిగానో, వ్యామోహంగానో కొన్నిచోట్ల పరివర్తనం చెందవచ్చు కానీ, అది భక్తిమార్గాన్ని మాత్రం వీడటంలేదు విశ్వనాథ సమాజంలో ఉన్న బలమయిన ఈప్రవృత్తిని పట్టుకొని రామాయణంలో భక్తిప్రవృత్తిని స్థాపించారు

పోతన్న భాగవతంలో ప్రదర్శించిన శిల్పం యిదే సర్వపాత్రప్రవృ త్తుల్లో భక్తిని రంగరించి చిత్రించాడు దానితో భాగవతం ప్రజల మనస్సులలో శాశ్వతావాసం చేసుకున్నది దీన్ని రామాయణానికి కూడా వర్తింప జేసి విశ్వనాథ కథాసూత్రాన్ని నిబంధించారు

రామాయణకథలో గసరహస్యం ఒకటుంది అందులో రాముడు ధర్మవీరుడు. రావణసంహారం ఆయన అవతారప్రయోజనం.

'దశరథధాత్రీశగర్భధాత్రి నందనుడనై పుట్టి
దశకంధరుని కంఠనాళదళనకృత్యంబుఁ జేర్చి
దశ సహస్రాబ్దముల్ ధరణి ధర్మసంధానంబుఁ జేసి
ప్రశమితాసురుడనై మీకు బాములు మాయంగఁజేతు.'

అని మహావిష్ణువు ప్రతిజ్ఞ కావ్యానికి బీజమిది ఫలం రావణ సంహారం. ఈ కార్యనిర్వాహణంలో నాయకవర్గం ఉంది. ప్రతినాయకుడైన రావణ వర్గం ఉంది నాయకవర్గంలో కైక రామపట్టాభిషేకాన్ని భంజి స్తుంది ప్రతినాయకవర్గం వారు రామకార్యాన్ని భంజించటానికి సీతాప హారణం చేస్తారు. ఒకరు రాజధర్మాన్ని, మరొకరు గార్హస్థ్యధర్మాన్ని ధీ కొన్నారు రెండూ రామకార్యానికి పోషకాలై నిలుస్తాయి. భరతుడు రాజ ధర్మాన్ని నిలుపుతాడు. హనుమ సుగ్రీవ విభీషణాదులు రాముని గృహస్థ ధర్మాన్ని రక్షిస్తారు. రాముడందరికీ నాయకుడు. నాయకవర్గంలో దశరథ, విశ్వామిత్రులు లక్ష్మణ భరత శత్రుఘ్నాదులు, కపివీరులు, విభీష ణాదులు, అహల్యా శబరి జటాయులు-ఇల్లైందరో రాముని యందు భక్తి ప్రపత్తులతో శక్తియుక్తులను ధారపోసినారు రాక్షస పాత్రలలో మారీచ్యాదులు, కుంభకర్ణాదులు రామభక్తిని పరోక్షంగా ప్రదర్శించిన వారే. రామకథలో అడుగడుగున వీరి భక్తి ధర్మవీరానికి పోషకమౌతుంది ఇక మిగిలిన రావణాది రాక్షసపాత్రలు రౌద్రపాత్రలు విశ్వనాథ వానిలో కూడా జీవసంస్కారప్రేరితమయిన భక్తిని వేదనగా ప్రదర్శించి నారు. రామాయణకల్పవృక్షంలో రాముడు ఆదర్శమానవుడు, జిజ్ఞాసు వైన సాత్త్వికకర్మవీరుడు రావణుడు ప్రతీకారంతో ప్రభువు నన్వేషించే రాజసభక్తివీరుడు సీతాపహారణం అతని అన్వేషణలో ఒక మధురమార్గం. సీతారాములు పరస్పరోపాసనతో పరిపూర్ణజీవస్థితిని, తద్వారా పర మార్థాన్ని సాధించే అద్వైతప్రేమమూర్తులు.

సీత శ్రీరామచంద్రుని చిత్తపదము
రామచంద్రుడు జానకీప్రాణపదము
రామసర్పఫణామణి రమణి సీత
ధరణిజాజీవితాతపతరణి స్వామి.

సీత చిత్తమునందు రాముడున్నాడు రాముని ప్రాణము సీత. సీతాప హారణం రామప్రాణాపహారణం. సీత రావణుని వరింపదు రావణుడు

సీత నుపాసించును రాముడు సీతను రక్షించుకొనును రావణుడు తాను చచ్చి రామప్రాణమును రక్షించును. ఈపని రావణుడు తెలిసి చేసినచో నిది అధ్యాత్మరామాయణ మగును. రావణుడు తెలియక చేసినచో వట్టి రామాయణమగును తెలిసీ తెలియని తెలివిడితో చేసినచో కల్పవృక్ష మగును. రావణుని లోని జీవుడు సీత నుపాసించును. అతని తనువు ఆమెను కామించును. అతని వాక్కులో జీవుని వేదనము, కాముని సాధనము రెండును వినిపించును అశోక వనిలో సీతతో రావణుడాడిన మాటలు దీనికి తార్కాణము

'నన్నున్ మించిన వాడు పండితుడనంతన్ లేదు వేదార్థముల్
నన్నున్ సుంతయు మించి లేవవి నెలంతా! నేను వేదోక్తులి
వ్విన్నివ్విన్ని యటంచు లెక్క యిడితిన్ వేదార్థ మేమందు వా
యన్నూ! కామము చూడ సృష్టి ప్రథమాహంకారమే జానకీ!'

అహంకార ప్రేరితమయిన కామం అతని బహిఃప్రవృత్తిని సమర్థి స్తున్నది

'భ్రాజితమైన యీసకల వైభవమున్ త్యజియించి యొక్కనీ
తోఁ జనుదెంతు; నేరికిన్ దోపని సీమల నీవు దేవతా
భా జితమూర్తి నేను పదవారిజసేవకుడన్ భవత్కటా
క్షాజిరరంగ వల్లులకు నద్దినదౌ మృగనాభికల్పుడన్.'

'నీ వఖిలభవాంభోనిధి
నావవు నేనుప్పు నీళ్ళ నాసాకంర
వ్యావల్గువులుగ నుంటి గృ
పావేత్రమునిచ్చి యొడ్డు పట్టింపగదే'

'అంబుజసదృశంబు నీచరణ మోహన పీఠమునందు నాదు స
ర్వంజనిఫలంబు నర్పణము పట్టితి మట్టితి శ్రీరహస్యమున్.'

ఇవి పైకి ప్రణయవచనాలే కాని లోని జీవుని వేదనను పట్టియిచ్చే భక్తిసూక్తాలు రావణుడు శ్రీరామసేనను చూచినాడు. అతని కది యొక మహాతరువుగా కానవచ్చింది.

'ఇది నారాయణ మూలమౌ తరువు నాయీ రాముడన్ బోదె యొ
ప్పిదమై లక్ష్మణుఁడన్న పంగయు మహాభీష్మంబులౌ శాఖలై
ముది వర్గైచను జాంబవంతుడు మరుత్పుత్రుండు సుగ్రీవుఁడం
గద మైందిద్వివిదుల్ గవాక్ష గవయుల్ గా వందలౌ వానరుల్'
'ఇది యీకొమ్మలు సాగకున్న మును పే యే దీని భేదింపగా
మది నూహించితి జానకీహరణ మన్మందుం బ్రయోగించి మొం
డిది యీచెట్టును కొమ్మలున్ విరిసి నిండెం బూలతో పండ్లతో
జదలున్ సాగరమావరించినది యాశాసంతతిన్ గ్రుమ్మరున్.'

భారతమున ధర్మజుడు ధర్మతరువునకు బోదెయైనట్లు గానే, రామాయణమున రాముడు నారాయణతరువునకు బోదె. దానిని భేదించుటకు రావణుడు విషప్రయోగముచేసినాడు అది విషవృక్షమగుటకు బదులు కల్పవృక్షమయినది రావణుని కంత్యకాలంలో లోని తత్వము స్ఫురించినది

'ఇతనికి దేవికిం దనరు నింతటి భేదము, స్వ్యాతభావనా
తతముగ దేవియే యితడు తానగు;నన్ను వధింప బ్రహ్మసం
గతమగు దీప్తికాఁ దొలివికారము నందలి తేజమౌచు న
చ్యుతుడును దాను దేవియు త్రిశూలియు నందరునై నచోటునన్'.

అతనికి స్ఫురించిన తత్వ మద్వైతము. ఆ అద్వైతతత్వాన్ని బోధించుటయే రామాయణకల్పవృక్ష తత్వం పురుషుని నుండి స్త్రీని విడదీయలేము వారిరువు రొకటయినప్పుడు వారి కద్వైతసిద్ధిలేనిచో ప్రణయానికి స్థాయిలేదు. ఆస్థాయిని తెలియుటయే రసతత్వం. దానిని రావణుడు భేదించి రసభంగం చేయడానికి యత్నించినాడు. సంఘర్షణం అందుకు ఫలము. సంఘర్షణలో సత్యం స్ఫురించింది, ఆధునిక ప్రణయ తత్వాన్వేష

కుల స్థితి కూడా యిట్టిదే వారికి కల్పవృక్షాన్ని చూపించినాడు విశ్వనాథ. సంఘర్షణ తత్త్వాన్వేషణకు దారితీయటంలో తోడుపడే శక్తి భక్తి; జాతి సంస్కార బీజం. దానిని రసార్ద్రం చేస్తే మరల సంస్కృతివృక్షం మొల కెత్తి పుష్పించి ఫలిస్తుంది.

విశ్వనాథ ఒక్క రావణుని యందేకాదు-రాక్షస పాత్రలయందును జీవ సంస్కార ప్రేరితమయిన భక్తిభావాన్ని ముద్రించినాడు విరాధ కబంధాదు లటువంటివారు అకంపన కుంభకర్ణాదు లట్టివారు. ఇక త్రిజటా దుల గూర్చి చెప్పనవసరము లేదు ఇలా రాక్షసభక్తిభావం వారి రౌద్రాన్ని ఆర్ద్రీపరుస్తుంది. ఆర్ద్రీమయిన రౌద్రం రామవీరాన్ని పోషి స్తుంది పోషకద్రవ్య స్వభావాన్ని బట్టి పోష్యద్రవ్య స్వభావం సిద్ధిస్తుంది

నాయకపక్షంలో ఉన్న కైకలో రౌద్రం పరుషంగా స్ఫురిస్తుంది రామాయణంలో విశ్వనాథ దాన్ని విరుద్ధరసమయిన వత్సలంతో, అంతర్వే దనతో ఆర్ద్రీకరించాడు కైకలో సపత్నీమాత్సర్యాన్ని పోషించి ఆ పాత్రకు న్యాయం చేయాలనుకున్నారు కొందరు ఆమెలో దైవప్రేరిత మయిన సరస్వతి ఆవేశించి వరాలను కోరినట్లుగా కల్పించారు కొందరు ఎన్ని కల్పనలు చేసినా ఆమె యందు పఠితలకు సానుభూతి లేదు; ఆ పాత్రకు పరమార్థం లేదు అందుకని విశ్వనాథ ఆమెను రామకార్యానికి ప్రేరణగా, పోషణగా తీర్చి దిద్దారు దశరథుడు కైకకు పుత్రసంతానం కోసం దీక్ష వహించుమని యన్నప్పుడు "అవ్వనితామణికి (కౌసల్యకు) నాత్మజుడుండిన దివ్వె వెంబడిన్ దివ్వియలాగ మీకులము దీధితి వెల్గు" నని సపత్నీభక్తిని ప్రదర్శిస్తుంది. రామునికి చిన్నప్పటి నుండీ తన ప్రతా పాన్ని పినతల్లితో చెప్పుతుంటేనే సంతృప్తి. పినతల్లి దగ్గర రాముడు అహో రాత్రాలు ధనురభ్యాసం చేస్తాడు ఆమె బాణవిద్యలో ఎన్నో రహస్యా లతనికి చెప్పింది. విశ్వామిత్రుడు రామునికి అస్త్రగురువైతే కైక శస్త్రోపా ధ్యాయిని. రాముని ఉపనయనంలో కైక ఒక చురకత్తిని భిక్షగా ఇస్తుంది అతడు కొండంత అవుతాడు మిథిలానగరంలో పెండ్లి వేడు కల్లో రాముడు పినతల్లి కొంగు పట్టుకొనే తిరుగుతాడు. శివధనుర్భంగ

వీరుని ఆ వర్తనం వనితలకాశ్చర్యం కలిగిస్తుంది. సీతారాముల నయోధ్యలో తనయింటికి పిలిచి వారికేకాంతం కల్పించి వారి వలపుల తీగలను చిగురింప చేస్తుంది కైక అభిషేకం రామునికి జరుగుతుందంటే ఆమె బ్రహ్మానంద పడుతుంది. తెల్లవారితే పట్టాభిషేకమనగా రాముని సమాధిలో దేవత లాతని కర్తవ్యాన్ని బోధిస్తారు అతడు రహస్యంగా కైక యింటికి వచ్చి తన పట్టభంగాన్ని అర్థిస్తాడు ఆమె అంగీకరించదు. అయితే ఆమెనేర్పిన కోదండ విద్యంతా నిష్ఫలం కావలసిందేనా యని అడుగుతాడు. దేవతలకు తాను సింహాసనం ఎక్కడం ఇష్టం లేదని ప్రాధేయ పడతాడు కైక రామ కార్యం కోసం కపటనాటక మాడుతుంది కృతక క్రోధాన్ని అభిన యిస్తుంది రాముడరణ్యానికి పోతూ—

"నీ యుపకారమున్ మరువనే మఱి యోజననీ! యెవండుగా
ని యొక సత్కృతిన్ సలుప నీవగు దిందొక రాదు రెవ్వరో
చేయక యే సహాయపడి చేయగరాదును సత్ఫలంబు రాఁ
జేయగ రాదు లోకమున సేయుము త్యాద్రుళులందు నిల్పెడిన్."

అని తన కృతజ్ఞత ప్రకటిస్తాడు. తరువాత ఆమె పొందిన సుఖం లేదు లోగుట్టు బైటకు చెప్పలేదు. అందరిచేతా ఛీ యనిపించుకొంటుంది కన్న కొడుకు నానా మాటలంటాడు. నేనే రాముడయితే అడవులకు పంపగలవా అని ప్రశ్నిస్తాడు

"అనినం గైకయి యిట్లనెన్ దగుదురా! యన్నా! మఱీవేగి కా
ననమేమౌదువు? రామచంద్రుడనినన్ బధ్నాంశు తేజో వినూ
తన నారాయణమూర్తి, శాశితసమస్తప్రాణి నీ వేగు టా
తనిదౌ నేగుట యెక్కడా?భయసముద్రం బయ్యెనీమాటలున్."

అని రామతత్వాన్ని వ్యంగ్యంగా సూచిస్తుంది. చివరకు చిత్రకూటంలో కూడా వశిష్ఠాదులందరూ ఆమెను గర్హిస్తారు. శ్రీరాముడందరినీ వారించి ఆమె చిత్తమెలాటిదో తెలిసికొండని హెచ్చరిస్తాడు లోకమంతా తనను నిందిస్తున్నా లోకరక్షణలో రామునికి లోలోన తోడుపడిన వత్సలవిషాద

మూర్తియైన కైక ఆమె బడబాగ్నిని దాచుకొన్న సముద్రం అందరే మన్నా రాముడొక్కడామెను మెచ్చుకొంటే చాలు. దైవకార్యాన్ని లోక హితాన్నీ తెలిసి చేసిన విజ్ఞురాలు కైక.

'తెలిసినదా రఘూత్తమునికి తెన్ను-అది రాముని తెన్ను-కన్నబి డ్డల పనిఁ బెచ్చు కీర్తి పన డక్కెను నాకును: డక్కెను రామచం ద్రుల దయచేత నా యెడద నూల్కొను దీపపు వర్తిచేత లో యలఁ బడి వచ్చునాతని రహస్యము నేను వచింప నేటికిన్.'

అని మౌనం దాల్చిన ఆమహనీయమూర్తి భక్తిత్యాగాలు పరితల నత్యంత ఆర్ద్రులను చేసి వేస్తాయి రాముడే కైకను ఆమెనేర్పిన విద్యకు సార్థక్యం కల్పించుమని కోరిన కల్పనం రామాయణ కల్పవృక్షంలో కైక పాత్ర ఉదాత్తీకరణకు బీజం ఆమెలోని గుప్తమైన నారాయణ భక్తికి సంకేతం.

రామాయణంలో అడుగడుగున ఆర్ద్రమైన ఘట్టాలున్నాయి పరుషప్రవృత్తుల్ని సైతం ఆర్ద్రప్రవృత్తులుగా మార్చి రాముని ధర్మ వీరాన్ని అత్యంత ఆర్ద్రంచేసిన గౌరవం విశ్వనాథకు దక్కుతుంది "నాథ క్తి రచనలు నావికాన" అన్న సూక్తిలో మౌక్తికం లాగా ఉన్న రసపోషణ రహస్యమిది.

ఆధునికకాలంలో వాల్మీకిరామాయణానువాదాలు వెలిశాయి. మరలనిదేల రామాయణమని ప్రశ్నింపవచ్చు "ఇది వాల్మీకమునకు యథాతథమయిన తెనుఁగు కాదు; పరమ స్వతంత్రమైన రచన, మూలము నకు భావప్రాయము, తత్త్వమునకు వ్యాఖ్య తెలుగు భాషలోని పూర్వపు తెలుగు కవులలోని రచనా శిల్పరహస్యములకు విహారణ ప్రదే శము-" అని శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి సమాధానము "విశ్వనాథ రామాయణాన్ని కల్పవృక్షంగా భావించాడు కల్పవృక్షం మిగతా వృక్షాల లాగా ఒకే విధమైన ఫలాన్ని ఇవ్వదు రామాయణం కల్ప వృక్షంలాగా ఏయుగం లోని కవిగానీ సమష్టియుగచైతన్యం దర్శించ

తలిస్తే ఆ దర్శనం కలిగిస్తుంది. దానియొక్క విశ్వజనీనత అలాంటిది విశ్వనాథకు భారతీయుల రాజకీయ దాస్యమే కాదు ఎక్కువ ఆవేదనం కలిగించింది. వారి సాంస్కృతిక దాస్యం వైదిక కాలంనుంచి వస్తున్న జాతి మహోన్నతమైన జాతీయచైతన్యశక్తి విఖండితమై అప్పుడప్పుడే నాగరకమై వైజ్ఞానికపారిశ్రామిక అభివృద్ధులు కారణంగా సత్త్వం సంపాదించుకొన్న జాతులు మానసికంగా మనను పాలించడం ఈరామాయణ సాక్షాత్కారం చేసుకొని జాతి మళ్ళా ఆత్మదర్శనం చేత తిగిగి ఉజ్జ్వలంగా ప్రకాశించ వలెననే విశ్వనాథ తాత్త్వికదృష్టి-" అని డా॥ సుప్రసన్నచార్య 'మన్వయం

# 2

ప్రసిద్ధేతి వృత్తంగల కావ్యాన్ని చదివేటప్పుడు పరితలు కథకోసం, కల్పనల కోసం, కథను నిర్వహించే తీరులో కవి చూపించే ప్రతిభకోసం చదువుతారు. ఆ రెండింటిలోని క్రొత్తదనం వారికి అభినవరుచులను అంద జేస్తుంది. రామాయణకల్పవృక్షాన్ని ఆ దృష్టితో చూచినా అపూర్వశిల్ప వైభవాన్ని ప్రదర్శిస్తోంది.

కల్పవృక్షంలో బాలకాండ రామకథా తరువుకు బీజంలాంటిది. కావ్యకథాప్రవృత్తికి బీజభూతాలైన కథార్థాలనందులో సంతరించడం శిల్పం నాటకంలో ముఖసంధినిర్వహణ మెంత ముఖ్యమో కావ్యంలో ఆదిపర్వనిర్వహణం అంగ ప్రధానం కల్పవృక్షం లోని బాలకాండ భావి కథా విస్తృతికి వ్యంగ్యసామాగ్రి నిక్షేపించిన అర్థకోశం. బాల కాండలో ప్రధాన ప్రతిపాద్యాంశాలు నాలుగు. 1. రామ జననం. 2. రామ సంస్కారం. 3. రామ పరాక్రమం. 4. సీతారాముల ప్రణయం కుమార జననానికి తల్లిదండ్రుల ఇచ్ఛాశక్తి మూలం. దశరథుని పుత్రేచ్ఛ భార్యల కన్నుల లోని విషాదరేఖలను చూచి వేదనగా మారుతుంది ప్రకృతిలో

సంతానసౌఖ్యం స్ఫురింపే సన్నివేశాలన్నీ అతని చిత్తాన్ని ఆకర్షించాయి. ఆ హాయిలో నుంచే ఆవేదన రగులు కొంటుంది

అసివాళ్లేగుచు ధారుణీపతి యయోధ్యా వీథినేవర్ణపున్
శిశువై నం గనిపించినన్ నిలిచి వీక్షించున్ హసించున్ గృపా
వశుడై వానిని దీసి యెత్తికొని యే భక్ష్యమున్గలో తెచ్చి యి
చ్చు సమాశ్వాసన సేయు నంతటనపుచ్చున్ దీర్ఘ నిశ్వాసమున్.

ఇలా సాగదీస్తాడు రోజు లారాజు. సంతానహీనుల దురదృష్టాన్ని ఇలా భావిస్తాడు.

"ఆత్మజు డన్న తీయదనం బెఱుంగని
చిత్తంబు ఊరుపు చేదుకట్టె
ప్రియసుతుడన్న జాబిల్లిం జూడని కన్ను
లవి యప్రసన్నతాంధ్యంపు గూళ్ళు
కొడుకన్న చిన్నారి పడవ చేరనివాని
బ్రతుకు ఝంఝూమరుత్ప్లవయ వీథి
కొమరుడన్ పుణ్యకర్మముం గాంచనేరని
కట్టడి పున్నరకంపుం ద్రోవ
తనయుండన్న సూక్ష్మతత్త్వంబెఱుంగని
జీవి మాయలోన జిక్కుకొన్న
యనదపుర్వు, వాని కైహికాముష్మికం
బులు నశించు దారి వెలుంగు లేక."

రాజు బాధను మంత్రులు పంచుకుంటారు సుమంత్రుడు మార్గం చెబుతాడు వశిష్ఠుడు నారాయణున్ని మంత్రంతో యజ్ఞశాలకు పిలిపిస్తా నంటాడు. మంత్రి సలహాతో ఋష్యశృంగుణ్ణి పిలిపిస్తాడు. అశ్వమేధ యాగం వల్ల సంతానలబ్ధి అవుతుందని దశరధుడు పొంగిపోతాడు భార్యల

వద్దకు పోయి పరి పరి విధాల తన సంతోషాన్ని ప్రదర్శిస్తాడు వారిని కూడా వ్రతదీక్షను పూనమంటాడు కౌసల్యను నారాయణు డామెను తల్లిగా నెన్ను కొనేటట్లు అలంకరించుకోమంటాడు నారాయణున్ని ఆకర్షించేవి నగలు కావు, నా కనుకొలకుల్లో వెలిగే భక్తియే సుమా అని కౌసల్య చెబుతుంది. ఆమె కడుపు పండితే తమ కడుపులు పండినట్లేనని కైకేయీ సుమిత్రలు భావిస్తారు. ఋష్యశృంగాగమనం దశరథ మనో రథానికి మంగళాశాసనం, శాంత రాక దశరథాంతఃపురానికి వాత్సల్య రేఖ. తెలుగువారి పెద్దాడపడుచు నిండుదనం శాంత ఆమె రాణుల హృదయాలలో మాతృవాత్సల్యాన్ని మనోజ్ఞంగా తీర్చి దిద్దుకుంది దశరథునిలోని వేదన యిష్టిలోని హోమాగ్ని, రాణుల చిత్తాలలోని భక్తి కామన హవిస్సు; సుమంత్రుని సంకల్పంలో రూపుకట్టిన అశ్వమేధం పురుష యత్నానికి ప్రతీక వశిష్ఠ ఋష్య శృంగాదుల మంత్రశక్తి దైవాను కూల్యం, రోమపాదుడు, జనకుడు, గుహుడు, జటాయువు మొదలయిన మిత్రులు, మిగిలిన బంధువర్గము సంతుష్టులయిన దేవతలు, శాంత వారి మనసున కుదురుకొన్న శాంతి ఇలా కథలోని పాత్రలనూ ప్రవృత్తులనూ రామావతార పూర్వరంగప్రవర్తనగా ప్రపంచించడం విశ్వనాథ సాధించిన కథా కథన శిల్పం రసానుకూల చిత్తవృత్తులను విస్తరించి రచించడం విశ్వనాథ రసపోషణ శిల్పం.

గర్భవతులయిన రాణుల వర్తనంలో నుండే రామాయణం రూపు కడుతున్నట్లు చిత్రించాడు విశ్వనాథ మచ్చుకు కౌసల్య వర్తన వర్ణనం చూడండి—

తానదేమో పిచ్చితల్లి కౌసల్యయే
ప్రేమఁబోయిన నదే ప్రేమఁ బోవు
శాంత పంపించిన సన్నజరీచీరఁ
బదునేడు దినములా పగిదిఁ గట్టె
నెందఱు వలదన్న నిది శాంత చీరంచు
నధి యుదికించును నదియ కట్టుఁ

దెలివి యరుంధతీదేవి వల్కాల మీయ
నా పైని నది తాల్చె నదియ పనిగఁ
బదియునాల్గుదినంబు లా పగిదిఁ జూచి
కొట్టుపట్టిన వని దాచి కొనియె దాసి
పట్టమహిషీ మహాయోగపరిధులైన
చీర లాపైని దాల్పఁజేసినది దాసి.

కౌసల్య పదునేడుదినాలు శాంత యిచ్చిన జరీచీర కట్టుకోవడం రాముని పదునేడేండ్ల రాజకుమారజీవితాన్ని, అరుంధతి యిచ్చిన నార చీరను పదునాలుగు రోజులు కట్టుకోవడం రాముని పదునాల్గేండ్ల అరణ్యావాస జీవితాన్నీ, ఆ పైనే పట్టుచీరలు దాల్చడం రామపట్టాభిషేకానంతర భోగజీవితాన్నీ ధ్వనింపజేస్తున్నాయి. ఇటువంటి కల్పన ఇంతవరకూ ఏ రామాయణకర్తా చేయలేదు. అత్యంతసూక్ష్మాంశాలలో కూడా ధ్వనిమయంగా కావ్యార్థభావనను సంభావింపచేయడం మహాశిల్పికి అలవడే మహనీయశక్తి

ఇష్టికి జనకుడు, గుహుడు, జటాయువు కూడా వస్తారు. వీరందరూ దశరథమిత్రులు రామాయణకల్పవృక్షంలో యాగానికి వచ్చి లోకమర్యాదను కాపాడటంతో పాటు కావ్యార్థబీజ నిక్షేపం చేసిపోతారు ఉత్తరోత్తర కథార్థ బీజాలను పూర్వకథార్థాలలో నిక్షేపించడం మహాకావ్య రచనలో మన్ననగన్న శిల్పం.

దశరథుడు ఇష్టి నారంభింప సంకల్పించినపుడు చంద్రుణ్ణి చూస్తాడు. "క్రతు యత్న మెంత దూరము వచ్చెనో చూడ వెళ్లేన్గు వజ్రి పంపించె నొక్కొ"— అన్నట్లు కనబడతాడు చంద్రుడు ఋష్యశృంగుల వారిని పిలిపించవలెనని సంకల్పించినపుడు మరలా చంద్రుణ్ణి చూస్తాడు "ఒనర బోర్కాడించి యుయ్యేల తొట్టెలోఁ బండఁ బెట్టిన పసిపాప వోలె" కనబడతాడు. రాముడు పుట్టిన తరువాత మరలా చంద్రుణ్ణి చూస్తాడు.

'రాజు పురుటింటిలోన నిద్రా సమాధి
గతుని హరిఁ జూచు సౌధశేఖర నితంబ
గతుని హరిణాంకుఁ జూచు నా కాంతి గోళ
ముల విభేదంబు దెలియక మోసపోవు.'

విశ్వనాథ రసానికి చంద్రుణ్ణి ప్రతీకగా వాడాడు రామోత్పత్తి వరకూ రామభావనమే రసహేతువు అది చంద్రుని నుండి రామచంద్రుని యందు కేంద్రాన్ని మార్చుకుంటుంది కథలో, రసవేదియైన విశ్వనాథ శిల్ప సంవాదప్రక్రియతో దానిని సూచిస్తాడు

"రాజన్నంబున్ చేయనెంచిన మొదల్ తారాడెఁ జంద్రుండు నీ
యోజన్ వచ్చెను నేటికిన్ దిరిగి యోహో! వాఁడె
వీఁడయ్యెనో
రాజై స్వీయగృహమ్ములన్ వెలుఁగు నీ రాముండు
చంద్రుండు తా
రాజై రాజునెడంద రాజయి రసారాముండుగా వెల్గెడిన్."

ఇక రాముని నాశ్రయించి కావ్యస్థాయి వెలుగొందుతుందని ధ్వని యుద్ధకాండలో ప్రత్యక్షమయ్యే రామకల్పవృక్షం ఈ బీజంనుండి పుట్టిందని అవతార ఖండంలో బీజస్థాపనాన్ని సూచించాడు విశ్వనాథ.

"వృక్షమా మున్నె యున్నది బీజనిర్గ
తంబయై గోచరించు నేత్రముల కెందు
అసలె రామమయం బయినట్టి జగము
నప్పుడే రామ మయ మైనట్లు తోఁచె."

రాముని బాలక్రీడల్లో రామాయణాన్ని ధ్వనింపచేశాడు విశ్వనాథ. నిద్రలో రాముడు దొరలి నేలమీద పడతాడు. కౌసల్య నేలపాప కొట్టిందని రక్ష పెట్టింది రాముడు మాత్రం దేహరాట్ప్రణమగు లక్ష్మియా పుడమి పాపకు దాకినట్లు భావించాడని కవి ప్రౌఢంగా ఉత్ప్రేక్షిస్తాడు. రామ

చంద్రుణ్ణైవరయినా పురుషు లెత్తుకుంటే వాళ్ళ మూర్ధాలనూ, చేతులనూ వత్తి చూచేవాడట! లక్ష్మణున్ని వనిత లెవరయినా ఎత్తుకుంటే వారి ముక్కులూ చెవులూ తడిమి చూచే వాడట! రావణసంహారం, తాటకా శూర్పణఖా పరాభవం పసిపాపల చేష్టలలో నాందీప్రస్తావనల నాలపించాయి.

'ధనువులు పూని భూపతి పదంబుల యందెలుఁగంగ వచ్చు వీ
రనికరమున్ గనుంగొనుచు రాముడు వారల చేధనుస్సులం
గొని చిఱునవ్వులన్ ధనుసు కొప్పులు గూర్పగ నల్లెత్రాళ్ళు వం
చిన వెస ఫెళ్ళుమంచన హసింతురు వీరులు విండ్లతోఁబడిన్'.

'రాము డడుగంగ ధనువు నీరాదు ధనుసు
రాము డడుగంగ నీకుండరాదు పెఱ ధ
రాపతిభుజావిమర్దనోగ్రంబు ధనువు
విఱిగిన విదేహులైనట్లు వీరులెంత్రు.'

శివధనుర్భంగం శిశుక్రీడలలో చిందులు త్రొక్కింది. రామచంద్రుడు వదిలే బాణంతో సమంగా లక్ష్మణుడు పరుగెత్తేవాడట. సౌమిత్రి విశిఖం కన్న ముందుగా పరుగెత్తేవాడట శ్రీరాముడు. వారి బలతారతమ్యం అందులో ధ్వని. ఇలా బాలక్రీడల్లో రామకథను ధ్వని మయంగా భావనా లోకంలో ప్రత్యక్షీకరింప చేశాడు విశ్వనాథ.

రాముడు ధనుర్విద్యాపారీణుడైనాడు గుణం సారించే క్షణం కోసం— పంచలో కట్టివేయబడిన పంచకల్యాణి గుఱ్ఱంలా తహ తహలాడుతున్నాడు. ఉన్నిద్రమయిన పరాక్రమం ఆయనలో పరవళ్ళు త్రొక్కుతోంది— ప్రయోగావకాశం కోసం.

'సుడియన్ బ్రత్యఃణువున్ బ్రవేగధురమౌచుం బంచకళ్యాణి సా
వడిలో నూరక కట్టివేసిన నసృగ్భాబ్ధోల్బణంబైన కై

వడి నిలోప్వపక రామభద్రుండు ధనుర్వేదగ్ద్యసాఫల్యా మే
ర్పడు మార్గంబుల కోసమై వెదకు సౌత్రశ్రీలవాలోలి త్తలన్.

ఇక బాలరామకథ అంతా అతని ధనుర్వేదగ్ద్యసాఫల్య మేర్పడు మార్గాన్వేషణమే

విశ్వామిత్ర యాగ సంరక్షణ మందులోని మొదటి మార్గము యాగరక్షణ మాగంతుక ఫలం, అస్త్రసిద్ధి ముఖ్యఫలం విశ్వామిత్రుడు రామ పరాక్రమాగ్నిని జగద్రక్షణక్రతుయోగ్యంగా మలచిన మహర్షి కైక నేర్పిన కోదండపాండిత్యం కౌశికుని చేతిలో జగద్ధితప్రయోగ మాహాత్మ్యాన్ని భజించింది విశ్వామిత్రుడు దశరథునితో అన్న మాటల్లో ఆ ధ్వని గర్భితంగా ఉంది

మొనసి భృశాశ్వద త్తములు మూల్గుచునున్నవి నా కడన్ మహా
స్త్రనిభృతవిద్యలల్లె రఘురామునకై యవి యెల్ల నిచ్చెదన్
మనుజమహేంద్ర! పంపుము కుమారుని నా వెనువెంట; నూరకే
యనలము దాచు కొన్న ఫలమా ? క్రతుయోగ్యము
కావలెంజుమీ.

కౌశిక యాగరక్షణం జరిగింది "ఉదిత మహాశార్ముక రసోగ్రదోః ప్రతాప నవవహ్నికా!" అని ముని మెచ్చుకున్నాడు—రాముణ్ణి రాముడు ముని పాదాలకు మోకరిల్లి "స్వామి యొక శిష్యలేశము నీ మాదిరిం బొగడ వచ్చునే" అని అంటాడు. విద్యతో పాటు వినయం వచ్చింది. విశ్వామిత్రుడు చెప్పిన కథలన్నీ వింటే ధృతిక్షమాదులు వచ్చాయి విశ్వామిత్రు డిచ్చిన అస్త్రసంపద రాముని పరాక్రమానికి రక్షణం అతడు చెప్పిన కథావళి అతని శీలనిర్మాణానికి శిక్షణం. శతానందుడు చెప్పిన మేనకా విశ్వామిత్రం రాముని శృంగారజీవితానికి సూత్రోపదేశం ఇక్కడ నేర్పిన పాఠమే రాముడు సీత దగ్గర ఒప్పజెప్పుతాడు

ధనుర్భంగ ఘట్టంలో రాముడు సీతను చూచినట్లు భావించిన కల్పన కమనీయం. రాముడు ధనువు వద్దకు వస్తాడు ఆ భవనం పై అంతస్తులో స్త్రీల కదలిక వినపడి రాముడు తల యెత్తుతాడు సీతాముఖబింబం కన బడుతుంది ప్రథమవీక్షణం లోనే జన్మాంతరవాసనాప్రేరితమయిన ప్రణయం ప్రభవిస్తుంది "అతని దృష్టికి జానకి ఆగలేదు, అతని కృష్టికి శివ ధనుస్సాగలేదు, సీత పూజడ వెన్నుగా శిరసు వంచె, చెఱకు గడవోలె నడిమికి విఱిగె ధనువు" ధనుర్భంగ ఘట్టమెంత గంభీరమో, సీతారాముల ప్రథమవీక్షణమునందు శ్రీరామహృదయంలో ఉద్భవించిన శృంగారభావ మంత సుందము విశ్వనాథ ప్రణయసిద్ధాంతానికిది ప్రాతిపదిక— జీవసంస్కారచైతన్యప్రతీక :

ఇదమిత్థమని నిర్ణయింపఁగారాని దే
కోర్కియో రూపుగై కొన్న యట్లు
జన్మజన్మాంతర సంగతమ్మైన యా
శాబలం బవధికి సాగినట్లు
ప్రాణముల్ బయటికి వచ్చి ముగ్ధాకార
మెనయించి దర్శన మిచ్చినట్లు
తన సృష్టిలోని యుత్తమభావ మానంద
ముగఁబొంగి బింబమై పొడిచినట్టు

లల యరుంధతియును నహల్యయును గోస
లాత్మజయు మువ్వురి యాననముల
కన్నను బవిత్ర మగుచు శృంగారభావ
మొడిసిపట్టిన ముఖచంద్రుడొకడు తోఁచె.

సీతా ముఖచంద్రుడింక జీవితమంతా రాముని నేత్రాల కచ్ఛమైన వెన్నెలల వంటి శృంగారాన్ని పండించడానికి ఈ తొలిచూపు కల్పవృక్షపు కాపు.

రామవివాహఘట్టంలో దశరథుడు పెండ్లి మాట లారంభించగానే మేఘూ లురుముతాయి. పక్షులు పలవరిస్తాయి, ఈ శకున మేమిటని రాజు మునులను ప్రశ్నిస్తాడు వారు— మొదట కొంత వక్రత యైనను, ఋజుత కల్గు ననుసరించి వచ్చి, ప్రళయ మట్లు వచ్చుఁబైఁదేలిపోవు, లేదయ్యా భీతి- అని సమాధానపరుస్తారు దానికి ఫలంగా పరశురామగర్వభంగ సన్నివేశం కలుగుతుంది. వివాహోత్పూర్వమే— ఈ ఘట్టాన్ని ప్రవేశపెట్టడంలో మొదటి ప్రయోజనం సీతాకరగ్రహణానికి పూర్వమే రామునిలో వైష్ణవ తేజం ప్రవేశించినట్లు చెప్పడం; రెండవది వివాహానంతరం అయోధ్యా పయనంలో అహల్యాదర్శనం సీతారాముల చేత చేయించి, ఆమె యిచ్చిన నారచీరలు వారిచేత ధరింప చేయించి, భావి అరణ్యావాసకథార్థసూచనం చేయించడం. భాసుడు ప్రతిమలో కల్పించిన వల్కలధారణ సన్నివేశం కంటె ఈ కల్పనం మధురతరంగానూ సహజంగానూ ఉంది

> 'సీతయు రామచంద్రుడును జేతములందు యుగాలుఁగల్పముల్
> నాతియుఁ బూరుషుండుగ ననంతరదంపతిభావయాపనా
> వ్యాతత సంసృతి|పథములైనటు లాత్మఁ దలంచుచుందు రా
> సీతకు రామచంద్రునకుఁ జేతములందలి ప్రేమ యెట్టిదో.'

అని సీతారాముల అద్వైతప్రేమను అమోఘంగా చిత్రించి, భావి కథార్థధ్వని కోసం, ప్రయోజనంకోసం రామునిలో అంతర్వైరాగ్యాన్ని కల్పించాడు విశ్వనాథ ఈ కల్పన "నేను మనస్సన్యాసిని" అని చెప్పుకున్న విశ్వనాథ స్వభావానికి ప్రతిబింబమేమో ననిపిస్తుంది ఋతువర్ణనలో సీతా రాముల చిత్త వృత్తికీ ప్రకృతికీ ఉన్న పరస్పరప్రభావాన్ని ప్రపంచిస్తూ కల్పనకు సార్థక్యం కల్పించారాయన రతితో ఆత్మరతిని కలిపి రాముని జిజ్ఞాసువుగా మార్చారాయన ఈ కల్పనలో కథార్థధ్వని యిది—

> 'మాయామానుషవిగ్రహుం డయిన రామస్వామి వైరాగ్యరే
> ఖాయుక్తిన్ దనయాత్మదీర్చి కొనెఁగాకన్ సంభవిష్యన్మహో
> త్కామోపాతనయా వియోగదహనజ్వాలల్ సహింపంగ నె
> ట్లైయుండున్ మఱి కేవలత్వపు మనుష్యత్వంబె సంధించినన్.'

అర్ధాంగిని వదలి ఆత్మచింతలో పడి వశిష్ఠుణి జ్ఞానభిక్ష వేడుతాడు రాముడు కొన్నాళ్ళు మూడేండ్లకాపురంలో ముదిత సీత శ్రీరాముని వర్తనం విచిత్ర మనిపించింది—

'అంతట నొక్కనాడు జనకాత్మజ రాముని జూచి యోయి వే
దాంతి ! నిజంబుగానె జనకాత్మజ యిష్టము కాదయేని వ
ర్తింతువ యున్మనీపదధురీణుడ వీగతి నన్ను నేల బా
ధింతువు నీవు క్రమ్మి కడుదెప్పరమై చను నాదుగుండియన్.

అనుకూలుండవ యేని గమ్ము; మఱి కావా ? చన్న
మూడేండ్ల వో
లెను నా గుండియ ఛిన్నధూర్జటిధనుర్లీలాకరున్ నిన్ జిరం
తను మన్నించుచు జీవితాంతము నితాంతంబైన సంయోగభా
వన దీర్ఘవ్రతమై చరింతుఁ గరుణింపం జూడు మిట్లైననున్.'

అని సీత దుఃఖిస్తుంది. రాము డార్ద్రుడౌతాడు. ఆమె నాశ్లేషిస్తాడు. "ఆత్మ నిన్ను నిత్యంబుగా హత్తు కొందు"నని వశిష్ఠమహర్షి మీద ఒట్టు పెట్టుకుంటాడు ఇరువురూ బిగికౌగిళ్ళ హత్తుకుంటారు. వికల్పభీతి వారి సంకల్పాలను సన్నిహితం చేస్తుంది.

హత్తిన ప్రీతి యిర్వురకు నాత్మలయందెడబాటు భీతికిన్
గత్తళమై భజించియు నొకానొక దూరవియోగ రేఖలో
నొత్తినయట్లు తోచిన ముహుర్ముహురావృతగాఢకాములై
చిత్తములం దొకళ్ళొకరు చేరగ నీరు విరామభావమున్.

ఈ ఘట్టం భావి సీతావియోగకథావ్యంజకంగా సంధించడం విశ్వనాథోపజ్ఞ. రామవిరక్తి దశరథుడతనికి రాజ్యాభిషేకం చేయాలని త్వరపడడానికి చక్కని హేతువుగా నిబంధించడం కార్యకారణసంవిధాన శిల్పం.

రామునిలో వైరాగ్య సంసార భావాల సంగమ కల్పనంలో మరొక రహస్యముంది అది రస సంబంధి రాక్షససంహారార్థం అవతరించిన రామునిలో వీరానికి భంజకంగా వైరాగ్యం ఉండటానికి వీల్లేదు. సీతావియోగశోకాతిశయం లేకుండా ఆత్మనియతికి అది తోడ్పడాలి విశ్వనాథవారు రాముణ్ణి విశ్వామిత్రశిష్యునిగా చిత్రించటంలో కలిగిన విశేషమిది గురువుగారిలో శృంగారం వైరాగ్యోద్దీపకమై బ్రహ్మర్షి పదవీ సాధనోత్సాహానికి అంగభూతమయింది శిష్యునిలో వైరాగ్యం శృగారం లోని కామమోహకాలుష్యాలను కడిగివేసి అద్వైతప్రేమగా భాసించ టానికీ, కరుణవిప్రలంభాలను శాసించి కర్తవ్యపరాయణత్వాన్ని కల్పించటానికి తోడుపడింది రామునిలో జిజ్ఞాసశీలిగా అతని దివ్యత్వాన్ని మెరిపించినా అతని సత్త్వచైతన్యాన్ని సాధకప్రవృత్తిలో దీపింప చేసింది వైరాగ్యం అతని ధర్మవీరానికి భంజకం కాదు! మోహశృంగారానికి అంకుశం.

కల్పవృక్షంలోని ఆరు కాండలు ఒక్కొక్కటి ఐదు ఖండాలుగా సమవిభక్తం కావడం విశేషం ప్రతిఖండం ఒక అధునిక ఖండకావ్యంగా నిర్మాణశిల్పంతో భాసించేటట్లు రూపొందించడం నవ్యకవితాలక్షణం ఎత్తుగడ, పెంపుదల, ముగింపులలో విశ్వనాథ కల్పించే నగిషీ పని ఉత్కంఠా వహమయిన ఉజ్జ్వల రచనా శిల్పం, తిక్కన భారతాన్ని ప్రబంధమండలి అన్నట్లే కల్పవృక్షాన్ని కమనీయ ఖండకావ్యమండలి అనవచ్చు ఆకృతిలో ప్రకృతిలో రామాయణానికి ఆధునికత సంతరించిన ప్రశస్తి విశ్వ నాథకు దక్కింది

కల్పవృక్షంలో కల్పనలు ప్రతికాండంలోనూ ప్రతిఖండంలోనూ ఏదో రూపంగా ప్రత్యక్షమౌతాయి సన్నివేశంలో, సంవిధానంలో, వివేచ నంలో, విస్తరణములో, సమీక్షణంలో, సమన్వయంలో, స్వభావచిత్రీ కరణంలో, సంభాషణ విభూషణంలో, భావి కథార్థవ్యంజనంలో, భావ శబ్దార్థ గుంఫనంలో, శైలిలో, శిల్పంలో విశ్వనాథ ప్రతిఘట్టంలోనూ ప్రతి భను ప్రదర్శించాడు. వివరించి వ్రాయడానికి వ్యాసం చాలదు.

అరణ్యకాండలో— దశవర్ష ఖండంలో సీతారామ స్వప్నకల్పనం భావి కథార్థవ్యంజకం అగస్త్యుడు జానకిప్రశంసా వాక్యాలు చెబు

తుంటాడు. ఆమె ఆత్మస్తుతి విముఖురాలై సమీపంలో నున్న హారిణీ సమూహాలను చూస్తూ ఉంటుంది రాముడు ప్రియావిరహియైన ఒక దుప్పిని చూస్తూ ఉండిపోతాడు. రాత్రి ఇద్దరికీ కలలు వస్తాయి సీత కలలో "కడుబసిడి మేను పొడలు, మాఘువత మణులు, కనులు పచ్చలు మిన్నెగం గల్గు లేళ్ళు" కనబడినాయి. రాముని కలలో 'కాంతావిరహిణి యైన దుప్పి' కనబడుతుంది. వాతావరణానికి సహజంగా ఉంది. 'భావలగ్నములు స్వప్నంబుల్ విడంబించెడున్' అన్న మానసిక సిద్ధాంతానికి సరిపోతుంది సీతకు హారిణదర్శనము కలిగినప్పుడే రామునికి సీతావిరహదుఃఖము కలుగుతుందని భావికథార్థసూచనము. ఈ సన్నివేశం అమూలకం ఇందులో—

'ప్రమదారత్నము కానఁ దోడరిగినన్ భర్తృవ్రతాలోక మౌ
ళి మహారత్నము సీత యేమడిగినన్ లేదంచనన్ రాదు ని
త్యము, గాంతారవిహారఖిన్నమతి యేదైనన్ సరే కోరును
త్తమురా లయ్యది తీర్పుటే మిగుల యుక్తంబౌను
శ్రీరాఘవా!'

అన్న ముని వాక్యం ముందు కథకు తగిన ముందుకాళ్ళ బంధాలను వేసింది ఇటువంటి కథాకల్పనలకు విశ్వనాథరామాయణం కల్పవృక్షం

సుందరకాండలోని హనుమత్సందేశం పెక్కు సందేశకావ్యాలకు ప్రేరణనిచ్చింది నలదమయంతుల కథలోని హంస సందేశము, కాళి దాసుని మేఘసందేశంలాంటి కథలూ, కల్పనలూ కోకొల్లలుగా వచ్చాయి. విశ్వనాథ కల్పవృక్షములో— యుద్ధకాండంలో రాముడు సీత యొద్దకు హంససందేశం పంపే కల్పనం చేశారు నైషధములోని హంస కల్పనం వంటిదే యిది హంస అక్కడా ఇక్కడా పరమేశ్వరుడే ఇంద్రజిత్తు చేత మూర్ఛితులయిన రామలక్ష్మణులకు గండం తప్పితే అగ్నిప్రవేశం చేస్తానని సీత ప్రతిన చేయడం భావి కథావ్యంజక మయినదే కాక దేశీయ... స్వభావవిశిష్ట మయిన కల్పన. అరణ్యకాండంలో మాయలేడి ...లో మృతి పొందుతూ లక్ష్మణా! అనటానికి బదులు, కల్పవృక్షంలో లక్ష్మణా... గ్రజా!' అని అరుస్తాడు మారీచుడు. అందులో 'అగ్రజా' అన్న పదము

అస్పష్టముగా అంటాడు. భారతంలోని 'అశ్వత్థామో హతః కుంజరః; న్యాయాన్ని నిపుణంగా రామాయణంలో పొందుపరచారు విశ్వనాథవారు'. మారీచునికి రామస్మరణ పుణ్యం దక్కింది; మనకొక నూత్న కల్పన దక్కింది అన్ని కల్పన లొక యెత్తూ — ఉపసంహారఖండంలోని ఈ క్రింది కల్పన ఒక యెత్తు. అత్రి ఆశ్రమంలో పుష్పకం దిగింది అత్రి దంపతులను సీతారాములు సేవించినారు — "అంత నందఱుం బోయి విమాన మెక్కిన నది బయలు దేరఁబోవు వేళ దూరాన ననసూయాదేవి నడచుచు వచ్చు చుంటఁ జూచి శ్రీరామచంద్రుం డాపిన, నామె నడచివచ్చి శ్రమంపడుచు మెల్లెక్కి రెండు ఫలంబులు సీతచేతిలో నిడి దిగిపోవుచుండ. సీత యా ఫలంబులు రాముని చేతికిచ్చి యామెను మెట్లు దించి తిరిగిరా విమానంబు సాగి చనఁజొచ్చె" సీతారాముల ప్రణయఫలాలైన కుశలవులీ రెండు ఫలాలలో బీజాలు. విశ్వనాథ ఉత్తరరామాయణ కథార్థాన్నంతా ఇందులో ధ్వనింప చేశాడు అనసూయ పండ్ల నివ్వట మెంత గొప్ప కల్పనో సీత రాముని చేతిలో వాటినుంచడం కూడా అంతే గొప్ప కల్పన సీతమ్మ రామునికి పండ్లిచ్చి అనసూయను పంపించి తిరిగి వచ్చింది విశ్వనాథ ఉత్తరరామాయణం కూడా వ్రాసి ఉంటే అదీ మంగళాంతమే అయి ఉండేదేమో!

వాల్మీకి రామాయణకథలో అధ్యాత్మరామాయణ కల్పనలు ప్రవేశించి లోకములో ప్రచారం పొందియున్నాయి విశ్వనాథవారు ఔచిత్యాన్ని బట్టి వాటిని కూడా తమరామాయణంలో పొందుపరచు కొన్నారు. అహల్యను శిలను గమ్మని శపించే కథార్థాన్ని గ్రహించినా ఆ సన్నివేశనిర్వహణలో విశ్వనాథ వైచిత్రిని కల్పించాడు రావణుడు సీతా కరకమలాలను గ్రహించి బలవంతంగా రథంలో ఉంచినా అతని స్పర్శ తగులకుండా విశ్వనాథ చిత్రీకరించాడు.

'దశకంఠు చేతులు ధరణిజా హస్త - జలజాతముల పదిజతలైన
గాజు
లందున నొక్క యాయమ భద్రపరుప-గాజులు చిట్లి
తత్కరములు పెట్లి

నెత్రుకాఱుచు ధారుణీసుతకెంతో-నొవ్వైన సీతాతనూస్పర్శ
దైత్య
కర తలంబున యందుఁ గానట్టిస్థితికి-తల్లి సంతోషించెఁ
దామనస్సునను"

రావణుని (యందలి మోక్షేచ్ఛను జీవుని వేదనగా మలచి పోషించాడు విశ్వనాథ

విశ్వనాథ ఉపాఖ్యానాలను చిత్రించే విధము ఉజ్జ్వలం. ఒక్కొక్క కథ ఒక్కొక్క లఘుకావ్యంగా భాసిస్తుంది బాలకాండలో విశ్వామిత్రుడు చెప్పే కథలు కథాకథనశిల్పానికి శిరోరత్నాలు. శతానందుడు చెప్పిన విశ్వామిత్రుని కథ ఉపాఖ్యానాలలో కెల్లా ఉజ్జ్వలనీలమణి రామ జీవితాన్ని ప్రభావితం చేసింది ఆ మహర్షి కథ. సంసారసారాన్ని, సాహస వీరాన్ని చవిచూచి పరిత్యజించి బ్రహ్మర్షి స్థానాన్ని సాధించిన సాధకుడా మహర్షి. ఆయని లోని శృంగారం, అంతర్వేదన, పరహితార్థబుద్ధి, పరమ పురుషార్థసిద్ధి రాముని జీవితాన్ని తీర్చిదిద్దాయి. సంసారి అయిన రామునిలో మనస్సన్యాసం ఆయన మహిమయే. విశ్వనాథ చిన్న పాత్రలను సైతం చికిలి పెట్టి రూపురేఖలు తీర్చిదిద్దాడు గుహుడు, అగస్త్యభ్రాత, శాంత, శబరి, మంథర, శూర్పణఖ, త్రిజట, అనసూయ— ఇలా ఎన్నో పాత్రలు ఆయన రచనలో పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని సంతరించుకున్నాయి శ్రీరామునిలో పరిహాస శీలాన్ని సార్థకంగా సంతరించారు విశ్వనాథ.

తాహాస్యాద్భుతశీలి రాముఁడు పృషత్కంబుల్
ప్రయోగించుచో
హాహాకారము లేచు మంథరను రాయన్ బాయఁగా సేయుఁ ద
ద్ధాహాకారము లెంతగా బలియునో హాస్యంబు దానంతగా
బాహాస్ఫాలనమూర్తి చేయు రఘురాట్బాలుండు
గగ్గోలుగాన్.

కుబ్జపై చూపించిన కోదండపాండిత్యమే రాముడు కోసల రాజ్యాన్ని వదలి కాననలకు వెళ్ళడానికి అంతస్సంధానముగా అమరింది కల్పవృక్షంలో కైక రాముని పరిహాసం మంథర యందు భాసించటం ఆ పాత్రకే అబ్బిన అదృష్టమని భావిస్తుంది

ఒక్క నీయందె పరిహాస ముజ్జ్వలించు
రామభద్రుఁడెంతటి తపోరాశి వంచు
నవ్వకానట్లు మఱియును నవ్వినట్లె
చంచలించును జేతులాడించు కైక.

తిక్కన గారి నవ్వులను విశ్లేషించి తెలుగు వారికి చెప్పిన విశ్వనాథ కల్పవృక్షంలో పాత్రల నవ్వులను సహస్రముఖాలుగా ప్రదర్శించాడు రసభావ విభావాలను సూక్ష్మాంశాలతో చిత్రీకరించటంలో విశ్వనాథ విశేష ప్రజ్ఞను చూపించాడు మచ్చుకొక్క ఉదాహరణము ప్రస్థానఖండారంభంలో రాజచిహ్నవిరహితుడై యున్న రాముణ్ణి చూచి సీత—

'తెరలుచుకొన్న దిగ్భ్రమయుఁ దీరఁ బకాలున నవ్వి రాఘవా!
యురవడి నా యెదన్ మొదటినుండియు నీ యనుమాన మట్టులే
జరిగిన దట్టులే జరిగె సంగతపెట్టినయట్టి హేతుతా
స్ఫురణము మాత్ర మే నెఱుగఁ జూచెద, దాని ననుగ్రహింపవే!'

'అనినఁ దైన్యపు పొర దాని యంత నదియ
యరుగఁ బొట్టఱు నువ్వుగింజంత నవ్వి
మఱల మొగమున బిగువు గ్రమ్మంగ స్వామి
యేమి యనుమాన మది? యది యెట్లు జరిగె?'

ఇందులో సీత పకాలున నవ్వటంలో నున్న అర్థగాంభీర్యం, రాముని నువ్వుగింజంత నవ్వులో నున్న బ్రహ్మాండమయిన భావము సహృదయులు భావించిన కొద్దీ ఆలోచనామృతాన్ని అందించగలవు

విశ్వనాథవారి సంభాషణా శిల్పము, వాక్య విన్యాస వైఖరి పాత్రల స్వరూప స్వభావాలనే కాక లోకధర్మాన్ని, కళాధర్మాన్ని మేళవించు కొన్న నాటకీయక కళానైపుణ్యాన్ని నిండుగా ప్రదర్శిస్తుంటాయి. రాముడు లక్ష్మణున్ని తెలుగువాడు చిన్నవాణ్ణి పిలిచినట్లు "లచ్చి" అని పిలుస్తాడు.

"నీ కొడుకును గైకొని చని
మా కాకలి యంచుఁ దిందుమా ? పిచ్చినృపా !
మాకడ ప్రశస్త మస్త్ర
వ్యాకృతి కలదద్ది నేర్పెద మింతే."

అనే విశ్వామిత్రుని పలుకులో తెలుగుదనం వెలుగు నింపు కుంటుంది "నీవటోయీ హెూయి! నెట్టిక సీల! నీవా? శైవధనుసును వంచినావు?" అన్న పరశురాముని మాటల్లో ప్రౌఢుడైన తెలుగువృద్ధుని వాక్యవిన్యాసం లాస్యం చేస్తుంది.

"ఈసారి కూడ సామీ !
భాసురముఁగ గుర్తుపట్టఁబడకుంటిని బో
నీ సుగ్రీవునకు జలము
చేసేతన్ వదలుకొమ్ము చేతఃప్రభువా!"

అన్న సుగ్రీవుని దీనవాక్యాలలోనూ "నీ వేమిటి రామా! ఈ విమలేతరము కార్య మేమిటి రామా!" అన్న వాలి మాటలలోని వాక్యాలు హృదయ వేదన వ్యాఖ్యానాలు ఇక సరస సంభాషణ చమత్కారాని కొక ఉదా హరణము చూడండి. అహల్యాఖండంలో రామగాథేయ వాక్య సల్లాపము—

'స్నిగ్ధకెరేవున నౌక సిద్ధముగ నుండెన్ బుణ్యభాగీరథీ
(శ్రీ)కాంతంబులు లేఁగరళ్ళగుములై ప్రేయఃకథాకృష్ణలీ

లాకారమ్ముగ నిన్ను వేచెడిని హేలార్ఘ్యప్రదానక్రియా
స్వీకారమ్మును గాంచవే మునిశిరస్సీమంతముక్తామణీ !'

'అనినన్ నవ్వుచు గాధిసూతి బళిరయ్యా! బాలకాకుత్స్థ! మా
మునిమూర్ధంబుల నట్టకట్టిన జడల్ ప్రోదోచి సీమంతముల్
తనుకన్ బాపటఁదీర్చి యాపయిని ముక్తారత్నముల్ పెట్టె దీ
వనుశే నా తలపైని ముత్యములునై యాముక్తమయ్యెన్
శిశూ !'

పంబుద్ధులను సార్థకంగా వాడడమే కాదు, వాటి మీది సరసోక్తు
లను కూడా సంతరించారు విశ్వనాథవారు

కల్పవృక్షంలో తెలుగు నానుడులు, జాతీయాలే గాక తెలుగు
వాతావరణం కూడా చిత్రింపబడింది దానిలో ముత్యాలజల్లు వంటి
కల్పన సీతారామవివాహం నాటి చిటపట చినుకులు.

'ప్రతి చైత్ర శుద్ధనవమికి
వితతంబుగఁ దెలుఁగునేల విరిసెడు జల్లుల్
సితముక్తాసదృశంబులు
ప్రతనులు తలఁబ్రాలవేళ వచ్చె జిటపటల్.'

తెలుఁగుదనాన్ని రంగరించడానికి రక్తికట్టించిన రచన యిది
విశ్వనాథ ప్రతిభ అచ్చమయిన తెలుగు కవిది!

## 3

"తనలోతు నెఱుఁగని జనుల పూజకుఁ దిర
స్కృతిఁజూపు మత్సరస్వతి సుభద్ర:
తనలోతు నెఱిగిన జనుల పూజకు నవా
దృతిఁ జూపు మత్సరస్వతి సమార్ద్ర."

విశ్వనాథవారి కవితాశైలిని గురించి పర్యాలోచించడానికి ఈ పద్యం-ఒక సూచిక. ఆయన లోతును గనుగొన్నవారు ఆయన కవిత్వాన్ని హర్షిస్తారు. తెలియని వారు నిరాదరిస్తారు. అందరికీ తెలిసేటట్లు కవిత్వం వ్రాస్తే బాగుంటుందనే వారు కొందరున్నారు. 'కిన్నెరసాని పాటలు అందరికీ తెలిసేటట్లు వ్రాశారు ఆ తరువాత క్రమంగా ఆయన శైలిని సంస్కృత సమాసజటిలం చేశారు. అందువల్ల ఆయన "పాషాణపాక ప్రభువు" అన్న వారూ ఉన్నారు

'నిష్ఠావర్ష దమోఘ మేఘపటలీనిర్గచ్ఛదుద్యోతిత
స్వేష్ఠేరమ్మద మాలికాయుగపదుజ్జృంభన్మహాఘోర బం
హిష్ఠస్ఫూర్జథుషండ ఘుర్ఘుర రవాహీనక్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠంబై యొక రావమంతట నెసంగెన్ ఛిన్నచాపంబునన్.'

వంటి పద్యాలు అర్థంకావడం కష్టమని కొందరంటారు. దీన్ని గురించి ఆలోచించే ముందు విశ్వనాథ అభిప్రాయాన్ని తెలుసుకుందాం "కవితాభావన కలవాడు రసములెన్ని? తీసుకున్న కథ యెటువంటిది? ఏ కల్పన చేసినచో ఆ కథకు పొసగును? ఏది లోకోత్తర మయిన ఊహ? ఒక విశిష్టమయిన భావమును చెప్పుటకు వాక్య మెట్లు చెప్పవలయును? ఏ యలంకారము చెప్పవలయును? ఇట్టి అనంతములయిన విషయముల యొక్క పర్యాలోచన స్వరూపము కవిత్వమయినచో కవిత్వమందఱకు అర్థమగుట కష్టము దాని యందు పరిశ్రమ చేసినవారికే అది యర్థ మగును." మహాకావ్యాన్ని రచించేటప్పుడు రచన రసానుగుణంగా ఉందా లేదా? అనే కాని పరిశ్రమచేయని పఠితకు అర్థం కావాలని కవి చూడ డని ఈ మాటల వల్ల అర్థమవుతుంది

అర్థంకావడం శబ్దార్థాలకు సంబంధించింది. అందం భావానికి శిల్పా నికి సంబంధించింది ఆవిష్కృతమయిన కవితలో అందాన్ని కవి నిక్షే పిస్తాడు సహృదయుడాస్వాదిస్తాడు సుమంత్రుడు సీతారామలక్ష్మణులను అడవిలో దింపి అయోధ్యకు తిరిగి వస్తాడు. దశరథునితో ఇలా అంటాడు—

'ఓమహారాజ! నీ యూళ్ళలో, నీళ్ళలో
　　జెలువులందున నొక్క చేప లేదు
భూలోకమఘవ! నీ నేలలోఁ బూలలో
　　దోటలందున నొక్క తేటి లేదు.
పృథ్వీశ! నీ రాజ్యవీథిలో వీథిలో
　　బురము లందున నొక్క పురుగు లేదు
ప్రభు! మీరు చను నసివాళ్ళలో బీళ్ళలోఁ
　　బసిమి మేసెడు నొక్క పశువు లేదు
చిన్నికోడలితోడ రామన్న వదలి
వచ్చుచున్నట్టి నాదు దౌర్భాగ్యముఖము
పరిహరించిరో! నాదు సేవకతపొంచెఁ
బృథ్వీపతి! యెంతగాఁ బ్రతారించినావు!'

ఇది రాముడు లేని రాజ్యాన్ని వర్ణించిన పద్యమా? సుమంత్రుని దుఃఖభావాన్ని దీపింపచేసిన పద్యమా? ఒకటి మరియొక దానికి వ్యంగ్యం. దీన్ని తెలుసుకోవడం కవితాసౌందర్యం తెలియటం అలాగే ధనుర్భంగంలో నున్న రచనాసౌందర్యాన్ని గ్రహింపవచ్చు. సుమంత్రుని ఘట్టంలో ఉన్నది భావప్రధానమైన రచన అందువల్ల శబ్దం దానికి ఒదిగి పోయి గౌణధర్మాన్ని ప్రదర్శిస్తుంది; ధనుర్భంగఘట్టంలో వస్తువే శబ్దం దాన్ని శబ్దమే ధ్వనింపచేయాలి అర్థం అక్కడ శబ్దానికి గౌణం శబ్దార్థోభయ ప్రాధాన్యవివక్ష సన్నివేశరస భావార్థాలను బట్టి ఏర్పడు తుంది అది తెలిస్తే శిల్పం తెలిసినట్లే కల్పవృక్షం విశ్వనాథ రచనా శిల్ప వృక్షం.

"నన్ను నెఱుగరో తెలుఁగునాట మీరు
విశ్వనాథకులాంభోధివిధుని బహువి
చిత్రచిత్రధ్వనిజహాలువిచ్ఛిత్తి మన్మ
హాకృతిప్రణేత సత్యనారాయణ కవి".

(త్రిశూలము)

అని చెప్పుకున్న విశ్వనాథ కావ్యాన్ని ధ్వనిసిద్ధాంత మర్మజ్ఞానంతో చదవాలి అందులోని లోతును గమనించాలి.

విశ్వనాథ పూర్వమహాంధ్రకవుల కవితాగుణాలను తన కవితలో సంగమింపచేసుకొని తనదైన ఒక మార్గాన్ని నిర్మించుకున్నాడు నన్నయ్య వాల్మీకిలాగా ఋషివంటివాడు. ఆయన ధారామధురమయిన రచనలో నున్న కథాకథన శిల్పాన్ని గ్రహించాడు విశ్వనాథ. శిల్పపు తెలుగుతోటయైన తిక్కనలోని వాక్యరచనావిన్యాసాలను ఒడిసి పట్టాడు. ఎఱ్ఱన సర్వమార్గేచ్ఛావిధాతృండని చెప్పి తానూ ఆ లక్షణాన్ని అలవరచుకొన్నాడు. పోతన భక్తిని మనసులో రంగరించుకున్నాడు. శ్రీనాథుని రసప్రసిద్ధధారాధునిని తన పంటకు కావలసినంత మేరకు కుల్యాలు చేసి నింపుకున్నాడు కృష్ణరాయని సమాసరచనద్వారా ఊహాను సంగ్రహరచనలో సాధించే కళ నేర్చుకొన్నాడు పెద్దన్నలోని వస్తుధ్వని, రామకృష్ణులోని పదగుంఫనం— ఇలా— రామాయణ కవితలో అన్నింటినీ పొందుపరిచాడు. అంతే గాదు 'ఒకడు నాచన సోమన్న'గా 'ఒకడు విశ్వనాథ' అనిపించుకున్నాడు.

విశ్వనాథ రచనకు ఓజస్సు, తేజస్సు, ప్రసాదం, ప్రకృతి మాధుర్యం మహిమ ఆయన భావాన్ని ఆవిష్కరించేటప్పుడు ప్రసాదాన్ని ప్రసరిస్తూ భావస్వభావాన్ని బట్టి మాధుర్యోజస్సులను మిళితం జేస్తారు. భావనను రేకెత్తిస్తున్నప్పుడు ఓజస్సును స్వీకరించి దాని బలాన్ని గుణాన్ని బట్టి ప్రసాద మాధుర్యాలను మిళితం చేస్తారు. అంతఃకరణప్రవృత్తిని చిత్రించేటప్పుడు మాధుర్యాన్ని ఆలంబనంగా చేసుకొని మిగిలిన గుణాలను సమయోచితంగా మిళితం చేసుకుంటారు. ధనుష్ఖండంలో మేనకావిశ్వామిత్ర ఘట్టంలో—

'పనియేమో దేవతలది
వనితా! కూలికినిగాని వచ్చిన యట్లు
య్యూను నెడఁదలోఁతులిచ్చిన
నిను నేల శపించవలయునే మధుమూర్తీ!'

అన్నది ప్రసాద గుణమైతే— 'వసంత నవ శోభ వచ్చె నప్సరస వోలె' నని వర్ణించిన సీసంలో ఓజస్సు ప్రధానంగా నడుస్తుంది 'కోరి ప్రత్యక్ష మన్మథ గురువవైతి, కోరక పరోక్ష వైరాగ్య గురువవైతి' వను పద్యంలో మాధుర్యం మణితం చేస్తుంది.

విశ్వనాథ రచనలో మరియొక విశేషం ఆయన పద సంవిధాన విధానం. ఆయన ధారామాధుర్యాన్ని మౌలికంగా అభిలషించడు. ధార ఆవేశానికి చిహ్నం విశ్వనాథకు ఆవేశం లేదని కాదు అది ఆలోచన పొరల్లో పడి వేగం తగ్గి విశ్లేషణాత్మకంగా వెలువడుతుంది ఆలోచన అంతఃప్రవృత్తి వ్యక్తం చేస్తుంటాయి. ఒక్కొక్కసారి ఈ రెండూ సమ భాగాలుగా ప్రసరించే తావులు కనబడుతాయి. వీటన్నింటికి మించి విశ్వనాథకు తన వ్యక్తిత్వం మీద అభిమానం ఉంది- అది తాను చేసే శిల్పాన్ని తెలిసిచేయటంవల్ల ఏర్పడిన స్థైర్యం కవి వ్యక్తిత్వం, ఆలోచన, ఆవేశం ఈ మూడింటిలో శ్రోతకు ముందు కావలసింది ఆవేశం. అ తరువాత ఆలోచన, ఆ వెనుక కవి విశ్వనాథ తాను తన ఆలోచనతో ముందు ప్రత్యక్షమై పరితను తనతో తీసుకొని పోతుంటాడు. తిక్కనాదులు ఆలోచనను ముందు త్రోసి తాము వెనుక ఉండేవారు నన్నయాదులు ఆవేశాన్ని ముందుంచి తమనూ, తమ ఆలోచనలనూ రచనలో లీనం చేసేవారు. నాచనసోమ నాదులు విశ్వనాథ వలె తమనూ, తమ ఆలోచననూ ముందుంచేవారు. నాచనసోమునికీ, విశ్వనాథకూ ఉన్న భేదమేమిటంటే నాచన సోముని కన్న విశ్వనాథలో ఆలోచనాంశ అధికం. నిలువెల్ల భావనగా భాసించే విశ్వనాథ రచనలో, కథలో అడుగడుగునా ఆయన ముద్రకూడా మనల్ని మోహపరుస్తుంటుంది. అదీ ఆయన ప్రత్యేకత.

'అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదాభోగ మస్మాదృశుం
డలఘుస్వాదురసావతారధిషణాహంకారసంభారదో
హలబ్రాహ్మీమయమూర్తి శిష్యుడయినాఁ డన్నట్టి దావ్యోమపే
శలచాంద్రీమృదుకీర్తి చెళ్ళపిళ్లవంశస్వామి కున్నట్లుగన్.'

ఈ పద్యం విశ్వనాథ కవితా స్వభావాన్ని పట్టి యిస్తుంది పదశ్రేణిలో భావం చాలా ఉదాత్తమయింది చెప్పే తీరు ఉత్కంఠావహమయింది. భావంలో పరవశిస్తున్న పరితకు విశ్వనాథమాత్రం మార్పుకు రాడు. రామాయణంలో కూడా ఈ తత్వం మరొక రూపంగా ప్రత్యక్షమౌతుంది రామునిలో నారాయణతేజం ఉంది. రామునికా తేజం నివురుగప్పిన నిప్పులా స్ఫురిస్తుంది ఋషులు, భక్తులు ఆ నివురును తొలగద్రోస్తూ జ్యోతిని చూస్తుంటారు పరితకు రామునితో తాదాత్మ్యం చెందితే ఒక విధంగానూ, భక్తులలో తాదాత్మ్యం చెందితే ఒక విధంగానూ రసస్ఫూర్తి కలుగుతున్నట్లుగా అనిపిస్తుంది ఒకటి ధర్మవీరం, మరొకటి భక్తి భావం. మధ్య విశ్వనాథ వారి జీవునివేదన ఆ రెండింటికీ వారధిగా రామాయణరచనలో సాక్షాత్కరిస్తుంది.

'అమ్మా! దేహమునన్ విచిత్రమగు దుఃఖారామ మన్పించు దే
హమ్మున్నంతన జీవి పొందనగు బాధాసహ్యతల్ చెప్ప శ
క్యమ్మా? యొక్కొక జీవి యొక్కొక విధంబై పొందు
దుఃఖమ్మె రా
జ్యమ్మో! రాణియొ కాననంబొ ఋషి భార్యారత్నమో
చెప్పగన్.'

రాముడు కౌసల్యతో అన్న మాటలివి. విశ్వనాథ కల్పించిన మాటలివి. జీవితాన్ని నిండుగా జీవిస్తూ అందులోని జీవచైతన్యాన్ని, సంస్కార సారాన్ని, తాత్త్వికతాత్పర్యాన్ని దర్శించిన బ్రాహ్మీమయమూర్తి విశ్వనాథ. రామాయణ కావ్యాన్ని ఆత్మాన్వేషణకోసం వ్రాసిన విశ్వనాథ— పరితులకు ఆ లోతులను చూపిస్తాడు రామునిలోని అన్వేషణ విశ్వనాథ; భక్తులలోని అన్వేషణ విశ్వనాథ. రామునిది ఆత్మాన్వేషణ, భక్తులది పరమాత్మాన్వేషణ- అది కావ్యంలో రసఫలాన్నిచ్చింది; సందేశంలో సాయుజ్య మార్గాన్ని కాంతాసమ్మితంగా బోధించింది రసలోకంలో రాముడు వీరుడు; జ్ఞానలోకంలో రాముడు దేవుడు రామకథా కల్పవృక్షాన్ని పెంచింది విశ్వనాథ; అది ఏ కోరిక కోరితే ఆ కోరికనిస్తుంది.

'సద్యోనిర్గతమైన సర్వకవితాసంభారమున్ నీకు నై
వేద్యంబిచ్చితి రామచంద్ర! ప్రభువా! విశ్వాసముంబూనవే
యాద్యంబై చను జీవలక్షణము సంహారంబు గావింపవే
హృద్యంబై చను నీదు తేజమును సారింపంగదే గుండియన్'.

విశ్వనాథ జీవలక్షణం కల్పవృక్షసృష్టికి బ్రహ్మత్వాన్ని కల్పించింది. ఆయన కోరుకున్న జీవలక్షణసంహారం ఆయనకు శాశ్వత బ్రహ్మసిద్ధిని కల్పించింది విశ్వనాథ కృతి యుగయుగాల సంస్కృతి పతాక. ఈ యుగానికి ప్రతీక! ఆయన రామాయణకల్పవృక్షానికి వచ్చిన జ్ఞానపీఠ పురస్కారం ఈతరం గుర్తించిన ఒక పెద్ద విలువ.

# విశ్వనాథ కవితా ప్రాగల్భ్యం

—శ్రీ ఖులుసు సూర్యప్రకాశం

"విశ్వనాథ సత్యనారాయణగారు అసాధారణ ప్రతిభాసంపన్నులు, అపూర్వప్రజ్ఞాధురీణులు" అని యెవ్వరనగలరు? ఆయనసంతటి ప్రజ్ఞలో, ప్రతిభలో నధికు డొకడుండినగదా అట్లనగల్గుట! అట్టి వారేరీ!

శా. నిష్ఠావర్ష దమోఘమేఘ పటలీ నిర్గచ్ఛ దుద్యోతి త
స్ఫేష్మేరమ్మద మాలికా యుగపదుజ్జృంభ న్మహాఘోర బం
హిష్ఠ స్ఫూర్జథుషండ ఘుర్ఘురరవాహీనక్రియాప్రౌఢి ప్రా
ఘిష్ఠంబై యొక నాద మంతట నెసంగెన్ ఛిన్నచాపంబునన్.

దాదాపు ఇరువదైదేండ్లకు వెనుక "కృష్ణాపత్రికలో" కీ. శే. బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు "శ్రీమద్రామాయణకల్పవృక్షము"నుగూర్చి వ్రాయుచు పై పద్యమునే ఉదాహరించి- "ఇట్టి దుష్కర ప్రాసతో బిగి చెడకుండ, భావగంభీరత సడలకుండ పద్యమును గూర్పగల వారెందరున్నారు?" అని వ్రాసిరి

శ్రీమద్రామాయణకల్పవృక్షములో పై పద్యమునకు వెనుక నొక సీస మున్నది "శ్రీరామచంద్రుడు శివుని వింటి నెక్కువెట్టి విఱచుట" అందు వర్ణింపబడినది. ఆ సీసముయొక్క తేటగీతి-

అతని దృష్టికి జానకి యాఁగలేదు
అతని కృష్టికి శివధను స్సాఁగలేదు
సీత పూజడ వెన్నుగా శిరసు వంచెఁ
జెఱకుగడవోలె నడిమికి విఱిగె ధనువు.

ఇట్లు శివధనుర్భంగమును కవి చాల తేలికపదములతో వర్ణించెను. చెఱకుగడవోలె నడిమికి విఱిగె ధనువు" "విల్లు విఱిగె" ననుట యందొక్క ద్విత్వాక్షరముకాని, సంయుక్తాక్షరముకాని కవి వాక్కులో చోటు చేసికొనలేకపోయినది కాని, అందుండి పుట్టిన ధ్వని! అది తేలికగా లేదు. దుష్కరప్రాసతో పద్యము మూఁడు పాదము లొక్కబిగిని సాగి ద్రాఘిష్ఠమైన సంస్కృతసమాసములో మెఱుపులు మెఱిసి, ఉరుము లురిమి, పిడుగుల మొత్తమై-"విఱిగనది హరకోదండము సుమా!" అనిపించినది సీసములో నంత సరళముగానున్న కవివాక్కు వెంటనే ప్రళయభీకరమై ధ్వనించినది.

ఛిన్నధనూరావము శివలోకమున విశ్రాంతికి హేతువై, సర్వలోకముల నానందమునకు గారణమై, అసురలోకములయందధికదర్పాటోపము జూపి, రాజలోకమున యశోగీతికాకృతితో పరువులు వారినది "భయము-విశ్రాంతి-ఆనందము-దర్పము-'ఆహా!' యన్న ప్రశంస" యొక్కటి కావు కదా! చెఱకుగడవోలె నడిమికి విఱిగిన ధనువునుండి పుట్టిన నాదముయొక్క పరిణాహమును వర్ణించుటలో దుష్కరప్రాసముతో సమాసద్రాఘిష్ఠమైన కవివాక్కు శైవలోకముల యందానాదము విశ్రాంతిని కలిగించెనని చెప్పుటలో మరల నడక మార్చినది.

శా. హేరంభోన్నత శూర్పకర్ణవివరహ్రీంకారియై షణ్ముఖ
స్ఫారద్వాదశనేత్రగోళవివృతిప్రాకారమై, శైలక
న్యారాజన్నవఫాలమండలవిభుగ్నక్రీడమై, యాశ్చల
ద్దీరుగ్రప్రమథమ్ముగా ధనువు ద్రమోగెన్ శైవలోకంబులన్.

ఈ నాదము విని సర్వలోకములు- 'అవతార కార్య మారంభమైనది, హరకోదండ మదిగో? తునిగినది, అసుర కదంబము లణగారు కాలము సమీపించినది'- అని ఆనందముతో నర్తించెను దానిని వర్ణించుటకు కవి వాక్కు వెంటనే 'నృత్యన్మంజులమై' పోయినది.

శా. నృత్యన్మంజుల తారహారకబరీనిష్యంది ముక్తామణి
ప్రత్యగ్రప్రసవాళిసంకలనదీవ్యత్కంధరాభేద సా
హిత్యప్రౌఢ నవాప్సరోనటనసాహిత్య ప్రశస్తాచ్ఛదృ
గ్గీత్యాకార మనోజ్ఞమై ధనువు మ్రోగెన్ సర్వలోకంబులన్.

ద్రుతగతితో సాగుచున్న నృత్యమున నర్తకియొక్క మెడలోని ముత్తెముల సరు లామె కదలికలవెంబడి మనోజ్ఞముగా కదలాడును; ఆమె కబరీభారమునుండి పూలు రాలును, ఆమె కన్నుల మెఱుపులతో నిరుబుజము లొప్పులు గురియుచుండును, ఆ నృత్యసౌందర్యము నిబ్బడి ముబ్బడి చేయుచు నొక మధురగీతిక సాగును-కాని వీని నన్నిటిని లెస్స గుర్తించుటకు వేగవంతమైన చూపు, ఆ చూపు వెనుక సూక్ష్మపరిజ్ఞానము ఆవశ్యకములు అవి లేనప్పుడా మంజులత యెదకు హత్తుకొనదుకదా! అట్లే యిదియును

దీనికి తరువాతి పద్యములం దొకటి "అసురలోకములయందు సాగిన ఛిన్నధనూరావదర్పాటోపమును", వేరొకటి "అహా!" యని పొంగిన అవనిలోని రాజన్యసభాప్రశంసాగీతికారావములో గలిసిన దాని మనోజ్ఞతను వివరించినవి.

చూ— దర్పస్వీకృత..........
స్ఫీతాష్టాపద.............

ఇట్లు సన్నివేశము మారుచుండగా అనుపదము శైలి మార్చి పలుకుట మహాకవులకే సాధ్యము సాధారణకవి తానేదోయొకశైలికి మాత్ర మలవాటుపడి యుండి యేమి పల్కినను నొకేతీరున పల్కును. సన్నివేశమును బట్టి శైలిని మార్చుకొనుటకు వానికి సత్తువ చాలదు

లోకమునం దున్న కవులందరు నొకేవిధముగా నుండరు. వేదాంతమున "అన్నమయ-ప్రాణమయ-మనోమయ-విజ్ఞానమయ-ఆనందమయ కోశములు" వర్ణింపబడినవి స్థూలశరీరమే అన్నమయ కోశము; ప్రాణము ప్రాణమయ కోశము, మనస్సు మనోమయ కోశము, బుద్ధి విజ్ఞానమయకోశము కవులలో కొందరు అన్నమయకోశమునే అంటి

పెట్టుకొని పల్కుదురు. అట్టివారి కవితయంతయు స్థూలశరీరమునకు సంబంధించిన సుఖదుఃఖములతో నిండియుండును. కొందరు ప్రాణమయ శరీర తాదాత్మ్యముకల కవులుందురు. వారి కవితలో ప్రాణము తొణికిస లాడుచుండును ఇట్టి కవుల కావ్యములు చక్కని శయ్య గలిగి, అధిక జనా కర్షకములై "ఆహా" యనిపించును కాని ఆ కావ్యములను నిశితముగా పరిశీలించిన—"చెప్పుటలోని యొదుపేకాని చెప్పిన దెంతో యుండదు." ఇక మనోమయకోశమును జేరిన కవియొక్క కావ్యము కల్పనాలలితమై యుండును ఈ కోశమున కీవల ప్రాణమున్నది, ఆవల బుద్ధి (విజ్ఞానమయ కోశము) ఉన్నది ప్రాణమునుండి రూపుకట్టుచున్న మనోమయకోశమున తాదాత్మ్యము పొందియున్న కవియొక్క కవితలో కేవలమైన కల్పనా లాలిత్యమే యుండును. మనోమయకోశము విజ్ఞానమయకోశమున విలీనమగుచోట తాదాత్మ్యము నొందిన కవియొక్క కవితలో బంగారము పండును

కొన్ని జన్మములు దాటితిని మనోమయకోశంబునందు
నున్న జన్మమిది, యింకెన్ని జన్మలకో మరిరెండు
మున్నున్న కోశముల్ దాటి నీవైన మూర్తితో నొక్క
డన్నది యగుట శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ!

-విశ్వనాథ మధ్యాక్కఱలు.

'కల్పవృక్షము' లోని పై పద్యము లెందరకర్థమగును? అని కొంద రందురు

'గ్రంథ గ్రంథి రిహాక్వచిత్ క్వచిదపి న్యాసి ప్రయత్నాన్మయా
ప్రాజ్ఞమ్మన్యమనా హఠేన పఠితా మాఽస్మిన్ ఖలః ఖేలతు'.

-హార్షనైషధము.

(నేనీకావ్యమున "గ్రంథ గ్రంథుల నచ్చటచ్చట సప్రయత్నము నిక్షేపించితిని పండితమ్మన్యులకు నా కావ్యము క్రీడాంగణము కాదు. శ్రద్ధగా గురువుల నారాధించినవారికే యీ గ్రంథులు, ముడులు విడును.")

ఇట్లే విశ్వనాథవారి కల్పవృక్షమునందును గ్రంథ గ్రంథులున్న వి కల్పవృక్షమునందే కాదు, వారి నవలలయందు సైతము ఎన్నో సామాన్యుల బుద్ధికందని ఔన్నత్యములు కాన్పించును ఆ ఔన్నత్యముల నధిగమించుటకు యత్నించుట మాని వానిని నిరసించుట 'ఆడలేక మద్దెల ఓడనుట' చిద్గగనవిహారియైన సిద్ధకవి మాటలు 'చిద్గగనము'[1] అననేమో శబ్దార్థమైన గుర్తింపజాలని వారికెట్లు తెల్లమగును! అందుచే విశ్వనాథవారి గ్రంథములు చదివి ఆనందించుటకు కేవలము భాషాజ్ఞానమున్న చాలదు కొంత దైవాభిముఖమైన చిత్తవృత్తి కలిగి, అంతర్ముఖుడగుటకు రవ్వంతయైన యత్నించు పాఠకునకు వారి గ్రంథము లెక్కువ యానందమును కలిగించును

'ఎవరైన నిట్లూహింపగలరా! ఈ భావమును మాటలలో వ్యక్తీకరింపగలరా!'—అని పాఠకుడు విశ్రాంతి చెందదగిన సన్నివేశములు వారి రచనలయందు కొల్లలు. అన్యకావ్యము లందట్టివి రెండుమూడుగానుండి యెత్తిచూపుటకు వీలు. కాని విశ్వనాథవారి రచనలయందది సాధ్యమైన విషయము కాదు. ఏమన, అనుపదము అట్టి సన్నివేశమే

'పంచభూతములు దివాకరుండును నిశా
కరుడు నీతనుసప్తకంబ యేని
యీ శరీరంబు నీదే.............
ఏతదధిష్ఠాత యెవ్వడో యజమాను
డనిన నీ యష్టమ తనువువాడు
కెరలి నన్నేమి మిగిల్చితి నాసామి !
బిట్టు నే నన్న దభిజ్ఞ గాక! ............'

శివుడు అష్టమూర్తి 'పంచమహాభూతములు, సూర్యచంద్రులు యజమానుడు' అనెడు ఎనిమిది మూర్తులు శివునివే అట్లయినపుడు 'నేను' అన్న దెచ్చట నిలుచును? నిజ మరయగా ఈ 'నేను' లేనిదే కేవలము అభిజ్ఞగా (గురుతు) దీని వ్యాపారము సాగుచున్నది. ఇట్లు కవి కావ్యా

[1] చిద్గగనము :- జ్ఞానము - జ్ఞేయము - జ్ఞాతయను త్రిపుటి యేకాకృతిని భజించుట.

రంభమునందే— 'ఆకాశ మెంత యెత్తు!' —అనిపించెను. స్వర్గముతో దన కక్కఱ లేదన్న శివాద్వైతభావనాసిద్ధుడు కవియన్న మాట మరువరాదు

కం. కృతిచే సమాత్తమగుఁ గీ
రితి స్వర్గదమంతె, నే వరింపను స్వర్గం,
బతిరూఢచింతనాగ్ర
స్థితతేజము శివుడు నన్ను జెందెడు గాతన్.

ఇట్లు పెక్కుచోట్ల విశ్వనాథవారు స్వర్గమును దృణీకరించిరి. స్వర్గమును గామించు కవియొక్క కావ్యములో లోకమునకు లౌకికముగా గావలసిన సామగ్రియుండును, అద్వైతవీథీవిహారియైన కవి కావ్యమునందు లోకాతీతములైన వెలుగులు వెల్లి విరియును.

ఒక అపూర్వవిషయము :— ద్వైతమునందే విశ్వమున్నది అద్వైతమునందు లేదు ఎవ్వని బుద్ధి ద్వైతమును దాటి అద్వైతముయొక్క అంచులను స్పృశించుట జరుగలేదో సాధారణముగా అట్టివారే కవులగుచున్నారు. అద్వైత భావసిద్ధుడు కవియగుట అరుదు. ఒకరిద్దరట్టి వారున్నను వారింత కావ్యసృష్టి చేసినవారు కారు.

'దృగ్ బ్రహ్మ దృశ్యం మాయాస్యాత్ ఇతి వేదాంత డిండిమః'— అద్వైత మెట్టి దృశ్యమును సత్యముగా నంగీకరింపదు. దృశ్యమును సర్వమును నిరసించి దృఙ్మాత్రముగా నిలువగోరు అద్వైతి మనోరాజ్యఫలమైన కావ్యమును సృష్టించుట యెట్లు? కేవలము అద్వైతమును గూర్చి శాస్త్రజ్ఞానము కలవారు కావ్యరచన సేయుటయుండును; కాని శివాద్వైతభావనాసిద్ధుడైనవాడు కవియై యింత కావ్యసృష్టిచేయుట అపూర్వము. ఒకవేళ నట్టివాడు రామాయణము రచించినను నంతగా నబ్బురమంద నక్కర లేదేమో? కాని సర్వతోముఖమైన సాహిత్యము నుదాత్తముగా విరచించుట నిజముగా నపూర్వము అందువలననే విశ్వనాథ సత్యనారాయణగారికబ్బములనుజూచి లోకమంతయు నుబ్బుట.

చం. పది పది వీడు నన్ను నెద భావన సేసెడు నంచు సుం
త దయను వచ్చి నాదు నెడదం జరియింతువు కొంత సేపు, నీ

పొదలికవేళ నేమియయిపోదునో యంచు భయంబు
పుట్టెడున్
కదలెడు జీవభావము వికారము సైతము మాన్పవే శివా!

కేవలము శాస్త్రగ్రంథములు చదివియున్న వారిట్లు పల్కుట అసాధ్యము; ఇట్లు పల్కుట సిద్ధునకే చెల్లును. ఆ సిద్ధుడు కవియగుట, మహాకవి యగుట, కొల్లలుగా కబ్బములు రచించుట ఆంధ్రభాషామతల్లిక యొక్క సౌభాగ్యము.

రామచంద్రుడు, భరతుడు మేఘశ్యామల దేహులు. లక్ష్మణుడు శత్రుఘ్నుడు సంజకెంజాయ మేనిపసవారు వారు నల్వురు క్రీడించు అవనీభాగము—

ఆ.వె. ఒక్కసారిగాగ నుభయ సంధ్యలు, దక్షి
ణోత్తరముల యందు నొదిగి యున్న
నీలి నీడలొప్పు నింగివోలిక
నల్వు రన్నదమ్ములాడు నవని దోచు.

సూర్యుడస్తమించుట, చంద్రుడుదయింప బోవుట యొక్కసారిగా జరిగినపుడు (పున్నమినాడు) ప్రాక్ప్రతీచీ దిశాముఖము లెఱ్ఱగా నుండి, దక్షిణోత్తర దిశాభాగములు నీలినీడలతో నిండియున్నట్లు— ఉన్నదట ఇదెంత రమ్యమైన యూహా అదియును ఆటవెలది పద్యములో!

రామలక్ష్మణులతో విశ్వామిత్రర్షి మిథిలకు చేరుకొనెను తెల్లవారిన శివధనుర్భంగము జరుగును. తెల్లవార బోవుచున్నది. కోడికూసినది.

సీ. ఛిన్నచాప వ్యవస్థితి మూడు విరుపులై
కుటిలభుగ్నక్రీడ కోడి కూసె.........

మూడు ముక్కలుగా తునిగిన వింటిచప్పుడు ననుకరించుచు కోడి కూత కుటిలభుగ్నముగా సాగినదట. ఇట్టి వెవ్వరూహింపఁగలరు!

వనములో రాముని యొద్దకు శూర్పణఖ కామినియై వచ్చినది ఆమె శరీరమున సౌందర్యమున్నది కాని అది సహజముకాదు, తెచ్చిపెట్టు

కొన్నది ఆ సౌందర్యము కామింపదగినది కాదు, పరిత్యజింపదగినది. ఆమెను గూర్చి కవి—

సీ. విరిసి మన్మథరాజు బిట్టావులించిన
యాకాశ మది రూపమందె ననఁగ
విరియమ్ములవాని విల్ ఫెళ్ళున విఱిగిన
ఘనురావ మది మూర్తి తనరె ననఁగ
శివదృగగ్నినిపీత నవమన్మథ శరీర
శిఖ యిట్టి యాకృతిఁ జెందెననఁగ
మన్మథదహనసంభవరతీబాష్పసం
తాన మీదేహంబు పూనె ననఁగ

నన్నియును గూడి యిట్టు లాయె నొక్క
యనఁగ లోచనసహజదర్శనసమగ్ర
శక్తి యుపసంహృతిచ్ఛిదాచటుల మగునొ
నా నొకానొక కామిని కానిపించె.

అని వర్ణించెను ఆకాశాది పంచమహాభూతముల పాళ్ళ చేరికతో కదా శరీర మేర్పడును! శూర్పణఖ యొక్క వర్తమాన శరీరమందు ఆకాశాది పంచమహాభూతముల యంశలున్నవి. అవన్నియు మన్మథునే తాకుచున్నవి కాని ఎట్టి మన్మథుని? మరణించుచున్న మన్మథుని, మరణించిన మన్మథుని.

"మరణించుచు మన్మథుడు నోరావులింపగా దోచినయాకాశము— ఆ మన్మథుని విల్లు ఫెళ్ళున విరుగగా నుదయించిన శబ్దతరంగమైన గాలి— ఆ మన్మథుడు శివుని కంటిమంటలలో గాలిపోవుచుండగా నెగసిన అగ్ని— ఆ మన్మథుడు మరణింపగా నాతని యిల్లాలైన రతీదేవి కార్చిన కన్నీరు— ఇట్లన్నియు గలిసి కామినీరూపమందెనా యనినట్లున్నది శూర్పణఖ."

అశోకవనములో సీతను రావణవశవర్తినిగా జేయుటకు యత్నించు రాక్షసస్త్రీలలో నొకతె వికట. ఆమె సీతతో—

కం. పదినెలలురాని యా మగ
డిదిగో రెన్నెలలలోన నేతెంచును దా
నదె యోడమీద వచ్చెడుఁ
గదలెడు తెలచాప మీకుఁ గనఁబడ లేదా!

వ. అని తన నాలుక చూపింపగా నందఱును బకాలున నవ్వి యందులో నొకర్తుక-యోసీ! యబద్ధము లాడెద వెందులకే! యముని వదనము నావయై నీనాలుక తెలచాపయెట్లగును? నిర్దయుఁడైన స్వామి వలన నీ కాయదృష్టము పట్టలేదు...............

ఆ వికట రాక్షసి కదా! ఆమె నాలుక యోడ తెలచాప అంత యున్నది. సీతను వెదకుచు రాముడు వచ్చుచున్నాడని, తెలచాప చూడు డని ఆమె తన నాలుక చూపించినది రాముడు మరణించునే కాని, యిటకు రాజాలడనికదా వారి నమ్మిక అ విశ్వాసమునే బలపరచుచు నొకతె— 'రాముడు యముని మొగమన్న యోడపై నున్నాడు. నీ నాలుక ఆ యోడకు తెలచాప యెట్లగును?' అన్నది

ఆ సందర్భమునందే ఆ రాక్షసస్త్రీలు— సీతా! నీవు మా మాట వినక మమ్ము చాల ఏడ్పించుచున్నావు నీవు పుట్టినది మొదలందర నేడ్పించు చునే యున్నావనుచు—

సీ. శివమహాకార్ముకచ్ఛేత్త యెవ్వాడని
కన్నతండ్రికిని దుఃఖంబు తొలుత
శివమహాకార్ముకచ్ఛేత్త వీడంచు భా
ర్గవరామునకును దుఃఖంబు పైని
తగ మహాటవిని జంకతాళివి మఱి తాళి
కట్టినవాని దుఃఖంబు మరియు
నీవన్న దలమునకలౌ వలపైన రా
క్షసరాజునకును దుఃఖంబు పెచ్చు

తే.గీ. ఇంక మామాట చెప్పగానేల రేపు
వరుగు తినిపించెదవు మమ్మ పరమదుఃఖ
మయ విచిత్రలోకేశ్వరీ ! మాయవై సు
ఖంబు చూపించెదవును దుఃఖంబు నెఱపి.

చం. ఎవతెవో కాని మాజనని యిచ్చటికిం జనుదెంచినావు, ల
క్ష్మివి జగదంబ పీవెచట జేరిన నచ్చట దిబ్బవేసి పోదువు....

ఈ రీతిగా కవి అనుపదము మహాభావములను గ్రుమ్మరించును.

హనుమ లంక నంటిచుచు నానావృత్తంబుల సంచరించె ననుటకు విశ్వనాథవారు వ్రాసిన వచనము — రూపింపగారాని నడకతో నారంభమై అందుండి సీసములోనికి - అటనుండి శార్దూలములోనికి - దానినుండి తేట గీతిలోనికి - అటనుండి కందము లోనికి - అచట నుండి మత్తకోకిలము లోనికి - దానినుండి పంచచామరమునకు - తిరిగి తేటగీతికి నురుకుచు దూకుచు నానావృత్తాకృతియై సాగినది.

"అంత నిచ్చటనుండి యచ్చటకి నేగు నటన్న నిశ్చయంబు లేకయే, 'యెచ్చోట దిగునా తానచ్చోట పట్టుమం, చొక ముహూర్తంబైన నుండ డొక' (సీసము), యేమైనన్ సరి వాని ఖడ్గములతో నేచం జనన్ నేరక (శార్దూలము), యున్నచోట మహాగ్ని యుత్పన్నమగుట కొకనిమేషంబు పట్టక (తే గీ). యాయుధముల కందక మఱి, యాయత దేహమున దిరుగు'చు (కందము), దైత్యనాయకు నింటిమీదికి తానుపోయి ప్రధానమౌ చైత్యమందున నగ్నిపెట్టి (మత్తకోకిలము), పరాభవన్మరుత్త్వరా ప్రభావ భాసురాకృతిన్ (పంచచామరము) పురము పురమెల్ల ముట్టించి భూరి మూర్తి (తే. గీ) నానా వృత్తంబుల సంచరింప"

ఇట్టి వచనములు రామాయణకల్పవృక్షములో నిది యొక్కటే కాదు.

నాగాస్త్రనిబద్ధులైన రామలక్ష్మణులు దానినుండి విముక్తులైరి. రేయియు గడచినది అప్పుడు పద్మబాంధవ కిరణములు బంగులు దేరెను

పూలు వికసించెను ఈ విషయము కవివాక్కులో మధురశృంగార రోచిస్సులను విరజిమ్మినది

సీ. నలిన కాంతాసమానత గండభాగాన
చిటిక వేసెనో నవ్వు చెఱగిపోసె
ముద్దమందారమ్ము బుగ్గపై నొక్కెనో
కమలిపోయిన యట్లు కందిపోయె
లలి పారిజాతమ్ము గిలిగింత పెట్టెనో
తూగాడు కొమ్మనే తూలిపోయె
రాదంచు మోటుపరాచిక మాడెనో
ముగుద కల్వయు మోము ముడుచుకొనియె

తే.గీ. రుద్రజట ముక్తకంచుకారూఢ యయ్యె
చంద్రకాంతమ్మ చిఱునవ్వు సంతరించె
నొక్కడొకడు స్వభావంబు పిక్కటిల్ల
నబ్జబంధుని పానిసలైన పూలు.

యుద్ధ సంశయఖం 336

ఇట్లెన్నియని యెన్నగలము! అన్నిటిని ఎన్నుట యెవరికి సాధ్యము? విశ్వనాథవారి సాహిత్యములోని యందములు, భావముల లోతులు వివరించి వ్రాయుట కితరుల మాట యటుంచి స్వయముగా ఆ విశ్వనాథ వారికిని నిట్టి బ్రాహ్మీమయావతారములు పది యెత్తినగాని సాధ్యము కాని మాట విశ్వనాథవారి తండ్రిగారు 'దూసిన స్వర్ణద్రువు;' కుమారుడైన సత్యనారాయణగారు 'ఎంత దూసినను నంతుచిక్కని కవితాస్వర్ణద్రువు'.

ఆ మహాకవికి - ఆయన కవితాసృష్టికి - ఆయన యొనరించిన శివాద్వైతసాధనకు నతిశతములు

# విశ్వనాథ సాహిత్యసౌందర్యదర్శనము

—శ్రీ సాంప్రతి సురేంద్రనాథ్

"తనలోతు నెఱుఁగని జనుల పూజకుఁదిర
స్కృతిఁ జూపు మత్సరస్వతి సుభద్ర
తనలోతు నెఱిఁగిన జనుల పూజకు నవా
దృతిఁ జూపు మత్సరస్వతి సమార్ధ్రి"

—విశ్వనాథ

నిరుపమాన ప్రతిభాసనాథులు, సారస్వత విశ్వనాథులు అయిన విశ్వనాథ సాహిత్యసౌందర్యదర్శనమును దిక్ప్రదర్శనముగ పరామర్శించుటయే యీనా ప్రయత్నము-సాహిత్యానంద రహస్య వేత్తలగు సారస్వత తపోమూర్తులకు దక్క సాధ్యముగాని యీకార్యమును అల్పజ్ఞుఁడనయ్యు, అజ్ఞాన హేతువుచే "ప్రాంశులభ్యే ఫలే లోభాత్ ఉద్బాహురివ వామనః" వలె నిర్వహింపదలచిన నాయీ సాహసమును విజ్ఞులు మన్నింతురుగాక!

మహాకవి లోకశుభాభికాంక్షియై, మహాగ్రంథావలోకనం వలన కలిగిన విజ్ఞానమాధారంగా సాహిత్యసృష్టి గావించును జన్మాంతరపుణ్యావిశేషంచే ఉత్తమసాహిత్యసంస్కారం కల కవిబ్రహ్మ సృష్టి అత్యంతరమణీయము దీనిని నిరూపించుటకే, కావ్యప్రకాశ కారుడు-

"నియతికృత నియమరహితాం
హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం

నవరసరుచిరాం నిర్మితి
మాదధతి భారతీ కవేర్జయతు."

అని వచించినాడు సాహిత్యతత్త్వము నవగతము చేసికొనిన మహా కవి రచనలు విశ్వజనీనములు, సర్వకాలానువర్తనములు విశ్వనాథ అటువంటి మహాకవి. మహాకవి రచనలను, కవిత్వమును భావించుటకు కేవలము శబ్దార్థ నిర్ణయ జ్ఞానము మాత్రము చాలదు. ఈజ్ఞానముతో బాటు, పాఠకుడిని గాఢభావన, రూక్షుచింతన, దీక్ష అవసరం. రచనాశిల్పమును సంపూర్ణముగ అవగాహన చేసికొన్న మహాశిల్పి అయిన విశ్వనాథ సాహిత్య పరిశీలనకు ఈగుణములు మరీ అవసరం భాషకు, ఛందస్సుకు, జీవుని లక్షణమునకు కల అవినాభావసంబంధము, పరమేశ్వరానుగ్రహమువలన, పూర్వజన్మ సంస్కార విశేషము వలన, వారికి సహజమైనది. సహజమైన ఈరసావేశంతో వారుగావించిన సాహిత్యసృష్టి అనుపమానము,అతిలోకసుందరము.

కవిత్వమనగా నెటువంటిది? "కవిత్వమనగా వర్ణన. ఉచితముగా సమర్థముగా దేనిని వర్ణించినను కవిత్వమే" (నేనూ - నా రచనలు - మహతి వ్యాససంకలనం)- ఇది విశ్వనాథవారి సిద్ధాంతము వర్ణన కవి వ్యాపారము కవియైనవాడు భౌతికముగా, ఆధ్యాత్మికముగా తనకు కలిగిన అనుభవములను వాక్యరూపమున వర్ణించును ఏతద్వర్ణనావైఖరికి తత్కవిప్రతిభయె ఆధారభూతము. వర్ణనాసౌందర్యము కేవలము వస్తువు నాశ్రయించి యుండదు. కవి ప్రతిభతోడైన వస్త్వౌన్నత్యము పసిడికి సువాసన యిచ్చినట్లు భాసించును ఆంధ్రసాహిత్య మవతరించిన నాటి నుండి విచిత్రములైన శ్లేషలతో వింతయగు చమత్కారములతో విలక్షణమగు శబ్దప్రయోగములతో విభాసించిన యీ వర్ణన సౌందర్యము విశ్వనాథవారి సాహిత్యంలో వినూత్న వైశిష్ట్యాన్ని సంతరించుకొనినది. అసలు విశ్వనాథవారి గొప్పతన మంతయు వారి వర్ణనములలోనేయున్నది. కవిహృదయమును దర్శింపగల భావుకత, ఊహాశాలిత యున్నచో అట్టివాని రసహృదయమునకు విశ్వనాథవారి కవిత్వమొక అమృతపుజల్లు. ఆంధ్రసారస్వతమున అనిదంపూర్వమైన వర్ణనాశిల్పము విశ్వనాథ సాహిత్యంలో సాక్షాత్కరిస్తుంది. విశిష్టమైన భావనాబలము గల రసావేశ

ఆయన ఈ విషయమును చూపిన ప్రక్రియలు విన్నూత్నములు ఏదేని ఒక విషయమును ఊహించుటలోనే వారి ప్రత్యేకత గోచరించును

సీ. ప్రభుమేనిపై గాలి పైవచ్చినంతనే
పాషాణమొకటికి స్పర్శ వచ్చె
ప్రభుకాలి సవ్వడి ప్రాంతమైనంతనే
శిలకొక్కదానికిఁ జెవులుగలిగె
ప్రభుమేని నెత్తావి పరిమళించినతోన
యశ్మంబు ఘ్రాణేంద్రియంబుఁ జెందె
ప్రభునీలరత్నతోరణమంజులాంగంబు
గనవచ్చి ఱాతికిఁ గనులు గలిగె

గీ॥ ఆప్రభుండువచ్చి యాతిథ్యమును స్వీక
రించినంత నుపలహృదయవీథి
నుపనిషద్వితానమొలికి శ్రీరామ భ
ద్రాభిరామమూర్తియగుచుఁదోచె.

(రామాయణకల్పవృక్షము - బాలకాండము)

ఆంధ్రసారస్వతమున ఇటువంటి వర్ణన మపూర్వము శ్రీరామచంద్రమూర్తి పాదస్పర్శచే శాపవిమోచనము పొంది, శిలారూపము వీడిన స్త్రీమూర్తి అహల్య, క్రమపరిణామము నొందుచు పంచేంద్రియ జ్ఞాన గోచరత్వము కలిగి పాంచభౌతికశరీరమును గాంచుటను కవి యెంత రమణీయముగాచిత్రించినాడు! ఈ భావుకత మహోన్నతమైనది! మరియు నొకటి. రామాయణకల్పవృక్షమున స్త్రీ రూపవర్ణన సందర్భమున విశ్వనాథవారు చూపిన సంయమము చాల గొప్పది కచకుచాదుల వర్ణనముచే కంపరము పుట్టించు ప్రాబంధిక ధోరణిని పరిత్యజించి, భావిసాహిత్యకారుల కొక నవీనమార్గమును, ఆయన చూపించినారు. సీతాదేవిని ప్ర ప్రథమముగ శివధనుర్భంగసందర్భమున రామచంద్రుడు చూచినప్పుడు, సృష్టిలోని సౌందర్యమంతయును రాశిగా సీతాదేవి యందు మూర్తిభ

వించిన ఆమె వదనారవిందమును, విపరీతములగు ఉపమలతో, విచిత్రములగు శబ్దములతో పదులకొలది పద్యములలో వర్ణింపక-

"ఇదమిత్థమని నిర్ణయింపగారాని దే
కోర్కెయో రూపుఁగైకొన్నయట్లు
జన్మజన్మాంతరసంగతమైన యా
శాబలం బవధికి సాగినట్లు
ప్రాణముల్ బయటికివచ్చి ముగ్ధాకార
మెనయించి దర్శనమిచ్చినట్లు
తనసృష్టిలోని యుత్తమభావ మానంద
ముగఁబొంగి బింబమై పొడిచినట్టు"

(రామాయణకల్పవృక్షము-బాలకాండము)

అని మాత్రము అనినారు సౌందర్యమును వర్ణించుట కెన్ని విధములు లేవు? ఎన్ని యుపమలు లేవు? కాని, రూపమును గురించిన ప్రసక్తియే పొసగనీయక, పద్యము పూర్తియగునప్పటికి సీతామహాదేవి కన్నులకడ సాక్షాత్కరించు నట్లు సాగిన యీ రచన యేమి? ఇది మహాకవి లక్షణము. గతమదమత్సరుండయిన పరాశరమహర్షి జితేంద్రియత్వము నించుక సడలించిన యోజనగంధి సౌందర్యమును, "అతీవరూప సంపన్నాం సిద్ధానా మపి కాంక్షితామ్"అని మాత్రము చెప్పినాడు మహర్షి వ్యాసుడు. జితేంద్రియులైన సిద్ధులచే కూడ కోరదగిన సౌందర్యవతి యనుటలో నెంత యర్థమున్నది? అట్లే పరమేష్ఠి సృష్టిలోని ఉత్తమభావము ఆనందముగ పొంగి బింబమైన దనుటలో ఎంత సొగసున్నది? ఇదమిత్థమని నిర్ణయింపగా రాని దనుటలోగల భావము పాఠకుని భావుకత్వమునకు పరీక్ష. మరియునొకటి.ఇచటఔచిత్యపోషణపటిష్ఠమగు'జన్మజన్మాంతరసంగతమైన' అను పదప్రయోగము గమనార్హము దైత్యసంహారమునకై భూలోకమునం దవతరించిన లక్ష్మీనారాయణులే సీతారాములు. అందుకే తదాశాబలము జన్మజన్మాంతరసంగతమైన దనుట అనవసర మగుచోట విస్తరించి చెప్పుట, అవసరమగుచోట సంక్షిప్తీకరించుట విశ్వనాథవారి పద్ధతి కాదు.

'శృంగారభావ మొడిసిపట్టిన ముఖచంద్రుడు' అనునుగాని, ఆ శృంగార మింతటిదని వాచ్యము చేయరు అయినను, సీతాదేవి శృంగార మెంతటిది? ఒడిసిపట్టిన యీ శృంగారమే రావణాది దైత్యకలభముల కంగార మైనది మరియును ఆమె 'దృగింద్రియ పరమార్థము', "రక్తఝరీ నిలీనవేగ మాధుర్య పరసీమ" ఈ భావములిట్లే యుండును. ఆయన కవిత్వము నానందించుటకు ఆలోచనము అవసరము ఆయనయే యొకచో అనినారు- "ఆలోచన చేయగవలె" నని. అట్లగుచో నాయన కవిత్వమంతయును ఆలోచనామృతము ఆయన భావనాబలము అత్యున్నతమైనది సార్థకమగు ఉపమాలంకార ప్రయోగముతో దృశ్యము కన్నులకడ కట్టినట్లు ప్రత్యక్షము చేయుట ఆయనకు వెన్నతో పెట్టిన విద్య ఆ మహాకవి భావనాబలమును, ఊహశక్తిని దిఙ్మాత్రముగ చూపుట కీ యుదాహరణము చాలును.

సీ॥ "చెట్ల సందులవచ్చు జిలుగువెన్నెలలట్లు
చారలు కనుపింప సాగు పులులు
పూలుపూచినయట్టి పొదలలో పొదలుగా
పొంచిన మచ్చలపులుల గములు

గీ॥ చీకటులు వెన్నెలలఁగటాక్షించుచున్న
కాననము నట్టనడిరాత్రి కానుపించు."

(రురుచరిత్రము)

ఆ మహాకవి భావనాపరిధిలో యొదుగని ఉత్ప్రేక్ష లేదు అతిసామాన్యమగు విషయము గూడ ఆయన రచనలో అలంకార మగును. శరత్కాలమున "పురుగు దొలిచిన దూలమునుండి పొడివలె సన్నని మంచు" కురిసెనట (వేయి పడగలు). శరదృతువున ఆకసమున సహస్రములుగ మాలాబద్ధములుగ విడిసిన కొంగలు-'

"మిన్నను పాములచిన్నదాని గళాన
నత్తగుల్లల పేరనంగ మొరసి"నవట!

(సంహారము)

నిసర్గమనోహరమై ఉపమాప్రయోగనైపుణ్యముతో సాగు ఈ వర్ణనా కౌశలము ఒక్కొక్క సారి విచిత్రములగు ధ్వనివైభవములతో ప్రకాశించును. శైవధనుర్భంగమును గావించిన దశరథరామునిపై సాగి వచ్చు పరశురాముడు-

'కైలాసమును వోలె కదలించరాని 'వాడట!

కాని కైలాసమును రావణుడు కదిలించెను ఆరావణుడు-

'రజతగిరిపార్శ్వగత శిలాప్రకరకషణ
కిణము లాతనిబాహుదశయుగీ మహాసి
కంచుకన్యస్త చిహ్నముల్ గాగ నమరు

వాడు...... (రామాయణకల్పవృక్షము-అరణ్యకాండము) రామచంద్ర మూర్తి ఆరావణుని నిహతుని చేయుట కవతరించిన విష్ణుమూర్తి. చాలును ప్రళయభయంకరప్రచండమూర్తియై వచ్చుచున్న భార్గవ రాముని ఔద్ధత్యగర్వనిర్వాపణసమర్థుడు రాముడనుటకు, పరశురాముదకు వాడిన యీ విశేషణము చాలును కవిప్రతిభకు నికషోపలమగు యీ ధ్వని వైభవమున కికనొక్క యుదాహరణము యుద్ధకాండమున, 'పది పర్వతముల బిగువుకలిగిన' రావణుడు, వానర సేనపై

"మహాంధకారంబైన యుగ్రమైన
యట్టి కాంతారమునుబోని దడుగుతీసి
యడుగు వేయరానిది యడుగడుగున
బ్రాణమును దీయునట్టి........."

(రామాయణ కల్పవృక్షము-యుద్ధకాండము)

అస్త్రమును ప్రయోగింపగా, దానికి ప్రతిగా పావకాస్త్రమును

"దండకాటవిఁ బ్రదయోదశవర్షములుగాఁగ
సంచరించిన రామచంద్రుడు"

వేయును. 'దుస్తరమగు దండకారణ్యములో పదుమూడు సంవత్సరములు

నిరాటంకముగ సంచరించిన స్వామికి కాంతారాత్ర మొకలెక్క లోనిది కాదనుటకీ విశేషణము చాలును.

సందర్భోచితముగ రసావిష్కారము చేయు రచనాసామర్థ్యముగల మహాకవి రచనలలో ఒకేవస్తువు సన్నివేశము ననుసరించి వివిధాకృతులు దాల్చును కథాకథనమున జరుగబోవు సంఘటనను సూచించుటకు ప్రకృతి వర్ణనమును కవులు ఆలంబనముగా చేసికొనుట సహజము సమర్థుడగు కవి చేతిలో బడిన యిటువంటి సందర్భముల యందు అద్భుతముగ రసావిష్కరణము జరుగును. విశ్వనాథవారిలో యీప్రతిభ ఎంత రసవంతముగ ద్యోతకమగునో పరికింపుడు వేయిపడగలు కావ్యమున, ధర్మారావు అరుంధతుల శృంగారమునకు పూర్వము వచ్చిన వర్షము-

"ప్రణయినీ మధురకోపమువలె రివ్వునవచ్చి రివ్వున పోయిన చిలుపవానలు, కాపుల వసనములు తడిపొడిగా చేసి, చిన్న చిన్న మట్టి బెడ్డలతో విసరికొట్టినట్లు వర్షపు పెద్ద చినుకులు చెంపల కొసకు చెడీలుమని కొట్టి, పొలాలమీద నూర్చుచున్న కాపుపడతులచే, అబ్బో! నామగడైన నింత దెబ్బకొట్టలేదే"——"నిన్ను వానమగడు వదిలి పెట్టునా? యింటిలోని మగడు వదలి పెట్టిన!" అని పరియాచకముల నాడింప జేయుచు, వర్ణనమంతయు శృంగారరసోద్దీపముగనే సాగినది. ఇదేవర్షము, 'స్వర్గానికి నిచ్చెనలు'లో, బీభత్సకార్యావిష్కారము చేయు వామదేవుడు వచ్చునప్పుడు-

"నట్టనడిమింట చట్టుపలెత్తిన గట్టురాయల వలె మిట్టిపడి చినుకులు మొదలుపెట్టి వానలు కొట్టి కొట్టి వదలి పెట్టబడి,- ఏదోయొక దయ్యము గృహోపరిభాగమున గూర్చుండి తన నిడుదచేతులంగప్పంతయుం బట్టుకొని కప్పుతో బాటు పురంబెగయ నప్పళించినట్లు టప్పుమని యెగిసి పైభాగమంతయు కూలినట్లు పేదగుడిసెలు వడిసెలలో బెట్టివిసరిన రాళ్ళవలె నెక్కవిసరబడిన" వట! ఈవర్ణనమున గావింపబడిన బీభత్స రసావిష్కారమునకు సహృదయులే ప్రమాణము మరియునొక్కటి ప్రకృతి ఆలంబనముగ రససృష్టి చేయగల రసబ్రహ్మ కవిసమ్రాట్టులు. ఇది మహాకవులకు సహజము. ఏదేని ఒక అవాంతర కార్యము జరిగినచో ప్రకృతి తన కోపమును ప్రకటించినట్లు చెప్పుటలో ఒకానొక అలౌకికసౌందర్యము, అత్యున్నతమగు ప్రయోజనము కలదు. అందులకే ప్రాచీన మహాకవులు, అనుచితకార్యము

నెవరేని యాచరించినట్లు చెప్పునప్పుడు 'కలగెం తోయధులేడు.. ...' అని చెప్పుట అనగా ధర్మబద్ధమై సాగవలసిన మానవుని జీవితము అధర్మ కార్యముల నాచరించుట యందాయత్తమైనచో ప్రకృతి తనయనంగీకార మును తెలుపుచు రౌద్రముగా ఆకృతిని దాల్చినట్లు చెప్పుట భారతీయకవి సంప్రదాయము కథలో లీనమై సాగుచున్న పాఠకుడు, తత్కథాంతర్గత మైన యొకానొక నిస్సహాయమగు పాత్ర కౌద్ధత్యముగా నేదేని దుష్ట పాత్రచే యపకారము జరుగబోవునపుడు, ఆదుష్టపాత్ర నెట్లయిన ఆ దుష్కార్యము నందు విఫలుని చేయవలయునను ఆవేగము, ఆవేశము కలిగి, యిటువంటి ప్రకృతియొక్క అనంగీకారప్రకటనావర్ణనముచే శాంతి నొందును. అప్పుడు కవి యుద్దేశము సార్థకమగును రససృష్టి గావింపబడిన అటువంటి సందర్భముల యందు, తన్మయత్వము నందిన పాఠకుని యందు రసము పర్యవసించును ఈరహస్యమును గుర్తించిన వారు విశ్వనాథ చూడుడు వేయిపడగలు కావ్యమునుండి యొక ఉదాహరణము గిరిక సర్వాత్మనా వేణుగోపాలస్వామికి జీవితము సంకితము చేసిన భక్తురాలు. ఆమె నవమానము చేయవలయునని, రామేశ్వరము తలంపు ఒకానొక నాటి సంధ్యాసమయమున ఒంటరిగా స్వామిఆలయమునకు పోవుచున్న గిరికి నటకాయించినాడు రామేశ్వరము ముందువెనుకలు చూచి,ఎవ్వరును లేనట్లు గమనించి, ఆమహాసాధ్వి నవమానించుటకై –

"పిల్లా! నీకు బదునేడేండ్లు వచ్చినవి కన్నెఱికమెవరు పెట్టిరి?" అని యడిగెను భీతయై స్వామి నెదలోనికి తెచ్చుకొని నిలువబడిన గిరిక, నమస్కారము చేసి, కనులుమూసికొని, 'శ్రీవేణుగోపాల స్వామివారు' అని ప్రత్యుత్తర మిచ్చెను. హేళనగా రామేశ్వరము పకపకాలుమని నవ్వెను ఆకాశమావరించి యున్న మహానీలమేఘమునుండి పటపటాలుమని పగిలి దిగ్దిగంతములు దద్దరిల్లి పోవునట్లు మహాశనిపాతము జరిగెను. రామేశ్వ రము కంగారుపడి పరవళ్ళు త్రొక్కెను. గిరిక నిశ్చలమై తన దారిని దాను బోవుచుండెను."

వర్ణనావిషయమై యింక నొక్కటిమాత్రము మనవిచేసెదను. వివిధ శాస్త్రములతో విశ్వనాథ వారికిగల పరిచయ మపారము వారి వివిధ

శాస్త్రవైదుష్యము వారి సాహిత్యములో ఎల్లెడల ప్రత్యక్షమౌతూనే ఉంటుంది ప్రకృతివర్ణనము చేయు పట్టుల నీ విద్వత్త ఒక వింత సౌందర్యముతో సాహిత్యముగ సాక్షాత్కరించును అసలు ప్రకృతిని వర్ణించుట యన్న నే విశ్వనాథ వారి లేఖిని పులకించి ప్రవహించి పాఠకులను పరవశింప చేయును ఆయా సందర్భములలో సకలజన మనోహరమైన ప్రకృతి కాంతయే శబ్దరూపము ధరించి ఆమహాకవి వాక్కునుండి వెలువడును అలంకార శాస్త్రపాండిత్యము నిండియున్న యీవర్ణనము 'ఏకవీర' లోనిది, పరికింపుడు—

“శిశిర చంద్రజ్యోత్స్న కలహాంతరిత వోలె జలదాంతర్నిగూఢ బాష్పయై విముఖ కా, మొగలి పొట్టలలో నీరు నిలచి ఖండితాసజలదీర్ఘ సితాపాంగభ్రాంతి కల్పింప, రాజహంసి భీతయై ప్రోషిత భర్తృకవలె తామరతీఁగ గొడుగాకు క్రిందఁ దలదాచుకోగా, నెమ్మి పురివిప్పి స్వాధీనపతికవలె నృత్యాభిరామమూర్తికా, మందార పూవును వదలి రాలేక రాలేక వచ్చిన తుమ్మెద యెడ నెఱ్ఱగన్నెరు ఈర్ష్యాకషాయితకా, వాసకసజ్జికవోలె నలంకరించుకొని ఒడిమి మేఘనాధునకు స్వాగతము బోవ, బలకాపాంగ మేఘనీలపటపరివృత యాకాశలక్ష్మి కాలపురుషుని నభిసరించ, విప్రలబ్ధాకృశీభూత దేహయష్టివలెఁ బోకమాను పై మొవ్వులోని యాకుల వెంటఁ గన్నీరు గార్చ— వర్షాశ్రీ సర్వరసాకృతి వలె మోహనాతి మోహన యయ్యెను

శృంగార నాయికలందరు సింగారముగ చోటు చేసుకొనిన యీ అసదృశమగు వర్ణనావైభవము కూడ మోహనాతిమోహనము భారతీయ సంస్కృతీ సంప్రదాయములు నరనరముల జీర్ణించుకొనిన వారి రచనలో వారు నిలుపని సంప్రదాయము లేదు ముఖ్యముగ, ఆంధ్రదేశ సంప్రదాయముల నెన్నిటినో ఆయన సాహిత్యములో నిబంధించినారు సంప్రదాయ మనిన నేమో యెరుగని యీ పిదపకాలమున, ఆంధ్రదేశ సంప్రదాయములను గురించి తెలిసికొనుటకు వారిరచనలే ఆధారమగు ననుటలో సందేహము లేదు ఒక్క 'వేయి పడగలు' గ్రంథమందే వారి

సర్వంకష పాండిత్యము, సర్వతోముఖమైన విజ్ఞానము సహస్రముఖములుగ భాసించిన దన్నచో, ఆయన సాహిత్యప్రపంచము నంతటిని దడవుటయేల!

విశ్వనాథవారి కావ్యశిల్పము అత్యద్భుతమైనది రసోపనిష ద్రహస్యవేత్త అయిన విశ్వనాథ జ్ఞాతశిల్పి (Conscious artist) ఎచ్చట ఎటువంటి బంధమవసరమో గుర్తించి తద్భావానుసారముగ, కవితాశిల్ప మును నాయన మలచును ఆయన గద్యసాహిత్యమునను, పద్యసాహిత్య మునను ప్రతిచోట ప్రత్యక్షమగు ఈ శిల్ప సౌందర్యము సహృదయులకు గోచరము కానిదికాదు అనితరసాధ్యమైన శయ్యాసౌభాగ్యముచే ఆపాత మధురమై ఆలోచనామృతముగ సాగిన అతిలోకసుందరమై అలరారు మహో సృష్టి అది ఆయన సాహిత్యలక్షణములకు సాదృశ్యముగా సాగిన యీ గంగానదీ వర్ణనము చూడుడు-

మ॥ "క్వచిదష్టాపద వర్ణసైకత క్వచిద్గంభీరపాథస్కయున్
క్వచిదుద్భ్రాంత విహంగసంతతి క్వచిత్కాశ ప్రసూనాచ్ఛయున్
క్వచిదానీతతుషారశీతల క్వచిత్క్రమస్వర వ్యాప్తయున్
క్వచిదాకాశవిశాలభావకృత దృక్తాత్పర్యక్లప్తాత్మయున్."

(రామాయణకల్పవృక్షము - అయోధ్యకాండము)

విశ్వనాథవారి కవిత్వమును ఇన్ని లక్షణములుగలది వారి రచనము ఓజోగుణ ప్రధానమే అయినను, ప్రసాదగుణమున నేమియు తక్కువకాదు కాని, ఆయన శిల్పవిద్యారహస్యమును గుర్తించుట అవసరము వారి పద్య మున సర్వజనాకర్షకమై అలరారునది వానియందలి శయ్యాసౌభాగ్యము నాగస్వరమునకు ముగ్ధములై మేనుమరచి పోవు భుజంగములవలె సాహిత్య రసికుల మనస్సులను తన్మయత్వము నందింపగల అనుపమానశయ్యా సౌందర్యముచే సంతరింపబడిన వారి పద్యము, హృద్యమై అనుభవైక వేద్యమైన ఆనందము నందించుననుటలో సందేహ మావంతయును లేదు విశ్వామిత్రుని వెంటజనుచున్న రామలక్ష్మణులను గురించి చెప్పు యీ పద్యము పరికింపుడు-

ఉ॥ విద్వదరాళమౌళి మునివెంబడి నౌర్వశిఖావిమర్దమ
ద్విద్వయ ముగ్రధాతుసముదీర విచిత్ర మనోజ్ఞవర్ణ మ

ద్రిద్వయ మింద్రచాపకబరీపరిభూషితవల్గుయాన మ
భ్రద్వయమేగె లో వెలిధురామహా ఉగ్ర ప్రచండమూర్తియై.

(రామాయణకల్పవృక్షము-బాలకాండము)

రామచంద్రుడు నీలమేఘశ్యాముడు. లక్ష్మణుడెట్టిని దేహచ్ఛాయ వాడు వీరిరువుని ఒకేరూపముగ చెప్పిన యీ సౌందర్యము నెంతని చెప్ప వలయును ? 'మహా ఉగ్ర' అనడంలో ఒక వింతయగు సొగసు. పదముల విరు పెక్కడ ఎట్లు చేయవలయునో, ఏ సమాసమెచ్చట ఎంతవరకు సాగవల యునో విశ్వనాథ వారికి కరతలామలకమైన విద్య అవును

'మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలాం
యోజ్యం కావ్యేష్వవహితధియా తద్వదేవాభిధానం."

అనికదా భామహామహాశయుని సూక్తి. అంతియేకాదు. సందర్భో చితముగ, ఔచిత్యరసపోషకసమర్థములగు వృత్తముల నెన్నుకొనుటలో విశ్వనాథ సిద్ధహస్తులు. ప్రియావియోగవిరహవిలాపమును వర్ణించు నప్పుడు 'వియోగిని' వృత్తములనే స్వీకరించినాడు కదా కాళిదాసు. ఏ తద్వృత్తములను స్వీకరించుట యందేకాదు, అవృత్త రచనమునందు కూడ మహాకవి ప్రతిభ వ్యక్తమగును. సర్వరాజన్యదుర్భేద్యమగు శివధనుర్భం గము గావించిన అచలస్థయిర్య నిశ్చలుడైన రామచంద్రుని ధృతి అతి వేలమై విజృంభించిన సందర్భమున "అతిధృతి" ఛందోద్భవమైన శార్దూల విక్రీడితములను,

శా॥ "నిష్ఠావర్షదమోఘ మేఘపటలీ నిర్గచ్ఛదుద్యోతిత
స్వైష్మేరమ్మద మాలికా యుగపదుజ్జృంభన్మహాఘోర బం
హిష్ఠస్ఫూర్జథుషండ ఘుర్ఘుర రవాహీన క్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠంబై యొకరావ మంతట నెసంగెన్ ఛిన్నచాపంబునన్."

(రామాయణకల్పవృక్షము-బాలకాండము)

పద్యమాదిగా గల వానిని రచించి రన్నచో విశ్వనాథ పద్యవిద్య నెంతగా సాధించిరో అవగతమగును ఛందోనిబంధనములను వాచోవిధేయ

ములు గావించికొన్న యీమహాకవి. యితర కావ్యములలో చోటు చేసికొన నోచని విచిత్రవృత్తముల కెన్నింటికో విముక్తి కలిగించుట రసహృదయు లెఱిగినదే.

ఆంధ్రసాహిత్యమున సీసపద్యమొక విశేషము కవి ఏవిధముగ భావించునో ఆవిధమైన నడక సాగించుట కవసరమైన యొద్దిక ఆ ఛందస్సునకు గలదు సమర్థుడైన మహాకవి చేతిలో బడినచో, పాఠకునికి బంగారము పండినట్లే నన్నయభట్టారకులు, శ్రీనాథులు వలన ఎన్నో సౌందర్యములను సంపాదించుకొన్న యీ సీసపద్యము విశ్వనాథవారి సాహిత్యములో మరీ వింత సొబగులను సంతరించుకొనినది వారు సీసమునకు విచిత్రమగు గతులు నేర్పిరి. వినూత్నమగురీతులను అలవరిచిరి మచ్చునకు విశ్వామిత్రుని తపోభంగమునకై దేవేంద్రుడు రంభను పంపించునపుడు సాగిన ప్రకృతి వర్ణనము-

సీ॥ చుఱచుఱ నెఱ్ఱనై చూచెడు చివురాకు
చివురాకు వెనుకఁబొంచిన లతాంత
బాణుండు విసరగాఁ బట్టిన పిడిబాకు
పిడిబాకు రివ్వున విసర దూసి
సన్నసవ్వడి వోని సన్నని పికివాకు
పికివాకుతో మేళవించి సన్న
గొంతురాగముతోడ గులుకు నచ్చెరసోకు
పిరువీకుగా నొక్కపెట్టఁదోచి"

(రామాయణకల్పవృక్షము-బాలకాండము)

సీసపద్యరచనమున విశ్వనాథవారు చూపిన అద్భుతమైన శిల్పప్రయోగమిది పైకి శబ్దాలంకారము దప్ప నిందున్న ప్రత్యేకతయేమి అనిపించును గాని, శబ్దాలంకారముతో రచన సాగించిన ప్రాచీనులలో, ఏ పాదమున కా పాదము విడిగా సాగును- 'లలనాజనాపాంగ వలనావసదనంగ తులనాభి కాభంగ దోఃప్రసంగ'ము వలె. కాని, ఇచ్చట ప్రథమ పాదార్ధమునకే వాక్యము తెగిపోయి, ముక్తపదగ్రస్తముతో కొనసాగిన ఉత్తరార్ధము ద్వితీయ పాదార్ధము వరకు సాగిపోయి, ఒకానొక రమణీయమైన బంగారు

సంకెలతో సీసపద్యమందలి నాలుగు పాదములను కమనీయముగ బిగించి వేసినది. అంతియేకాదు విచిత్రముగ కదనుత్రొక్కిన యీ సీసపద్యము రీతులను ఇంచుక గమనించుడు విశ్వనాథవారికే ప్రత్యేకమైన వీరి యీ సీస పదర్థ మొక్కొక్కసారి-

సీ॥ గూఢ సంచరదుగ్రగూఢపాద్గతనీడ
విలురద్వియద్రుదద్విహగకులము
ఉరుజఘన్యవ్యాఘ్రచరణభయగ్రస్త
కేకాద్రవత్ప్లవంగీకులంబు
ఉత్థగర్జాద్రావయద్ధరిణ్యానీక
హననలంఘన ధురావ్యాఘ్రకులము
జ్యోత్స్నసమర్పితస్ఫురదహిప్రౌఢార్ధ
వలయలంఘన శిఖావళబలంబు"గా

(రురుచరిత్రము)

సంస్కృతభాషా భూయిష్ఠముగ నడచును పై పద్యమున వ్యత్యస్త పాదములతో alternativeగా సాగిన అంత్యానుప్రాసము గమనింపదగినది మరి యొక పరి, యిదే సీసము.

సీ॥ "అధరాధరోదయన్మధుర రేఖారమ్య
మృదు మందహాసముల్ మెదలునట్లు" గా

(రురుచరిత్రము)

సీ॥ ''విరిసి మన్మథరాజు బిట్టావులించిన
యాకాశమది రూపమందె ననగ"

(రామాయణకల్పవృక్షము-అరణ్యకాండము)

శూర్పణఖ యవతరించినదనుచు విడివిడి పదములతో లలిత లలితము లైన భావములను చిలుకరించును. ఒక్కొక్కప్పుడు అశ్వగతి ధాటిచే-

సీ "సింధూ పరిప్లవత్స్కంధాంతపరిలసత్
మంధానగిరిచలత్కంధరుండు" (రురుచరిత్రము)

గా పరువులు పెట్టును. విశ్వనాథవారి గురుపద్యవిద్యారహస్య మిది.

విశ్వనాథవారి శబ్దప్రపంచము విలక్షణమైనది శబ్దము పై వారికి గల అధికారము అసాధారణము శబ్దము కావ్యమునకు బాహ్యశరీరము అక్షరముల రమ్యత కావ్యమునకు అక్షరమైన రమ్యత(తరుగని సౌందర్యము) నాపాదించుననుట నిశ్చయము. మహాకవియైన వాడెప్పుడు ఈ విషయము నుజ్జగింపడు అయినచో ఎక్కడెక్కడ ఏ ఏ పదప్రయోగ మవసరమో ఆపదముల నాయా ప్రదేశములలో ప్రయోగించును అర్థముల నాశ్రయించిన ధ్వని కాక పదముల నాశ్రయించిన ధ్వని కూడ నున్నది కదా! ఒక పద్యమునగాని, గద్యమునగాని, కవి నిర్దేశించుచున్న వస్తుస్వరూపము చదువునప్పుడే శబ్దప్రయోగవైలక్షణ్యముచేత మనస్సునకు గోచరింపచేయుట సామాన్యమగు ప్రతిభ కాదు అక్షరమెచట నుండి పుట్టుచున్నది? శబ్ద మెట్లేర్పడుచున్నది? యను విశేషవిజ్ఞానము కవి కుండిననే గాని యిది సాధ్యముగాదు మహాభారతమున, ఆదిపర్వమున ఉదంకుడు నాగస్తుతి చేయునపుడు, "బహువనపాదపాద్రికుల పర్వత పూర్ణసరస్సరస్వతీ, సహితమహామహీభరమజస్రసహాస్రఫణాళిదాల్చిదు, స్సహాతరకాయికిన్......"అను పద్యమున నన్నయ భట్టారకు డీ పదప్రయోగ శిల్పమును నిక్షేపించెను ఇచట 'సరస్సరస్వతీ' , అజస్ర సహాస్ర' 'దుస్సహాతర' అనుచోటుల పాముబుస వినబడుచున్నదికదా! మరియును ఆ 'అజస్రసహాస్ర' అను జగణము, సర్పమువలెనే వ్యత్యస్త గమనమును గోచరింప జేయుచున్నది. ఈపదప్రయోగశిల్పమునకు విశ్వనాథవారు సమ్రాట్టులు. ఒక్క యుదాహరణము మాత్రము జూపుదును రాముడు శివధనుర్భంగము గావించి నప్పుడు నళినభవాండభాండములు పగులునట్లుద్భవిల్లిన ఆఛిన్నచాపధ్వని త్రైతేయలోకములలో ప్రతిధ్వనించినది ఈవిషయమును వర్ణించు నప్పుడు సాగిన పద్యము—

శా॥ "దర్పస్వీకృత హాస విశ్లథన రుంధద్దుష్ట వాగ్ధోరణీ
సర్పద్ద్వీపరమూపథశ్లథనమై......"

(రామాయణకల్పవృక్షము-బాలకాండము)

పద్యము చదివినప్పుడే శబ్దప్రయోగము వలన వాని నాశ్రయించి యున్న వికృతరూపము దైతేయలోకముల నెదుట సాక్షాత్కరింప జేయుచున్నది కదా! దైత్యులెంత కర్కశులో పదములంత కర్కశములుగా ప్రయోగింప బడినవి. మరియును,

"...... దీపికా
లాతము వోలె నుంతయు విలంబనమోర్వదు నిత్యవేగి నా
చేతము శబ్దమేరుటకు చిన్నగు నిల్వదు భావతీవ్రతన్".

(రామాయణకల్పవృక్షము-అవతారిక)

అని ఆయన చెప్పికొన్నను, అపృథగ్యత్న పూర్వకముగ, శ్రవణానంద సంధాయికములగు శబ్దములు, వారిసాహిత్యమున, "పొంగ ముత్తెపుసరుల్ పోహళించినలీల తమలోనదొరసి" మెరసి పోవును. నాదసంబద్ధమై, సహృదయ హృదయాహ్లాదకరములై జంటలు జంటలుగా పోటీబడినట్లు సాగిపోవు పదములు, నన్నయ భట్టారకుని మనఃఫలకమున సాక్షాత్కరింపజేయు "ప్రభూత విభూతి" "మిన్నులొరసెన్ విరిసెన్" "కుమార సమీర కుటీరవార" "సరయూ సరయూ తరంగ రంగ" "సౌరపదవీ నదవీయస" వంటివి పరశ్శతములు అంతియేకాదు. ఆశబ్దబ్రహ్మము నుండి ఉద్భవించిన 'కృతతాప గోపనాత్యంత మనోహరములైన' శబ్దములు "లతాంత నితాంత రమద్వసంతసా, మంత శకుంత కూజిత సమంతతములు." సందర్భోచితముగ, ఆపదముల సౌందర్యము,

"విడిలు నచ్చెరల గుప్పిళ్ళట్లు పొలిచిన
నందివర్ధని పూల యందము" చిందించును.

ప్రసన్నగంభీరమై యొకప్పుడు, వారి యాశబ్దసరస్వతి,

"విధుర నాట్యక్రియా వివృత ధూర్జటి జటా
జూటారుణచ్ఛటల్ పేటురేగి" నట్లుసాగి,

శా॥ "రా!రా! సాదుర మేదురావలిత ధారాసార మైరేయకీ
రీమ్రారాసార మురావలీకలితవారీ! యిక్షుమాధ్వీరసో
దారా! సారస సారసాదర మహోదారా! సుధారాదరీ
హారా! హీర పటీర నీరమృదు బంధారూఢ శారాంభసా!"

అని గిర గిర సుడులు తిరుగును. ఒక్కొక్కప్పుడు, "ఇపుడీ మహాకవి దృష్టిపథము నుండి తప్పించుకొనినచో మరల మనలను పరిత్యజించునేమో!" యనుభయముచే, గబగబ, తొందర తొందరగ, తొట్రుపాటుతో నొకదానిలో నొకటి,

"చక్షుశ్శ్రవశ్శిరశ్ఛవిమన్మణిచ్ఛవిచ్ఛట"ల వలె నిరికికొని పోవును. ధిషణాహంకార నిరంకుశత్వముచే ఆయన నిర్మించు, 'కార్ష్ణాయస పీఠికాగతుడు.' 'విలసన్మాద్గీనసస్యాకృతిన్,, 'ఆనీత సంధ్యా గృధ్నుచ్ఛవి,' 'ధరాకృతస్న మృత్స్న దిగ్ధాంగుడు' 'నీహారసంధితుస్నవు,' 'నరీనృత్యమానులు' మొదలగునవి శబ్దప్రయోగమున ఆయన విశృంఖలత్వమును ప్రదర్శించును ఈశబ్దములపట్ల శాస్త్రచర్చ చేసి యథఃకరించు విమర్శకులకు సమాధానమిదియే.

శ్లో॥ "కల్హారైః పరికల్పితేవ లలితామాలా కవేర్భారతీ
శుష్కాణాం పరిపీడనం న సహతే శాస్త్రైషిషుణాన్మాత్మనామ్."

విశ్వనాథ సాహిత్యమున పద్యసాహిత్య మంతయు నొకయెత్తు, గద్య సాహిత్య మంతయు నొక యెత్తు. పద్యమున ఎన్నిశిల్పవిన్యాసములను వారు ప్రదర్శించిరో గద్యమున కూడ అన్నివిన్యాసములను ప్రదర్శించిరి. "గద్యం కవీనాం నికషం వదంతి" యనికదా యార్యోక్తి! బహుసంస్కృతీ నాగరకతా పరిశీలనము వలనను, బహుగ్రంథావలోకనము వలనను సంపాదితమైన వారి విజ్ఞానము సర్వస్వమును, వారినవలలో 'ఇందు గలదందు లేదను సందేహము' కలిగింపక వారు నిక్షేపించిరి. ఆయనయే చెప్పినట్లు, 'ఇట్లుచూస్తే వేదాలు, ఉపనిషత్తులు, భాష్యాలు, తర్కాలు, వ్యాకరణాలు—అటుచూస్తే పాశ్చాత్యవిజ్ఞానములలో నిద్రాహారాలు లేకుండా

సంపాదించిన విజ్ఞానమంతా' వారినవలలలో నిక్షేపించినారు. ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతీ నాగరికతా సమన్వయము నత్యద్భుతముగ ప్రతినవల లోను గోచరింప జేస్తుంటారు ఆయన. ఆగ్నేయమైన భారతీయసంఘము యొక్క ఔన్నత్యము, ప్రాచీన భారతీయ సంస్కృతి యొక్క గొప్ప తనము పునాదులుగా సాగిన వారి సాహిత్యసృష్టిలో మనకు లభింపనిదేది? పరిశీలనాదృష్టి పుష్కలముగ నుండి, మన ప్రయత్నము ఫలించు భాగ్యము మన యందుండ వలయునే కాని, ఆసాహిత్యతపస్వి సారస్వతప్రపంచ ములో మనకు లభింపని విజ్ఞానమేది? వారి కథాకథన శిల్పము, పాత్రసృష్టి, సన్నివేశస్వరూపకల్పనా నైపుణ్యము, నాటకీయత, సంభాషణా చాతు ర్యము–యివిచెప్పుటకు వేయిపడగల పాపజేడు రావలయును విషయ మును దేనినైనను సరే, సూక్ష్మముగ పరిశీలించి, లోతునకు పోయి ఆలో చించి, దానిని పాఠకలోకమునకు అందించు బాధ్యతాయుతమైన రచయిత ఆయన! ఉదాహరణకు, ఉత్తరరామచరిత నాటకమున భవభూతి మహాకవి దిఙ్మాత్రముగ సూచించిన, యిరువురు జీవుల సృష్టికి హేతువులైన వారి వారి యణుసంతతికిగల సామ్యమును సాధించు త్వగింద్రియస్పర్శ లక్షణ సిద్ధాంతమును, 'ఏకవీర'లో కొంచెముగను, 'తెఅచిరాజు'లో విపులముగను చర్చించినారు భౌతిక జీవిత విశేషములకు, ఆధ్యాత్మికయథార్థములకు సమన్వయము చేసికొన్నప్పుడు కలుగు మానసిక సంఘర్షణ నత్యద్భుతముగ 'స్వర్గానికి నిచ్చెనలు'లో వివరించినారు ఈదృష్టిలో ఆయన గొప్ప మన స్తత్వశాస్త్రవేత్త. ఒక్క చెలియలికట్టలో వారు గుప్పించిన 'సైకాలజీ' ఎంతటిది? ఆయన రాజకీయపరిణామపరిశీలన విచక్షణకు 'సముద్రపు దిబ్బ' పెద్ద తార్కాణ. ఆయావిషయములను వివరించుటలో ఆయన చూపిన రచనా శిల్పము, వచనరచనాపద్ధతి, వాక్యనిర్మాణవైఖరి సాహిత్యమున కలం కారములు. ఇంత జరుగుచుండియు జరుగు రససృష్టి, అత్యంతమనోహరము. మహాకవి బాణుడు,

"నవోఽర్థో జాతిరగ్రామ్యా శ్లేషోఽక్లిష్టః స్ఫుటోరసః
వికటాక్షర బన్ధశ్చ కృత్స్నమేకత్ర దుష్కరమ్."

అని నుడివినాడు గాని, విశ్వనాథ సాహిత్య మంతయును దీనికి వ్యతిరే కముగా, అన్ని విధములైన సాహిత్య సౌందర్యములతో భాసిస్తున్నది కాలము నాయన పరిశీలించిన తీరు, ఆ విషయమున వారి సిద్ధాంతము విచిత్రమైనది

'కాలానివైనా సరే! ఆలోచించి ప్రవర్తించక పోతే నేను నిన్నను సరించను' అనిన వారాయన. పైగా,

'కాలం అధికారి. అది నిన్ను దండిస్తుంది. అణగ త్రొక్కుతుంది నిన్ను పైకి రాకుండా చేస్తుంది. నీడోక్కు చీలుస్తుంది. డోలుకడుతుంది' అని సవాలుచేస్తే—

"ఆపని మాత్రం చేయవద్దను. డోలు మ్రోగుతుంది. దానికేం లాభం?" అని ఎదురు సవాలుచేసి, కాలాన్నే తనకనుగుణంగా మార్చు కున్న మహర్షి ఆయన. మరియును, ఒక విశేషము. సాహిత్యమున వారి ముద్ర నేర్పరచి రచించిన వారి యీవాక్య రచనా వైఖరి అతిచమత్కా రమైనది. ఒకప్పుడు విడివిడి పదములతో వాక్యము పూర్తియగును. మరొక సారి దీర్ఘముగ సాగును. "గ్రుడ్డివాని చేతిలోని రాయి తగులును. తగుల దును" (వేయి పడగలు); "అయ్యో! యన్న శబ్దము యొక్క చివరి యోకారము దీర్ఘీకరింపబడి ప్రగృహ్యములేని యనంత ప్లుత వికృత సంధి పరంపరా దుఃఖ సంయోజనా సంరావక్లేశ భావ విమూర్ఛితా రేఖావిచలన వసుంధరా గృహాంతర్భాగ మయ్యెను" (స్వర్గానికి నిచ్చెనలు) వంటి వాక్య రచనా విన్యాసము విశ్వనాథవారికే ప్రత్యేకము. అన్ని విధములైన సాహిత్యసౌందర్యములతో విలసిల్లు వారి సాహిత్యము–

"తేనెల్ వాఱును మేఘగర్జనలు వీతెంచున్ విశికన్యకా
నూనవ్యాహృతి మాధుపంచమము చిందున్ ద్యోనదాంభఃకణ

శ్రీ నృత్యంబులు"(మాస్వామి) చూపగా, వారి హృదంభోజము అందు ఆనందచ్యుతి పొంది ఈసారస్వతముగ పరిణమిల్లినది. "ఆద్యంబై చను జీవలక్షణము సంహారంబు" గావించుటకుగా, 'సద్యోనిర్గతమైన సర్వ

కవితా సంభారమును' పరమాత్మునకు నైవేద్య మొసంగి తరించిన రసావతారమూర్తి ఆయన పైగా, యీవ్యాసమున ఉపరిస్పృశముగా చర్చింపబడిన ఒక్కొక్క యంశముపై నొక్కొక్క గ్రంథమే రచింప వలసి యుండగా, నిటువంటి యలతి యలతి పదములతో ఆ సాహిత్యసౌందర్యమును ప్రదర్శించుట, ప్రచండ మార్తాండ తేజమును క్రొవ్వువత్తుల వెలుగుతో ప్రపంచమున కావిష్కరించుట వంటిది విశ్వనాథ సాహిత్య విలసనము ఆంధ్రసాహితీనందనోద్యానమున వేయిశరజ్జ్యోత్స్నలు వెదజల్లిన సమయము. నాడు సకల భారతము ఆంధ్రసరస్వతీ చరణ మంజుల మంజీర మధుర ఘులంఘులారావ ముఖరిత మైనది. "కింకిణీ చిణచిణ నినద కనదబ్జపద సమానీత మధుర గీతికా రసవార్ధి" పొంగి ఆంధ్రప్రశస్తి వినూత్నవిలక్షణ సౌందర్యముతో యావద్భారతము నందవతరించిన మనోహరమైన సందర్భమది. అది విశ్వనాథ యుగము పైగా, "కవనార్థం బుదయించితిన్ సుకవితాకార్యంబె నావృత్తి యీ, భవమద్దానఁ దరింతు" నన్న కవికుల గురువులు శ్రీచెల్లపిళ్ళ వేంకట శాస్త్రిగారికి శిష్యులై "కవితారూప తపస్సు" చేసిన విశ్వనాథవారి సాహిత్యమున నొదుగని ప్రక్రియ లేదు; ఇముడని భావము లేదు; చోటుచేసికొనని వస్తువులేదు. ఆంధ్రవాఙ్మయమునకా మహనీయు డొనరించిన ఉపకార మంతయు నింతయు కాదు

# విశ్వనాథవారి కవితావైదుష్యము

—శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణగారు సృజించిన సారస్వతము సర్వతోముఖము ఒకి వంక గద్యరూపమగు నవలలు, కథానికలు, విమర్శనాత్మక వ్యాసములు. ఆంధ్రదేశము నలువంకల సభారంగముల వెలువరించిన యుపన్యాసములు ఒకవంక ఛందో వైవిధ్యముతోడి ఆంధ్రప్రశస్తిమున్నగు ఖండకావ్యములు మొదలుకొని రామాయణ కల్పవృక్షము మున్నైన యఖండపద్యమయ కావ్యములు, కిన్నెరసానిపాటలు మున్నగు గేయప్రబంధములు త్రిశూలము, నర్తనశాల మున్నగు నాటకములు. ఇంకను నాంధ్రమున నెన్నియో రచనములు అంతతో నైనదా? విశ్వనాథ త్రిశతి మొదలగు సంస్కృతకావ్యములు- విచ్చిన నెమిలి పింఛము వలెం దళతళలాడుచు కన్నులు మిఱుమిట్లు గొల్పుచుండ నాయన కవితనుగాని వైదుష్యమునుగాని వివరింపబూనుట సాహసమగును. తుదకిసాధ్యమును నగునని, నగుంబాటగుననియునుగూడ జంకు.

ఆయన రచనల పౌర్వాపర్యము నెఱుగను. ఆయన ప్రశస్తికి వేగుచుక్క "ఆంధ్ర ప్రశస్తి" యనిరి కొందరు, కొందరు కిన్నెరసాని పాటలు అనిరి ఏదియైనను కావచ్చును నా యెఱుకలో ఆయన మొదటి కవితా నాట్య దర్శనము 1922 సంవత్సరమున కావచ్చును- కాకినాడలో బులుసు సాంబమూర్తిగారి కుమార్తె వివాహసందర్భమున మగపెండ్లివారి పక్షమున వచ్చిన వారిలో నొకరై యష్టావధానము నొనర్చిన సందర్భమున అని జ్ఞాపకము అనాటి వారి యాశుకవితావిహారమున సమయస్ఫూర్తితోడి లోకోక్తి ప్రసంగమునందలి వక్రోక్తి చాతుర్యమునకు ముగ్ధులు కాని సదస్యులే

యొకరును లేకపోయిరి. తుదిని "అవధానంబున"......అని ఆరంభించి "నవరత్నంబుల గ్రుమ్మరించితివె యన్న సత్యనారాయణా!" అని మత్తేభవృత్తంబున నేను, శ్రీతిరుపతి శాస్త్రిగారి కుమారులగు వేంకటావధానిగారు గూడు పద్యములతోను ప్రశంసింపక మానలేమైతిమి అప్పటికాయన బి.ఏ ప్యాసయినారో? చదువుకొనుచున్నారో! చెప్పజాలను శ్రీచెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి శిష్యుడనని నడుమనొక పదమున నాయన చెప్పికొనినప్పుడు నాకు సాక్షాత్తు వేంకటశాస్త్రిగారే యీయన యను గురుభావమును గలిగినది

వారి గ్రంథము లాద్యంతము నేనుఁ జదువఁ జాలకపోయినను "వేయి పడగలు"ను, రామాయణకల్పవృక్షము క్వాచిత్కముగను చదివిన పిదప వారి రచనల కీరెండును మకుటాయమానము లనిపించినవి· ఇప్పటికిని నా భావమంత యే.

ఈరెండు రచనలకు పూర్వమే ఏలూరు "సాహితీ సమితి"లో ఆయన నిజమైన వీరుఁడగు నాంధ్రపుత్రు డనినట్లు చేయెత్తు దృఢమైన మూర్తితో నిలువబడి యుత్తరీయము నడుమునకుఁ జుట్టుకొని గొంతెత్తి గానయుక్తముగా చదివిన కొండవీటి పొగమబ్బులు చెవులలో గుండెలలో అమృతవర్షము కురిసినట్లయి పరవశించిన సభ్యులందరిలో నేనొకఁడను. ఏమి భావన! ఆగాలి మూటలో రెడ్డిరాజుల నిరుపమరాజ్యవైభవముల పరిమళము లిమిడియుండుటచే ఆమూట కదిలించిన మాత్రమున "గప్పు"మని మిన్నంటలేచి దశదిశలు గ్రమ్మినట్లయినది.

ఆ కళాఖండము "ఆంధ్ర ప్రశస్తి"లోనిది అని నామిత్రులు ప్రకృతమున యశశ్శేషులునగు శ్రీ కాంద్రేగుల రామచంద్రరావుగారు సభానంతరమున చూపగా ఆఖండకావ్యమునందలి ప్రతిఖండమును ముమ్మాఱు చదువక మానలేనైతిని. మరల మరల కొండవీటి పొగమబ్బులు చదివితిని.

సీ॥ "ఒకరెడ్డి సభదీర్చి యున్న కొండకు వాలు
కొసలతో ముత్యాల గొడుగుపట్టు,
ఒకరెడ్డిమూర్తిపోలికతీరియున్న కొం
డకు కోసగా కిరీటమ్ము వెట్టు

ఒక్క శుద్ధాంత వధూత్ప్రేతఁజను బురు
జున సన్నమేలిముసుంగు దొడుగు
ఒక తెల్గుబంటు శివికి ముద్రగొనియున్న
బురుజుపజ్జ మహాసివోలె వ్రేలు
ఈ జగా పొగమబ్బులు రాజసేవ
మఱచిపోలేవు రసధునీమహితమూర్తు
లేము లెక్కించుచుంటిమి యెన్నినాళ్ళ
చనెనోయని వంద లేళ్ళగాఁజాచికొనుచు."

సీ॥ "అస్మదర్థాతిథేయారబ్ధములు రెడ్ల
భువి వంటశాలల పొగలటంచు
అచట శ్రీనాథకావ్యశ్రోతలగు మాకుఁ
బఱచిన పందిళ్ళ పఱపులంచు
కొండకొమ్ములఁ దీర్చికొని నిల్చియున్న యాం
ధ్ర భటాళి వీరగంధాలటంచు
ఉత్సవాగతజనమ్మొరిగిబోఁ గొండకొ
మ్ములఁ దొంగి కను రెడ్లముగుదలంచు
మున్ను గుఱ్ఱాల దూకించుకొన్నచోట
నడుగడుగునందు పాతంబులైన మాకు
నప్పుడప్పుడు తలయెత్తినంత కొండ
కొసల మబ్బులు పొరపెట్టి విసరులాడు".

సీ॥ "ఎంతనిర్భయముగా నీపొగమబ్బులు
జెట్టీల బురుజుపైఁ జిమ్మిరేగు
ఏ లెక్క లేనట్లె యీ పొగమబ్బులు
మిరియాల తఖతుపై తటిమి పోవు

ఇంత యడ్డంకి లే కీపొగమబ్బులు
తారాబురుజుమీదఁ దాట్లు పెట్టు
ఈమాత్ర మాఁక లే కీ పొగమబ్బులు
కేళిశుద్ధాంతసౌధాళిఁజొచ్చుఁ

పిచ్చిపొగమబ్బులార! కోపించిరేని
చెడ్డవారుసుమీ! మిమ్ముఁ జించి యొమ్మొ
తాచి చెండాడిపోదు రద్దంకి రెల్లు
లేలిహానమ్ము లడ్డంకిలేని రెల్లు."

కాళిదాసు స్వయముగా వచ్చి "నభూతో నభవిష్యతి" అని ప్రసిద్ధ మైన తన మేఘసందేశకావ్యమును శృంగారరసము చిప్పిల్ల నాఁటి యా సభావేదిక నిలిచి యెంత మధురముగాఁ జదివినను స్వరాజ్యవాంఛాపిపాసిత మైన నాటికాలమున ఆషాఢప్రథమదివసమేఘము వీరకరుణరసభర భరిత ములగు విశ్వనాథవారి పొగమబ్బుల ముందు దూదిపింజయై తెల్లపోవలసినదే కాని నిలుచునా? అనిపించినది.

కవియగు వానికి ముఖ్యముగ నుండవలసిన ప్రతిభకు ఈఖండము మచ్చుగా చూపితిని "వేయి పడగలు" గూర్చి తరువాతఁ జెప్పెదను ప్రతిభకును వైదుష్యమునకును, సిద్ధఘట్ట మగు రామాయణకల్పవృక్షమును చేరి యాఛాయను గూడ నిలిచి యానందించుటయు ముఖ్యమేగదా!

రామాయణము అనఁగానే వాల్మీకికృతమగు నాదికావ్యము ప్రథ మోపస్థితము కాక మానదు. కాని అది సంస్కృతభాషామయము. తెలుగు వారి దృష్టిలో (ఎన్నియున్నను) భాస్కర రామాయణము- అది కవిపేర ప్రసిద్ధము అట్టిదే ద్విపదచ్ఛందమునఁ బుట్టిన "రంగనాథరామాయణము". "మొల్ల రామాయణము"ను ఇంటిపేర వెలువడినది. గోపీనాథ వేంకటకవి కృతమగు గోపీనాథరామాయణము ఇట్టివి ఇంకను గొన్ని యుండవచ్చును. "వచ్చును" అనుటేల యనిన—తెలుగున నున్నన్ని రామాయణము లితర భాషలలో లేవేమోయను ననుమానము. వచనముగా, పద్యముగా, ద్విపద

లుగా, కీర్తనలుగా, దరువులుగా, నాటకములుగా, నవలలుగా, హరికథలుగా, బుఱ్ఱకథలుగా, ఇంకను రచనా విధానములందెన్ని భేదములు గలవో యన్నిటను రామాయణ రచనము కనఁబడుచున్నది శతకముల మాట నెత్తితిమా? నేటివరకు దినమున కొకటికిఁ దక్కువగాకుండ వెలువడుచున్నవని తలంపవచ్చును

అట్టియెడ తమయింటి పేరితో విశ్వనాథ రామాయణమనికాని, కవి పేరుతో సత్యనారాయణ రామాయణమని కాని, లేపాక్షి రామాయణము, గుత్తెనదీవి రామాయణము మున్నగు వానివలెఁ దాను జన్మించిన నందమూరు క్షేత్రనామముతో నందమూరు రామాయణము అని కాని పేరుపెట్టక విశ్వనాథవారు "రామాయణ కల్పవృక్షము" అని రామాయణమునకు నూతననామకరణ మేల యొనర్చినారని పరిశీలింపవలదా?

అహంకార రాహిత్యమేకాక, రాముని కంటెను, ఆతని పేర వెలసిన గ్రంథమైనచో రచయితకును, పఠితకును సకలవాంఛితములను కల్పవృక్షమువలె నిచ్చునను నూహతో "రామాయణ కల్పవృక్షము" అను పేరు కూర్పఁబడి యుండును అని నాబుద్ధికిఁ దట్టినది

ఒక కాలమున నీ నామకరణము గూర్చి పత్రికలలో నొక దుమారము లేచినది "రామాయణ శబ్దము నపుంసకలింగము, కల్పవృక్ష శబ్దము పుంలింగము. ఈ రెండుశబ్దములకు విశేష్య విశేషణ భావముగాని ఉపమానోపమేయ భావముగాని కుదురదు" అని, విశేషణ విశేష్యములకు లింగవచనముల యెడ భేదమున్నను సామానాధికరణ్య మున్న యెడల విశేషణ విశేష్యత్వము నిర్బాధము అను నర్థముగల "లింగ సంఖ్యా విభేదేపి విశేషణ విశేష్యయోః విభక్తి పునరేకా చేత్ విశేషణవిశేష్యతా" అను విధివాక్యము చేత ఆదుమారము శాంతించినది.

అహోబిలుఁడు కవిశిరోభూషణమున వాల్మీకిని స్తుతించుచు "తం కావ్య కల్పద్రుమ కుంభవారిధిం ప్రస్తౌమి వల్మీకభవం సతాం వరం "అని నపుంసక లింగమగు కావ్యశబ్దమును పుంలింగశబ్దమగు కల్పద్రుమ శబ్దమును విశేష్య విశేషణ భావముతో సమసింపఁజేసినాడు. కవిత్వ మనెడి కల్పవృక్ష

మునకు వాల్మీకి పాలసముద్రము వంటివాఁడని భావము ఇది "రామాయణ కల్పవృక్ష"మను సమాసము వంటిదే ఇందలి సామానాధికరణ్యము విశేషణ విశేష్యములకుఁగాని, ఉపమానోపమేయములకుఁగాని యెట్లుచెప్పికొనినను సరిపడునదే కావున మీఁది ఆక్షేపము సముచితము కాదు

సరే! రామాయణము కల్పవృక్షమెట్లగును? అను ప్రశ్న మిగిలియే యున్నది. పురుషార్థచతుష్టయము నర్థించు వారికి భేదము లేక సర్వులకు ఇచ్చునది కావున "కల్పవృక్షమే" యిది యనుటలో విప్రతిపత్తి కనఁబడదు

ధర్మము, అర్థము, కామము, మోక్షము అనికదా పురుషార్థములు భారతజాతికి ధర్మాధర్మనిర్ణయ మొనర్చి "స్వీకార్యము ధర్మమే" యని యుపదేశించునది వేదము "వేదోధర్మమూలమ్" అని స్మృతి అట్టి వేదమే రామాయణము అని "వేదః ప్రాచేతసా దాసీత్సాక్షాద్రామాయణాత్మనా" అని సూక్తము "రాజన్! భూమిసురోత్తమాదృత మిదం రామాయణం పుస్తకం" అనెడి భోజప్రబంధోక్తి అర్థకామములకు నాలంబనము రామాయణమే యని సూచకమగు చున్నది రామునియందు వాచ్యముగాఁ గాక మోక్షమే వ్యంగ్య మగుటచే కల్పవృక్షకల్పన యందపార గౌరవమేకాని న్యూనత యత్కించిత్తును లేదనుట స్ఫుటము

ఆభావముతోనే రామాయణమును కల్పవృక్షముగా విశ్వనాథవారి నిరూపణ మనుకోదగును.

తమ కవితకుఁ బరమావధిగాఁ బెట్టుకొనిన విశ్వనాథ రామాయణ రచన యందలి యాయన ప్రతిభను మించిన వైదుష్యమును గూర్చి స్పృశింపవలసి యున్నది. కాదు వైదుష్యమును మించిన దాప్రతిభ యందురా అదియును సమ్మతమే "ప్రతిభావ్యుత్పత్తిమాంశ్చ కవిః" అని కావ్యమీమాంసయందు రాజశేఖరపండితుడు ' కాని నావంతు వైదుష్యమే నిరూప్యమైనను ప్రతిభను విడిచి వైదుష్యమును జెప్పఁజాలక యుభయ మిశ్రణమున వ్రాయఁబూనితిని. నాఅశక్తతను పెద్దలు మన్నింతురుగాక!

శ్రీసత్యనారాయణగారు ఆంగ్లమున ఎమ్ ఏ పట్టభద్రులు ఎప్పుడు చదివిరో తెలియదు. గురువులగు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి

యనుగ్రహ విశేషముననే యనుకొందును-వ్యాకరణశాస్త్రమార్మికుఁడు; గానవిద్యాలంకారుఁడు రామాయణరచనకు ముందు వేదము కొంత భాగము నేర్చినారని పెద్దల వలన వినికిడి ఇంత సామాగ్రి యుండియు అక్షరాక్షరశః వెదకిన నెందేని రవంత స్ఖాలిత్యమగపడు నేమోయని తనకే తోచి కాఁబోలును తనజంట కవియగు శ్రీకొడాలి ఆంజనేయుని తలంచు పట్టున—

ఉ॥ అతఁడె తోడు కల్గినను నచ్చముగాఁ గలకండ లచ్చులుం
బోఁతలు పోసియుండెదము పోతనగారి విధాన-దీపితా
లాతమువోలె నుంతయు విలంబనమోర్వదు నిత్యవేగి నా
చేతము శబ్దమేరుటకుఁ జిన్నము నిల్వదు భావతీవ్రతన్.

అని రామాయణ కల్పవృక్షముననే చెప్పికొని యుండుటచే భావ తీవ్రతలోని నెఱసులు గణించుచు కూరుచుండుట పురోభాగిత్వము కాక మానదు రసజ్ఞత కలిగి యాస్వాదింపనెంచిన యెడ నా కల్పవృక్షమున రసవంతములగు నెన్ని ఫలములు లేవు? ఎన్ని చిగురాకుల తళతళలు లేవు? ఎన్ని నూతన భావసౌరభములు లేవు? రేఖానిర్దిష్టమగు వాక్యమునకు తార్కాణగా "నిరంత" శబ్దప్రయోగమును మచ్చునకు ఁజూపెదను.

"ఆయనకు *నిరంత* నిర్వాత చిద్దీప నిభృత మూర్తికిని"
(పాదూకాఖండము పుట 274)

"అమ్మ ననున్ బలెన్ నిను *నిరంతము* కన్గొను"
(ప్రస్థానఖండము పుట 147)

ఈరెండు తావులందును "నిరంతము" కంటే "నిరంతరము" అని యున్నచో శైలి యింకను మనోహరముగా సహృదయ హృదయులకు స్ఫురించుచు నుండును కాని ఆయన చిత్తము విలంబన మోర్వదు - "నిత్య వేగి" కాన నిరంత శబ్దము ప్రయోగించెనను కొందును. అయినను నది యర్థ వంతమై ఆయాతావుల యందు అదుకు కొనినది "ఋషీణాం పునరాద్యా నాం వాచ మర్థోనుధావతి" అనిన భవభూతి సూక్తి స్ఫురణకు వచ్చు చున్నది ఇట్టిదే "నిరంతమోదము", "హృదంత వికీర్ణములు" మున్నగునవి

"కాననాంత యాత్రాపతయాళు" (పాదూ 268 పుట)-ఇచటి అంత శబ్దమునకు సామాన్యముగా తుదయని యర్థమైనను లోపలిభాగమను నర్థమున పంచతంత్రము నందుండుటచే నా రహస్యము తెలిసియే చూపవలెననినట్లు తోచుచున్నది "సనకసనందాది సర్వర్షి సంఘుంబు" (పాదూ 272 పుట) ఇందలి సనంద శబ్దముకంటె ఆయర్థముననే "సనందన" శబ్దము భాగవతాది గ్రంథములందు ప్రచురముగా గన్పడును. కాని సనంద శబ్దము లేకపోలేదు "సనకశ్చ సనందశ్చ తృతీయశ్చ సనాతనః కపిలశ్చాసురిశ్చైవ వోఢుః పంచశిఖస్తథా" అని సనంద శబ్దమును జ్యేష్ఠః సనత్కుమారోఒభూత్ ద్వితీయశ్చ సనాతనః తృతీయస్సనకోనామా చతుర్థశ్చ సనందనః" అనియు వామనపురాణమున "సనంద,సనందన" శబ్దములు పర్యాయములుగా ప్రయుక్తములగుటచేత నే యీరహస్య మెరిగియే కవిసమ్రాట్టు అట్లు ప్రయోగించియుండును.

"పురస్తాద్యాతు సౌమిత్రి (ప్రస్థాన ఖండము 151పు)- ముందు భాగమున వెళ్ళుచున్న లక్ష్మణుఁడు అని యర్థము "పురస్తాత్" అను నవ్యయముతో యాతుశబ్దము సమసించినది యాతువు-అనగా-వెళ్ళువాడు అను నర్థమునకమి, మని,జని,గా,భా, యాహిభ్యశ్చ-అను ఉణాది ౧-28 సూత్రమున 'యా' ధాతువు మీద "తు" ప్రత్యయము రాగానైన రూపము, "అధ్వగుఁడు" అని యర్థము కల్పవృక్షమున నిట్టి పశ్చాత్ పురస్తాత్ బహుశః మున్నగు సంస్కృతావ్యయములతో నెన్నియో సమాసములు గలవు ఇంకను విచిత్రములు శాస్త్రీయములునగు శబ్దకల్పనము లెన్నోకలవు గ్రంథ విస్తరమని మానితిని

యుంజాన మూర్తి (ప్రస్థానఖండము 148 పుట)-ఈపదము శబ్దకల్పద్రుమమున (యుజ సమాధౌ శానచ్) 1 సారథిః, 2 విప్రః, 3 భావనా సహకారేణ సర్వజ్ఞః—అపరః యుంజానః—విషయ వ్యావృత్యా మానస సమాధిస్థః అయంచ యుంజాన ఇత్యుచ్యతే, చింతా, ధ్యానం, తదేవ కారణం తత్సహకారాత్ స్థూల సూక్ష్మ వ్యవహిత విప్రకృష్టాన్ అర్థాన్ మనః ప్రత్యక్షీకరోతీత్యర్థః- ఇతి "సిద్ధాంత ముక్తావలీ" అని. ఇంద్రియ విషయములలో శబ్దస్పర్శాదులనుండి మరలఁబడిన నిర్మలమగు మనస్సు

తోడి సమాధి యందుండువాఁడు అని భావము. లక్ష్మణునకు "యుంజానుడు" అను విశేషణము కల్పవృక్షమునఁ గలదు సీతారామలక్ష్మణులు గుహుడు తెచ్చిన పడవపై గంగానది దాటునపుడు "ఆరోహింపగఁజేయు మీవదినె ముందావైని నీనావ నీవారోహింపుము—నేను వచ్చెదను దర్వాతన్" అని రాముఁడాజ్ఞాపింప "లక్ష్మణుఁడు తల్లి నెక్కించి పక్ష్మచలన మృదు దృగంతములన్ రామునెగది చూచి తాను నావపై నెక్కి యుంజాన మూర్తి" అనిరి లదు ఇట "యుంజానమూర్తి" అను విశేషణమున లక్ష్మణుని శీలము ప్రతిబింబించినది, ప్రతిబింబింప వలెననియే కవిసమ్రాట్టుల యాశయము కూడను. కావుననే—

"సంజఁను రెంట నానమస్కార సరణి నేను పదుమూడు వర్షంబు లెరిగినాఁడ నివి విడిగ నూపురములని యిపుడు దెలిసె......నేనింకేమియు నెఱుఁగను నాకుఁ దెలియదు" అని కిష్కింధాకాండమునఁ జెప్పగల్గెను "పదుమూఁడేడులు వెనువెంట నంటియుండి సీతారాములకు వివిధోపచారములు చేయుచు అవ ఠము వెంబడిని మాటాడుచు గూడ సీతాదేవిని కన్నెత్తి లక్ష్మణుడు చూడనేలేదఁట. చూచినను ఉభయసంధ్యల మాతృమూర్తిగాఁ దలఁచి మ్రొక్కునపుడైనను కాలియందెలు మాత్రమే చూచితిని గాని యింక నాఁకేమియు దెలియదు అనిన "నాహంజానామి" అను వాల్మీకి శ్లోకమునకు ఇది కరదీపికగా ముందే యుంజాన శబ్దము వెలసినది.

మచ్చునకు పరిణత ప్రజ్ఞాద్యోతకమగు నింకొక ప్రయోగము నూపురఖండమున 155 పద్యములో సీతాపహరణము రావణుని వలన జరిగినట్లు రామునితో సుగ్రీవుఁడు చెప్పు సందర్భమున—

"ఆ పరమాభిమాన విభవాకృతి యాసతి రామనామ శ
బ్దాపయదంబరాధ్వమున నార్తరవప్రతిరావ నిర్గతా
శాపరితోనిరాశముగ సాగిన దవ్వుగఁజూచినాము" అను వాక్యమందలి—(రామనామ) శబ్దాపయత్—అనుపదము విచిత్రమైనది రామ

నామముచేత ధ్వనితమగుచున్న ఆకాశమార్గమున ఆకాశమార్గమంతయు రామనామముచే ధ్వనితమగుచుండెనని భావము

ఈ "శబ్దాపయత్" అను పదము వ్యాకరణ రహస్యముతోఁ గూడినది కాని సామాన్యమైనది కాదు

శబ్ద-అనునది-క్విబంతమయిన నామధాతువు అనగా నామవాచకమయిన "శబ్ద" పదమునకు "సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః" అను వార్తికముచే క్విప్ ప్రత్యయమువచ్చి క్విప్పు సర్వలోపి కావున "శబ్ద" అని మిగిలి అదియే ధాతువగును ఆక్విబంతమునకు ధ్వనించు అని అర్థమగును దానిపై (శబ్ద పై) ప్రేరణార్థమున "ణిచ్" ప్రత్యయము పరముకాగా 'ణిచ్చు" అను దానిలోని ఇకారము మాత్రము మిగిలి శబ్ద+ఇ అని యుండ "అచోఞ్ణితి" అను సూత్రముచే ఈ ఇకారము ణిత్తుకావున "శబ్ద" అను దానిలోని అకారమునకువృద్ధి (ఆకారము) ఆదేశమై "శబ్దా" అని ఆదంతమగును శబ్దా+ఇ అని యుండ "అర్తిహ్రీ......ఆదాం పుక్ణౌ" అను సూత్రముచే పుగాగమముకలిగి శబ్దా ప+ఇ = శబ్దాపి అని ణిజంత ధాతువగును క్విప్పు లోపించిన 'శబ్ద'వలెనే 'ఆపి'అను ణిజంతమును "సనాద్యంతా ధాతవః" అను సూత్రముచే మొత్తము ణిజంత ధాతువై వర్తమానమున లట్—చేయఁ బోవుచుండ "శప్" వచ్చి శకార పకారములు లోపించి "అ" మిగులును శబ్దాపి+అ అని యుండ "సార్వధాతుకార్ధధాతుకయోః" అను సూత్రముచే అకారము సార్వధాతుకమగుటచే "శబ్దాపి" లోని తుది "ఇకారమునకు" గుణము ఏకారము—అయాదేశములు కలిగి శబ్దాపయ్+లట్ అనియుండును పిదప వర్తమానార్థకమగు లట్టునకు "లటః శతృశానచావ ప్రథమా సమానాధికరణే" అను సూత్రముచే "శతృ" ప్రత్యయము ఆదేశమై "శబ్దాపయత్" అని రూపసిద్ధికలుగును

"శబ్దాయంతే మధురమనిలైః కీచకాః పూర్యమాణాః" అని మేఘసందేశమునను, "జితే నృపాలౌసుమనీభవంతి శబ్దాయమానాన్య శరైరశంకం" అనియు "శబ్దాయమాన మవ్యాసీద్భయదం క్షణ దాచరం" అనియు భట్టికావ్యమునను ఆత్మనేపదముగాను శానజంతముగాను కనఁబడుచుండ "శబ్దాపయత్" అను శత్రంతము సందిగ్ధమను కొందురేమో! వానికిని వీనికిని సంబంధములేదు. అర్థమునగూడ—ఈమూడును తమంతఁ

దాము ధ్వనించుచున్న అని అర్థము. "శబ్దాపయత్" అట్టిదికాదు. రామ నామముచే అంబరాధ్వము ధ్వనించునట్లు అగుచున్నది అని కరణార్థప్రధాన మైనది యీ ప్రయోగము.

ఇట్టిదే రఘువంశము 2వ సర్గమున 44 "విస్మాపయన్ విస్మయ మాత్మవృత్తౌ" అను శ్లోకవ్యాఖ్యయందు "విస్మాపయమాన, విస్మాయయ మాన" ఏలకారాదు? అని శంకించి కరణవివక్షయందు ఏదోషములేదు అని "విస్మాపయత్" అను శబ్దమునకు సిద్ధిమార్గమును చూపెను మల్లినాథసూరి

"యది భవానంతఃపుర కలహాన్ముచ్యతే తతో మాం మేఘప్రతిచ్ఛందే ప్రాసాదే శబ్దాపయ" అని కాళిదాసుని శాకుంతల నాటక ప్రయోగము కలదు. శబ్దాపయ ధాతువుపై లోణ్మధ్యమైకవచనము విశ్వనాథవారి శబ్దసంస్కారజ్ఞానమున కిది యొక్కటి చాలదా?

ఇట్లు నవీనముగాఁ గనిపించు ప్రాచీన సంప్రదాయబద్ధము లీకల్ప వృక్షమున నడుగడుగునను గల వనిన నతిశయోక్తి కానేరదు

రాముఁడు పంపాసరస్తటమునకు వచ్చిన సందర్భమున—

మ. వనమీనాటికి నయ్యె బిల్వఖదిరాశ్వత్థంబు లీతీర్పు తీ
ర్చిన రేఖం దొలినాటికిద్ది క్రతుధాత్రింబోలెఁ గల్పించుచున్
దనయున్ జానకియున్ జనుర్విభవవృత్తాంతంబు నాన్ బంపయొ
డ్డున దుఃఖోల్బణకంఠశోషములు గండూషించెఁ బ్రాణేశుడున్

బిల్వ ఖదిరాశ్వత్థ వృక్షములేనాడో యిక్కడ క్రతువొనర్చినట్లు నేడును కనబడుచుండుటచే దశరథుని యజ్ఞఫలముగా జన్మించిన తనపుట్టుక యును, జనకుని యజ్ఞఫలముగా జన్మించిన జానకి యొక్క పుట్టుకయును స్ఫురించి దుఃఖాతిశయమున గొంతు తడియారుటయును, గండూషించెనట రాముడు. పుక్కిట బట్టి యిటునిటు కదిలించి వెదలనుమ్మినరీతిని రాముఁడా నాటి యశ్వమేధ యజ్ఞములనుస్మరించి మనస్సులోమిగులకుండునట్లు వలఁచు కొని ఖారుమని యేడ్చెననుట. వామనుని మతప్రకారము ఖారుమని

యేడ్చెననుటకు మాఱుగా గండూషించెననుట సుకుమార ప్రయోగము. ఆతడు తన కావ్యాలంకారసూత్రవృత్తియందు 'మృతు'డనుట కంటె "యశశ్శేషుడు" అనుట సుకుమార ప్రయోగమనినట్లే యిదియును.

"వన మీ నాటికి" అను పద్యమున నొక గ్రంథ గ్రంథి వ్యాకరణ విషయమునఁ గలదు "తనయున్ జానకియున్ జనుర్విభవ వృత్తాంతంబు" అను వాక్యమున తన యొక్కయు జానకి యొక్కయు జన్మవృత్తాంతము: అని చట్టున స్ఫురింపక తప్పేమో యనిపించును

తనయున్=తన యొక్కయును, జానకియున్=జానకి యొక్కయు, జనుర్విభవంబు=పుట్టుక యందలి గొప్పదనము— ఇయ్యది సమాసము కాదు కాకపోదు యొక్క లోపించుట, ననుచు : ముచ్చయ 'ను' వర్ణము వచ్చుట కడుచిత్రము కాని విశ్వనాథులు భారతము ననుసరించియే యీ వాక్యము రచించిరి

"దివ్యమాల్యములయు దివ్యానులేపనములయు సౌరభంబు వెలయఁ
దాల్చి
రంగమధ్యజనులకుంగడుముదముగాఁ జేరిపిచె దివ్యమారుతంబు"
భార. ఆది 2 ౧౨౩

దీనియందలి సొగసును జూప ముచ్చటపడి యీయన రచించినది కాని వేఱు కాదు రామునకు పట్టము కట్టవలెనని రాజసభయంతయుఁ గోరఁగా దశరథునకు నానందము కల్గుట ఇట్లు వర్ణింపఁబడెను—

భూపతి కంటికోసలను బొల్చిన చిన్నరి మోదబాష్ప బిం
దూపరి దృశ్యమాన కలితోజ్జ్వల రత్న మణిప్రదీపికా
శ్రీ పరిదీప్తమై వెలువరించెను భూపతి గుండెలోని ర
త్నాపణవద్గద్గితమైన మహోత్సవకాంతి యెల్లయున్.(అభి.)

రామునకు పట్టము గట్టువార్త వినఁగనే దశరథుని కంటి కొనలందు చిన్నది యానందబాష్పజలబిందువు తోఁచినది ఆ కన్నీటి బొట్టునందు సభామంటపము మీఁది భాగమునందు గల రత్నదీపము యొక్క కాంతి

ప్రతిఫలించినదట! ఆ ప్రతిబింబము రాజుయొక్క హృదయమునందుఁ గల వివిధ రత్నాల బజారుయొక్క ధగద్ధగకాంతులేనఁట అనఁగా తనకా సమయమునఁ గలిగిన యనేకవిధములైన భావములే చకచకమని కన్నీటి బొట్టునందు మీఁది కుబికి వచ్చుచున్నట్లుండెనని మనోహరమగు ఉత్ప్రేక్ష ఎంత గంభీరమగు భావము! ఈ పద్యమా కారణముననే రత్నదీపమైనది ఇట్టిదే యింకొక పద్యము మచ్చునకు—

ధరణిని న్యాయమార్గమునఁ దన్పుచుఁ షష్టిసహస్రవర్షముల్
పరమసుఖంబులొంది నరపాలుఁడు ధర్మగృహీతకామినీ
పరమసుఖంబులొంది నరపాలుఁడు శత్రునిబర్హణక్రియా
పరమసుఖంబులొంది తృప్తినిగాంచఁ డెంతయున్.

ఇది దశరథుని వర్ణనము "నరపాలుడు" అను పదము ముమ్మాఱు వచ్చుటచే పునరుక్తమువలెను, అపుష్టార్థము వలెను గానఁబడును కాని సూక్ష్మముగా నరయ నారచనలో పరిపుష్టియే కాని యన్యము లేదు ఇట్టి రచన యసాధారణము కాశీఖండమున ఈ క్రింది పద్యమునఁ బునరుక్తి కాదు గాని వాక్యరచనాచమత్కృతిలో నేదియో లోపమువలెఁ బైకి గనఁబడునది కలదు.

దుర్భిక్షదోషంబు దొరకొన్నఁ గడపని
కడపని గృహసూతకంబునందు
నింటఁబీనుంగు వోయెనేనియుఁ గడపని
కడపని ముక్కిడి గవిసెనేని
గువలయేశుఁడు దండుగులుగొన్నఁగడపని
కడపని భవనంబు గాలెనేని
పితృకార్యవిధి సమాపింపకఁగడపని
కడపని ముట్టంటు గలసెనేని

వేళగాకున్న గడపని వేలుపులకు
మీఁదువోకున్నఁ గడపని మిన్నకెట్లు
గడపి రింటింట నీ కాశికాపురమునఁ
బుణ్యగేహిను లది మహాద్భుతముగాదె.

'గడపని' అను విశేషణములు పదియును 'పుణ్యగేహిని' అను విశేష్యముతో నన్వితములు కాఁదగినవే- "గడపని పుణ్యగేహిని" యని యర్థమగును కాని విశేషణసంబంధము లేనంత వ్యవధానముతో 'పుణ్యగేహిని' శబ్దము సమన్వయింప వలసియున్నది ఎట్లు? దుర్భిక్ష దోషంబు దొరకొన్నఁ గడుపని పుణ్యగేహిని, గృహాసూతకంబునందును గడపని పుణ్యగేహిని, ఇంటఁ బీనుఁగు వోయినేని గడపని పుణ్యగేహిని......ఇంటింట నీ కాశికాపురమునందలి పుణ్యగేహిని యెట్లు గడపినది? ఇది మహాద్భుతము కాదా' అని ఏకవాక్యత వ్యాసునకును శిష్యులకును భిక్ష పుట్టకుండ కాశిలో అన్నపూర్ణ పరీక్షించు ఘట్టమున తన శిష్యులు భిక్ష పుట్టక వట్టి జోలెలతో వచ్చినప్పుడు వ్యాసుడు శిష్యులతో ననిన మాటలు గృహస్థునకు అసామాన్యముగా వచ్చు నిబ్బందులతో సైతము అట్టి వైపరీత్యమ్ మదినరకెన్నడు గలుగలేదు కావున నాయిబ్బందుల నన్నియు వరుసగా ప్రశ్నించెను ఆ వ్యతిరేకార్థక క్రియాజన్య విశేషణముల కన్నిటికి తచ్ఛబ్దార్థమగు అది అనుపదము సమాసమునందువలె వ్యాసమునఁ గూడ లోపించుట అపూర్వము. అట్టిదే కల్పవృక్షమునందలి పై పద్యమునందు గూడ విచిత్ర సమన్వయము గలది "అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః, యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే"—అనుసూక్తి యిట్టి కవితా వైచిత్ర్యము కొఱకే పుట్టినది కాఁబోలును!

ఈ పద్యరచన మొక చిత్రమగు నన్వయము కలది అయోధ్యాకాండమున రామునకు పట్టముకట్టు తలంపు ప్రజల ముఖమున స్థిరపరచుకొని దశరథుడు సుమంత్రుని పంపి రాముని తన సభకు రావించుచున్నాడు. అప్పుడు మేడ యెక్కి దశరథుడు రాముని రాక నిరీక్షించుచుండెను-

మరకత వైడూర్య మాణిక్య నీలచ్ఛ
టాప్తిచే బర్హిబర్హాభచూడు
సహజ నిశ్చల మనస్సంచార ధీరతా
ప్రతిభచే శ్రీగజరాజగమను
స్వాంతర్నిలీన బ్రహ్మజ్ఞానకీర్తిచే
నిశ్చలసౌదామనీ దృశాంకు
మందవీచీపరిస్పందానిలాధ్వరం
జన బలాకాగరుత్సదృశచేలు
వరలక్ష్మీసమాపన్నవక్షుఁడైన
ప్రౌఢ పర్జన్యదేవుఁడభ్రంబు వదలి
నడచి వచ్చెడు చందాన నయనపర్వ
మోదమునుగాంచెఁ బతి మేడమీఁద నుండి. (45)

దశరథుడు వర్షాధిదైవతమగు పర్జన్యుని ప్రజ లానందముతో నుత్కంఠతో ప్రతియేట తొలకరియందు చూచుతీరున రాముని మేడ మీఁద నుండి చూచుచుండెనట ఇఁక రామునియందా వర్షాభ్రలక్షణములు స్ఫురింపఁజేయ రాముడు బర్హిబర్హాభచూడుఁడనియు, గజరాజగమనుఁడనియు, నిశ్చలసౌదామనీదృశాంకుఁడనియు, బలాకాగరుత్సదృశచేలుఁడనియు– నాల్గు విశేషణములుకలవు తొలుకారు మేఘమునుఁ జూడఁగనే నెమిళ్ళు పురులు విప్పుకొని నాట్యము చేయును. ఆమేఘము గజరాజు వలె నెమ్మదిగా మలయానిలముచే నాకసమున నేగుచుండును "ఆషాఢస్య ప్రథమదివసే- మేఘం...వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయం"—అను కాళిదాసు సూక్తికి జ్ఞాపకము. నిశ్చలసౌదామినీదృశాంకుఁడు అనునది దండిమతానుసారము అభూతోపమ మెఱపు తీఁగ నిశ్చలమనుటయెట్లు? ఒక వేళ మెఱపుతీఁగ తళుక్కుమని మాయము గాక నిలిచినచో ఎట్లుండునో అట్లు రాముని చూపులున్న వన్నమాట. దీనిలో మెఱపుతీఁగలు చెప్పబడెను బలాకాగరుత్సదృశచేలుఁడు అనువిశేషణముచే- బలాకలనగా వానకోయిలలు అవి క్రొత్త మేఘమును సేవించును. "గర్భా

ధాస క్షణపరిచియాన్నూన మాబద్ధమాలాః సేవిష్యంతే (మేఘం) బలాకాః" - అను కాళిదాసు సూక్తికి జ్ఞాపకము రాముని యుత్తరీయపుఁ గొంగులు లేఁతగాలికిఁగదలుట ఆదోఁకగా సన్నముగా నుండు బలాకల రెక్కలవలె నున్నవఁట.

ఇట్లు వర్షాకాల లక్షణములైన నెమిళ్ళనాట్యము,గజరాజపాదప్రశ్యము' మెఱపు తీఁగలు, బలాకలు-రాముని వేషమును స్ఫురింపఁజేసి, రాముని యందు వర్షలక్ష్మికి ప్రభువు పర్జన్యుఁడు ధ్వనింపజేయఁబడెను నావ్యాఖ్య చాదస్తముగా నుండవచ్చును. కాని సహృదయులీ కల్పన మననమొనర్చు కొని యానందింతురని నాయానందమును వెల్లడించితిని. ఏమి భావన! గంభీరమగు భావము!

పిదప రాముఁడు తండ్రిని సమీపించును ఆరాముని చూఁడగనే దశరథుని మానసికోత్సాహము నెంతగంభీరముగా నీపద్యము ప్రదర్శించెనో- ఇందొక విచిత్రము నపూర్వమునగు భావనయును గలదు రాముఁడు తప్ప టడుగులు వేయు శైశవమున దశరథు డెదురుగాఁజని యెత్తుకొను వాడు కావున యువకుఁడైన రాముని నట్లే నేఁడెత్తికొనుట యనుచితము కాదఁట. రాక్షసవధజేసి దృఢగాత్రుఁడయిన రాముని పసితనమునందువలె బుగ్గముద్దు పెట్టుకొనుట యుచితముకాదుగదా! అట్లే కోసల రాజ్య సింహాసనమెక్కఁదగి ప్రౌఢుఁడుగా నిప్పుడున్న రాముని పసితనమందువలె దటుక్కునఁదొడపై గూర్చుండ బెట్టుకొనుటయు ననుచితమేకదా!తనయంత పెరిగి పెద్దవాఁడైన రాముని అనుటకు-"తనకాలిచెప్పు రాముని కాల సరిపోవునట్టి వయసు"అని మనోహరముగా నిరూపింపఁబడినది బాలుఁడుగా నున్నప్పటివలె కౌగలించు కొనుటయు విరసముగా నుండునుకదా! ప్రేమ సంబంధమయిన యీపొంగు లన్నియు వ్యర్థమయినను రాముఁడు తండ్రిని సమీపించునపుడు భక్తితోఁ బట్టిన దోసిలి తండ్రి దనదోసిటియందుఁబట్టుకొని రామునిదోసిటిలోనే యొక ముద్దుపెట్టుకొనెనఁట ఏమి ఔచిత్యము! ఈకల్పనము ఈభావన యపూర్వము. ఏ సహృదయుడు మోదపరవశుఁడుకాకుండును?సహృదయులింకను ధ్వనల్ లంకార విశేషములను వెల్లడింతురేమోయను నూహతో నాపద్యమంతయు నిందే పొందుపరచుచున్నాను.

చిటికెన వ్రేలితో శివుని విల్వీఁచిన
ఘోరబాహుని యెత్తికోను నగునె
యనుభూత దనుజమర్దన కాలవికటత్వ
మీతని బుగ్గ ముద్దిడఁగ నగునె
కోసల రాజ్య సింహాసనాధ్యసనత
ర్కితుఁడౌడ నితని నెక్కింపనగునె
తనకాలి చెప్పు రాముని కాల సరిపోవు
వయసులోఁ గౌగిలింపంగఁదగునె

రామచంద్రుని వయసు కారణము గాఁగ
నవనిపతి పొంగులగు ప్రేమ వ్యర్థమైన
నతఁడు పూనిన యంజలి నంజలించి
యతని యంజలిలో ముద్దులాడె నృపతి.

—ఈపద్య మీకాండమున కొక్క దానికే కాదు విశ్వనాథ సారస్వతమున కంతకును మణిదీపము అని నేననుకొందును ఏమి మానసిక భావనిరూపణము!

ధారుణిఁ బుట్టుమర్త్యుల విధంబునఁబుట్టితి వారివోలె నా
హారవిహారనిద్రల సమత్వమె కాంచియు సర్వవస్తులం
దేరికిఁగానరాని గుణమిట్టె గ్రహించి భ్రమింపఁజేయు ని
న్గారవమొప్పఁగన్న పతికంటెను ధన్యులికెవరో కపీ!

—అట్లే ఆద్యంతము వ్యాఖ్యానించి వివరింపవలసిన యీకల్పవృక్షమున నల్ప ప్రజ్ఞగల నావంటి వారికిఁబూర్ణముగా వివరింపఁదరమా! ఒకవేళ వివరింపబూనిన గ్రంథవిస్తరముకాక మానునా!

ఇది యంతయు వైదుష్యమును మించిన ప్రతిభావిశేషము. ప్రతిభను మించిన వైదుష్యము మొదటనే చూపఁబడెను. పర్యవసానమేమన ప్రతిభా వ్యుత్పత్తులు సరియగు తూకములో నడచినవని చెప్పుటయే.

శబ్దార్థవిశేషములను గూర్చి స్థాలీపులాకముగా సూచించినట్లే విశ్వనాథ వారి ఛందః స్వాతంత్ర్యమును రవంత సూచింతును. ఇంచుమించుగా ఛంద

శాస్త్రమునఁ జెప్పఁబడిన సకలములగు జాత్యుపజాతుల యొక్కయు, వృత్తములయుఁ బోకడలన్నియు నీకల్పవృక్షమునఁ గలవనవచ్చును. కొన్ని స్వతంత్రముగాఁ బ్రస్తరించు కొన్నవిగూడఁ గలవనిపించుచున్నది.

కేవలము మధ్యాక్కఱలతో వేయిపద్యముల కావ్యమునే వీరురచించిరనియు, ఆ పదిశతకము లందును ప్రత్యేకము భారత భూమియందుఁగల క్షేత్ర దేవతలను స్తుతించిరనియు, దానికై ఢిల్లీ కేంద్రసాహిత్య అకాడమీ వారు అయిదువేల రూప్యముల పారితోషిక మొసగిరనియు వినియున్నాను వారికీ గ్రంథమున నీ ఛందో వైచిత్రిఁజూపనేల వాంఛ గల్గెనో విచారింప-నన్నయభట్టు కంటెను కవిబ్రహ్మ తిక్కన సోమయాజిని ననుకరింప విశ్వనాథవారికి ముచ్చట గలిగిన దనిపించును

లోకములో తిక్కనను గూర్చి యొక కథగలదు లేఖకుఁడైన కుమ్మర గురవయ్య-స్వామీ! యెంత సేపును చంపకోత్పల శార్దూల మత్తేభ కంద గీతపద్యములేనా? యని యడుఁగఁగా-"ఇదిగో ఈ స్త్రీ వర్ణనమున నీ వాంఛ తీర్తును. ఈ మాట ఇదివఱకే నీవన్నచో రసోచితములగు నెన్నియో ఘట్టములను వెనుకటి పర్వములలో దాటఁ బెట్టితిని. అస్థానమైనను ఈ పర్వమునఁ జూపెదనులే-అనెను" అందురు. తక్కిన వానికంటె చిన్నదగు స్త్రీ పర్వము 1వఆశ్వాసము 189 పద్యములలో 30ను, 2వ ఆశ్వాసము 186 పద్యములలో 27 పద్యములును మొత్తము 57ను, వివిధ వృత్తములు. అట్లే కల్పవృక్షమునను అప్రహతసంజ్ఞలతో పణవము, చంద్రకళ, అశ్వవిలసితము, అశ్వగతి, ప్రియంవద, ప్రయాణి, కర్ణాట చతుష్పద, ధృతమధ్య, వియోగిని, ఐరావతి, వేగవతి, ధరణి, మనోహర, శ్రీరమణము, వర్ప, విపుల, చపల (ఆర్యా భేదములు) మున్నగునవి లెక్కలేనన్ని కలవు. అవధానము లొనర్చు పరిపాటియుఁ గూడ దీన వెల్లడింపవలెననియే విశ్వనాథుల యాశయము కావచ్చును. ఇటీవల మానినను కొంత కాలము అవధానములొనర్చి యశోధనము లార్జించిన వారే శ్రీ సత్యనారాయణగారు, బంధకవిత్వము, గర్భకవిత్వము నెందేని గలదేమో తెలియదు కాని ఆ

సంకల్పము కలుగుచో సాధింపగల ప్రతిభాశాలి ఆయన కవితా ప్రపంచ మునఁ ద్రొక్కని మార్గము లేదనుకొందును

ఈయన దుష్కర ప్రాసములకుఁ బ్రసిద్ధిగన్న బమ్మెర పోతనా మాత్యునకుఁ దీసిపోవని కవియే. కాని పోతనగారివలె సహజముగా పుట్టి నట్లు గాక వీరి ప్రాసములు తిక్కనగారి దుష్కర ప్రాసమున కనుప్రాసముగా నుండునని పెద్దల యాశయము

భీష్మ ద్రోణ కృపాదిధన్వి నికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధ బలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్యమిదియేఁ జేరంగ శక్తుండనే—
(విరా 4.53)

ఇందలి 'ష్మ' ప్రాసము దుష్కరమైనది "ఉదగ్ర ధ్వజార్చిష్మత్త్వా కలితంబు" అను సమాసము పైమూఁడిటికంటెఁ గష్టతరముగా ప్రయుక్త మనిపించును. కల్పవృక్షమునందు శివధనుర్భంగము వలనఁ గలిగిన ఘోర ధ్వని సకలలోకములందును నొక్కమాఱు వ్యాపించెనని వర్ణించు సందర్భ మున "ష్ఠా" ప్రాసముతో నందుకొని—

నిష్ఠావర్షదమోఘ మేఘపటలీ నిర్గచ్ఛదుద్యోతిత
స్పేష్ఠైరంమదమాలికాయుగపదుజ్జృంభన్మహాఘోరబం
హిష్ఠస్ఫూర్జథుషండ మండిత రవాహీనక్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠంబై యొకరావ మంతట నెసంగెన్ ఛిన్నచాపంబునన్.

అని చెప్పి అగంభీరధ్వని స్వర్గపాతాళ రాక్షస మర్త్య లోకంబులం దేకకాలమున వ్యాపింప నట నట పుట్టిన విశేషములు ఈక్రింది మూడు పద్యములందుఁ జెప్పఁబడెను.

హేరంబోన్నత శూర్పకర్ణ వివరహ్రీకారమై షణ్ముఖ
స్ఫారద్వాదశ నేత్రగోళ వివృతిప్రాకారమై శైలక
న్యారాజన్నవఫాలమండల విఘుగ్నక్రీడమై యాళ్ళల
ద్గీరుగ్రప్రథమంబుగా ధనువు మ్రోగెన్ శైవలోకంబునన్.

నృత్యన్మంజుల తారహారకబరీ నిష్యంది ముక్తామణి
ప్రత్యగ్ర ప్రసవాళీ సంకలన దివ్యత్కంధరాభేద సా
హిత్యప్రౌఢ నవాప్సరో నటన సాహిత్యప్రశస్తాచ్ఛ దృ
గ్గీత్యాకార మనోజ్ఞమై ధనువు ప్రమోగెన్ స్వర్గలోకంబునన్.

దర్పస్వీకృతహాస విశ్లథన రుంధద్దుష్ట వాగ్ధోరణీ
సర్పద్వీరచమూపథ శ్లథనమై స్రంసత్కటీశాటికా
కూర్పాస ప్రకటోగ్ర సాధ్వస వధూ గుర్వీణ్య భద్రాధ్వమై
దర్పాడంబరమై ధనుస్సు మొరసెన్దై తేయలోకంబులన్.

స్ఫీతాష్టాపద విద్యుదుజ్జ్వల పయఃపీయూషధారాధునీ
నీతాస్వాద్యతర ప్రగల్భ వచన స్నిగ్ధానవాంభోజసం
ధా తీర్థాకృతి మాగధోల్బణము నానామేదినీరాట్సభా
గీతి స్వాదుమనోజ్ఞమై ధనువు ప్రమోఁగెన్ రాజలోకంబులన్.

ఇందలి విశేష మేమన-ప్రకృతమయిన ధనుర్భంగము వలనఁ గల్గిన మహాధ్వని ముందుగా పదములందు ధ్వనింప వలెనను భావము కూడ నున్నట్లు గమనింపవలెను అది తిక్కనసోమయాజి మార్గము పిరికివాడగు నుత్తరునకు కౌరవబల మతిభయంకరముగాఁగనఁబడినదని స్ఫురింప "ష్మ" ప్రాసముతో గౌడిరీతిని ఓజోగుణమున నాపద్యముఁజెప్పించి యాతని యల్పత్వము స్ఫురించునట్లే యుత్తరుని నోటనే—

అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గార్ముక విద్యాప్రౌఢిమై నిరూఢు
లయిన యీ
శకుని జయద్రథ దుర్ముఖ వికర్ణ కర్ణాదియోధవీరుల కెదురే—

అని 'క' కార ప్రాసముగల కందమునందు చిన్న చిన్న సమాసము లతోఁబలికించుట సొగసుగదా! మఱియుఁ గీచకునితో ద్రౌపది ముందుగా "వల"దని వారించు సందర్భమున-,

కం॥ నాయున్న బాము దలఁపవ
యీయొడ లీచీర యిట్టి యేవపుఁ జందం
బోయన్న మదన వికృతిం
జేయు ననుట యెంతయును నిషిద్ధముగాదే!

గీ॥ చనునె యిమ్మాటలాడ సజ్జనుల కాఁడుఁ
బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ
వట్లుఁగాకయు హీనవంశాభిజాత
నై పతివ్రతనగు నన్ను నడుఁగఁదగునె?

-అను అనునయవాక్యము లలఁతియలఁతి పదములతో ముందుచెప్పి చూచినది. కాని మూర్ఖుడగు కీచకుడా మాటల గణింపక మరల వలపు ప్రకటింప-ఇఁక లాభములేదని కోపమువచ్చి ద్రౌపది వీనిని భయపెట్టవలె నని "ర్వ" ప్రాసముతో శార్దూలవిక్రీడితమున రజోగుణముతో గౌడీరీతిని-

దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవురిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానవు ప్రాణముంగొనుట తథ్యంబెమ్మెయిం గీచకా.

అని భయపెట్టినది. అదియెట్లు తత్కాలమున కుచితమో అట్టిదే యీ ధనుర్భంగధ్వనివర్ణన ఘట్టమున ఓజోగుణ గౌడీరీతులు, దుష్కర ప్రాసములును.

ఆపిమ్మట ఆవార్త వ్యాపించుట కా రచనయెంత మృదువుగా నడచినదో గమనించినచో మీఁది పద్యరచన యందలి రహస్యము రసికుల కవగతమగును. వార్తయనునది మనుజుల నోళ్ళవెలువడునది. కావున

మేలుగ గౌతమాశ్రమము మీఁదుగ నల్ల విశాల మీఁదుగన్
లోలత మౌనిలోక నృపలోకములం జేరె వార్త-రాముఁడు
ద్వేలభుజాభిరాముఁ డరవిందవిలోచనుఁడన్న వార్త-యా
ఖీల సురారిమండల విభీషణమూర్తియటన్న వార్తయున్-

—అని చిన చిన్న మాటలతో వాయువు మెల్లమెల్లగ ప్రసరించిన రీతిని ప్రసాదగుణభరితమగు వైదర్భీరీతిలో నడచి మీంది ఘోరధ్వనిని ద్విగుణీకృత మొనర్చినది తక్కిన తావుల మాటయటుండ- ఇచట రచనావైశిష్ట్యము మెచ్చుఁదగినది కల్పవృక్ష మేరీతిగా రచింపఁబడెనో గ్రంథకర్తయే యిట్లనినారు అని వెనుక వ్రాసి యున్నను మరల జ్ఞప్తి వెలయించెదను కవితాకాలమున తనమనస్సు వెలుఁగుచున్న కొలిఁకచ్చువలె నుండి నిత్యవేగి కూడ నగుటచే కొంచెమును విలంబన మోర్వదనియు భావతీవ్రతచే శబ్దమే రుటకాను పెంతనిల్వదనియు బాలకాండముననే కలదు ఆవాక్యము మనసున నిడుకొని యెంచేని శబ్దమునఁగాని అర్థమునఁగాని లోపముకనఁబడినను "ప్రదీయతాం దాశరథాయ మైథిలీ" అని నిరాఘాటకవితావేగమునఁ జెప్పిన ఆదికవి వాక్యమును స్మరించుకొని, ఆర్ష ప్రయోగమనుకొనినట్లే యా శబ్దార్థములను సంభావింపఁదగును కావుననే కాళిదాసు—

"పురాణమిత్యేవ నసాధు సర్వం
నచాపి సర్వం నవమిత్యవద్యం
సన్తః పరీక్షాన్యతరద్భజన్తే-"

—అనుటగల్గినది భాస, భవభూతి, మురారి ప్రభృతులగు పూర్వమహాకవుల మార్గమున వాల్మీకమునుండి యితివృత్తమును రేఖామాత్రముగా గ్రహించుచు స్వీయమగు భావనాబలమున నూత్నకల్పనలతో గ్రంథకర్తయు నాధునికలోకమునకు చేరువగా నడిపించెను అని భవభూతి ననుకరించిన యీక్రింది ఘట్టము నంతనూహింపవచ్చును

పవన విదళైః ప్రాంతోన్మీలమనోహరకుట్మలై
ర్దశన కుసుమం ముగ్ధాలోకం శిశుర్దధతీముఖం."

-అని ఉత్తరరామచరితమున చిత్రపటప్రదర్శవేళ రామునినోట జెప్పించెను. ఆభావము శివధనుస్సెత్తునపుడు రామునకు గోచరించిన సీతాముఖమును వర్ణించు సందర్భమున కల్పవృక్షమునందు-

"పునరుద్భవద్దంత ముగ్ధ మోహాన రుచిప్రకట రేఖాహాస భావపరిధి
బాల్యయౌవనదశాపరిణాహసంధిత్రపాముగ్ధ నేత్రశోభాపయోధి."

అని వ్యాఖ్యానముతో విశ్వనాథవారు చెప్పినారు పెండ్లినాటికి సీత ముగ్ధయని ధ్వనింప-నడుమ నడుమ నొక్కొక్క పల్లూడిపోయి మిగిలిన పండ్లు విరళముగా నున్నవనియు, వానినడుమ నుండి క్రొత్తగా పండ్లు మొలచు చుండటచే ఆముఖమెంతయు సుందరముగా నున్నదనియు మూలము ననుకరించి అది బాల్యయౌవన దశాపరిణామ సంధియనియు, ముగ్ధాత్వముకూడ లజ్జచేగలిగినదనియు వ్యాఖ్యానింపక మానలేకపోయినారు

పరశురాముని యాగమనము రామాయణము లన్నిటి యందును సీతాకల్యాణానంతరమున నుండఁగా కల్పవృక్షమున శివధనుర్భంగము వెంటనే ఆధ్వని విని పరశురాముఁడు వచ్చినట్లు కలదు దానిపై నెట్టి యాక్షేపము రాకుండుట కనినట్లు జనకుని నోట—

ఆ దిగులులోనఁ బరిణయ
మోదంబునఁ గొంత తఱుగు పుట్టకయుండన్
జోదు పరశ్వధరాముని
ప్రోదియుఁ జెడె మున్నెమున్న పొంగెడు శుభమై.

(బాల 824 పుట)

అని పల్కించి సయుక్తికముగా విశ్వనాథులు సమాహిత మొనర్చుట మెచ్చఁ దగినది. అట్లే యే కథ మార్చినను ఔచిత్యము చెడకుండ నెంతయు దూరదృష్టితో వెలువడిరనే మచ్చునకీ యంశము తెలుపవలసి తెలిపితిని.

కైకేయికి రాముని యెడ నెట్టి యీర్ష్యయు లేకున్నట్లు పసితనము మొదలు పట్టాభిషేకము దాఁక జూపించి, మంథర దుర్బోధమున నామె మనస్సునకుఁ గలిగిన వికృతి చక్కఁగా సూచింపబడినది మంథరకు రాముని పట్ల దురాగ్రహము కలుగుటకు హేతువుగా బాల్యచాపలమున రాముడు మంథరను తఱచు పరిహాసించుచుండువాఁడని హాస్యరస పరిప్లుతముగా బాలకాండమున చక్కఁగా వర్ణింపఁబడినది. మఱియు శాంతను గూర్చి యెచట జెప్పినను రాముని తోఁబుట్టువువలెఁ గాక విశ్వనాథ వారింటి యాఁడుబిడ్డవలెనె వాత్సల్యము ప్రతిపదమందును ప్రతిచేష్ట యందును వర్ణించుట సహృదయ హృదయావర్జకముగాఁ గనఁబడును. సీతా కల్యాణమునకు శాంతయు ఋష్యశృంగుఁడును వచ్చినారు. కాని ముందుగా

ఋష్యశృంగులు కనఁబడ మాశాంత యేదియని కౌసల్య కాఁబోలు నడుగఁగా "మాశాంత రానిదే నేను వత్తునా, రాను అన్నచో మీశాంత నన్ను నింట నిలువ నిచ్చునా" యని నవ్విన భాగము చదువుచుండ నెవ్వని హృదయము పులకరింపకుండును! కౌసల్య ఆ వచ్చిన శాంతను గౌఁగలించుకొని, అమ్మాయీ! నీవువత్తువో, రావో యని పరితపించుచున్నాను మీ తమ్ముని వివాహవేళ మాడపట్టున కాసంత చమురు నీ చేతితో పెట్టవలెను గదా యను భావము స్ఫురింప నడపిన యాఘట్ట మత్యంత మధుర మమూల్యము సుమిత్రను గూర్చి యెచ్చటఁ జెప్పినను శాకుంతల నాటకమందలి అనసూయా ప్రియంవదలలో ననసూయ ఋజువర్తనము సుమిత్రలోఁ బ్రతిఫలించుచునే యుండును

ఇట్లు ప్రతిపాత్రమునను అనన్యమగు నొక గుణవిశేషము చూపి ఆ పాత్రమును పఠితల హృదయములందు విశ్వనాథులు ముద్రించినారు.

ఈ రీతిగా నాకుఁదోఁచిన విషయములెన్నో యెత్తి వ్రాయవలెనని కుతూహల పడితిని. కాని వార్ధకముచేతను, ఈ నడుమ వచ్చిన జ్వర బాధ చేతను దృష్టి గలుఁగ వ్రాయఁజాలక పోయితిని విషయసంకీర్ణత, శాఖా చంక్రమణము మున్నగు లోపము లిందుండ వచ్చును. వచ్చునేమి? తప్పక యుండును చదువరులు మన్నింతురు గాక యని వేడ్కోలు.

# శ్రీ కృష్ణ సంగీతమ్

—డాక్టర్ ధారా రామనాథశాస్త్రి

ఆంధ్రకవిలోక విలోక మూర్ధమణులలో ఒకరైన విశ్వనాథవారి సాహిత్యాన్ని అవలోడనం చేసేప్పుడు ఎలుచు రామకథ ప్రసక్తం కావడం సహజం ఆంధ్రసాహిత్యంలో రామకథకి అనన్యమైన రూపకల్పము చేసిన మహాశిల్పి విశ్వనాథ కాని కృష్ణకథకి కూడ వేరు వేరు కావ్యాలలో చక్కని రూపకల్పన చేసి చక్కని వ్యాఖ్యానం చేసిన ఘనతకూడా ఆ మహాకవికే దక్కుతుంది రామకథకి ఆయన చేసిన సేవతో పోలిస్తే యిది అవరంగానే భాసిస్తుంది అయినా అందులో సంధిబంధాలను పట్టుకొని సాగదీసినవాఁడు విశ్వనాథ ఆయన వ్రాసిన కృష్ణకథా కావ్యములు రాశిలో తక్కువైనా వాసిలో ఎక్కువ అందునా శ్రీకృష్ణసంగీతం అనే కావ్యంలో మహాకవి కృష్ణకథాదర్శనము ఎన్నిముఖాలుగా సాగివచ్చిందో ఎన్నడం ఈ వ్యాసం ఉద్దేశ్యం

తెలుగు కవులలో రామ, కృష్ణ కథలను జోడు గుఱ్ఱాల లాగ నడిపించ గలిగిన కవులు చాలామంది ఉన్నారు కాని వారి ఆత్మీయ సంస్కారాన్ని బట్టి ఏ ఒక్కదాని మీదనో తమ అధికారాన్ని ప్రదర్శించారు. రెండవది వారి ఆత్మీయసంస్కారాన్ని అంతర్వాహినిలాగ ఆక్రమించి ఎక్కడో అవకాశం ఉన్నప్పుడు పెల్లుబుకుతుంది. ఇలా చెప్పడం వల్ల కవి ఏ ఒక్క కథకో తన ప్రతిభను తాకట్టుపెట్టి గిరిగీసుకుంటాఁడని గాని, ఇతర కథాసంస్కారాలకు చోటివ్వఁడని గాని అనుకోడానికి వీలు లేదు. పోతన కౌటుంబికసంస్కారం శైవము ప్రత్యక్షదైవం రాముఁడు

కావ్యకథా నాయకుఁడు కృష్ణుఁడు అలాగే త్యాగరాజస్వామి ఆరాధ్య దైవం రాముఁడు నౌకాచరిత్ర రచనలో ఉత్తమ కృష్ణతత్త్వ నిర్ణేతగా ఆయన భాసించాఁడు ఇలాంటి ఉదాహరణలు చాలా ఉన్నవి. దీనివలన కథాసంబంధమైన ఒక చైతన్యం ఆయా కవుల జీవితఘట్టాలలో ఎప్పుడో ఎలాగో చోటు చేసికొని వ్యక్తమౌతుంది—అని తెలుస్తుంది. ఇలా అయిన వానిలో ఏ ఒక్కదానితోనో ఆయన ఆత్మీయసంస్కారము చక్కగా పెనవేసికొంటుంది పెనవేసికోని సందర్భాలలో ఆ కవికి, కథకి బొత్తుగా పొత్తు కుదరలేదని భావించడం మామూలు సాహిత్యవిమర్శకు లనబడే వాళ్ళు చేసేపని ఈ సందర్భాలలో కూడ ఆత్మసంస్కార సమన్వయం ఏదో ఒక స్థాయిలో జరిగి ఉంటుంది-అని ఊహించి నిరూపించడం కొంత ఆంతరంగికమైన అన్వేషణ అదే కృష్ణకథాసందర్భంగా విశ్వనాథ శ్రీకృష్ణ సంగీతము అవలోడన చేయడము అనే ఈ యత్నానికి కీలకము.

భారతీయదృక్పథాన్నిఁ బట్టి కథ అంటే కొన్ని పాత్రలను, కొన్ని వేశాలను పడుగు పేకలాగి పేర్చడం మాత్రమే కాదు, కల్పితకథల సంగతి మనం చెప్పలేము గాని రామకథ, కృష్ణకథల వంటి జీవత్కథలు మానవ సంస్కారాన్ని అన్ని కక్ష్యలలోను ఉత్తేజపఱచి ఇటు రసానందాన్ని, అటు ఆధ్యాత్మికప్రబోధాన్ని కలిగించే శక్తిచిహ్నాలు, తాత్త్వికప్రతీకలు. అందులోను కృష్ణకథ అనన్యము దానికి చాలా కారణాలున్నవి

ఆసలు అవతారాలన్నీ నిర్గుణమైన ఈశ్వరతత్త్వానికి సగుణ ప్రతీకలై ఆయాయుగాలలో ధర్మసంస్థాపన కోసం విశ్వశక్తిని సమీకరించుకొని వ్యక్తమవుతూ ఉంటాయి ఇతరావతారాలు అంశ, కళ, పూర్ణ విభాగాలకి చెందగా కృష్ణస్వామి స్వయం భగవానుఁడు ఇచ్ఛ, క్రియ, జ్ఞానశక్తులలోను, పాడ్గుణ్యవిలాసములోను, నిత్యవిభూతిలోను ఆ స్వామి కెవరూ సాటిరారు. ఆయన జీవితంలో ప్రత్యంశము మాధుర్యతత్త్వంతో నిండి చర్వణయోగ్యతగల్గి యుంటుంది వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్నానిరుద్ధ వ్యూహాలకు కేంద్రమైన స్వామి పరతత్త్వవిభూతి, ఆయన ప్రవచించిన భగవద్గీతలో ఉన్న తాత్త్వికవిభూతి, మంత్ర తంత్రాదిదర్శనాలలో స్వామిస్వరూపము, అనంతముఖీనమైనది. ఆయన జీవితకథ ఎంత సమగ్రమో

అంత సంకీర్ణము బాల్యము ఎంత లీలామాధుర్యముల విలాసమో అంతగా దార్శనిక తత్త్వాలకు వ్యాఖ్యానము ఆయన శృంగారం బాహ్యదృష్టికి మోహనగీతి, తత్త్వదృష్టికి జటిలరీతి ఆయన ధర్మసంస్థాపనము ఎంత వివాదాస్పదమో అంత శాశ్వతధర్మగోపనశీలము ఆయన కథను మానవతా దృష్టితో చూడదలచిన వారికి ఒక విషాదగాథ చెఱసాల పుట్టుక మొదలు స్వజనము నశించే చరమఘట్టం వఱకు నింద, కుట, వ్యతిరేకత మొదలైన భయంకరశక్తులతో నిరంతరము పోరాడినవాఁడు స్వామి అదే సందర్భంలో ముఖంమీద చిఱునవ్వు చెఱగనీయని మోహనమూర్తి స్వామి-ఇలా లెక్కించడం మొదలుపెడితే ఆయన విభూతులకు అంతంలేదు. అందుకే కాబోలు "నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప" అన్నాఁడు గీతలో మొత్తంమీద ఈ కథని ముట్టుకోవడానికి గాని, ముట్టుకొని కడముట్టించడానికి గాని మొత్తం తెలుగు కవులలో ఏ కొద్దిమందికో చెల్లింది వారిలో విశ్వనాథ ఒకఁడు అనడం నా అభిప్రాయం కాదు గాని ముందే చెప్పినట్టు కృష్ణకథకి సంబంధించిన పై అంశాలలో ఏ కొన్ని పట్టులనో గట్టిగా పట్టుకొని కడముట్టించాడనుకుంటున్నాను.

అలా చేయడానికి కావలసిన సాధనసంపత్తి ఆయనకి ఉన్నంతగా ఎక్కువ మందికి లేదు సంప్రదాయం మీద, అందులో వ్యాస ఘట్టాలమీద ఆయన అధికారం చాలా గొప్పది అటుపైన ఊహ చేయడంలో గాని, చేసిన ఊహకి శిల్పసమ్మతమైన శబ్దార్థాలను పొదిగి పద్యాలలో రవ్వలు రాల్చడంలోగాని ఆయన అందెవేసిన చేయి కథాగతమైన రసపోషణ ప సంధిబంధాలలో ఋషులు ముందు తరాలవారికోసం నిక్షేపించి పెట్టారో అక్కడ ఆ మహాకవి శరద్వాహిని లాగ నీడలు తేలఁగలఁడు, వర్షానది వలె పొంగులు వారగలఁడు అందునా, ఇందునా ఆయన నిండైన రసవాహిని. ఆ యా విషయాలు ఆయన కవిత్వాన్ని నిర్మలాంతస్సుతో ఆనందించే సహృదయు లందరికి గతార్థాలే కాగా స్వామి కథను ఆయన తన గుండెలో ఎంతగా పండించుకొని తెలుగు పాఠకులకు అందించాడో భావించడానికి ఈ క్రింది అనుశీలనము కొంతగా తోడ్పడుతుంది

(శ్రీ)కృష్ణసంగీతము ఒక విలక్షణమైన రచన ప్రణాళిక దాదాపు గాథాసప్తశతిని పోలి యుంటుంది కృష్ణగతభావన కలిగిన గోపికలు తమ అనుభూతులను చెలులకు చెప్పుకొంటూరు స్వగతముగా భావిస్తారు ఈ మొత్తం వారిహృదయాలలో చిరంతనంగా ముర్మురించే శాశ్వత సంగీత రూపంగా, చైతన్యస్వరూపంగా, గోపికారూపజీవాత్మలయొక్క భిన్న భిన్న భావాలలో లీలానిలీనమై యున్న శాశ్వతబాలస్వరూపంగా దర్శింపబడింది ఒక క్రొత్త క్రొత్తపెళ్లికు క్రొత్తగా కాపురానికి వచ్చింది తొలిరాత్రి శయ్యమీద భర్త నిద్రపోయాఁడు ఆమెకు నిద్రపట్టలేదు భయపడింది మొదట గుండెల్లో పిల్లికూతలు వినిపించాయి తరువాత అవి స్వామి పిల్లనగ్రోవి సవ్వడులని తెలిసికొన్నది చిమ్మచీకటిలో బయలుదేరివెదికింది ఇంతలో వేణుగానం వినిపించడం మానివేసింది ఒళ్ళు తెలిసిన గోపిక అడవిలో కూలిపోయింది అత్తమామలు, మగఁడు వెదికి పట్టి ఇంటికి తెచ్చి ఆమెకు దయ్యం పట్టిందని చెప్తారు. "...నేనును విశ్వసించినాను, మూఁడు యుగములు గడిచె పూఁబోఁడి యపుడుదయ్యమది వేణువూదు కథల్ వినంగరాదు. తుది నాకునై ద్వాపరమునవచ్చె!" అనుకొన్నది. ఇందులో గోపీ కృష్ణ తత్త్వము యొక్క ప్రాచీనత, అంతస్సు వ్యాఖ్యానింపఁ బడింది ఇది ఇప్పటిది కాదు రామావతారంలో మహర్షులకు "భవాంతరే కృష్ణావతారే యూయం భూత్వా మా మాలింగథా—"అన్న నాఁటి మాట గుండెలోతులలో గూడు కట్టుకొనియున్న అనుభూతులను, ఒక్కొక్కరు జన్మాంతర సంస్కారాల చేత ఎలా త్రవ్వుకొని మననం చేసికొంటున్నారో తెలిపేమాట ఇంకొక గోపికకు "ఎడమకనుమూసి కుడికన్ను నింతవిచ్చి— మకర కుండల వంతుఁడు. మణికిరీటహారి, కేయూరవంతుఁడు, హస్తయుగళి నియుత శంఖచక్రుడు, హిరణ్మయవపుషుఁడు, సరసిజాసన సన్నివిష్టముగా" స్వామి దర్శన మిచ్చాఁడు ధ్యేయస్సదాసవితృ మండల మధ్యవర్తి అన్న ఆదిత్యమండలాంతర్వర్తి స్వరూపం యథాతథంగా ఇక్కడ అనువదించారని వేరే చెప్పనక్కఱలేదు. కాని చంద్రస్థానమయిన ఎడమకన్నుమూసి, సూర్యస్థానమయిన కుడికంటిలో ఆదిత్యదర్శనం చేయించడం ఒక ఔచిత్యం ఒక

కన్నుమూసి రెండవకంటి ప్రక్కవాలున చూస్తూ వెళితే దిదృక్షాఫలితంగా ముందు మకర కుండలాలు, ఆపైన కిరీటం, మళ్ళీ చూపు ప్రక్కకు వాలగా కేయూరాలు, అవిపెట్టియున్న చేతులు, ఆచేతులతో శంఖచక్రాలు, మళ్ళీ పైకి మళ్ళిన చూపునకు బంగారు దేహము-ఈమొత్తం ఒక్కసారిగా సరసిజంలో ఉండడం—ఈక్రమం ఉన్నదే అది కంటి చూపుల కదలికను చాలా అందంగా చూపెడుతున్నది. రచనలో అందాలకు, సంప్రదాయాన్ని నిర్దేశించడానికి యిలాంటి సమన్వయం పెద్దకవుల్లోనే చాలా అరుదు ఇంకోగోపిక వేణువు రహస్యాన్ని సోధించాలని ప్రయత్నంచేసి విఫలయై యిలా అనుకొన్నది - "—కృష్ణుఁడును మేఘమట్లు వర్షించుచుండ తడయుచున్నాము మన మెల్ల ధాత్రివోలె—మనప్రపత్తి కథానిరూపణము చేసెనన్నది లతాంగి వైకుంఠ సదనమునకు"-ఈమాటలుకావ్యగత మహార్థాన్ని, గ్రంథనామాన్ని పరమతాత్త్వికంగా వ్యాఖ్యానిస్తున్నవి కృష్ణుడు మేఘమైవర్షించడం ఆదిత్యమండలాంతర్వర్తి నారాయణ తత్త్వానికి ప్రతీక నారాయణతత్త్వమంటే నారములయొక్క అయనము అని అర్థము ఈఅయనానికి ఆకాశము రంగస్థలము ఈఆకాశము సప్తమారుతమండలాలతో నిండినది. నాదాత్మకమైన ఈఆకాశలక్షణాన్ని ప్రతీయమానం చేయడానికే గాంధర్వంలో సప్తస్వరాలు, ఛందస్సులో సప్తవ్యాహృతులు శాస్త్రసంకేతాలుగా ఉన్నాయి స్వామి వేణునాదం గూడ దీనికి ప్రతీక. వర్షానికి ధాత్రి తడవడం అంటే ప్రకృతి-పురుషసంయోగము అది గూడ ప్రపత్తి కథచేతనే సర్వబంధాలను వదలుకొని వికుంఠమయిన స్థితిని పొందుతుంది అంటే ఈగోపికల కథలన్నీ తేటమాటలతో పరతత్త్వాన్ని సూటిగా తాకుతున్నాయి. ఒక గోపుడు ఆడవేషం వేసుకొని అసలు సంగతి పసికట్టాలని యమునా తీరానికి వెళ్ళి అక్కడ జరిగేకథంతా భావనామయమనీ, స్వామి సంగీతము రసమయమనీ తెలిసికొని సిగ్గుపడినాడట. దీనిని బట్టి లోకంలో గోపీకృష్ణ సంబంధ మీద ఉన్న అపప్రథల అసలు స్వరూపాన్ని ప్రదర్శించడం జరిగింది ప్రేతలలో పాతికేళ్ళువచ్చి ముదిరిపోయిన ఒక గోపిక ఉన్నది పని గట్టు

కొని స్వామి ఆమె యింటికి వచ్చి నీయింటిలో వెన్నతీసుకొనడానికి వచ్చా నన్నాడట. ఆమె ఖండితముగా మేము వెన్నచేయము అని చెప్పింది. అమ్మ కము ఇష్టంలేకపోతే ఊరికే పెట్టుమని స్వామి అడిగాఁడు ఆమె విసిగిపోయి నీకేమయిన పిచ్చా? ఎవరునీవు? అని కోపించింది. నందబాలుఁడు కిలకిల నవ్వి ఓలేమా! ఉన్నదంతా దాచుకో. నీభర్త కక్కుఱలేని వెన్న "పరునకు" పెట్టినా నష్టంలేదు వెన్నచేయడం మాత్రం నేర్చుకో అని చెప్పి వెళ్ళి పోయాడు బాలగోపాలుని అందానికి ముచ్చటపడిన ఈ వ్రేత వెన్న చేయడం నేర్చుకొని "మధుర బృందాటవీ సభా ప్రథమ యువతి" యైనది నవనీతతత్త్వం [1]లో తైనది. ఈనవనీతాన్ని ప్రకృతికి "పరుడైన" పురుషు నికి సమర్పణ చేయడం అంటే ఏమిటో సూచింపఁ బడింది. వ్రేపల్లెలోఉన్న ఒక జారిణి దగ్గరకు పోయి బాలుఁడు ఓసీ! నీకెంతమంది భర్తలు? అని అడి గాడు. ఆమె విస్తుపోయినది చుట్టుప్రక్కలవాళ్ళు పరిహసించారు. స్వామి అంతటితో ఆగక ఊరక అందరితో పోదువుఁగదా! నన్నుమరిచిపోకు అని పరుగెత్తి పోయాడు. ఈఒక్క మాట ఆమె జీవితమార్గాన్ని మార్చి వేసింది ఇల్లు కదలక నిద్రాహారాలు మాని వేణుగానం కోసం చెవులు రిక్కించుకొని తపస్విని వలె నిరీక్షిస్తూ, "యూరక వచ్చెదనోయి ప్రభూ! అదేల రావనుచు, గుండెలోన నారాటపడుచు" ఉండిపోయినది ఒక్క మాటతో ఆమె బ్రతుకు బాటను మార్చి తనయందు న్యస్తమయిన ఏభావ మయినా పునీతమవుతుంది అన్న విషయాన్ని నిరూపించాడు కృష్ణయంత్ర మనే శీర్షిక స్వామిని కాళీగోపాలతత్త్వముల సమన్వయమూర్తిగ చిత్రి

---

[1] సాంసారిక జగత్తులో వాసనారూప సంస్కారాలతోపొంగులువారే జీవాత్మ ప్రాథమికస్థితి పాలు. సద్గురువు దయవల్ల ఒకసాధనకి జీవితాన్ని అంకితం చేయగలగడం పెరుగుగా తోడుకొనడం సాధన ఫలితంగాసిద్ధించిన స్థితి నవనీతం. దాన్ని యిష్టపడి స్వామి లుబ్ధత్వంలో మనదగ్గర గ్రహిస్తాడు మనం సమర్పించలేకపోతే దొంగలాగ వచ్చి దోచుకుంటాడు. నవనీతాన్ని ఇలాంటి తత్త్వప్రతీకగా దార్శనికకవులు మాత్రమే వాడారు

స్తుంది. ఇలాంటి భావాలకు బంగారు గని ఈకావ్యము మొత్తంమీద గోపీ కృష్ణ సంబంధప్రకరణంలో ఇది ఒక మహార్థస్ఫూర్తిగల కావ్యం.

ఇలాంటి గాథాచిత్రములు ఈగ్రంథములో అనేకము ఉన్నాయి. బాలకృష్ణ మురళీరవము సర్వమానవహృదయాంతర్గత చైతన్యాలను ఉద్ధరించే సాధనమనీ, సర్వవిధాలయిన భావవిలసనాలు అందులో లీనమౌతా యనీ అన్యాపదేశరమణీయమార్గములో ప్రతిపాదించడం ఈకావ్యం ప్రత్యేకత అలతి అలతి పదములతో నిండైన జానుతెలుగు పలుకుబళ్ళతో రచన వ్రజయువతుల జానపదజీవనపద్ధతులకు అద్దం పట్టినట్లు రూపొంద డమనే విషయము విశ్వనాథవారి శైలిపరిష్కారశిల్పానికి నిదర్శనము. బాహ్యజీవితపద్ధతుల చాటునతత్వతః కృష్ణకథార్థ భావనాప్రౌఢి వారిహృద యాలలో లీనమయియున్నట్లే పూర్వోక్త జానపదగాథారచనాపద్ధతి మాటున శబ్దార్థాతీతతత్వప్రౌఢి ఒకటి ఈకావ్యంలో సాగివచ్చింది.

# శివార్పణము

—శ్రీ ముళ్ళపూడి జయసీతారామశాస్త్రి

ఒక సూర్యుండు సమస్తజీవులకు తానొక్కొక్కడై తోచును. కొందరకు పరిశుద్ధకాంతిప్రదాతగా, మరికొందరకు రసగ్రాహకుని గాను రసప్రదాతగను ఇంకొకరికి రాజపోషకునిగా, అన్యునకు దుర్నిరీక్ష్య తేజోరాశిగా, కశ్చిత్తునకు తాపకరునిగా చూపట్టును. "యాదృశీ భావనా యత్ర సిద్ధిః భవతి తాదృశీ" అని మన చూపులతీరు తెన్నులను బట్టి ఎదుటి వ్యక్తుల వస్తువుల గుణములు మారుచుండును మన కందరకును స్వచ్ఛముగా వివిధ వర్ణ విసర సంభరితమై కాన్పించు ప్రపంచము నేత్ర వ్యాధి గ్రస్తునకొక్కనికి పచ్చగా కన్పించును

ఒక వ్యక్తి సంఘమును, సాంఘిక చైతన్యమును తిరస్కరించి మాటాడును అని పల్కుటకు ముందుగా నీవైపు తిరిగియున్న మూడువ్రేళ్ళు ఏమనుచున్నవో ఆత్మవిమర్శనము చేసికొనవలయును ఆతనికి సంఘ మర్థము కానిచో నీకు తదేకదేశమగు వ్యక్తియే బోధ పడలేదే! ఈ యెఱుకలేనివాని హేతువాదము ధాతువాదము.

కనులు మిరుమిట్లు గొల్పు తేజఃపుంజమును ఎదుర్కొని అభిముఖులమై ఎన్నడును చూడవలదు కనులు బైర్లు క్రమ్మునే గాని ఆశించిన ప్రయోజనములు చేకూరవు ఆ తేజఃప్రసారమున కనుకూలముగా నిలబడి చూచినచో విశ్వమంతయు దృగ్గోచరమగును.

విశ్వనాథాధ్యయనమున కిది ప్రథమసూచనము.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి రచనలందు మన దర్శనమునకు చిక్కెడి కొన్ని అంశములు- 1 అధ్యాత్మికత, 2. పాఠకులలో వుత్పత్తిని పెంచుట, 3. జాతీయత, 4. అనిదంపూర్వములైన భావములు. 5. చమత్కారములు, 6. హాస్య ప్రియత్వము మొదలగునవి వారి సర్వగ్రంథముల యందు ఈ గుణములు ప్రత్యక్షము లయ్యెడివే. ప్రస్తుతము 'శివార్పణము' అను కావ్యము ననుసరించి ఈ పరిశీలనము నొనర్చెదము

1 పరమేశ్వరుని తత్వమును గూర్చి విచారము ఆధ్యాత్మికత కాగలదు. ఆత్మవిచారమన్నను అదియే. మన భావన కందిన దైవమును వేదాంతప్రతిపాదితమైన దానిగా నిరూపించుట కూడ ఆధ్యాత్మికతయే. కథాంశములందు, ప్రబంధప్రధానాంశ (ప్రబంధవ్యంగ్య) ప్రతిపాదనము లందు, వర్ణనములందు సర్వత్ర ఈ ఆధ్యాత్మికత సాగి వచ్చుచునే ఉండును భారతీయతలో ఈ వేదాంతప్రీతి ప్రధానాంశము. సర్వవిధమైన భారతీయతను నరములలో, రక్తకణములలో, శ్వాసనిశ్వాసములలో జీర్ణించుకొనిన మహావ్యక్తి శ్రీ విశ్వనాథ ఉత్తమమానవుడు దైవాంశసంభూతుడే శివాజీపాత్రము నాశ్రయించి లలితామహాదేవి మహాలోక లాలసా విలాసములు క్రమ్ముకొన్నవి కథాభాగములందు దేవీశక్తి ఎట్లనుసంధింపబడెనో తొలుత పరికింతము.

గోరక్షణము, శివాజీ విజయములు, సామ్రాజ్యస్థాపనము-ఇవి యిందలి ప్రధాన కథాంశములు. రాజవీథిలో నొకచోట తురకలు కొందరు గోవధ కుద్యమించిరి. ఏదేం్డైనను నిండని బాలశివాజీ వారి నెదుర్కొనెను. గోవధకై కత్తినెత్తిన వానిచేయి ఎత్తినటులే నరుకంబడియె వారల నుద్దేశించి "బాలకుండనని యాడకుడు ఏను విచిత్ర ఖడ్గవిద్యా నిపుణుండ, మీరు శతమైనను చాలరు నాదు కత్తికిన్" "నా పేరు శివాజీ, జ్ఞాపకము పెట్టుకొనుండిది ఏమి చేతునో, కారణజన్ముడేను-మిము కత్తికి కండగం జీల్తు నందరన్" అని తీంండ్రించి పలుకును. తాను కారణ జన్ముడనని శివాజీకి తెలియదు అతనికే కాదు సృష్టియందలి ఏ వ్యక్తికి తాను మహాత్ముడనని తెలియదు. అట్లు చెప్పికొనగల్గుట భగవంతునకే చెల్లును. కాని పైపైఘట్టమున శివాజీ అనాలోచితముగ తాను కారణజన్ముడనని ప్రకటించుకొన్నాడు.

ఆ వాక్యములు ఆతనియందు తన యంశమును నిల్పిన పరాశక్తివి ఆ దేవియే శివాజీ ఆకారముతో గోరక్షణము నొనర్చెను. తన మాటలకు ఆతనికి ఆశ్చర్యము కలిగియుండును. ఒకనాడు తల్లితో దేవాలయమునకు వెళ్లినా డాతడు.

"తన తల్లి ప్రక్క నిలబడి
వనితాకృతి బూని దైవభావమ్మెదో
తనయెడద శివాజీకిని
కనిపించిన యట్లు లీలగా నగుచుండున్."(2-65)

ఇట్లు బాల్యమునుండి శివాజీకి లలితాపరమేశ్వరి తల్లివలె కాన్పించి నడిపించెను.

తోరణ దుర్గవిజయమునకు ముందు జిజియానే "వేదరహస్యమూర్తి పాలనము చేసెడి" దానినిగా కవిచూపును. కొండన దుర్గము జయించిన పిమ్మట "ఎట్టిదాసాని పూనెత్తిన జిలుగు నా నది కొండకూతు క్రీడదవి మెఱసె" నట' శివాజీ పురందరదుర్గమును జయించి రాజపురందరుడైన సందర్భమున నాతని భ్రూయుగాంతస్థలియందు శ్రీచక్రసంచారిణియైన లలిత క్రాంతదర్శనుడైన కవిదృష్టికి కాన్పించెను

"ఒక చక్రమ్మె చలించె శ్రీనడుమదా, వ్యూహంబుగా రేఖ రే
ఖకుమధ్యమ్మన సర్వదైవములుగాఁ గాత్రస్వరాభంబుగా
కకుబంతమ్ములు చాలనట్లుగ మనఃకంజాత సంజాతయై
చికురమ్ముల్ చెరలాడుమోముగ శివాజీభ్రూయుగాంతస్థలిన్."

పార్వతీచరణ మంజీరశింజినీనినాదములు "వినిపించన్ రాక విన్పించి నట్టిదిగా నిక్కముగాగ విన్పడినయట్లైయె శివాజీమదిన్" తోచె నట క్రమముగా దుర్గముల నెన్నిటినో ఆతడు జయింపసాగెను "తులజాపురికేగి శివాజి దేవతాదర్శన మాచరింప" "ఇక ముందున్నయవి;పద'నిలువబోకు, వెనుక నేనుంటి నను కలధ్వనులు మ్రోసె"— ఇట్లాదేవి అనుగ్రహముతోను, ఆజ్ఞతోను తన విజయపరంపర సాగెను. కళ్యాణీదుర్గమును జయించి శివాజీ ఆర్థికవిజయమును సాధించెను. బిజపూరు నవాబు బెదిరింపులు

బెండుపడినవి జిజియా, శివాజీ తమ దుర్గమందున వెలయింప జేసిన దేవిని ఆరాధించుచున్నారు— "తులజాపురమునుండి మలకొండ దొరగారి అమ్మాయి తేజుతోనందు జొచ్చె"

బీజపూరు నవాబు పరమకపటియై శివాజీని కడతేర్చుటకు అఫజలు ఖానును నియోగించెను. ప్రతాపగడమున సంధిచర్చలు జరుగునట్టుల ఇరు వర్గముల వారును అంగీకరించిరి తన యుపాయము ఫలింపబోవుచున్నదని అఫజలుడు మురిసిపోవుట దేవికి కన్నెఱ్ఱ కారణమయ్యెను

"కుంభ నికుంభులన్ పదము గోటను చీల్చినతల్లి, తత్సమా
రంభము లాతు ఎఱ్ఱనయో, రక్తము చారలా నేరరాద!".

ఆదేవికి కాలిమంట తలకెక్కన్ పాదములందు గూడ ఆ యెఱ్ఱందనము నిలిచియే యుండెనట! అఫ్జుల్ ఖాన్ వధ శివాజీ సాహసములలో మకుటాయమాన మయినది. కావున ఈఘట్టమున దేవీప్రభావమును శివాజీ యందు కవి పూర్తిగా సంధానించినాడు!

"శాకంభరీ క్రోధ సంజ్వల త్పదలాతు
కంకేళి పూచిన కరణినొప్పె
మాహేశ్వరీ సమున్మత్తాగ్ర పదలాతు
మందార సుమకాంతి చిందులాడె
భస్మాయుధాకృధాభరితోగ్రపదలాతు
నవజపారాగ సంతతి వహించె
నారాయణీ చోదనావ్యగ్ర పదలాతు
కోకనదాభ లక్ష్మైకమయ్యె
కోరి పూజాగృహమ్మున గూరుచున్న
శ్రీ శివాజీ హృదంతరసీమయందు
తల్లిపదలాతుకాంతు లుత్ఫుల్లములయి
అతని నేత్రాంచలమ్ములయందు జేరు."

అశోక మందార కోకనదములతో పూజించి భవానీపదములందలి లత్తుకరక్తిమను మరింత ఎఱ్ఱవాఱజేసినాడు శివాజీ— అని సీసము నాల్గు పాదములందలి ధ్వన్యర్థము ఏకాగ్రధ్యానమువలన శివాజీ హృదయమునకు నేత్రములకు తల్లి పదలాక్షారుణిమ సోకినది అఫ్జల్ ఖాన్ గుండియ ప్రీల్చబడి మతోద్ధరణయిజ్ఞమున వ్రేల్చబడెను

"భారతమందు నెల్లెడ శివాజియనన్ విని నంత గుండె జే
జారయి పోయెనందరకు, క్ష్మాపతులందరి గుండెజార, నీ
హారగిరీంద్ర కన్యపదమందలి నెత్తురుఁదగ్గి తల్లి చాం
ద్రీరుచి మందహాసలహరీ నవరీతులు వెల్గులెత్తగాన్."

ఖానువధకు ముందు రక్తకాంతులనీనిన అంబపాదములలో నేడు నెత్తురు తగ్గి. నది; చిరునవ్వుల వెన్నెలలు మోసులెత్తినవి.

ఔరంగజేబు శివాజీని నిగ్రహించుటకు షయిష్టఖానుని పంపినాడు అతడు పునాపురిని జయించి విడిసెను. వర్షాసమయ మయ్యెది- "భూభృత్పు తాభ్రనిర్వ్యాజ మహాంధకారములుగా పొల్చెన్ దిశల్ తత్కృధాస్థానంబై చను కంటివెల్గులుగ వర్షంబుల్ విజృంభించుచున్" వర్షర్తువర్ణనమో! దేవీ పౌరోహిత్యమో భావుకుల భావనకే ఎరుక. ఒకనాటి అర్ధరాత్రమున "నరు కంబడె కుడికేలున పోరిపోరిని షయిష్టఖాను బొట్టనవ్రేలు"—శివాజి సాధించిన యిట్టి పెక్కు గెలుపులలో దేవి తన శక్తి యుక్తులను వినియో గించినట్లు చాటుచు కవి ఆధ్యాత్మికతను సాధించినాడు "అంశమయ్యె శివాజి నగాత్మసుతకు...అనుట దీని సారాంశము

2. పాఠకులలో వ్యుత్పత్తిని పెంపొందించుట విశ్వనాథవారి ఆద ర్శము లోకశాస్త్రకావ్యజ్ఞానము వ్యుత్పత్తిపదవాచ్యము అందులోకకావ్య జ్ఞానములను పెంపొనర్చుట అన్యుల కావ్యముల వలనను వలనుపడవచ్చును కాని శాస్త్రేతిహాసాది జ్ఞానమును విశ్వనాథుడు పెంపొనర్చిన రీతి అనితర సాధ్యము మచ్చునకు ఒండు రెండు—

తోరణదుర్గమును రేల పయినించి శివాజీ జయించెను. ఈ మహాకవి ఇట్లావిజయమును ప్రశంసించుచున్నాడు—

"సర్వభూతమ్ములకెది నిశాసమయము
అపుడు మేల్కొనియుండు సంయమి; శివాజి
ఎల్లవేళల మేల్కొనియే చరించు
అనుచరులతోడి నిత్యసంయమి యతండు."

ఈపద్యము వ్యాసప్రోక్తమయిన యోగిలక్షణమునకు అనుసరణమయి మెఱుగుపెట్టుట గమనార్హము.

"యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః."

సర్వదేహులకు ఏది రాత్రియో ఆరాత్రిలో సంయమి మేల్కొనియుండును భూతములన్నియు ఎపుడు మేల్కొని యుండునో అది ఆసంయమికి నిశాసమయమట! సత్వగుణమును పగటిగను, తమస్సును చీకటిగను అధ్యవసాన మొనర్చి నాటి మహాభారతేతిహాసకర్త సంయమి లక్షణమును ప్రవచించినాడు శ్లోక పూర్వభాగము శివాజీ విషయమున యథాతథముగా అన్వయించినది; మహాకవి నికిషోట్టంకిత మంజుతేజఃపుంజము ఉత్తరభాగమున పరివ్యాప్తములైనవి ఇతరులు మేల్కొనియుండు సమయమున సయితము శివప్రభుడు మేల్కొనియే యుండును అందువలననే ఆతడు నిత్యసంయమి యని వాకొనబడినాడు నాయకుని యందలి శివాంశ ప్రతిపాదనమున కీమార్పు సహాయకమని నిరూపింపవచ్చును కావ్యరసాస్వాదమగ్నమైన సహృదయపాఠకుని మనస్సును ఇతిహాసజ్ఞానసంభరిత మొనర్చి ఇతోధిక వ్యుత్పత్తిని గల్గించుట కవియుద్దేశ్యము

ప్రాశ్చాత్యదృక్పథమును కొంత ఆవలబెట్టి భారతీయ తాత్త్వికదృష్టితో పరిశీలించిన మేరుతంత్రాద్యుద్గ్రంథములలో పెక్కు విషయములు చారిత్రకములే యనునంశము స్థిరమగును. కర్మప్రాధాన్యముగల భారతీయ సంస్కృతి కర్మహీనులను దేశబహిష్కారణశిక్షకు అర్హము చేసెను. ఏత

ద్వివిధముగ బహిష్కృతులైన సంఘజీవులు కొందరు భారతీయ సిద్ధాంతము లను మున్నుతా మాచరించిన వానిని కొన్నింటిని మరువకయే, తోడుగా మరికొన్ని వినూత్నసిద్ధాంతములను జోడించుకొని జీవితమును గడుప సాగిరి. మహమ్మదీయుల విగ్రహారాధనావ్యతిక్రమము, తదభావములు ఉపనిషత్ప్రతిపాదితములైన నిర్గుణోపాసనకు ఛాయలే

"కొందరు లేచిపోయి యెటకో నట నెవ్వడో తండ్రియంచునున్
చిందులు త్రొక్కికొంచు నటశేఖరునిన్ శశిచూడ నేరకన్
ముందరి తల్లిదండ్రులకు బుట్టినవారిని నెట్టజూచుచున్
చిందరవందరం జనము చేయుచు నుందురు సాపరాధులై."

పూర్వము పేర్కొనిన యట్లు స్మృతి ప్రతిపాదితాంశములీ పద్యము నకు నేపథ్యములై పొరకుని తజ్జు నొనర్చుచున్నవి.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ".

"ఓం సత్ చిత్" అను మున్నగు వాక్యములు వేదప్రోక్తములై భారతీయనిర్గుణోపాసనమునకు ఆధారభూతము లగుచున్నవి. అట్లరి సగుణారాధన, అందునబహుదేవతాపూజనములనేల ఆకాంక్షించుచున్నారు? అను ప్రశ్నమునకు ఆస్తికమహాశయులు పెక్కురు నిరుత్తరులగు చున్నారు. అట్టి దుస్థితికి వ్యుత్పత్తి దారిద్ర్యమే ప్రధానకారణము. దానిని పరాస్త మొనరించి భారతీయతత్వమును సయుక్తికముగ స్థాపించుటయే విశ్వ నాథవారి జీవితాదర్శము. వారి సమాధాన సరళి యిది—

"రాజొక్కడే తాను రాజ్యంబు సేయునా
సకలవిద్యాసమజ్ఞాపయోధి
యైనను వేలపై యధికారు లుందురు
వేనికి వాడె రాజైన వాడు
రాజాజ్ఞ నిత్యనిర్వాహణంబు సేయుచు
తనయధికారంబు సనిన వట్టు

రాజు తా క్రీడాపరాయణుండైనచో
నా ప్రతినిధులు రాజంతవారు
ఇచట లోకంబదెట్టులో నచట సృష్టి
పాలనా చక్రమట్టులే, ప్రభువొకండె
దైవమొక్కండె వాడు చైతన్యమయిన
దైవమగు సర్వమైన చైతన్యమూర్తి".

"యథా మహానస వత్" అను ఉపమా ప్రామాణ్యముతో తార్కికులు పర్వతమందు అగ్నిని సాధించినట్లు పై రాజపాలనాదృష్టాంతముతో విశ్వనాథ ఏకానేకేశ్వరత్వమును నిరూపణము చేసిరి ఈరీతి పాఠకులలో వ్యుత్పత్తిని పెంపుసేయుటకు కవి అవిరళకృషి చేసినాడు.

3 భారతీయ సంస్కృతీ పరిరక్షణము, ధార్మికప్రబోధము అను నుత్తమాదర్శములు విశ్వనాథవారి ప్రధానలక్ష్యములు. జాతీయతా దృక్పథమున సంస్కృతిపరిరక్షణాదులు ఏకదేశము. ఇట్టి లక్షణము లీ కావ్యమున పెక్కుచోట్ల చేటలోని వెలగలవలె నిదర్శనములు పెక్కులు· స్ఫుటముగా కాన్పించుచున్నవి. (దేశభక్తిరూపమైన జాతీయత ఆంధ్ర ప్రశస్తి, ఆంధ్ర పౌరుషము మున్నగు ఖండకావ్యములలో ప్రస్ఫుటము).

విన్నన్న చెప్పినదే వేదమన్నట్లు పాశ్చాత్యవిమర్శకుల బోధలే పాశ్చరిత్రవేత్తలకు శిరోధార్యములగుట విశ్వనాథవారికి కంటగింపైనది అందులకు కారణము వారి జాతీయతాభినివేశమేగాని పాశ్చాత్యాచార్యుల యెడ ఈర్ష్యాద్వేషములు గావు

"ఆత్మలాభంబు కొఱకు దురాత్ములెల్ల
మోసగింతురు సామాన్య భూప్రజలను."

అనునది వారి యావేదనము. శివాజీని 'కొండయెలుక' యని 'విప్లవకారుడని' వర్ణించిన చరిత్రకారులు కొందరు కలరు

"ధర్మమున విప్లవమున భేదంబెరుగని
పాలసుండన్నచో ననవచ్చుగాని"

ధర్మ-విప్లవములకు భేదము తెలిసిన విజ్ఞులెవ్వరును అంగీకరింపజాలరు శివాజీ విప్లవకారుడు కాడని విశ్వనాథవారి యుద్దేశ్యము

"జులుముచేసెడి వాని జుత్తును గొరిగింప
లంచముల్ గొనువాని లాగి పొడువ
మతము మారెడివాని మతము మార్పించెడి
వానిని నీజన్మ బ్రహ్మసేసె
బ్రహ్మకంటెను మీరు పరమవివేకులు
ధరమీద నుండగా తగరటంచు
ప్రాణమ్ముమ్రతీయింప, పరకాంతలను భర్తృ
హీనల చెరిపెడి వానిబట్టి
కొఅతవేయింప బదిమంది గూడుసభను
కరినశిక్షల నిడు నధికారులొప్ప
తా శివాజీయు విప్లవదారు కాడు
పరమధర్మాత్ముడైన భూపతియగాని".

అని శివాజీ పాత్రమును భారతీయచారిత్రక దృక్పథముతో మన కన్నుల సాక్షాత్కరింపజేసి, విప్లవకారునిగా గాక పరమధార్మికుడైన భూపాలకునిగా చిత్రింపజేసి జాతీయసంస్కృతీపరిరక్షణమునకు పరోక్షముగా కృషిచేసినాడు. అట్లే విశ్వనాథవారి సాంఘిక ధర్మప్రబోధమునకు వేఱొక్క నిదర్శనము నీ సందర్భమున పేర్కొనుట యుచితము.

"ఇది యీరీతి పొనర్ప రన్నయది పోనీ ఇద్ది యిట్లూహసే
సెదరన్నట్టిది గూడ బుద్ధిపదముం జెందింపరానంత దు
ర్మదులై తల్లియు దండ్రి కూడ దమకామంబూనివర్తించి రే
మొదవన్ మాకును మేముగా నొదవినా మూహింప నంచాడగా."

నేడు కొందరు యువతీయువకులలో తల్లిదండ్రులయెడ అగౌరవము అవినయము మున్నగు అవలక్షణము లుప్రస్ఫుటములగు చున్నవి కృతజ్ఞతా దూరములైన ఈ భావములు భారతీయ ధర్మవృక్షమునకు వేరుపురుగుల వంటివి "ప్రజాయై గృహమేధినామ్, ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీ" మున్నగు వాక్యములు భారతీయ సనాతన ధర్మముకురములు వీటిని సమర్థించుటకు పైయువతకు గల దుర్భావనలను ఖండించుట కవికి ఆవశ్యక మైనది

విశ్వనాథవారి శబ్దార్థప్రయోగములో నెంతో చమత్కారముండును అది వారికైన ప్రత్యేకత.

"తల్లి నవ్వులలోన తానమాడుచు నుండు
నొడలెన్నడును గాని తుడుచుకొనడు"

ఇందగతర్థవైచిత్రి నరయుడు. భ్రమరాంబ నవ్వులలో స్నానము, చేసెననుటయందే పొగసు చిందులు వేసెను ఆమె నవ్వులు ప్రవాహసదృశములుగానో, చంద్రికాసంకాశములుగానో ఉన్నవి. అందా భక్తునకు స్నానావకాశము లభించెను హృదయతాపపరిహారమునకు ఆ తానము కన్న వేరుపాయము లేదు. కాని చమత్కారమేమనగా ఆ స్నానానంతరము శరీరమును తుడుచుకొనకుండుట అనగా ఆ సుధామందహాసములు దేహము నందే ఇంకిపోవలయును -అని కవి భావనామధురిమ

2 ఇట్లే మరొక్క ఉదాహరణము-

బలవంతముగ మతాంతరీకరణము ఆమోదకరము గాదు అట్లే స్వధర్మము నెఱుంగకయే పరధర్మము, పరమతముల నాశ్రయించుట చిత్త మౌఢ్యమగును. శివపాత్రద్వారమున కవివారిని ఖండింపుచున్నాడు

"మతము మారెడివాని, మతము మార్పించెడు
వానిని నీ జన్మ బ్రహ్మసేసె
బ్రహ్మకంటెను మీరు పరమవివేకులు
ధరమీద నుండగా దగరటంచు"

శివాజి వారి ప్రాణమ్ములను తీయించెనట "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అనిన ఆర్ష ధర్మమును పురస్కరించుకొని మతాంతరీ కరణమును హాస్యసమ్మిశ్రముగా కవి పల్కెను.

3. "శాంతించెన్ సుల్తానును, శాంతింపక యేమి చేయు"—ఇందు తొలి వాక్యార్థమును, ద్వితీయవాక్య మపహాస్యమొనర్చుచు సుల్తాను నసామర్థ్యము వ్యక్తమొనర్చెను.

4 ఆర్థికమైన వెసులుబాటు వాంఛించిన శివప్రభుండు కళ్యాణి దుర్గముపై చూపులతూపుల నంపెను. ఆ దుర్గాధిపతి త్రైమాసికముగ సుల్తానుకు పంపెడి ధనము ఆతని కనుల గట్టినట్లుండెను ఇట శివాజీ యొనర్చిన యుద్ధవర్ణనము ప్రత్యేక వర్ణశిల్పసంభరితము.

"పారశీకు లరబ్బులు వానయన్న
వారికిని భీతి, యెండు దిబ్బల జనమ్మ"

"మిన్నులో జీరగా సన్న మబ్బని లేదు
యుర్వీధరము లిట్టె యురుమదొడగె
సన్నని గాలిగా సాగినయది లేద
బుంగలతో బడబోసె నీళ్లు
పర్వతాధ్వము సన్నబాట యిర్వంకల
బండలతో మూయబడియె నంత
కోసిన యట్లున్న కొండల ప్రక్కలు
వెసనెగ బ్రాకగా వీలులేదు

విరిగిన పోయిన కత్తులు, వెలికిలబడు
దేహములు కాళ్లుచేతులు దెబ్బతిన్న
బంటులును, తలలొడళులు బగిలియున్న
గుఱ్ఱములతోడ సైన్యంబు బిఱ్ఱబిగిసె".

విచిత్రమైన యుద్ధవర్ణనయిది. తేటగీతిపాదములకు సీసపాదములకును కార్యకారణ భావ సంబంధము పాటింపబడెను ప్రకృతిప్రభావము చేతనే కౌరుష్కసైనికులు అపజయముపాలైరి— అనియు కవిభావన

ఇట్టి నిర్మాణమందలి శిల్పచమత్కారములకు పెక్కింటికి ఈగ్రంథము కాణాచి ఈ ఉదాహరించుట స్థాలీపులాకముగా మాత్రమే.

విశ్వనాథవారి భావములు, ప్రతిపాదనములు ప్రబోధములు జాతిని కొన్ని దశాబ్దములు, శతాబ్దములు తిరోగమింపచేయునని ప్రాజ్ఞవిమర్శకుల అమూల్యాభిప్రాయము తద్విచారణమునకు ముందుగా ఈ 'శివార్పణము' కావ్యమందలి కొన్ని వాక్యములను సహృదయులగు సుహృదయులకు నివేదింతును

1. ఎండమావు లుద్యోగాలు వృత్తులబడి
   ప్రజలు తమ తమ బ్రతుకులు బ్రతుకవచ్చు
   ప్రతినరు డబద్ధమని లేక బ్రతికె నేని
   అందరు సమానులే పరమాత్మ యొకడె.

2. జులుము చేసెడివాని జుత్తును గొరిగింప
   లంచముల్ గొనువాని లాగిపొడువ.

3. అందఱి దైవమొక్కటియె, అందఱి దైవము కర్మరూపమే.

4. సొంత చదువులు చదివింపజొచ్చె ప్రజల
   జన్మయెత్తిన దానికి జన్మముక్తి
   ఆత్మవిద్యలోనున్న రహస్య మెఱిగి.

5. జులుము లేదొక్క చోటను చిలుము లేదు
   లంచముల్ లేవు న్యాయమ్ము కంచె లేదు.

ఈ వాక్యములీ కవిని మూఢాచారపరాయణునిగా నిరూపించునా? లేక ఇరువదియవ శతాబ్దివానిగా నిర్ణయించునా?

ఇప్పట్టున నొక్క యంశము గమనింపవలయును—కావ్యమున వెలువడిన భావములన్నియు కవి మనః ప్రతిబింబములు కావు అట్లే కవి మానసిక భావములన్నియు కావ్యమున నుండవు, అవసరమునులేదు ఈ యెఱుక లేని వారు కావ్యవిమర్శనమునకు కడంకకుండుట మేలుత్తరము.

చిరుతొండనంబికథ వ్రాయుట కారణముగా శ్రీనాథుని వీరశైవునిగా భ్రమించుట యెట్టిదో, "నేలన్ జీవులు ముక్తిపొందుటకునై నిర్మించె దైవంబు వే, దాలన్ గోవుల బ్రాహ్మణావళి........." అనిన విశ్వనాథ వారి వాక్యముల జూచి వారిని సనాతన సంకుచితాచారసమర్థకులుగా భావించుట యట్టిదే అట్టిది జాతి నెంతో వక్రమార్గమును పట్టించును మహా సముద్రము నేకదేశమును చూచి అందు ముత్యములు రత్నములును ఆయా వ్యక్తుల దౌర్భాగ్యముచే కన్పించనిచో తావన్మాత్రమున దానిని రత్నాకర మన్నవారిని నిందించుట ఎట్టి పాక్షికసంకుచితదృష్టియగునో విశ్వనాథను విమర్శించుట కూడ అట్టిదే నేటి విమర్శలకీ పాక్షిక దృష్టియే నిదానము రామాయణమున అయోధ్యాకాండయందు జాబాలి తన నాస్తిక మతాభినివేశము ప్రకటించుట చూచి ఆ ప్రక్కనేగల తత్ఖండనవాక్యముల నుదాహరింపక వాల్మీకిని నాస్తికునిగా వ్యాఖ్యాన మొనర్చుట, పై రీతిగా విశ్వనాథను విమర్శించుట రెండును ఒక్కటియే ముందుగనే నిర్ణయముల, సిద్ధాంతముల నొనర్చుకొని వానికి నుదాహరణములను ప్రోదియొనర్చుకొనుటచే ఈ విధము సాగుచున్నది

పై నుదాహరించిన "నేలన్ జీవులు...... " అను వాక్యముతో మరి కొంత దూరము దృష్టిని సారించినచో—

> "బ్రాహ్మణ కులంబులో కర్మరహితులగుచు
> మ్లేచ్ఛులంబోలి యెందఱు లేరు జనులు!"

అను పల్కులు ప్రత్యక్షములగును ఈ పద్యముల వరుసలో గోమహిమ ప్రతిపాదించుట కవి స్పష్టాభిప్రాయము అది తెలిసినచో పూర్వపద్యములయందలి భావప్రకటనౌచిత్యము మర్శనీయమేయగును. కావున

పచ్చని చూపులతోగాక, స్వచ్ఛమైన సాత్త్వికమైన దృష్టితో మహాకవుల నధ్యయన మొనర్పగా ప్రాజ్ఞులగు సహృదయులకు మనవి

విశ్వనాథవారి విశ్వతోముఖ ప్రతిభను వివరించుట ఒక్కరికి సాధ్యము గాదు వేయి ముఖములు చాలవు శివార్పణమున దేవీముఖముగా కవి పలుకులు చూడుడు

"నన్నెరిగిన హరిహరులే
నన్నెరుగరు తక్కువారు నన్నెరుగుటయున్
మిన్నెగురుట మన్నుతినుట
నన్నెరుగుట నా ప్రసాదనమ్మున కలిమిన్."

ఆ మహాకవి ప్రసాదమున్నచో ఇసుమంత గుణగ్రహణ సమర్థత్వమును కాంగుదము ఆ జిజ్ఞాసాదృష్టిలేక ప్రలాపింపసాగిన ఆయన మహాగిణము.

ఈ పరిశీలనమునందు శివార్పణకావ్యము నాధారముగాగొని విశ్వనాథవారి కవితాదర్శన మేరీతిలో సాగవలెనో స్థూలారుంధతీ న్యాయముగా వివరించితిని. తమకు తెలిసినదే ప్రపంచమనుకొనక మహాకవులను పరిశీలించెడి తిన్నని దృష్టి నలవరచుకొనవలసినదిగా విజ్ఞప్తి యొనర్చితిని.

"తం సంతః శ్రోతుమర్హంతి, సదసద్వ్యక్తిహేతవః
హేమ్నః సంలక్ష్యతేహ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపివా."

# "విశ్వనాథ మధ్యాక్కఱలు: వైశిష్ట్యము"

—శ్రీముళ్లపూడి సచ్చిదానందమూర్తి

విశ్వనాథ మధ్యాక్కఱలు పదిశతకముల సంపుటి. ఆయా క్షేత్రముల గల స్వామి నాయా పేర్లతో కవి స్తుతించుచున్నారు మొత్తము 1017 పద్యములు-మధ్యాక్కఱలు. ఒక్క 'మున్నంగి వేణుగోపాల' శతకములో 108 పద్యములుండగా తక్కినశతకములలో 101 పద్యములు చొప్పున నున్నవి. మకుటమును పాటించుట, రచన నొకేరకమైన వృత్తములో, లేదా ఛందములో సాగించుట యిత్యాదిగా శతకములకు చెప్పబడిన సాధారణ లక్షణము లన్నియు నిందున్నవి ఉత్పల చంపక మాలలలో శార్దూలేత్యాది వృత్తములలో కందము, సీసము, ఆటవెలది, తేటగీతములలో చెప్పినశతకము లాంధ్రవాఙ్మయములో నున్నవిగాని మధ్యాక్కఱలలో చెప్పిన శతకము లితఃపూర్వము లేవనియే చెప్పవచ్చును అందువలననే కాబోలు కృతిభర్తయైన శ్రీధర్మవరపు సీతారామాంజనేయాభిదుల కాశీర్వచనము పలుకుచు, "ఈపుస్తకము నిల్వవచ్చు వృత్తవైశిష్ట్యంబు మహిమ"- అంటారు కృతికర్త.

సాహిత్య ప్రక్రియలలో దేనినైనను సమర్థవంతముగా నిర్వహించి నల్లేపద్యరచనలో నేఛందోపద్ధతినైనను సాంతము రసవతంముగా రమ్యముగా రచించిన దిట్ట శ్రీవిశ్వనాథ. ఉత్పలచంపకమాలాదివృత్తములను, కందము, సీ·ము, మొదలైన జాతుల నుపజాతుల నందరు సాధారణముగా చేపట్టగలరు కాని మధ్యాక్కఱలు పంచమగణప్రథమాక్షరము యతిగా

నందరకు లొంగుతాయని చెప్పలేము శ్రీవిశ్వనాథవారికి సాహిత్య ప్రపంచములో శార్కరిలతలములలో పయనించుట చాలవర కిష్టము. ప్రతిభను ప్రకటించుట కదొకవిధముగా నెన్నుకొన్నట్లు తోచును. "సువశా కాళిదాసస్య మందాక్రాంతా ప్రవల్గతి" అని క్షేమేంద్రుడు వచించినట్లు మధ్యాక్కఱ విశ్వనాథ కట్లువశమైనది.

పరబ్రహ్మను కవి మధ్యాక్కఱలలో స్తుతించుచున్నారు వేములవాడ శతకములో "మధ్యాక్కఱలకును నీకు నాకు సంబంధంబు బలిపి, మధ్యాక్కఱలు నేను వేరు పనిమీద మానివేసినను నీధ్యానమేమయ్యె!"-అంటారు. కవి యీపద్యములను పరిణితికివచ్చిన వయస్సులో పరిపక్వముచెందిన మనస్సుతో రచించినారు. ప్రతిపద్యము కవి గుండెనుండి దూసుకొని వచ్చినట్లుంటున్నది. ఇది జీవుని వేదన; దేవునికి నివేదన. ప్రతిపద్యము కరుణరసముతోడనో, భక్తి రసముతోడనో జాలువారుతూంటుంది. 'నైనంఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః' అనుదానికి మాత్రాఛందస్సులో వ్రాస్తూ "జీవికి తప్పదు వేదన" అంటారు హేతువాదయుగకర్తయైన శ్రీ శ్రీ కూడ శ్రీవిశ్వనాథ ప్రస్తుతకవిత్వమును గూర్చి, తన స్థితిని గూర్చి శ్రీగిరిశతకములో "వేదాంతములలోని వేదములలోని విపులార్థచయము వాదించునాకైత" అనిచెప్పి యీ జగత్తు ప్రస్తుతమట్టికవిత్వానికి శత్రువై యున్నది; నీవట్టి కైతకనాదిబంధువుడవు; ఇద్దరుంగూడ నన్ను" కాదంటే "నాకుఁ బ్రోదియెచట?" అని స్వామిని నిలదీసి యడుగుతారు కవిత్వరచనచేత మాత్రమువారు తృప్తి పడుటలేదు. 'ఇదుకెల్ల నీరీతిగాగ నీమీద పాటలు బాడ-జదురుగా తుదకది యెల్ల కవితగా జమకట్టెదేమో' యిది ముందరే తేల్చి పెట్టు-శ్రీకాళహాస్తీశ్వరా!మహాదేవ!" అంటారు శ్రీమద్రామాయణకల్పవృక్షంలో "అలఘుస్వాదు రసావతార ధిషణాహంకార సంభారదోహలబ్రహ్మమయమూర్తి" నని చెప్పికొన్న అంతటి విశ్వనాథ పిట్టవలె అయిపోయి భద్రగిరి శతకములో "నీదయ నీదయ నీదయ మరొండు నేరను త్రోవ"...రమారమణ! నీదయ కానిమ్ము అంటారు. మరొకచోట "నన్నేమి చావుమంచనెదో యెంత యత్నముచేసి మనసు, నిన్నంటుకొని నిమేషమ్మయిన గాని నిల్చుటలేదు. నన్నొక్క వేయికత్తుల నరకుము" అని స్వామి ఎదుట వలవల యేడ్చు

చున్నట్లు కనిపిస్తారు విశ్వనాథ. ఇంకొకచోట, "సిగ్గుబడు లహంకారమ్ము ఖూని యుండి, యిదేమి బోర్లపడి బోవుచున్నాను!" భద్రగిరి శ్రీరామపుణ్య నిలయ నీవో నిండుకుండవు' అని సిగ్గుపడతాడుకవి శ్రీవిశ్వనాథవా రద్వైతి శ్రీగిరిశతకములో—

"నాలోన శుష్కతృణమ్ము ముట్టించినావు దృగ్వహ్ని! నీల లోహిత! ...నీవు జ్వాల తా నదివేరు నిద్దివేరుగా సంతరించకువె శూలాభిషంగ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ"- అని

తన అద్వైతభావమును వెల్లడిస్తారు జీవబ్రహ్మాలు వేరనిపించినను తత్త్వమొకటేనని ధ్వని నెకరుకల్లు శతకములో, "నేనన్న దే లేనియపుడు, పాపముల్ నేనేమి సేతు, నేనేమి సేతు, పాపముల్ సేసితని నీవనెదేని నేనన్న భ్రాంతి మాయించు, నీవును నేను నదొక్క చేనిలో పంటగా, నెకరుకల్ ప్రాంతసిద్ధాబ్జహేళి!" -యిది పతాకస్థాయి నందికొన్న వైదాంతిక విష యము శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే- అను ఉపనిషత్ సూక్తిని భావించి శేషాద్రిశతకములో- "శివునకు నీకును నేను భేదంబు చేసితినేని, తవులు నా పాపాన నాకు నాయువు తగ్గును గాక" -అంటారు జీవుని వేదన యింతింతనరానిది "నా గుండెదీసి నీ పాదమూలమునం బెట్టుమనుము మాగువారినదశ నంత వాలిన మాశ్వేర బిలుము" అని మఱొకచోట పరమేశ్వరుడు బయట నెక్కడనుండియో కథలలో విన్న రూపాలలో రాడట " మత్ఫాలంబు ఘట్టుమంచు పగిలి రావలయు"నని దేవుని గూర్చి, "నీవు నాలో ప్రవేశించుటకు నెంచగావలె గాని. త్రోవలెన్నున్నవి? కనులలోనుండి భ్రూరేఖనుండిరావచ్చు" దేవునికి దయ రావలెగాని, "శత శతచ్ఛిద్రమీ శరీరమ్ము" అనివాపోతాడు చివరికి విసిగివేసారి, "నీవు లేవన లేవటంచు వాదించు నిర్భయదైత్య, భావంబె మేలనిపించు -నీవు కినబడుట నిశ్చయము, భావించి మేమేమి బావుకొన్నాము- వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ!" అంటాడు కవి జనుల భోగాశను గురించి యొకచోట, "కోథిక బేలాకు మందగా తోలికొని పోవుచునుండ, దారి ప్రక్కనయున్న పచ్చిగడ్డిపై, తారాడు పసుల తీరుగానున్నది" ఏమి చెప్పమంటావని పెదవి విరుసాడు. ఇంతకంటె సమాజ నిర్మాణ వైఖరీవాద మేముం

టుంది? ప్రక్కవారు బాధలతో చచ్చిపోతుండగా మేడలలో హాయిగా కూర్చున్న విలాసపురుషుల ఔదాసీన్యము నిది ధ్వనించుట లేదా? అటువంటి వారికి పీడితుల యెడ, తాడితుల యెడ కనీసము సానుభూతికూడా లేదని చెప్పినట్లు కాదా! ద్రాక్షారామశతకములో జనుల భోగాశ పరాకాష్ఠ నందినదని చెప్పుతూ," తనయింట దాంజావవలయు గొలువగా దగ్గరివారు, తనచావు సైతము భోగమన్నట్లు తలచు"నంటారు వివేకానందస్వామి యన్నట్లు తనకు నొకరోజున చావున్నదని తెలిసికొన్నచో జాలు మానవుడు విజ్ఞానియే మరి! జనుల భోగాశ యెంత దవ్వుగా జనినది స్వామి - నివ్వెర పోతాడు. వర్తమాన సమాజస్థితికి నిట్టూర్పువిడుస్తాడుకవి కవికిగల లోకాను భవ మనంతమైనది తద్విషయమును గమ్యాతి రమ్యముగా లోకోక్తులతో, ఉపమానములతో చెప్పుతాడు కవి పద్యములనిండ తెలుగు పలుకుబడులే- 'నీకిటు కంతయు నాకు తెలిసెను', కాలికి వ్రేసినవన్ వ్రేలికి మహేశ! కాలికి మరియు వ్రేలికి వేసినన్‌లాగుచున్నావు! పిచ్చికుదిరిగాని పెండ్లికాదది పెండ్లైనగాని, పిచ్చియు కుదురదు- నానెత్తిపైకెక్కి పిండికొట్టుచున్నావు- నా గుండె లోనుండి గగ్గోలు చేయుచున్నావు- చెవులు చిల్లులు పడిపోవు గుండియ చిట్టైముకట్టు- కాళ్ళనుబడ్డ పామెట్టులైనను కరవక పోదు- హాళ్ళికి హాళ్ళికి- ఇటువంటివి కోకొల్లలు వ్యాజస్తుత్యలంకారము కవికి ప్రియమైనది ఒకచోట దేవునికి దయరాదంటూ "నీకంటె పల్నాటి నూతులు మేలంటాడు నీకు (లింగమునకు) ముక్కు మొగము లేనప్పుడు జనులు నీ మొగమెరుగక పోవుటలో వింత యేమున్నదని చమత్కార ముగా ప్రశ్నిస్తాడు. మరొకసారి "తెలివి యనంగ నీ యదియ తెల్వి, యంతి కమునజేరు, బొలపముల్ పచరింతు వందలున్ వేలు, మోహమ్ము పెంచి మొలక నవ్వులతోడ దులపరించుక పోయెదు తుదకు నలయించి నంద మూర్తిలయ! విశ్వేశ్వరా! కులస్వామి!"- నందమూరు విశ్వేశ్వరుడు వారి కులస్వామి, అందుకేనేమో అంతచనువు. శ్రీవిశ్వనాథ మాస్వామిలో ప్రాణమువిసిగి ఏదో వచ్చిన కాడికమ్మెదను స్వామీ! నిన్ను విశ్వేశ్వరా!"

అంటారు పాపం. ఆస్తిపాస్తులన్నీ వారి తాతతండ్రులే అమ్మివేశారు కవికి స్వామి ఒక్కడే మిగిలినాడు అమ్మకానికి! శ్రీరామునిగూర్చి "నీదు లావణ్య నది యొక్కసారి జివ్వున లాగివేసెడిని" అని పరవశించి పోతారు.

శ్రీరామునితో మొరపెట్టుకొనుచు, "నిస్సాత్త్వికచేత నిట్లడుగుచుంటి గాని లేకయున్న వన్నెలు చిన్నెలుగాగ వర్ణింపవలతిని నన్నెఱుంగుదుగా దె మఱల రామాయణమ్మంత జేతునిన్ను'–ఇదికష్టముకాదంటారు మగల శేషాద్రి శతకములో దశావతార ప్రసక్తిగా, "శ్రీరామభద్రుడై చెచ్చెర రావయ్య! వేంకటేశ్వరా" అని "ఎన్నిమహాయుగంబుల తపస్సు వ్యయించితో రాముడన్నట్టి యవతారము వడయ" అంటారు కవికి శ్రీరాముడంటేచాలు అన్నింటిని మరచిపోతాడు "నాయెద వేయిమంది దుర్యోధనుల్ గలరు చిక్కించుకోరాదె?"–తనలోని అసూయను దేవునిముందుపెట్టుట యిది అందరు సాధారణముగా మేలుకొలుపులు రచించుచునేయుంటారు శ్రీవిశ్వనాథప్రాభాతగీతిని రచించి తుదకు దైవము నిద్రయెవ్వడు పోవుచున్నాడని ప్రశ్నించినచో నిద్రాభినయము ప్రిదిలించు కొనుమంటిగాని అనిచమత్కారముగా తప్పుకొంటారు. కవిచెప్పికొన్నట్లుగా నాకు దక్షత "నాల్కకు గలదు వేయి పద్యంబులువ్రాతు" నన్నట్టు వారు సర్వకవితాదక్షులు

"విశ్వసత్య నాథాయణ అగ్గిమీద గుగ్గిలం" అని పరిహాసం కోసమో లేక ఆయన తత్త్వమట్టిదనియో శ్రీశ్రీ ప్రాసక్రీడలలో అన్నారు కాని ఆయనంతటి సాత్త్వికుడు, తాత్త్వికుడింకొకరు లేరనిపించును. వారొకచోట, "నల్వురు ననుజూచి యయ్యో! పాప మనిపించుకోలేన", ఎందుకని అంటే "బయటి నావ్యవహార నిష్ఠతయు ననుగట్టు పొగరుబోతనియ యనిపించు"–ఆయన మరివైదికుడుకదా? కాని వారమృతహృదయులు "విశ్వనాథవారు వెనక్కి నడవగా నడవగా వేదకాలమింకా వెనక్కిపోయిందట"–అని కీ॥శే॥ తిలకు అధిక్షేపించినారు. కానిఆయన "ఏషధర్మ స్సనాతనః" అనెడి వాక్యము నెడల ప్రగాఢవిశ్వాసము కలవారు. "కృతయుగమతి వచ్చెకెదురుడేకెడు

వాడనేను!'' అంటారు కృతయుగములో ధర్మము నాల్గుపాదాలనడచినదని కదా ధర్మము సంపూర్ణముగా నీదేశములో నెలకొనవలెనని ధ్వనికదా? అంతేకాని "ఆయన అభివృద్ధి నిరోధకుల వ్యవస్థను ప్రోత్సహించాడు" అంటే ఆమాటక్కర్థరహితములు ఆయువుదీరిన అర్థరహితములైన యీల వాట్లను ఆచారములనెన్నడు నాయన ప్రోత్సహించలేదు. ధర్మాభిముఖముగా ప్రయాణము సాగవలెననుటయే శ్రీవిశ్వనాథవారి అభిప్రాయము.

శ్రీవిశ్వనాథవారి రచనలు కఠినముగా నుండునని యొక అపప్రథ లోకములోనున్నది ప్రధానముగా వారి మధ్యాక్కఱ లట్టివిగావు. ఒక్కొక్కపద్యమొక్కొక్క మధుబిందువు

# శృంగారవీథి

—డాక్టర్ కోపల్లె శ్రీరామమూర్తి

శ్రీ విశ్వనాథవారు రచించిన ఖండకావ్యాల్లో శృంగారవీథి ఒకటి. ఇది బహుశః వారి తొలి రచనల్లో ఒకటికావచ్చు ఈ కావ్యంలో వారు రాధామాధవుల ప్రేమను హృదయంగమంగా చిత్రించారు. రాధామాధవాన్ని అనేకులు అనేకవిధంగా గానంచేశారు వారిలో శ్రీ జయదేవుని గీతగోవిందం అగ్రస్థానాన్ని అలంకరిస్తుంది గీతగోవిందాన్ని వినని భారతీయుడు అరుదంటే అతిశయోక్తి కాదు విశ్వనాథవారి రాధామాధవులు జయదేవుని రాధామాధవులకన్న భిన్నులు కారు ఉభయులు విప్రలంభ సంయోగ శృంగారాల్లో మానసికావస్థల్ని చక్కగా రూపొందించారు. ఉభయుల్లోను శృంగారం భక్తిపర్యవసానం చెందుతుంది కాని జయదేవుడు తన గ్రంథాన్ని సంగీతంతో పాటు పద్మావతీచరణచాలన ప్రయోజనానికి గూడా ఉద్దేశించగా విశ్వనాథవారు తమ గ్రంథాన్ని కేవలము ఆత్మ సంతృప్తికొరకే ఉద్దేశించారు. వీరిలో నాట్య సంగీతాలకు ప్రసక్తిలేదు. జయదేవుని కావ్యం ప్రదర్శనార్హమై ప్రేక్షకుల్ని తన్మయుల్ని చేస్తుంది. విశ్వనాథవారి కావ్యం చదువరుల మనోరంగంలో దృశ్యంగా మారి మైమరపిస్తుంది.

శృంగారవీథిలో అనేక విషయాలు ఉన్నప్పటికి ప్రస్తుతానికి సంబంధించినవి కేవలము అయిదారు ఘట్టాలు మాత్రమే మొదటి ఘట్టంలో రాధ, కృష్ణుని గురించి, బృందావనాన్ని గురించి ఆలోచిస్తుంది అసలే వేపమానయైన రాధకు ఈ ఊహలు విరహాభివృద్ధిసాధకాలు. రెండవఘట్టంలో

కృష్ణుని తీసుకు రావటానికి రాధ చెలి మాధవుని సమీపించి అతనికి రాధ అవస్థను వివరం చేస్తుంది కాని కృష్ణుడు, ఏమీపలకడు ఆమె తిరిగి రాధను చేరుతుంది మూడో ఘట్టంలో తిరిగివచ్చిన చెలి రాధానునయంతో కృష్ణుని నిశ్చలత్వాన్ని చెపుతుంది అంతేగాక ఇతర వ్రజకన్యలతో అతనికి గల సంబంధాన్ని, వారి వారి చైతన్య స్థితుల్ని వ్యాఖ్యానిస్తుంది. ఇక నాలుగో ఘట్టంలో మాధవుడు హారాద్భావంలో రాధను చూడటానికి వస్తాడు రాధ స్థితిని చూచిన మాధవుడు హృదయవిదారకంగా చలిస్తాడు కాని అన్యోన్య దర్శన సుఖంలో పూర్వకష్టాల్ని విస్మరించి వారు ఉభయులు పరస్పరాలింగన సౌఖ్యాన్ని అనుభవిస్తారు. తరువాతి ఘట్టంలో రాధాకృష్ణుల వనవిహారం అనేక రకాలుగా సాగుతుంది. అనంతరఘట్టంలో కృష్ణునికి భార్యలపై గల అనురాగం తద్విశిష్టమైన మనోభావాలు గోచరిస్తాయి. కాని మాధవునికి రాధపైగల అనురాగం గాఢమైంది కనుకనే అందరిమధ్య రాధ స్థానం విశిష్టమైంది. వీరిరువురి సంయోగంతో కథ కొంత పూర్తి అవుతుంది

ఈ కథను పద్యాత్మకంగా చిత్రీకరించటంలో సత్యనారాయణగారు సిద్ధహస్తులుగా కృతకృత్యులయ్యారు వారిలో గల మహాకవి బీజాలు మొలకెత్తినాయి దీనితోనే వారి కవితామహావృక్షం శాఖోపశాఖలుగా వ్యాపిస్తుందన్న విషయం దృగ్గోచరమవుతుంది. ఈ విషయాన్ని వారను కోకుండానే ప్రప్రథమంగా, శృంగారవీథిలో చేసిన వస్తునిర్దేశంలో సూచించి నట్లుగా కనపడుతుంది. శృంగారవీథి ఆరంభంలో కవి—

"మదన మహీపతి ప్రసవ మార్గణ భిన్నశరీర, దీనతా
స్పద పరిపాండురానన, విసర్పిత నీలపటాభిరామ, స
మ్మద మధులిట్ప్రదాహృత తమాలనికుంజలతాంత శయ్యపై
మదగజయాన పండుకొనె మాధవ రాధిక వేపమానయై."

అని రాధను మనకు పరిచయంచేస్తాడు ఈ రాధ విప్రలంభావస్థలో మాధవుని నిరీక్షిస్తూ నికుంజంలో శయనించింది ఈ పరిసరాలు రాధ యొక్క ఔన్నత్యాన్ని సూచించటమేగాక విప్రలంభోద్దీపనాలను గూడ

సూచిస్తున్నాయి. వస్తువురమ్యమయింది ఉద్దీపనవిభావాలు రమ్యతరమయిన తమాలనికుంజాలు ఈ నికుంజాలు తమాలవృక్షసంబంధమైనవి కావు ఆ వృక్షవాటికమధ్య ఏర్పడ్డవనే ఊహించాలి తమాల వృక్షాలు సుదీర్ఘాలు; విశాఖలు. ఈ నికుంజాలు మధులిట్పదాహ్వృతాలు అన్ని విధాలయిన సంతృప్తి మనోల్లాసాలు ఉఁ చేనేగాని పట్పదాలురావు కనుక మనోవికాసాస్పదమైందే ఈ నికుంజం ఇచ్చట అనేక రకాలయిన లతలున్నాయి. తమాల వృక్షాలు కాఠిన్యాన్ని సూచిస్తే లతలు సౌకుమార్యాన్ని సూచిస్తాయి. ఈ విషయాల్ని ఈ విధంగా సతత కావ్యానుశీలనాభ్యాసవశంచే మనోనయనంతో పరికిస్తే సత్యనారాయణగారి కవిత్వంలో మహావృక్షాలు, మృదుమధురంగా అల్లుకొనే లతావిశేషాలు, వాటి సంబంధమైన సౌరభాలు ప్రతిస్ఫుటం కావటానికి అవకాశాలు ఉన్నట్లు స్పష్టమవుతుంది తను మహాకవి కాబోతున్నాడనే విషయం ఈ పై పద్యంలో ఆయన అవితర్కితంగా చొప్పించాడని మనకు గోచరిస్తుంది నాందిలో కథావస్తువు సూచింపబడినట్లే ఈ వస్తునిర్దేశాత్మకమైన పద్యంలో కవి ప్రతిభావిశేషాలు సూచింపబడ్డాయి.

ఈ కథాకథన విధానంలో సత్యనారాయణగారి ప్రతిభ-సందర్భశుద్ధి పదవిన్యాసము, భావగాంభీర్యము మొదలైన వాటిలో ప్రతిఫలించి రసాస్వాదనకు తోడ్పడుతున్నాయి వారు కేవలం శృంగారరసానుగుణ్యంగా కావ్యం రచించినప్పటికి ఈశృంగారం భక్తిపర్యవసానమయిందన్న విషయం మనకు విదితపూర్వమే. దేవాదివిషయకమైనరతే భక్తిగదా! ఆ విషయాన్ని మనస్సులో పెట్టుకొని కవిగారు పదే పదే మాధవుడు భగవత్సంభూతుడన్న విషయం జ్ఞాపకం చేస్తుంటారు. అందుకు తార్కాణంగా—

"శ్రీదములై వికుంఠనగరీముఖకుడ్యగతాత్మ దర్శనా
పాదిత సర్వమౌనిజనవల్లభమోక్షసుఖులై పురాసమా
స్వాదిత మత్సమర్పితలసత్పరిరంభరసాబ్ధులౌ భవ
త్పాదసరోరుహానుభవభాగ్యము విస్మృతిరాదు మాధవా!"

అనే పద్యం పరిశీలనార్హమైంది దీనిలో రాధ మాధవుని గురించి స్మరిస్తుంది. స్మరణ కీర్తనాదులు రతివిశేషాలు అందులోను విప్రలంభా వస్థ ఆమె మాధవుని పాదసరోరుహానుభవభాగ్యాన్ని పదే పదే స్మరిస్తున్నది. ఈ పాదసరోరుహం కేవలం 'శ్రీహరి కిశోరాంఘ్రిద్వయీపూర్వ చిహ్నిత రాధారమణీకుచద్వయం' కలిగింది కాక, 'సర్వమౌని జనవల్లభ మోక్షాస్పద' మైంది అని చెప్పటంలో రాధ మనోగతమైన రతి సందర్భాను గుణం కాదా? ఇంకా ఆ పదసరోరుహం వికుంఠ నగరీగతకుడ్య గతాత్మ దర్శనం అనటంలో సర్వవ్యాప్తిత్వం గూడ ద్యోతకమవుతుంది ఆ సందర్భంలో ఆమెకు మాత్రం ఏవిధంగా విస్మృతి కలుగుతుంది? ఈ విధంగా ఆలోచిస్తే కవిగారు ఈ సందర్భంలో వ్రాసిన ప్రతిపద్యము సందర్భాను గుణంగానే ఉంటూ అనుభావపూరితమైందని చెప్పటంలో అతిశయోక్తి లేదు.

సహించటానికి వీలులేని విప్రలంభావస్థ అనుభవిస్తున్నప్పటికి రాధ తన మనోనాథుడు మోక్షదాయకుడన్న విషయం గూడ విస్మరించలేదు. ఈ శారీరకవిషయానుభవాలు బుద్బుదప్రాయాలన్న విషయాన్ని జ్ఞాపకం చేసికొంటూనే ఉన్నది అందుకనే ఆమె అతనితో ఐక్యంగావాలన్న ఆదుర్దాని ప్రకటిస్తుంది ఈ విషయం—

"హా నేనెంతగ బేలువోయితిని యీ మోసంపు స్వర్లోక వీ
ణానాదంబులు శాశ్వతంబని, యనంతంబైన యాత్మాపవ
ర్గానందంబును జేతులారగ శరీరాంభోధిలో ముంచితిన్
హా! నందవ్రజబాలుడిట్టి డటవే! యంభోజపత్రేక్షణా!"

అని తన చెలితో వాపోవుతుంది ఈ వీణానాదాలన్నీ కేవలం శ్రవ్యసుభగంగా భ్రమింపచేయటమే గాని శాశ్వతాలు కావనీ, తను గూడ అందరివలెనే మొదట్లో ఆ మోసానికి గురిఅయితిననీ చింతిస్తుంది. ఈవిషయ జ్ఞానం వచ్చినతర్వాత, ఆత్మాపవర్గాన్ని శరీరసౌఖ్యాల్లో ముంచెయ్యటం అజ్ఞానమనీ చెపుతుంది ఈ పద్యంలో 'హా! నందవ్రజబాలుడిట్టి డటవే!' అంటంలో అతను తనవద్దకు రాకుండా మోసం చేశాడన్న విషయం కాక,

ఈ శారీరక విషయాలు కుణికాలను ప్రస్ఫుటంగా పలకకుండా, చేష్టల ద్వారానే సూచిస్తాడనీ, ఆ విషయం తెలిసికొన్న తర్వాత సంపూర్ణజ్ఞానానందం కలుగుతుందని రాధ గ్రహించిందన్న విషయం మనకు స్ఫుటమవుతుంది. అందుచేతనే రాధకు మాధవుడు సందర్భోచితంగా అర్చితస్థానుడుగాను, అనంతశయానుడుగాను కనిపిస్తాడు

రాధ మాధవుని ప్రతిక్షణం స్మరిస్తుంది ఆ విషయం చెపుతూ కవి నిర్దయుడైన గోపరమణీప్రియునే స్మరియించు...' అని చెపుతాడు దానికి అనుగుణంగా 'కొనివత్తు నాథునని యేగిన దూతిక,' 'విప్రయోగామంద జ్వరతాప శోషిత శరీరాతిక్రమవ్యాప్తి శయ్యామధ్యంబును' వీడని రాధను, అతనినే జపిస్తూ 'బాష్పప్లుష్ట నేత్రద్వయిన్' శయనంబందున నంటుకొన్నయది, కార్శ్యంబంది యేకయ్యో, కయ్యోయో' అని వర్ణిస్తుంది కాని మాధవుడు చలించినట్లు కనపడదు. తిరిగి రాధవద్దకు వస్తుంది రాధ ఆతురతతో అతన్ని గురించి అడిగిన ప్రశ్నలన్నిటికి సమాధానంగా 'మనము జ్ఞాపకమా? యదువంశమౌళికిన్' అంటుంది ఈ సమాధానంలో 'నిర్దయుడైన గోపరమణీప్రియునే స్మరియించు' అన్నదానిలో విశేషణం ఎంత సందర్భశుద్ధిని విశదం చేస్తుందో మనకు అవగాహనం అవుతుంది అంతే కాకుండా 'యదువంశమౌళి' అన్న పదంవల్ల మాధవుడు యాదవాధినేత అని, 'మనము' అన్న పదంవల్ల అతని పాలనలో ఉన్న ప్రజలలో మన మొకళ్లమనీ, ప్రభువులకు ప్రజలందరు జ్ఞాపకం ఉండటం అసాధ్యమని కూడా ద్యోతకమవుతుంది.

ఆ విధంగానే రాధను వర్ణిస్తూ కవి 'రాధికాపృథుల నితంబ యేగెడు అని రాధను పృథులనితంబగా చెపుతాడు ఈ విధంగా చెప్పటం కవిసంప్రదాయం అయినప్పటికి, ఈ విశేషణానికి అనుగుణంగానే, రాధా మాధవుల విహారఘట్టంలో 'ఊరక జారుచూ చెదవయో ప్రియురాల' అని మాధవుని నోట పలికిస్తాడు ఆమె పృథులనితంబ కనుకనే కృష్ణుడు, ఆమె వామోరువును ఎంతబిగ్గ పట్టుకొన్నప్పటికి, రాధ క్రిందికి జారుతూ ఉంటుంది ఈ జారటం సహజం అన్న విషయం అటుంచి అవయవగౌరవం కూడా

యిందుకు తోడ్పడుతుందన్న విషయం మనం జ్ఞాపకం చేసుకోవాలి అప్పుడే ఆ సందర్భశుద్ధి మనకు ఆనందదాయకం అవుతుంది

ఈవిధంగా సందర్భశుద్ధిని పెంపొందించటమే కాకుండా విశ్వనాథ వారిరచనలో మృదుమధురమైన పదవిన్యాసం గోచరిస్తుంది పదాలు వర్ణాశ్రయాలు సరళమైన వర్ణసంఘటన ఉన్నపుడే పదలాలిత్యం ద్యోతకమవుతుంది ఈలాలిత్యం శృంగారకరుణరసాలకు ముఖ్యంగా అవసరమవుతుంది. అందులోను విప్రలంభశృంగారం ఈలాలిత్యంపైనే ఆధారపడి ఉంటుంది లలితపదాలే గదా, అని దీర్ఘదీర్ఘ సమాసాలని వాడటం ఈరసవిషయంలో శ్రేయస్కరం కాదు రసోద్బోధన భావసౌష్ఠవంపై ఆధారపడిఉన్నా పద మార్గం ద్వారానే రసాన్ని అందుకోవలసిన ఆవశ్యకత ఉన్నది కనుక ఈ సంఘటనకూడా ముఖ్యమనే మనం తెలిసికోవాలి ఈరసపోషణకు కఠిన పదాలు పనికిరావన్న విషయం ఆనందవర్ధనాదులుగూడా వక్కాణించారు ఇందుకు కారణం శృంగారరసానికి మాధుర్యగుణం ప్రధానం కావటమే అని విశదీకరించారు రచనలో గుణాలు గూడ ప్రధానపాత్రని వహిస్తాయి గుణాలు రసాన్ని అనుసరించి ఉంటాయి శృంగారంలో ఉన్న మాధుర్య గుణానికి వ్యంజకాలుగా స్పర్శలు, నిజవర్గాంత్యవర్ణయుక్తములు, హ్రస్వ రణలుఅనువర్ణాలు హ్రస్వసమాసంగాని మధ్యమసమాసంగానిఉండవచ్చని గూడా ఆలంకారికుల మతం వీరిమతానికి అనుగుణంగా సత్యనారాయణ గారు కూడ తమశక్తి వంచనలేకుండా మృదుమధురమైన పదజాలాన్నే వాడారు వారు పుంభావసరస్వతులు కాబట్టి ఆపదాలు అహమాహమికతో వారికలంతో చిందులు తొక్కాయి ఇందుకుగాను—

"చూత తమాల పల్లవ విశుష్కిత శయ్యల శైత్యమార్ధవా
ప్రీతయు దేహళీనిహిత దృష్టియుఁ బాండు కపోల భాగ ని
ష్ఠాతృశవోష్ణబాష్పయు స్తనద్వయమధ్యపతన్మనోజబా
ణాతిప్రకంపమానయు మహాప్రభు! రాధిక యేమిచెప్పుదున్."

అనే పద్యాన్ని గ్రహించవచ్చు ఇదివిరహంతో మాధవుని కోసం నిరీక్షిస్తున్న రాధయొక్కస్థితి. ఈస్థితిని రాధయొక్క చెలి మాధవునికి ఈ

విధంగా నివేదిస్తుంది. 'ప్రభూ! చూతతమాల పల్లవాలపై పడుకున్నప్పటికీ రాధకు ప్రీతికలగటంలేదు. పాలిపోయిన చెక్కిళ్ళపై జారుతున్న బాష్పాలతో, స్తనద్వయంమధ్య పడుతున్న మన్మథబాణాలతో వణుకుతూ ఎప్పుడూ వాకిలివేపే చూస్తూ ఉంటుంది' అని ఈరాధ స్థితి ఎవరినైనా కరిగింప జేస్తుంది ఈపద్యంలోని సంఘటన శృంగారరసానుగుణంగా కనబడుతుంది. భావంలో కాఠిన్యంలేదు దీర్ఘదీర్ఘములైన సమాసాలులేవు. టవర్గాదులు అప్రయత్నంగానే వర్జింపబడ్డాయి. ఈవిధం అయిన రచన కవిగారికి అప్రయత్నంగా ప్రాప్తిస్తుంది. ఎప్పుడూ అది రసానుగుణంగానే ఉంటుంది వేరొకసందర్భంలో కృష్ణునివద్దనుంచి తిరిగివచ్చినదూతిని రాధ—

"నాసందేశము తా నెఱింగికొనెనా! నామాట లాలించెనా!
రాసక్రీడలు మానెనా! యిచటికిన్ రాఁగాఁ దలంపూనెనా!
గోసంత్రాణసుశీలు డచ్యుతుఁడు నాకుం బ్రాణబంధుండు నే
నా సంకర్షణదేవు ప్రాణములకున్ బ్రాణంబనే నెచ్చెలి!"

అని అడుగుతుంది ఈపద్యంలో సమాసమనేదే లేదని చెప్పవచ్చు. రాధలోని తహతహను స్పర్శలద్వారా చదువరుల మనస్సును స్పృశిస్తుంది ఈవిధముగా బంధపారుష్యరహితము, శబ్దకాఠిన్యవర్జితము, నాతిదీర్ఘసమాసము అయిన రచన వైదర్భరీతికి సంబంధించినదని చెప్పటం సత్యదూరంకాదు.

ఈపై రెండు గుణాలతో పాటు విశ్వనాథవారిలో మనకు కనపడేది భావగాంభీర్యం 'రవిగాననిచో కవిగాంచునే గదా' అన్న నానుడి వారికే తగింది. వారిభావాలు అనన్యసాధారణాలు సందర్భానికి తగిన ఏభావం అయినా వారిలో ఉద్భవించి మనోరంజకమైన విలక్షణాకృతిని ధరిస్తుంది. ఆ గంభీరమైన లోతుల్ని అందుకొన్న తర్వాత సూర్యకిరణాలవలె శ్రోతల మనఃకమలాన్ని ఉద్భిన్నంచేస్తుంది ఆభావాలు వారి పరిశీలనాశక్తికి గీటురాళ్ళు. నిత్యజీవితంలో మనకు గోచరించే వివిధవిషయాల్ని స్పృశిస్తాయి అందుకుగాను—

"నీస్వర్లోకపు గానవాహినులు పూనెంగాక పాంధాంగనా
విశ్వాసంబులు కాక పోవునెడ నందెన్ ముక్తి కళ్యాణముల్
భాస్వన్మన్మథ రాగసంహితలఁ జెప్పన్ వచ్చు నిన్నున్ ఘనాం
తస్వాధ్యాయివి కోకిలా! ఘనదుదాత్తశ్రీకి స్వస్త్యంజలుల్."

అనే పద్యం ఉదాహరణం ఇది 'కుహూ కుహూ' అని కూస్తున్న కోకిలనుగూర్చి రాక చెప్పిన మాటలు కవి మయూర్లో పికోపాలంభనం, ప్రలంభవర్ణనలో ఒకటి. కవిగారు ఈఅవకాశాన్ని చక్కగా మల్చుకొన్నారు కోకిల కూత పదే పదే ఒకటిగానే వినపడుతున్నదని చెప్పటానికి వారు చక్కని భావగాంభీర్యంతో కోకిలను ఘనాంతస్వాధ్యాయివి అని సంభోధింప చేశారు 'ఘనం' అనేది వేదాధ్యయనంలో ఒకభాగం దీనిలో ఒకేపదాన్ని పూర్వాపశ్చిమాలకు ఆవృత్తి చేస్తారు. వేదపరనం విన్న వారికి ఇదిచాల సులభంగా అవగాహన అవుతుంది సాధారణ భాషలో చెప్పాలంటే 'ముక్తపదగ్రస్తం' అనుకోవచ్చు దీన్ని పరిదీకరించటం కొంత కష్టం. ఈకష్టతరమైన భావాన్ని వారు చాలసులభంగా "ఘనాంతస్వాధ్యాయివి" అనే పదంతో అందించారు.

ఇంకో సమయంలో దూతి కృష్ణునితో రాధావ్యధను చెపుతూ 'నృత్యన్మయూరీ మణిచ్ఛాయా బర్హములు, పికీ కుహూ కుహూ సంగీత భంగీతరంగా యామమ్ములు, కళిందతనయా వ్యాకోచ నీలాంబుజ ప్రేయోదూత మధువ్రతోత్తమ కులశ్రేణీ గరుత్కాంతులు, చూస్తున్న రాధకు మాధవుని ఆనందపుమూర్తే స్మరణపథానికి వస్తున్నదని అంటుంది. నిజానికి ఈ కమనీయ దృశ్యాలలో రాధ కృష్ణునియొక్క మన్మథమూర్తినే చూడాలి కాని ఆవిధంగా కాక రాధ కృష్ణుని ఆనందపు మూర్తిని తనస్మృతి పథానికి తెచ్చుకొంటున్నది. ఈ విధమైన భావకల్పన ద్వారా కవిగారు రాధ అలౌకికమైన ఆనందానుభూతిని పొందుతున్నదని ధ్వనింప చేస్తున్నారు

ఈ కావ్యంలోనే వేరొక ఘట్టంలో యశోద కృష్ణుని వేల్కొల్పుతూ 'ఆదిత్యనవాంశువుల్ పసుపు పండించెన్ గవాక్షమ్ములన్' అని అంటుంది ప్రాతఃకాలంలో సూర్యరశ్మి మన ముంగిళ్ళలో చూచిన ప్రతివారు పస

పండించెన్' అన్న భావసౌందర్యాన్ని అనుభవించక పోరు సూర్యుడుద యించి కొంత సేపయింది అని చెప్పటానికి కవిగారు ఎంతచక్కని భావకల్పన చేశారో మనం ఊహించవచ్చు

పై గుణాలతో పాటు కవి అనేక విధాలుగా చరువరులను ఆకర్షించ గల ప్రతిభాశాలి మనస్తత్వాన్ని చక్కగా చిత్రించటంలో అద్వితీయుడు. ఈ విషయాన్ని రాధా మాధవుల సమాగమంలో గమనించవచ్చు. రాధ తీవ్రమైన విరహాన్ని అనుభవిస్తూ మంచానికి అంటుకొని యేకుమాదిరిగా ఉంటుంది. సర్వదా కృష్ణుని స్మరిస్తూ అతని ఆనందపుమూర్తినే జ్ఞాపకం చేసికొంటూ ఉంటుంది ఆ సమయంలో కృష్ణుడు హఠాత్తుగా ఆమె వద్దకు వస్తాడు వారుభయులు ఒకళ్ళ నొకళ్లు చూచుకుంటారు అప్పుడు కవి

"చూచిన యంతలోన మధుసూదను లోచనముల్ స్రవన్నిరం
తాచిత బాష్పవారి కలనంబున, రాధకనుల్ స్రవన్నిరం
తాచిత బాష్పవారి కలనమ్మెన........ ..........."

అని వర్ణిస్తాడు రాధామాధవుల అన్యోన్యప్రేమ అగాధం అయింది కాని కారణాంతరాలవల్ల స్వల్పకాలం వాళ్ళు కలుసుకోలేక పోయారు ఈకాలంలో జనించిన విరహం దుస్సహం రాధకార్శ్యాన్ని పరికించిన కృష్ణునికి మనస్సుండబట్టలేదు కనుక అప్పుడు మాటలు రాలేదు అందుకనే అతని కళ్ళనుంచి అశ్రువులు పరులుగా పారినాయి—తన మనోనాథుడు వచ్చాడన్న సంతోషంతోను, అతనికి తనపైగల ప్రేమాతిశయాన్ని ఆలో చిస్తున్న రాధకు గూడా ఈదృశ్యం చూచిన తరువాత ఆనందపారవశ్యంలో మాటలురాక కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహించాయి ఇదిలోకసామాన్యం భావం పరాకాష్ఠను చేరినపుడు అశ్రువులు వస్తాయి అవధుల్ని మీరిన ఆనం దంలోకూడా అశ్రువులువస్తాయి Anything in its excess generates its opposite అన్న న్యాయం ఇక్కడ చక్కగా వర్తిస్తుంది అందుకనే కవిగారు భావాన్నిగాని, పదాల్నిగాని మార్చకుండా ఇద్దరి విష యంలోను ఒకే విధమైన పదాను ప్రయోగించారు దీనివల్ల నాయికా నాయ

కుల భావసామ్యం మనకు సూచించటమే కవిగారి ముఖ్యోద్దేశ్యం అన్నట్లు తోస్తుంది

రాధామాధవులు వనవిహారంలో ఉంటారు రాధ సుకుమారి కనుక మాధవునివలె పరిమితిలేకుండా నడవలేదు. అందులో అదివసం ఆమెబాధను చూస్తున్న మాధవుడు

"నడచుట నీకు కష్టమయినట్లుగ నున్నది నీదుపాదముల్
తడబడుచుండె నెత్తుకొనెదన్ వెసరాగదె సిగ్గులేటికే
పడెదవు నీ తమోనియుతభాగము లేరును చేరరారులే
యెడపని సిగ్గదేల ఇట నేనొకరుండనె కాదటే చెలి!"

అని అంటాడు. ఈమాటల్లో రాధయొక్క సౌకుమార్యమేగాక మాధవునికి ఆమెపైగల అనురాగంవల్ల కల్గిన జాలికూడా వ్యక్తమవుతుంది. ఆమె పసిపిల్లగాదు. కనుక మాధవుడు తనను ఎత్తుకొంటానన్నపుడు ఆమెకు సిగ్గు రావటం సహజం. ఆసిగ్గును పోగొట్టటానికిగాను కృష్ణుడు ఆమెతో అక్కడచీకటిగాఉన్నందువలనఆప్రదేశానికిఎవ్వరూరారని, అంతేగాకఅక్కడ ఉన్నది తానొక్కడేనని చెప్పి ఆమెకు నచ్చచెపుతాడు. "నేనొకరుండనె కాదటే" అనటంలో తనవద్ద ఆమెకు ఉన్న చనువు అతి దీర్ఘమైందనీ, వారిద్దరి మధ్య దాచవలసిన విషయాలు లేనందువల్ల సిగ్గుపడటానికి ఆస్కారంలేదని ఆమెగ్రహించాలన్నది కృష్ణుని భావం అన్నట్లు ధ్వనిస్తుంది. "కాదటే" అన్న పదంవల్ల కృష్ణుడు బ్రతిమలాడుతున్నట్లు గూడా గోచరిస్తుంది. ఈవిధమైన మనస్తత్వం గాఢస్నేహం కలవారికే వర్తిస్తుంది

కృష్ణుని తీసుకొనివస్తానని చెప్పి వెళ్ళినదూతి ఒక్కతే తిరిగివస్తుంది. ఆమె కొద్దిక్షణాలు రాధవద్ద మౌనం వహిస్తుంది ఈకొద్దిక్షణాలు గూడా మాధవుని విషయం వినకుండా ఉండలేని రాధ దూతిని సమీపించి "...యేమె యేమే, విచ్చేసెనె సామి, చెప్పవే చెప్పవశే," అంటుంది: ఈరచనలోని అక్షరవిన్యాసం రాధలోఉన్న ఆవేదనను ఎంతచక్కగా బహిర్గతం చేస్తుందో తెలుపుతుంది ఈవిధమైన మనస్తత్వానుగుణమైన అక్షరఘటన సిద్ధహస్తులైన కవులకే సాధ్యమవుతుంది కాని వేరొకరికి కాదు

పద్యాలను సంస్కృతపద భూయిష్ఠంచేసినా కవి తాను రచిస్తున్నది తెలుగువారి కన్న విషయం మరువలేదు వారు ప్రయోగించిన తెలుగు నానుడులు సందర్భోచితలై వారి కవిత్వానికి మరింత శోభ కలిగిస్తాయి అప్పుడప్పుడు ఆ నానుడుల వల్లనే పద్యభావం వ్యక్తమౌతుందని చెప్పినా అతిశయోక్తి కాదు— 'శయనంబందున నంటుకొన్న పోది, కార్యాంతంబంది యేకయ్యె, అలుచచ్చినా నిల్చినను సీరై, ఒల్లి పోకార నీ లేన్ గ్రుత్తువు గాని, పుస్తకమ్ముల్లు పండుకొనును.' మొదలైన యిందుకు ఉదాహరణాలుగా తెలియకోవచ్చు

ఈ కావ్యంలో ప్రారంభం కన్న ముగింపు చాల గొప్పగా ఉంటుంది కృష్ణుని విషయం వర్ణిస్తూ కవి—

"అల్ల విదర్భరాజతనయా పరిభోగము వేళ దామపై
నుల్లము వెట్టు భామ మధువోపల కేళి గృహాంత కేళిలో
భల్లుకరాజు కూతుపయి జారు మనంబట మిత్రవిందపై
జెల్లును గోర్కి లక్షణను జేరు నటన్ మఱియందు నిల్వదున్."

అని చెపుతాడు దీనివల్ల సాధారణంగా కృష్ణుని దక్షిణ నాయకత్వం వ్యక్తమౌతుంది అదే విధంగా "రాధికాధీశునుగా జగించు'నపుడు 'రుక్మిణి నెదన్ బూజించు సత్యాభిమానంబును మన్నించు నా స్వామి' అన్న విషయంలోగూడా వ్యభిచారంలేదు ఈస్థితిలో అతడు "దశనలీలాక్లిశ్యమానాధర" అయిన రాధను "నిర్నష్టప్రచేతనుడై జడుడై, దురాత్ముడై తత్కాంతరప్లుష్ట వేళను" "నీ పేరిది యేమి" అని అడుగుతాడు అప్పుడు "జడమంధర శక్తి" అయిన రాధ ఆలోచించంగా అన్నిటి "మాయలాడ" అని అంటుంది క్లిశ్యాధర కనుక నాదం పూర్తిగా ఉచ్చరించిందో లేదో మాధవుడు ఆమెను "మఱీచు మాయలాడ; తెలిసెను గాని చేతికి దీపరిపంచన కేళికాకృతీ" అని ప్రశ్నిస్తాడు ఈసంభాషణల ద్వారా జ్ఞానోదయం కల్గినపుడు—

"అను జగదీశు నేత్రముల నాడిరి చంద్రుడు సూర్యుడున్ వినూ
త్నముగ ఫాలభాగమున దానొక నేత్రము తోచి దాని వె

ల్గిన నుసియయ్యెం బో వెలికి లోనికి గొమ్మలు వేళ్ళుచాచియుం
డిన యొక పెద్ద మద్దివలె నిక్కినమోహపు వ్యూహమంతయున్."

అని వర్ణిస్తాడు కవి. అంటే వారిరువురమధ్య అల్లుకొనియున్న "మాయ" సశించి నిత్యమయిన ఈశ్వరస్వరూపం సాక్షాత్కరించిందన్న మాట. గ్రంథం వైష్ణవమయిన రాధామాధవం అయినా ఈశ్వర సాక్షాత్కారంతో ముగిసింది. దీనివల్ల ఆసత్యనారాయణగారు తిక్కనవలె హరిహరాద్వైతులా అనిపిస్తుంది. కవిగారి ఇతర రచనలు గూడా ఈ ఊహకు ప్రోద్బలకంగానే ఉంటాయి.

రసాస్వాదన గుణాలంకార రీతి ధ్వని మార్గాల్లో ఏమార్గం ద్వారా జరిగినా అలౌకిక రసాన్ని అందింప చేయగలిగిన రచన గొప్పది. విశ్వనాథ వారిలో అలాంటి రచనే కనపడుతుంది. వారి విషయాన్ని గుర్తించారనటానికి 'చిత్ర చిత్ర శృంగారసంబులై చనుగదా రసభావము లీధరిత్రిపై' అన్నవారి మాటలే సాక్ష్యం. ఈ సందర్భంలో 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్న విశ్వనాథుని నిర్వచనం విశ్వనాథవారి విషయంలో 'ప్రతివాక్యం రసాత్మకం' అని మనకు జ్ఞాపకం చేస్తుంది.

# విశ్వనాథవారి గోపికాగీతలు

—శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి

వరమిమ ముపదేశమాద్రియధ్వం
నిగమవనేషు నితాంతచారఖిన్నాః।
విచినుత భవనేషు వల్లవీనా
ముపనిషదర్థ ములూఖలే నిబద్ధం॥

అని లీలాశుకుల వారి ఉపదేశం. జ్ఞాన సాంఖ్యాది యోగాలకంటె భక్తియోగం ద్వారా పరమాత్మపరత్వం సులభమార్గ మంటారు జ్ఞానానికి భక్తి చుక్కెదురుగా కనిపిస్తుంది జ్ఞానం స్వతంత్రతా విలసితమైతే భక్తి పరతంత్రతా పారమ్యాన్ని పొందినట్టుంటుంది భక్తి యోగమే కాదని కొందరంటారట ఇది యిలా ఉండగా భక్తి రసం కూడా కాదని కొందరి మతం మఱేమిటంటే – ఇది కేవలం భావం ఆ భావాన్ని మధురభావం అంటారు. కృష్ణ పరమాత్మపరమైన భక్తి అజ్ఞాతమూ, జ్ఞాతమూ, సుజ్ఞాతమూ, విజ్ఞాతమూ అయి పరిణతస్థితినిపొంది మధురభావం అయిందని ఒక పరిశీలన.

బాలకృష్ణుని విషయంలో వాత్సల్యభక్తి ఉదయించింది. భాగవతంలో ఉన్న కథలలో ఈ భక్తి దశవిధాలుగా వివరించారు. ఒక్కొక్క భక్తుడొక్కొక్క భక్తితో భగవదారాధనం చేసినట్టు దీని వింగడింపు జరిగింది మొత్తంమీద భక్తిభావమంటే పరానురక్తి అన్నారు. ఇది నిరతిశయ

ప్రేమ ఇంద్రియ సంబంధికాదు అది కామం దాన్ని ప్రేమ అనటం మంచిది కాదు

శ్రవణ స్మరణ కీర్తనలు మూడూ ఆధిభౌతికభక్తి పాదసేవనం, అర్చనం, వందనం ఈ నేవి ఆధిదైవికభక్తి దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం ఆధ్యాత్మికభక్తి వీటిలో గోపజాలురిది సఖ్యం— ఆధ్యాత్మిక భక్తిగా భావించారు

ఇదంతా ఇల్లా ఉండగా రసమయభక్తి ఉందనీ, అందులో హాస్యాద్భుత శాంతాదులిమిడిఉన్నాయనీ పెద్దలంటున్నారు వీటన్నిటిలోనూ ప్రేమ ఉందట వీటి వివిక్తస్థానం శృంగారమంటారు దాన్నిబట్టి శృంగార నాయికా నాయకులు— అవ్యవహారమంతా గోచరస్తుంది కొన్ని భావాలు పరిశీలిస్తే– మొదట దేవకీ వసుదేవులలో భగవద్భావం కనిపిస్తుంది యశోదకు విహ్వలకరుణావాత్సల్యం, నందుడికి గంభీర వాత్సల్యం ఉన్నాయి కంసుడిది భయానకభావం కృష్ణ పరిసరమంతా ఈవిధంగా భిన్న భిన్న భావాలతో కృష్ణ పరితంత్రం. గోవులు సుఖానందానుభూతిని పొందాయి గోపీహృదయాలలో భర్తృభావం విజ్ఞాతమయింది ఇది ప్రేమభక్తి వెన్న ముద్దలనాడు ఇది అంకురించింది ఎంతలన ఎక్కువై యశోదతో కృష్ణుడి దుడుకు చేతలు చెప్పేనాటికి నిలదొక్కుకుంది. అద్భుతాలు ఆర్తినాశనాలు చూచినకొద్దీ వృద్ధిపొందింది మధ్యలో ఎన్నో వచ్చి కలిసి సర్వభావాలూ ఏర్పడ్డాయి. చివరికి మురళీనాదం వినిపించింది అది జగన్మోహనమంత్రం గోపికలు వివశలయ్యారు. బంధువుల నందరినీ విడిచిపెట్టి కృష్ణుడివెంట పడ్డారు అతడు వెళ్ళిపొమ్మన్నాడు. గోపీ విరహం ప్రారంభమయింది కృష్ణుడు—

"పత్యపత్య సుహృదనువృత్తి స్త్రీలకు స్వధర్మ" మంటే– గోపికలు "ధర్మవేత్తవైన నీవిల్లా అంటున్నావు. [అస్త్వేతదేవ ముప దేశపదే త్వయీశే, ప్రేష్ఠోభవాం స్తనుభృతాం కిల బంధురాత్మా]

ఇది ఉపదేశం చెయ్యటానికి బాగానేఉంది కాని దేహధారుల కతి ప్రియుడ వైన ఆత్మబంధుడవు నీవే కదా!" అన్నారు.

"దేహాధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపు మా
పతి పుత్రాదిక నామమూర్తి వగుచుం భాసిల్లు నీయందుఁ
దత్పతి పుత్రాదిక వాంఛలం జలిపి సంభావింప టన్యాయమే?"

అని పోతన్న గారనిపించారు

మైవం విభోఽర్హతి భవాన్ గదితుం నృశంసం
సంత్యజ్య సర్వవిషయాం స్తవ పాదమూలం।
భక్తా భజస్వ దురవగ్రహ మాత్సజాస్మాన్
దేవోయథాఽఽదిపురుషో భజతే ముముక్షూన్॥

అని వ్యాసమహర్షి పలికించిన దానినిబట్టి గోపీకక్తిలో ముముక్షు భావం వ్యక్తమవుతోంది "ఆది పురుషుడైన దేవుడు ముముక్షువుల్ని పొందు తాడు [వారు పొందకపోయి నా కూడా] కాబట్టి యిలా అనటం తగదు. సర్వ విషయాలూ పరిత్యజించి మేము భక్తులమై నీ పాదమూలం పొందాం. మమ్మల్ని విడిచిపెట్టకు" ఇదీ గోపికల వాదం

కృష్ణుడు తిరోహితుడయ్యే సరికి గోపీవిరహం పెరిగింది వియోగంలో గాని సంయోగానికి పుష్టి కలగదుగా' రసదృష్టితో చూచి ఇదే విప్ర లంభం అంటారు పురుషుడు పరమ పురుషుడు అతడే మన్మథ మన్మథుడు సద్విషయమైన రతి బ్రహ్మానంద బ్రహ్మచారి. ఇది రసం. దీని పరాకాష్ఠ రాస క్రీడలో కనిపిస్తుంది నాట్యం రసాభిన్నం ఇంతమంది గోపికలు ఒకే గోపికగా అయ్యారా? ఇంతమందికీ ఇద్దరు కృష్ణు లేర్పడ్డారా? రెండూ జరిగినట్టే భిన్నత్వంలో అభిన్నత్వం - అభిన్నత్వంలో భిన్నత్వం. ఇంత కంటె ఇంతరమ్యంగా పరమార్థపరిశీలనకి లక్ష్యం మరొకటి కనిపించదు రససిద్ధి కలిగిస్తూ పారమార్థిక సామ్యాన్ని ప్రదర్శించే దివ్యతేజః పుంజం గోపికాబృందం.

భగవంతుడి మాటల్లో భక్తితత్వం పరికించి పరమ భావుకతా ప్రధానాలైన విశ్వనాథ గోపికాగీతాల్లో పరిదాం.

భక్త్యా త్వనన్యయాశక్య అహమేవం విధోఽర్జున।
జ్ఞాతుంద్రష్టుంచతత్త్వేన ప్రవేష్టుంచ పరంతప॥ (భగవద్గీత)

"సర్వైరపికరణైః వాసుదేవాదన్యత్ న ఉపలభ్యతే యస్యాసా అనన్యాభక్తిః" (శాంకరభాష్యం) ఏభక్తిచేత సర్వేంద్రియాలద్వారా వాసుదేవుడు తప్ప మరొక ఉపలబ్ధి ఉండదో ఆ భక్తితోనే ఈ విశ్వరూపుడనైన నన్ను తెలుసుకోవటంగాని చూడటంగాని తత్త్వతః ప్రవేశించటంగాని కుదురుతుందని (విశ్వరూప ప్రదర్శనముచ్యాక) పరమాత్మ చెప్పాడు

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సర్వవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ॥

అనేది సర్వగీతాశాస్త్రసారభూతమైనదని శంకరులంటున్నారు ఇవి భక్తిభావ స్వరూపాన్ని వ్యక్తంచేసే మాటలు

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః॥

అనేగీతాప్రవక్తృమతాన్ని శంకరులు "నైరంతర్యేణ హి తే మచ్చిత్తతయా అహోరాత్రం అతివాహయంతి అతోయుక్తంతాన్ప్రతియుక్తతమా ఇతి వక్తుం" అని వివరిస్తున్నారు

ఏతావతా భగవంతునికి భక్తిభావం యుక్తతమంగా ఉందనవచ్చు. అయితే గోపికలకున్నది భక్తిభావమేనా? ఈ పరిశీలనవల్ల వారిది భక్తిభావమే అనాలి. అది యేభావమైనా చివరకిందుకో పర్యవసించకతప్పదు.

జ్ఞానానికీ భక్తికీ మరీదూరంగా ఉండేటంత భేదం లేదంటూ వివేకానందుడు—సాధనంగా ఉపయోగపడేటప్పుడు భక్తి ఆరాధనయొక్క అధఃశ్రేణిలో కనిపిస్తుందనీ చివరికి నిజంగా అదే ఉత్తమశ్రేణికి పోయి క్రింది రూపంతో విడదీయరానిదిగా ఉంటుందనీ అంటాడు మొత్తంమీద నిర్వికల్ప జ్ఞానమూ, భక్తీ విడదీయరానివని నిర్వచిస్తాడు

"ఆవృత్తిరసకృదుపదేశాత్" అనే సూత్రం విషయంలో శంకర భగవత్పాదులు చెప్పిన విషయాన్ని వివేకానందుడిట్లా అన్నాడు—

**Bhagavan Sankara says thus - people say,"He is devoted to the king, he is devoted to the Guru"; they say this of him who follows his Guru, and does so, having that following as the one end in view. Similarly they say "The loving wife meditates on her loving husband",there also a Kind of eager and continuous remembrance is meant." This is devotion according to Sankara. "When he who is far and near is seen, the bonds of the heart are broken, all doubts vanish, and all effects of work disappear· "He who is near can be seen, but he who is far can only be remembered"**

ప్రహ్లాదుని నిర్వచనం—

యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ।
త్వామను స్మరతస్సామే హృదయాన్మాపసర్పతు॥

[అవివేకులకు విషయాలమీద ఉండే ప్రీతే నిన్ను స్మరించే నా హృదయంలోంచి పోకుండా ఉండాలి ]

ప్రీతి అవివేకంచేత విషయాలమీద గాఢంగా ఉంటుంది కాని అదే భగవద్విషయకమై సార్థక్యాన్ని సంతరించుకొంటుంది వ్యాసులు "ఈశ్వర ప్రణిధాన"మనీ, శాండిల్యులుడు 'భగవద్విషయకమైన అత్యంత ప్రీతి' అనీ ఈ భక్తిని నిర్వచించారు.

ఇదంతా అనుశీలించి మరీ గమనించాలి గోపికా వ్యవహారం.

వ్యాస పోతనలు వివరించిన వృత్తాన్తాల పరిశీలనలో అంతరార్థం భావించిన విశ్వనాథ హృదయంలో గోచరించింది గోపికా గీతల పరమార్థం ఏదైనా విలక్షణంగా పరిశీలించి పరమవిలక్షణంగా పలికే కవిసమ్రాట్టు సలక్షణంగా విశిష్టంగా గోపికాగీతలను సంతరించిన తీరు పరికించేటప్పుడీ ఉపోద్ఘాతం సమన్వితమవుతుంది.

కవిసమ్రాట్ గోపికాగీతలు నేత్రచికిత్సాధన్వంతరి శ్రీముక్కామల వేంకట లక్ష్మీనరసింహారావు గారికి అంకితమిచ్చారు. శ్రీ విశ్వనాథ అనేక కృతు లనేకులకి కృతులిచ్చారు. ఈ అంకితాలిచ్చే తీరూ వేరే.

చక్కని కూర్పుతో నెడదచెందికం గూర్చెడు కొద్దిమందిలో
నొక్కడ నేను గొల్లహరి యుల్లము మొల్లముగా కొల్లగొన్న నా
వాక్కున గోపికాకృతిని వ్రాసిని మోసము చేసినాడ నా
ప్రక్కన మాటలో గలసివచ్చిన నిన్నత డెట్లు కాదనున్?

అని కృతిపతితో అంటున్నారు. ఇందులో చక్కని నిక్కమైన ఆత్మతృప్తి కనిపిస్తోంది. కవి గొల్లహరి యుల్లము అధికంగా కొల్లగొన్నాడట. "నాదోపాసన చేసి ఒకనాటి కృష్ణసాక్షాత్కారం పొందా"నని నాతో విశ్వనాథ అన్నారొకనాడు. నాకా విషయం ఇప్పుడు గుర్తుకువచ్చి ఈ పద్యాన్ని మళ్ళీ మళ్ళీ చదివిస్తోంది. గోపికాకృతిని వ్రాసిని నా మాటలతో మోసం చేశాననటం ఒక గడుసుదనం. ఒక భావం చెప్పటానికి బహు మార్గాలున్నాయి. సహస్రముఖంగా చెప్పగలిగిన విశ్వనాథ ఇక్కడ ఈ చెప్పిన తీరు తన సకల కృష్ణోపాసనా వైభవాన్ని ధ్వనిమయంగా ఉక్తివైచిత్రీవిలసితంగా వెల్లడించటమే. అంటే కవికి కృష్ణపరమాత్మతో బాగా పరిచయముందన్నమాట. ఆయనతో కలిసి కృతిపతి వెడితే కృష్ణుడెందుకు కాదంటాడు? స్వానుభవసాక్షాత్కారధిషణాహంకార సంభార ముందంటేనే అదొక రకంగా కొందరికనిపించింది గదా! ఇదెలా ఉంది? పరమ పరిణత బుద్ధితో పరమాత్మ దగ్గఱ తనకంత చనువుందనుకోవటాని కెంతభక్తిజ్ఞాన సంభారము ఉండా లంటారు? సమ్యగివగాహనతో విశ్వనాథ రచనమీద విశ్వాసంతో అనుగమిస్తే రసమయజగత్తు సన్నిహిత మవుతుందనటంలో సందేహం లేదు. పరమాత్మతోనే పరిచయం చేస్తానని చెప్పగలగటానికెంతటి ఆత్మశక్తి కావాలి? అది లేకుండా అనటం—ఈవిధంగా అనగలగటం అసంభవం. ఇది కవితాహంకారమాత్రం కాదు; "సోహంకారం". 'చక్కని కూర్పుతో

ఎడదచెందిక కూర్చుటం' మొక్క అల్లాడిచి [నిజానికి దని నిదీ యిలానిదే] ఈ మోసం చేసే ధోరణిని అవగాహన చేసుకోవటం అవసరం

మీకూ ఆయనకూ ఏదో పరిచయమున్నట్టుండ అదెంతటిదో మాకు తెలియదు. అయినా ఆయన మిమ్మల్ని గౌరవించవచ్చు. ఏ సన్మానమో చేయవచ్చు "మా మీ లావాదేవీలకు నాదు బాహ్యసంబంధంబులే దిట్లురా!" అని పిలవటానికైనా నాకంటి ధైర్యముండవద్దా' అని కృతిపతి అంటాడేమో అనుకొన్నట్టు కృతికర్త—

ఆయన గూర్చినే పడినయార్తి ఫలంబులోఁ గొంత నీకునై
యీయఁగఁ, గాదనంగ నతడెవ్వడు ? వేఱొకఁడెవ్వడు ?
ఏదొ
నాశ్రయత సంక్రియాఫలమునప్పుడు జీవులందునన్
దోయిలియొగ్గి వచ్చునిది తోకొనిపోఁగదవోయి పున్నెమున్.

అంటున్నారు. ఈ వైరాగ్యం, ఈ త్యాగశీలం, ఈ వ్యక్తిత్వంలో గుప్తంగా కాదు సువ్యక్తంగానే ఉన్నసంగతి గుర్తించి రసజ్ఞులీ పద్యాలు భావిస్తూ కొంత సేపాగాలి కవి తాను చేసిన మోహమేమిటో ? పడిన ఆర్తి ఏమిటో ? ఈ కవి సృష్టించిన గోపికాకృతిలో పరిశీలించటం నాకు సాధ్యపడే సంగతేనా ? అని భయం— "గుమ్మందాకా వచ్చాను లోపలికి వెళ్లకుండా ఎలా వెనక్కి వెళ్ళను ? పిలిచి చూద్దాం - పలకరిద్దాం - అధికారమున్నంతలో అర్థం అవుతుందిగదా ? అని యీసాహసం

గోపికాగీతలు మూడు ఖండాలుగా మూడువందల పద్యాలలో ఉన్నాయి. చింతా ఖండం— అన్వేషణా ఖండం— సాక్షాత్కార ఖండం. సాక్షాత్కారం పొందాలంటే చింతించాలి అన్వేషించాలి. ఈ పరమాత్మ పరమైన చింతకూ, అన్వేషణకూ అంతేముంది ? అనంతమై అనుస్యూతంగా వస్తున్న ఈ భావధార సాక్షాత్కారాన్నిస్తే ఇంక అంతకంటె కావలసినదేముంది ? వ్యాసమహర్షి మాటలు పోతన కొంచెం పెంచుతూపోతే విశ్వనాథ పోతనలాగే తన ఆర్తి గోపికలలోనో గోపికల ఆర్తి తనలోనో కలి

గించుకొని పలికించారు విశ్వనాథ వారి గోపికాగీతలలో జ్ఞానభక్తి కనిపిస్తుంది ఆకాశం పట్టి ఇంత వెల్లివిరుస్తుంది అసాధ్యసాధన ప్రయత్నం ఒక ప్రత్యేక జీవలక్షణం ఈ గుణం బాగా ఉన్న కొద్దీ పరమాత్మపరమైన పరిశీలనకు బుద్ధి నైశిత్యాన్ని పొందుతుంది

తనకును మూర్తి లేదనుచుఁ దామరసాక్షుని దొంగిలించియుం
డును గగనంబు సొగసిమనోజ్ఞవిలోచనలార! మిన్ను తా
మనకును మధ్యమున యది మట్టిన కౌగిళులందుఁ బట్టుఁడీ
చెడకెడ ముంజురంబు మనచేతుల కందకపోదు స్వామియున్.

స్వామినిఁ గోపాలంతో ఆకాశాన్ని చెరకాలంటు అంతటి యాత్ర చింతిస్తావాలి బయటికి ఎందుకు ఎత్తుకుపోవాలి? కాశీకా? శ్రీరంగానికా? ఇంటిలో కూచుంటే స్వామి దొరకడా? స్వామి ఎంతదూరమో అంత దగ్గర — "మిన్ను తా మనకును మధ్యమున్నయది మట్టిన కౌగిళులందు" పట్టుకోవలగాని ఆకాశానికి మూర్తిలేదు, తనలో దొంగిలించి దాచుకుంది నిరాకారగగనంలో స్వామి ఆకారం అదృశ్యంగా ఉంది. పట్టుకోవటం చేతకావాలి గాని ఎక్కడ పడితే అక్కడే దొరుకుతుంది నిర్గుణ నిరాకార పరబ్రహ్మం ఈ దృశ్యభావనతో కవి చింతించటం మొదలుపెట్టాడు ఒక గోపిక మిగిలిన వాళ్ళతో మాట్లాడుతుంది తఱచుగా అప్పుడప్పుడు స్వామితోనే ఏదో అంటుంది కృష్ణుడు సులభంగానే పట్టుపడతాడట — "వందలక్షణంబులు గల తాను తానెట్లకు బోవును? జిమ్మనుకొన లోపలన్ తెలియదు గాక!" పట్టుబడి తీరును. తీరని కోర్కెయైన మాకలయిక కల్గుగాని తన యంతట తానయి నిల్వఁ గల్గునా? అంటుంది. ఏ ఒక్క లక్షణం చూచైనా పట్టుకోవచ్చు కోర్కె తీరనిదా? కలయిక తీరని కోర్కె కలదా? పరమాత్మ సంభావన విస్పష్టమై ఉంటేనే సాధన ఫలిస్తుంది. సాక్షాత్కారమైతే మాత్రం దర్శనంలో నిలిచి ఏమిటి పొందుతుంటుంది? అనంతమైన ఆనందంలో ఇతరం భాసించదు అభిన్నత్వమేర్పడుతుంది. అది పరిణతి "నే నాతడు వేఱు వేఱను నట్టిది సంశయ పాయు లేన," అంటూ గోపిక "నా ప్రియుఁడీనియందె కన్పించెడు" అని చేయము చిన్నదై శ్రీపతి నాకు కనిపిస్తాడా? అని దుఃఖిస్తుంది ఆత్మ పరమాత్మల అభిన్నత్వం అంత తొందరగా పట్టుపడదు; పడే

దాకా జీవుడికి చింత తప్పదు జీవుడీ భిన్నత్వంలోనే ప్రీతిపొందుతాడు విశిష్టాద్వైతతత్త్వంతో, అందుకే కనిపించనే భయం సహజమైన పరతత్త్వ పరిశీలన చింతన గోపికాపరమైంది విశ్వనాథచేతిలో పోతనగారి గోపికలు కూడ అవతారమూర్తిగానూ విష్ణుమూర్తిగానూ కృష్ణుణ్ణి భావించారు పాపం!

> వెఱవున బోయి మీకుఁగనిపించెనె స్వామి యటంచు నడ్గినన్
> గుఱుతులు చెప్పుమందు రనుకొందును వేరనిగాని, నాయెదన్
> మొఱగిన వాడనంగ సితఫుల్లనవాంబుజనేత్ర! యేమి యీ
> గుఱుతని నవ్వి పోదు రనుకొందును నేనిపుడేమి చేతునే?

ఇంత చింతన చేసే గోపిక గుర్తు చెప్పలేదు పాపం చెప్పలేకేం? చెపుతుంది 'నా యెదన్ మొఱగినవాడని' ఎదలో పొంచి ఉన్న వాడు బయట ఎల్లా కనిపిస్తాడు? ఈ మాటలంటోందంటే వినే గోపిక చూడండి ఎలా చూస్తోందో 'సిత, ఫుల్లనవాంబుజనేత్ర' కళ్లబోయి (నవ్వి) 'ఇదేం గుర్తుచెప్పటమే! చోద్యంగానూ!' అని. గోపిక వెతుక్కోవాలిగాని వాడిని అడవిని పడి వెదకటమేమిటి? అవతారమూర్తిగా గుర్తించిన గోపికలు, ముముక్షువులను భగవంతుడు పొందుతాడని తెలిసిన గోపికలు విశ్వనాథ సరస్వతీ విజ్ఞాన మూర్తులై ఏమీ ఎఱుగనట్లు అమాయకంగా మాట్లాడుతున్నారు మనం కనిపెట్టలేంకదా? అని, అమ్మా! ఆయన నాయెదన్ మొఱగిన సంగతి యెందరో చెప్పారు— వీళ్ళంతే విదుసువాళ్ళై అమాయకంగా కనిపిస్తున్నారు గాని

> ఇంతగ నేడ్చుచుంటిని గదే? లవలీ నవ పల్లవాగ్రనే
> త్రాంత! గృహంబునం బతియు నాత్మజు డేమయిరో
> యటన్న వృ
> త్తాంతము మాసి పోదుగదె, అక్కడ నెంతయు కృపాపరిహీనుడ
> న్నంతనె తేలిపోయినదె ఆతడు సత్కృప చూపి రావలెన్.

'అనన్యయా భక్త్యా జ్ఞాతుం ద్రష్టుం ప్రవేష్టుం చ శక్యోహం' అని భగవంతుడు చెపుతోంటే— ఇంటిలో పతిపుత్రాదు లేమయ్యారో అనే చింత

మాసిపోనంత సేపు 'ద్రష్టుం' శక్యుడెల్లా అవుతాడు? భక్తిసాధనలో ఉన్న తిప్పలివే ఏం చేస్తాం? ఆ భగవంతుడే సత్కృపచూపి రావాలి.

శ్రీమతియైన పండితు డొక డన్నాడట— 'అతడొక తెల్విగా హృదయ మందున నుండు నటంచు' ఆ తెలివిలేక తికమకపడేలాగ మతి నిలవనీయక యదుకాంతుడు వెళ్ళి పోయాడంటుంది

"సర్వహృదంతరస్థుడు గదా! యీ పోవు లెట్లున్న దే?" అంటుంది. గోపిక మనసు పొలం దున్నిందిట! మాధవభావం పిత్తింది ఆయన కని పించటమే వాన దానితో జల్లిన యది ముక్తిపంటగ ఫలించునట. కనిపించక పోవటం గ్రీష్మమై మనసు పొలంబు బీడుపడి విత్తనాలు కూడ మాడిపోతా యట. ఇలా రూపించిన గోపిక కోరేది ముక్తిపంట!

ఈ సాధన ఎలాగ?

కడు విలపించి శ్రీహరిని గాంతుమొ మౌనముతాల్చి
కాంతుమో
బుడుతని రూపమున్ ఋషుల పోలిక వర్ణనచేసి కాంతుమో
యెడ తపియించి కాంతుమొ మరింతయు నాకును పాలు
పోద యీ
యొడలు త్యజించినంత హరియూహను చేయనులేమ!
యేమిటే?

ఎవరి కెల్లా కుదిరితే వారల్లా చేయటమే. అది మనోలక్షణమై ఆ భక్తి అనన్యభక్తిరూపాన్ని పొందుతుంది. మొత్తంమీద దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" ఈ వేదాంతం మాటనెవరు నమ్ముతారు? మనం చెప్పగలమా?

ఇంతటి నిర్దయాత్మునిగొని యీ మనమందరమేల సర్వవే
దాంతమున్ పఠింప హృదయంబులు బాహిరవోవ దీనిన
మ్మింత మటంచు గాక పుడమిన్ మనయజ్ఞత, "తాను
దూరగా
గంతయు లేదు డొలొకటి కంతవు నం" దనినట్లు నా చెలి!

ఈ మాటలు చూడగా 'లోకోఽయ మవిశేషజ్ఞః కింకుర్మః కస్య కథ్యతే' అనిపిస్తోంది. మరొకందు కన్నా విద్యానాథుడు బాగా అన్నాడు ఇంతకీ—

చెప్పెడువారు లేక తులసీ! చెడిపోయెను స్వామి వానినిం
జెప్పెడు వారుగాని శ్రుతిచిందిన యర్థములాడి వాని కిం
జెప్పెడు వాడు లేడొకడు! చెల్వల మజ్జిగ పాలునమ్మి నీ
గొప్పకులంబు వారి వెతఁగూర్చుట యేమిపనే తలోదరీ!

శ్రుతి చిందిన యర్థములాడుతారు కొద్దిగా తెలిసి— శ్రుతిలో ఉన్నదంతాకాదు-అంతాఅయినా చాలదు. ఉక్తివైచిత్రితో నిండిన యీ తత్త్వచింతనం ఆపాత మధురంగానూ ఆలోచనామృతంగానూ కూడా ఉంది బహువిధాలగా తన చింత ప్రకటించిన గోపిక చివరకు కనిపించని కృష్ణునితోనే ఏమేమో అంటుంది

సాధనమార్గంలో తెలివిని శరీరంతో విడబరచి యత్నం చెయ్యాలనే మాటలతో 'విదియనాడు కనిపించని చంద్రుడు పదియనాడు తానే కనిపిస్తా' డనే లోకోక్తితో చింతాఖండం సమాప్తమయింది

# 2

నల్లనివాడు పద్మనయనంబులవాడు— ఇత్యాదిగా గోపికలు తరు లతాదులను శుక పికాదులను పలకరించి ప్రశ్నించిన తీరు పోతనగారి మధురభావ పారవశ్యంతో పాటు సుందరశబ్దసన్నివేశంతో చూచిన పాఠకులు ఈ అన్వేషణ ఖండంలో బహుముఖీనంగా కనిపించే ఆ భావాల విస్తృతిని గమనించవచ్చు. విశ్వనాథవారి ఊహాలధోరణి అపరిమిత ప్రవాహారూపంలో సాగిపోవటం పాఠకలోకానికి సుపరిచితమే. పోతనగారి గోపికలు కృష్ణుడు కనిపించాడా అని కొన్ని వృక్షాలనడిగారు

ఇక్కడ ఎన్నో చెట్ల నడుగుతూ ఆయా చెట్ల విశేషాలూ, కృష్ణు డందులో దాక్కోవటానికున్న వీలూ, వాటి వాటి ప్రకృతిసిద్ధమైన స్వరూప స్వభావాలతో పరిశీలించి సమన్వయించటం జరిగింది. ప్రకృతి పరిజ్ఞానం, వృక్షవిశేషాల విజ్ఞానంవివరించటం జరిగింది. పిట్టల్లో గుడ్లగూబనీ పాలపిట్టనీ కూడ వదలకండా అడిగారు.

అడవి కోళ్ళనడిగితే లాభం లేదనుకొన్నారు. శుకపిక చాతకాదులే కాక పిచ్చుకల సంగతి చెప్పుకొన్నారు మందులకు పనికి వచ్చే చెట్లూ ఆకులూ వాటివిశేషాలు కూడా ప్రస్తావనకు వచ్చాయి

ప్రకృతితో కలిసిమెలిసి ఉన్న గోపికలకు వాటితో ఉన్న పరిచయ విశేషమంతా శబ్దచిత్రాలలో అర్థచిత్రాలతో అన్వేషణలో వంద విధాలుగా వివరింపబడటం కవిప్రజ్ఞా పాండిత్యాలను సరళతరంగా కవితలో ఒదిగించటం రమ్యంగానూ విజ్ఞానప్రదంగానూ భాసిస్తుంది.

వకుళం వాడిపోయినా పరిమళిస్తుందికదా' అసంగతి దాని 'భర్తృ మనోనుయాయినీమతి గా భావించి పతిపైన తాము కూడా ఈసునెఱపకండా ఉండగల్గటం నేర్పుమని అడగటం భావనా వైవిధ్యచమత్కారాలు తెలుపు తుంది. అశోకం కనిపించేసరికి అక్కడ కూర్చుంటానంటుంది గోపిక అక్కడ కే వానరుడైనా వస్తే అతనితో చెపుతుందిట. అతడు వెళ్ళిచెపితే స్వామి వస్తాడుకదా అని ఆవచ్చిన స్వామి నిప్పులలో ఉరికించిశా సరేగాని 'హరి తమ్మి మొగింబును' చూడకుండా నిలవలేనంటుంది

రామాయణ వృత్తాంతం, సీతాదేవి స్వామికై పరితపించిన విధం, ఇక్కడ ధ్వనింప చేయటం ఒకఎత్తు. మరి ఆసీతాదేవి పట్టినంత ఓపిక గోపి కలకేది? అంత ఓపిక చూపినా స్వామి సీతను నిప్పులలో ఉరికించాడనే సంగతి ఎంత తాపమైనా భరిస్తాననే తీరులో నుంచి ధ్వనించటం మరొకఎత్తు. రామకృష్ణుల అభిన్నత్వస్ఫూర్తి. ఇదంతా ఒకసంప్రదాయ బద్ధంగా నూతన రీతిలో భావించటమే కవియొక్క భావుకతా జలధితరంగం.

వావిలిచెట్టులో స్వామినిద్రించి ఉంటాడనటం, నల్లవావిలి నల్లనిస్వామిని దాచుకోగలుగు తుందనుకోవటం వఱకూ బాగానే ఉందిగాని దానివ్యుత్పత్తిని

బట్టి నిద్రించుచున్న తుమ్మెదలుగలది కాబట్టి స్వామి అందులోచేరి నిద్రించాం డనుకోవటంలో సామంజస్యం గమనించదగింది గదా!

ఒక పూర్వకవి ఊహించిన తీరు తలఃప్రర్శగా భావించి దాన్ని ఇంకెం తగా ఊహించవచ్చో అంతగా ఊహించి చెప్పే విధానమే విశ్వనాథ కవితా విధానం. ఇటువంటివిధానం 'అన్వేషణ'లో అన్వేషించ నక్కర లేకండానే కని పిస్తుంది.

దోసకాయకు తొడిమకు ఉన్న సంబంధం జీవుడికీ శరీరానికీ ఉందన్న వేదాంతుల మాట కోసం దోసకాయని కూడా గోపిక అడుగుతున్నారు వారెంతగా అన్వేషించారో ఆపరమాత్మ స్వరూపాన్ని చెప్పిన మాటల్లో—

తొడిమన్ జారును నీవలెం జనుడు మృత్యున్నాగ వేదర్శినీ
తొడిమన్నిన్నను బోల్కి తెచ్చుకొనె సాధూ! వేల్ల దుర్వారుకా
కొడిమల్ గట్టి బిగించెఁబించియము శ్రీగోపాల మౌళిన్ యశో
ద, డయ్యచ్ఛి గమనుండు వచ్చియిచటం దారాడెనా చెప్పవే!

అనే దొకటి—

"కాముకీ వ్యాపారంబుగ బెట్టు బుట్టల బడిన్ జారాడగా నేటికిన్ అని "దివ్యాను రాగప్రభా శ్రీపూర్ణాకృతి నూహచేయుదము"—దాక్షిణ్యం చూపిస్తాడేమో అనుకోవటం గోపికాగీతలలో ఉన్న పరమార్థం వైపు పాఠ కుల దృష్టిమళ్ళించటమే.

కరుణకలవాడు కనక స్వామి తానేవస్తాడు. ఈయమున ఒడ్డునే ఉంటే సరి రాడనుకో దగ్గర యమున ఉందిగదా! అందులో "వియత్స్ఫురణము నీలవర్ణకము" శూన్యం చూపిస్తాడు చూపించనీ అంటుంది జగద్వ్యాప కత్వం అందులో నీలవర్ణత్వం-ఈభావన సర్వప్రకృతిలోనూ పరమాత్మను దర్శించే ప్రయత్నపరత్వమే.

# 3

ఎంతగానో ఎదురు చూచిచూచి తీరా స్వామివచ్చాక గోపికలందరూ ముందుకువస్తే—ఎవరి తొందర వారిదికదా! ఎంత సహజ చమత్కారంగా మాట్లాడుతుందో ఈ గోపిక! ఏం ఓపిక!

**పిడుకలు కొట్టు చేతులును పేడను చేసెడి చేతు లంట్లు తో**
**మెడు నవి మోటు చేతులును మీరును, స్వామిని పట్టి తాకఁబో**
**కుడు, నును మెత్తమేనది, గగుర్చును, కందును, స్వామిపై కెగం**
**బడకుడు దవ్వునన్ నిలిచి స్వామిని జూచినయంతఁజాలదా !**

సహజ సుందరమైన నుడికారంలో స్త్రీస్వభావం ఇముడ్చుకొన్న ఈ భావం సాక్షాత్కారంలో తన్మయత్వాన్ని తెలుపుతూ ఊరుకోక అదే పరమార్థమనీ అంతకంటె ఆనందపారవశ్యంగాని పారమ్యంగాని లేదనీ అర్థంగా భాసిస్తూ 'సాక్షాత్కారం' ఆరంభమయింది ఇంకేమీ లేదన్నట్టుగా కనిపించే ఈ భావధార ఇంకొక వంద పద్యాలలో ప్రవహించటం ప్రతిభా పరాకాష్ఠకు ప్రతిబింబం.

మీదపడకండంటే—కొరుక్కుతినరులే ఎవరూను ఊరికే స్వామి కృపారసదృష్టికోరుతూ 'మనోంబరమున నింద్రకార్ముకము వైఖరి నున్న వన్నెలు చిన్నెలు' చూస్తారని సమాధానం ఇంతకంటె చేయగలిగిందీ చేయవలసిందీ ఆ స్థాయికి వెళ్లాక యింకేముంది? ఇంతకీ ఈ కృష్ణుడు కుఱ్ఱ వాడు—వీడెక్కడికిపోయాడు? ఏడిపించుకుతింటున్నాడు కనిపించనంత సేపూ పడేబాధ, అదుర్దా ఒకరకం కనిపించాక ఒళ్ళు మండుతుంది— వాడు మనవాడైనప్పుడు - మనకి వాడిమీద అధికారమున్నప్పుడు కోపం వస్తుంది ఆ కోపం స్నేహ పరాకాష్ఠరూపం, ఇది లోకం. ఈ లౌకిక భావం అలౌకిక సత్యంతో సత్యనారాయణగారు కలుపుతారు; అది మహాకవి చేయగలిగినపని ఆ పనితనం ఒక్కొక్కప్పు డతికాళిదాసంగా భాసిస్తుంది. భావించటం తెలిసినకొద్దీ అది కుదిరినకొద్దీ దాని సొగసులు వికసిస్తాయి.

కృతిపతిని 'నాతోరా, నీకు చూపిస్తా'నన్న కవికెంత దిలాసా ఉందో ఈ క్రింది పద్యం భావిస్తే తెలుస్తుంది. ముందీ విలక్షణ మార్గంలో పడి నడవాలి నడచిన కొద్దీ శ్రమ తగ్గుతుంది - అదే విచిత్రం. "ఏమి, యీ సహస్రముఖ కవితా బ్రహ్మవిద్య' అనిపిస్తుంది.

అలుసై పోతిమి నందబాలునకు మోహం బెంతలో నున్నదో
వెలికిన్ సర్వము నొల్కబోసి కొనుచున్, వెన్నుండు
వెన్నుండె! గో
కులమందున్ మఱివేఱ యూహయఱి దిక్కున్ మొక్కగా
నెంచ, నీ
చలముంజూడుడు- కుఱ్ఱవానికి దిలాసాయయ్యె గోపాంగనల్.

ఇదీ గోపికలతో పాటుగా కవికి ఆ కృష్ణునితో ఉన్న చనవు ఎంత కుఱ్ఱవాడైనా ఇలా మాటలాడితే ఏమనుకుంటాడు? స్నేహం మానుకుంటాడేమో! పైకి ఉన్నట్టే చూపిస్తూ!

అది సరిగాని ఓసి మనసా! మనసార వరించి యున్న యీ
యదుకుల సార్వభౌము దురహం కృతియున్ వలపుం బెడంగు గా
మొదలిడి బిట్టుకట్టై విరుపుల్ పచరించిన స్వామి కూడఁ బై
యెద సవరించుగాని సుదతీ మఱిలోయెద త్రవ్వి పోయదే!

ఈ పై యెద—లోయెద శబ్దాల వాడకంలో గడుసుదనం చూడండి ఇది మనోలక్షణం. ఆ లక్షణం వెయ్యివిధాలుగా భావిస్తుంది. అది కట్టై విరుపు పలుకులూ పలికిస్తుంది—మాలిన్యం లేకపోతే ఆ విరుపుల్లోనూ, సరస్వతి సాక్షాత్కరిస్తుంది. కాని లోకం గుర్తించదు ఈ సంగతి సత్యనారాయణగారికీ అన్వయిస్తుంది. ఇది ఆయనకి తెలుసునన్న మాట "ఇంత తెలిసిన వాడి కదెందుకు తెలియదు? తెలిసి తన స్వామిని గూర్చి తాను మాటలాడుకొనేటప్పుడు మనకెందుకు మధ్యన?" అనుకొనే లోకంకూడా ఉంది. ఊరుకోని లోకమూ ఉంది. ఇదంతా ఒక విచిత్ర భావసాగరం.

కృష్ణుడు మంత్రతంత్రజపాదులు లేకుండానే గోపికలకు లభించాడు గదా! అందుకే వాళ్ళెంత ఆటగా ఉందో చూడండి ఎల్లా మాటాడుతున్నారో కనిపించాక —తలోమాటాను!

ఈయన పోడిమల్ తెలిసియే ఋషులెల్లరు తీవ్రమంత్ర వ
ర్ణా యతిమై బిగించిరి మహాప్రభు దానికి నాగలేక భి
తూ యొకగొల్ల గూడెమును జూచి చొరంబడెఁ బడ్డవాడు మా
కీ యమునాతటీ విరహమేటికిఁ జేయునె మాటిమాటికిన్ ?

ఈసాహిత్యం ఆధ్యాత్మికమా? ఆధిభౌతికమా? చమత్కార సర్వస్వాన్ని పరమరమ్యమార్గంలో అవిచ్ఛిన్నసంప్రదాయానికి నవీనత్వం కల్పించి పల్కించటానికి కావలసిన సంస్కారమెంతటిదై ఉండాలి? ఇది ఇహాన్నీ పరాన్నీ చూపించే కవిత్వం ఒకచోట రెంటినీ చూపించటం భారతీయ సాహిత్యానికి పరమ సహజమైన ప్రచురలక్షణం విడిగాకూడా రెండు చూడలేని బుద్ధి శక్తితో పరికించటం పరిహాసాస్పదం.

స్వామి దక్షిణనాయకత్వంలో కూడా లక్ష్మీదేవికున్న సర్వోన్నతత్వం చిత్రించిన తీరు—

ముదితలమౌళి పాల్కడలి ముద్దుల కూతురి బొట్టవ్రే
లదుమగఁ గోర్కిమై నెగచినట్టిది బొట్టనవ్రేలు సాచి న
ట్టిది యది సాచినట్టిదగు రీవి వెలార్చెడి స్వామి దక్షిణా
పదమును చూడవే సమద బంధుర సింధురరాజగామినీ!

రసం ఆస్వాదనైకవేద్యమేకాని ప్రపంచన సాధ్యం కాదనిపిస్తుంది ఆ రసాస్వాదన ఊరుకోనియ్యదు ఆలోచనామృతమైనవాటిని ఆలోచించనివ్వాలి— సంస్కారబలాన్నిబట్టి సహస్రధా భాసిస్తుంది

సాక్షాత్కారంతో సర్వభావాలూ నిరతిశయానందంతో నిర్వికల్ప పరబ్రహ్మలో విపరీతంకాక తప్పదు అయినా అద్వైతసిద్ధిని ప్రశంసించి ప్రవచించటాని కక్కడాభావం పుట్టక తప్పదు.

అవులుతేరునట్లుగ, లయాంబుధి ధూర్జటి కంటివెల్లుము
త్తో్రివలు పోవుచుండ స్థితితోయధి మాధవుపాదధార ము
త్తో్రివలుపోవు మూడయిన స్రోవల చాలలు నందునిందువె
ట్టై వెలియై నవారుణమునై పసిమై జ్వలియించు నించెదున్.

వెట్ట—వలి—నవారుణము—పసిమి అయి మూడు స్రోవల చాలలు ప్రకాశిస్తూ ఆనందాన్నిస్తాయట ఈ ముత్తో్రివలు—త్రినేత్ర కాంతులు, త్రిపథగా గంగాధారలు, త్రిమతాచార్యమార్గాలూనూ లయకారుడి కంటినుండివచ్చి స్థితికారుడి కాళ్ళుపట్టుకున్నాయి పవిత్ర భావనాపార మ్యంతో పర్యవసించిన శివకేశవైక్యం ఇక్కడ హృదయంగమంగా జ్వలి స్తోంది. ఓపికతో గోపికలు తమ జ్ఞాననేత్ర కాంతులు ప్రసరింపజేస్తున్నారు సాక్షాత్కరించిన కృష్ణుణ్ణి ఆపాదమస్తకం పరికించి అభివర్ణిస్తున్నారు ప్రార్థిస్తున్నారు. పరవశిస్తున్నారు హృదయ హృదయాని కందినంతగా అనుభవించి ఆనందించగలగనిద్దాం క్షమించండి

రెండు పద్యాలు చూపించి సెలవు తీసుకుంటాను

శ్రీకృష్ణా యనుమాట వచ్చినదియా యేయూహ యోకల్మియా
శ్రీకృష్ణా యనుమాట వచ్చినది నా హృత్సీమలో నెందు నీ
శ్రీకృష్ణాంకితమైన యూహ తొలినెల్లే పారు దానింగనన్
లేకన్ ప్రాణము సొమ్మసిల్లెదఁ గుకూలీభూత జీవేశ్వరా !

హీరమువంటి నీయెడదనే చిఱుబెజ్జము చూచినాడొ నీ
మారటరూపమైన ముని, మాధవ, వ్యాసుడు గోకులాంగనా
శ్రీరమణీయ మధ్వమును సృష్టియొనర్చెను ముక్తిస్రోవలన్
గేరడమౌచుఁ బద్య భుజకీర్తులు మాదృశులంగలార్పగన్.

యం ప్రవ్రజింతమనుపేతమపేత కృత్యం
ద్వైపాయనో విరహాకాతర ఆజుహోవ ।
పుత్రేతి తన్మయతయాతరవోభినేదు
స్తం సర్వభూతహృదయం మునిమాతనోమి॥

